# సాహితీ చైత్రరథం

డా॥ జి. వి. కృష్ణరావు సాహిత్య సమాలోచన



సంపాదకవర్గం :

హితశ్రీ

సంజీవదేవ్

ఆచార్య దొణప్ప

నాగళ్ళ గురుప్రసాదరావు

జనప్రియ పుస్తకమాల

విజయవాడ - 2.

తెలుగు సాహిత్యంలో మహా మేరువై నిలిచిన డాక్టర్ జి. వి. కృష్ణరావు సాహితీ కృషినీ, మూర్తిమత్వాన్ని ఆవిష్కరింపచేసే సమాలోచన గ్రంథం ప్రచురించాలనే ఆశయంతో డాక్టర్ జి. వి. కృష్ణరావు సాహితీ సమాలోచన సమితి తెనాలిలో ఏర్పడింది. ఈ ఆశయ రూపకల్పనే ''సాహితీ చైత్రరథం''.

ఈ సాహితీ చైత్రరథం ఇంత నయనాభిరామంగ విలసిల్లడానికి తోడ్పడిన వదాన్యులందరికి వివిధ కోణాలనుంచి డా॥ జి. వి. కృష్ణరావు సాహిత్య సమాలోచనం చేసే వ్యాసాలనందించిన భావుకవిమర్శకులందరికి

డా॥ జి. వి. కె. సమగ్రమూర్తిమత్వాన్ని ఆవిష్కరింపజేసే వ్యాసాలను పేర్చి కూర్చిన సాహితీతత్త్వకోవిదులైన సంపాదక వర్గ సభ్యులకు

డా॥ జి. వి. కృష్ణరావు సమాలోచన సమితి సవినయంగా హార్దికంగా కృతజ్ఞాభివందనలు తెలియజేస్తున్నది.

ఈ చైత్రరథాన్ని వివిధ వర్ణపుష్పకలిత కుబేర చైత్రరథంవలె ఆకర్షణీయంగా నిర్వ్యాజప్రేమతో రూపుదిద్దినవారు, సాహిత్య కళాభిజ్ఞులు, జ్యోతిప్రెస్, హైదరాబాద్, అధిపతులు శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్‌గారు. ఈ సహృదయుని సౌజన్యసహకారాలు లేకపోతే ఈ చైత్రరథం వెలుగును చూడడం అసంభవమై ఉండేది. వీరికి సమితి హృదయపూర్వకంగా ధన్యవాదాలర్పిస్తున్నది.

*డా॥ జి. వి. కృష్ణరావు సాహితీ సమాలోచన సమితి,*

*తెనాలి*

# డా॥ జి. వి. కృష్ణరావు సాహిత్య సమాలోచన సమి

## కార్యవర్గం

గౌరవాధ్యక్షులు : డా॥ బెజవాడ గోపాలరెడ్డి
(సాహిత్య అకాడెమీ అధ్యక్షులు)

అధ్యక్షులు : శ్రీ ఆవుల సాంబశివరావు
ఆంధ్ర యూనివర్శిటీ వైస్ చాన్స
(ఆ. ప్ర. మాజీ ప్రధాన న్యాయమూ

ఉపాధ్యక్షులు : శ్రీ వెలువోలు సీతారామయ్య
శ్రీ కె. వి. గోపాలస్వామి
శ్రీ రవీంద్రనాథ్ ఆలపాటి
డా॥ గవిని వేంకటేశ్వరరావు
డా॥ గోగినేని హరిప్రసాదరావు
డా॥ కొత్త రవీంద్రబాబు
శ్రీ మహమ్మద్ తమీజుద్దీన్
శ్రీ బోయపాటి నాగేశ్వరరావు

కార్యదర్శులు : శ్రీ ఎ. వేంకటేశ్వరరెడ్డి
శ్రీ జె. శ్యామసుందరప్రసాద్
డా॥ పి. దక్షిణామూర్తి
శ్రీ గురజాల సీతారామయ్య

కోశాధికారులు : శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణ

# విషయ సూచిక

# డా॥ జి. వి. కృష్ణరావు సాహిత్య సమాలోచన సమితి

## కార్యవర్గం

**గౌరవాధ్యక్షులు :** డా॥ బెజవాడ గోపాలరెడ్డి
(సాహిత్య అకాడెమీ అధ్యక్షులు)

**అధ్యక్షులు :** శ్రీ ఆవుల సాంబశివరావు
ఆంధ్ర యూనివర్శిటీ వైస్ చాన్సలర్
(ఆ. ప్ర. మాజీ ప్రధాన న్యాయమూర్తి)

**ఉపాధ్యక్షులు :** శ్రీ వెలువోలు సీతారామయ్య
శ్రీ కె. వి. గోపాలస్వామి
శ్రీ రవీంద్రనాధ్ ఆలపాటి
డా॥ గవిని వేంకటేశ్వరరావు
డా॥ గోగినేని హరిప్రసాదరావు
డా॥ కొత్త రవీంద్రబాబు
శ్రీ మహమ్మద్ తమీజుద్దీన్
శ్రీ బోయపాటి నాగేశ్వరరావు

**కార్యదర్శులు : :** శ్రీ ఎ. వేంకటేశ్వరరెడ్డి
శ్రీ జె. శ్యామసుందరప్రసాద్
డా॥ పి. దక్షిణామూర్తి
శ్రీ గురజాల సీతారామయ్య

**కోశాధికారులు : :** శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణ

## మానకలశునికి మహాభిషేకం

# సాహితీ నీరాజనం

డా॥ జి. వి. కృష్ణరావు కవితారచనతో ఆంధ్రసాహితీరంగంలో అడుగు పెట్టారు. ఆయన సత్యాన్వేషి; తత్త్వానుసంధాత. ఆంగ్లవిద్యలో పట్టం పుచ్చుకోవడంతోపాటు ఆయన హృదయం మార్క్సిజంవైపుకి మొగ్గింది. ఆ ప్రభావంతోనే నాడు ఆయన కలంనుండి కావ్యజగత్తు వెలువడింది. ఎం.ఎన్.రాయ్ గారి ప్రభావంతో నవ్యమానవతావాదం వైపుకి ఆయన దృష్టి మళ్ళింది. సత్యాన్వేషి అయిన వారి హృదయంలో క్రొత్త జిజ్ఞాస బయలుదేరింది. మానవుని వివిధ సమస్యలకు పరిష్కారం ఎక్కడ ? ఎలా ? అన్న జిజ్ఞాసతో ప్రాచ్య పాశ్చాత్య దర్శనాలను అధ్యయనం చేయసాగారు. ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హెగెల్ ల వంటి తాత్త్వికుల దర్శనాలను, ఫ్రాయిడ్ వంటి మానసిక తత్త్వశాస్త్రవేత్తల మనోవిశ్లేషణను మథించారు. ఇటు భారతీయ ఆస్తిక దర్శనాలను, నాస్తిక దర్శనాలను తుదముట్ట చవిచూచారు. అద్వైతం ఆయనకు అభీష్టమైనా శాంకరాద్వైతంలో ఆయన మనసు కుదురుకొనలేదు. నాగార్జున దర్శనమైన మాధ్యమికవాదం ఆయనకొక సంతృప్తి నిచ్చింది. బౌద్ధతర్కాన్ని బాగా ఆకళింపు చేసుకున్నారు. ఈ దార్శనిక దృష్టితో భారతీయ అలంకార శాస్త్రాన్ని అధ్యయనం చేశారు. పాశ్చాత్య కవితాతత్త్వాన్ని అవగాహన చేసుకున్నారు. ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన స్వప్నశిల్పాన్ని, ఫ్రాయిడ్ చూపెట్టిన స్వప్నవిచారాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేసి స్వప్నశిల్పానికి, ధ్వనిసిద్ధాంతానికి గల సామ్యాన్ని ప్రతిపాదించారు. ఔచిత్యవిరహితంగా రసనిష్పత్తి కలుగదని విశ్వసించారు. అటు పాణినీయం, ఇటు చిన్నయసూరీయం ఆయనకు తలమానికాలైనవి అటు వాక్యపదీయంలో ప్రతిపాదించిన పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ వాగ్విచారము, స్ఫోటబ్రహ్మవాదము అభిమానికాలైనాయి. శబ్దబ్రహ్మవాదాన్ని సునిశితంగా పరిశీలించారు. ఇటు

అలంకారాలను ఛందోవిధానాలను, ప్రాస అనుప్రాసాది ప్రయోగాలను రస స్ఫోరకంగా ప్రాచీనాంధ్ర కవులు ఎలా వాడారో ప్రదర్శించారు. దర్శనంగా మాధ్యమికం, కవితాలక్ష్యంగా రసాభివ్యంజకమైన ధ్వనిమార్గం ఆయనకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాస లయ్యాయి. ఈ దృష్టితోనే ఆయన సాహిత్య రంగంలో పద్యరచన, నవల, కథ, నాటిక, నాటకం సాహిత్యవిమర్శ మున్నగు అనేక ప్రక్రియలను సమర్థవంతంగా నిర్వహించారు.

వ్యక్తి ఆలోచనతో జీవితవ్యవహారం సమన్వయం పొందాలని, హేతు బద్ధమైన ఆలోచనాసరళియే జీవితవికాసానికి పునాది అనీ, మానవజీవితం వినిమయవస్తువు కాదనీ, మౌలిక విలువల పరిరక్షణ మానవతాచిహ్నమనీ, బానిసలక్షణాలను ఏ రూపంలో ఉన్నా పరిహరించాలనీ, స్వేచ్ఛాయుత వాతా వరణంలో మానవవ్యక్తిత్వవికాసం జరుగుతుందనీ, అప్పుడే ప్రజాస్వామ్య వ్యవస్థ సుస్థిర మవుతుందనీ, రాజకీయంగా, సామాజికంగా ఇటువంటి ప్రగతి పథం ఆదరణీయమనీ, మానవకళ్యాణానికి దోహదం చేసే భారతీయ ప్రాచీన సంస్కృతీసాహిత్యాల అవగాహనం ఆవశ్యకమనీ - కృష్ణరావుగారి సాహిత్య ప్రక్రియలలోని ఇతివృత్తాల ప్రధాన ఆశయాలు.

జి.వి. కృష్ణరావుగారు ఆగస్టు 23, 1979 తేదీన కాలధర్మం చెందారు. కృష్ణరావుగారి భావాలను వ్యక్తిత్వాన్ని పరిశీలించే, ప్రతిబింబించే వ్యాసాలతో సాహిత్య సమాలోచన గ్రంథాన్ని ప్రచురించాలనే తలంపుతో సారస్వత ప్రియుల సంఘం ఒకటి ఏర్పడింది. సమితి కోరిక మన్నించి సహృదయులైన పండితులు, సాహితీవిమర్శకులు, సన్నిహితులు కృష్ణరావుగారి సాహిత్య వ్యక్తి త్వాలకు ఆవిష్కరించే వ్యాసాలను పంపి దయతో తమ తోడ్పాటు అందచేశారు. వీరందకృషి ఫలితమే ఈ సాహితీచైత్రరథం.కృష్ణరావుగారి ప్రతిభావ్యుత్పత్తులకు దర్పణంపట్టే వారి కొన్ని వ్యాసములనుగూడ ఇందులో పొందుపరచాము. ఇదే కృష్ణరావుగారికి సాహితీనీరాజనం.

— సంపాదకవర్గం

# సాహిత్య భవితవ్యం

డా॥ జి. వి. కృష్ణరావు

న సంసారస్యనిర్వాణా త్కించి దస్తి విశేషణం ।
న నిర్వాణస్య నంసారా త్కించిదస్తి విశేషణమ్
నిర్వాణస్య యా కోటిః కోటిః సంస్మరణస్య చ ।
న తయో రంతరం కించి త్సుసూక్ష్మమపి విద్యతే॥

— మూలమాధ్యమిక కారికలు

"సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్", అని భర్తృహరి కాబోలు అన్నాడు. ఈ వాక్యం కొన్ని సంవత్సరాల క్రిందట విడ్డూరంగా కనిపించింది. "ప్రజాస్వామిక రాజ్యాలలో వ్యక్తులకు రాజ్యాలు లభించవు. కాని, మంత్రిపదవులు, శాసనసభాసభ్యత్వాలు, రాయబారుల పదవులు, ఇంకా ఇతర పదవులు కోరుకోవచ్చును; లభించనూవచ్చు. కాని అవి అక్కరలేదు. కవిత్వం ఒకటి ఉంటే చాలు ననుకోవడ మేమిటి ? ఇది ఆలోచించి అంటున్న మాటేనా ?" అని నాడు అనిపించింది. ఏ కొలదిమంది మాత్రమో తక్క తక్కిన సమాజమంతా నేడు ఇలాగే భావిస్తున్నది.

ఇంతకూ కవిత్వానికిగాని, ఇతర లలితకళలకుగాని ఇంత ఉత్తమస్థానం ఇవ్వవచ్చునా? ఇవ్వవచ్చునంటే ఎందుకు ఇవ్వాలి? "చాలుం జాలు గవిత్వముల్ నుడువుచో సత్యంబు సాధింతురా?" అని మరొక కవి ప్రశ్నిస్తున్నాడు. ఈ వాక్యం భర్తృహరి తాత్పర్యాన్ని అనుగమిస్తున్నదా? ఖండిస్తున్నదా?

కవిత్వ మంటే ఏమో చెప్పుకొనక యీ ప్రశ్నలకు సరియైన సమాధానం పొందలేము. మరి కవితానిర్వచనానికి ప్రయత్నించట మంటే మహాకూపంలో పడటమే. అత్యంత ప్రాచీన

కాలం నుంచి నేటివరకూ ఎందరో మనీషులు కవిత్వాన్ని ఎన్నో విధాల నిర్వచిస్తూ వచ్చారు. అవి సంవాదకమై అందరికీ ఆమోదనీయమైన నిర్వచనం కనిపించటంలేదు. ఒకవేళ అలాంటిది ఉన్నదేమో తెలియదు. కాని కవిత్వం విన్నప్పుడు గుర్తించవచ్చు ననుకుంటాను.

'ఇంతకూ కవిత్వాన్ని గుర్తించే మార్గాలేమిటి ? అంతరాత్మ ఏమైనా చెబుతుందా ? ఏమని చెబుతుంది? ఆ రహస్యం కొంచెం మాకు గూడ చెప్పండి', అని అనవచ్చును. ఎవరు ఎలా వెక్కిరించినా ఏది కవిత్వమో ఏది కాదో చెప్పవలసింది హృదయమే. అయితే ఎవరి హృదయం చెప్పాలి ? నా హృదయమా, మీ హృదయమా, సమాజహృదయమా?

నా హృదయం మీకు గాని, మీ హృదయం నాకు గాని, సమాజహృదయం మనకుగాని చెప్పలేదు. ఎవరి హృదయం వారికే చెబుతుంది. తన హృదయం తనకు ప్రమాణం కాని, అన్యహృదయం కాదు. పరప్రత్యయనేయబుద్ధులు పొందేది శాస్త్రార్థమైతే కావచ్చును గాని, కావ్యానుభూతి మాత్రం కాదు.

సరే, కవిత్వవిషయంలో హృదయం ఏమి చెబుతుంది? శబ్దపూర్వకమైన రచన విన్నప్పుడుగాని, చదివినప్పుడుగాని, సమాధ్యవస్థ ఏర్పడాలి. ఆ సమాధ్యవస్థ కల్పించిన రచన కవిత్వ మౌతుంది. కల్పించదో, కవిత్వం కాదు. ఇప్పుడు సమాధ్యవస్థను నిర్వచిస్తేనే కాని, తాత్పర్యం బోధపడదు.

గ్రహణము, గ్రాహ్యము, గ్రహీత అన్న భేదాలు పోయి గ్రహణం మాత్రం మిగిలి ఉన్న స్థితిని సమాధి అంటారు. ఇలా అనగానే ఏదో మాటల గారడీ ప్రారంభమైనట్లు కనిపిస్తుంది. దృష్టాంతం చెప్పుకొంటే ఈ చిక్కు తొలగుతుంది.

"ఒకసారి ద్రోణుడు తన శిష్యుల అస్త్రవిద్యాకౌశలం తెల్సుకొనగోరి పిట్టబొమ్మను చెట్టుకొమ్మకు గట్టి ధర్మరాజాదులను బిలిచి — 'మీరు ఆ పిట్టపై గురిపెట్టుకొని సిద్ధంగా ఉండండి. నేను చెప్పినప్పుడు కొట్టండి.' అని హెచ్చరించాడట. అంత అందరూ విండ్లెక్కుపెట్టుకొని సిద్ధంగా ఉన్నారట. అప్పుడు ద్రోణుడు ధర్మరాజును సంబోధించి "పిట్టతల కనబడుతున్నదా?" అని ప్రశ్నించాడట. 'ఆఁకనిపిస్తున్నదండీ', – 'మరి నేనో' — 'ఆఁ' — 'మరి నీతమ్ములు?' — 'ఆ –,' వెంటనే ఆచార్యుడు అర్జునుని సంబోధించి — 'పిట్టతల కనబడుతున్నదా?' అని అడిగాడట. అతడు 'అవు' నన్నాడట. 'మరి నేనో' అని ప్రశ్నించగా 'లే' దని ఆ శిష్యుడు చెప్పాడట." అర్జునునకు అప్పుడు ఏర్పడినదానిని సమాధ్యవస్థ అంటారు.

ఇలాంటి సమాధ్యవస్థ కల్పిస్తున్నదానిని కవిత్వ మని చెప్పుకోవచ్చును. అంటే పాఠకుడు బాహ్యప్రపంచం మరచిపోయి రచనలో నిమగ్నుడు కావాలి. ఇలా అన్నప్పుడు ఒక ప్రశ్న అంకురించవచ్చును. లెక్కలు చేసుకొనే విద్యార్థి శాస్త్రవిషయం గాఢంగా ఆలోచించే శాస్త్రకారుడు, పనిలో నిమగ్నుడైన శ్రామికుడు బాహ్యప్రపంచాన్ని మరచిపోతున్నారు. వారికి ఆ స్థితిని కల్పిస్తున్నవి కూడ కవిత్వమవుతవా ?

కావు — అవి బాహ్య ప్రపంచాన్ని మాత్రమే మరపిస్తున్నవి. కాని, సమస్య ఒకటున్నది; నేను ఉన్నాను, చేస్తున్నాను, అన్నవాటిని మరపించటం లేదు. గ్రహణ, గ్రాహ్య గ్రహీతృభేదం ఉంటున్నది.

కొన్ని సందర్భాలలో 'నేను' అన్న జ్ఞానం లోపించవచ్చును. తన్ను తాను మరచిపోయి ఒక విషయాన్ని గూర్చి ఆలోచించవచ్చును. అప్పుడుగూడ గ్రహణము, గ్రాహ్యము అన్నవి రెండూ, ఉంటున్నవి. కవిత్వ మని చెప్పబడే రచన చదువుతున్నప్పుడు పాఠకుడు తన్ను తాను మరచిపోతాడు. ఆస్థితిలో తన సంగతి స్ఫురించదు. ఆరోగ్యవంతునకు శ్వాసప్రశ్వాసాలు గమనంలో ఉంటవా? కావ్యపఠనంలో గూడ అంతే. కావ్యార్థం మాత్రమే పాఠకుని మనోముకురంలో భాసిస్తుంది. అలా భాసిస్తున్నప్పుడు పాణినీయ ధ్వన్యాలోకాదులు పాటింపబడుతున్నవని కాని, ఉల్లంఘింపబడుతున్న వని కాని, కాళిదాసాదులు అనుకరింపబడుతున్నా రని కాని తోచదు. గుణదోషాదులు గూడ ప్రత్యక్షంగా కనిపించవు, ఆసక్తులమై ఒక పుస్తకం చదువుతున్నప్పుడు అల్పమైన అక్షర స్ఖాలిత్యాన్ని గమనించము. అది జి.పి. బాడిలో అచ్చయిందా, ఇ. బి. బాడిలో అచ్చయిందా, పాయింట్ టైపులో అచ్చయిందా అన్న విషయం స్ఫురించదు. ఇలాంటివే కావ్యానుభవానపకర్షకాలైన గుణదోషాలు.

ఆ భాసించే అర్థము ఏమిటి? అది ప్రత్యక్షాదిప్రమాణ సిద్ధమైన జ్ఞానం కాదు. రజ్జుసర్ప భ్రాంతి వంటి భ్రాంతి కాదు. ఒక్కొక్కప్పుడు ఇదా, అదా అన్న సంశయం కలుగుతుంది. సాహిత్యానుభూతి అలాంటి సంశయప్రతీతి కాదు. స్వప్నంలో గజతురగాదులను చూస్తాము. కావ్యంలో భావింపబడుతున్న అర్థం అలాంటిది కాదు. కనుకనే ప్రాచీనులు కావ్యమందు ఆస్వాదింపబడే అర్థం లౌకికపదార్థవ్యతిరిక్త మనీ, అది అనుకార, ప్రతిబింబ, ఆలేఖ్య, సాదృశ్య, ఆరోప, అధ్యవసాయ, ఉత్ప్రేక్షా, స్వప్న, మాయా, ఇంద్రజాలాది విలక్షణ మనీ, పాఠకునకు కలుగుతున్న అనుభవం సమ్యక్ జ్ఞాన, భ్రాంతి సంశయ అనవధారణ, అనధ్యవసాయ, విజ్ఞానభిన్న వృత్తాంతాస్వాదనరూప సంవేదన మనీ అన్నారు.

ఇలాంటి అనుభవమే కాక రామాయణం, భారతం, షేక్స్పియర్ నాటకాల వంటి రచనలు మరికొంత విశేషానుభవం కలిగిస్తున్నవి. వానిని పూర్తిగా చదివేటప్పటికి పాఠకుడు ఆ యా పాత్రలందు తన్మయీభావస్థానీయావస్థ పొందటమే కాక విషయరహితమైన స్థితి పొందుతున్నాడు. ఆ స్థితి ఆర్యనాగార్జునుడు పేర్కొన్నట్లు చతుష్కోటి [సదసదుభయానుభయాంతాలు] వినిర్ముక్తం. అందు ఏ దృష్టి ఉండదు. అదే నిర్వాణం. అట్టి స్థితి కేవలం కరుణం వల్లనో శాంతం వల్లనో మాత్రమే ప్రాప్య మేమో ననిపిస్తున్నది. కనుకనే, కరుణం ఒక్కటే రసమని భవభూతి, శాంతమే మహారస మని అభినవగుప్తుడు పేర్కొన్నారు. వీరిరువుర కంటె అత్యంతప్రాచీనుడైన నాగార్జునుడు కావ్యతత్త్వాన్ని ప్రత్యక్షంగా గాని పరోక్షంగా గానీ ప్రస్తావించకపోయినా సర్వోపశమాన్ని ఉపదేశించటం వల్ల అతని మతంలో శాంతమే రసరాట్టని చెప్పుకోవచ్చును. కావ్యం వల్ల పొందబడుతున్న ఈ స్థితి సుషుప్తి, అపస్మారం, మదిరాపానవైవశ్యం మున్నైనవాటి కంటె ఎలా విశిష్ట మని అనిపించవచ్చును. సుషుప్త్యాద్యవస్థలలో పంచేంద్రియవ్యాపారం ప్రవర్తిల్లదు. కావ్యాస్వాదనకాలంలో జ్ఞానేంద్రియాలు జాగరూకాలై ఉంటవి. చక్షురక్షరసంయోగాదులు సాగుతుంటవి. అనౌచిత్యం, అసంభావ్యత పొడకట్టగానే మనసు ఎదురు తిరిగి బాహ్యజగత్తులోకి వచ్చిపడుతుంది. కనుక కావ్యానుభూతికి, సుషుప్త్యాదులకూ పోలిక లేదు.

ఇంతకూ ఇలాంటి కావ్యానుభవం దేనికి ? కూడు పెడుతుందా ? గుడ్డ ఇస్తుందా ? జాతిని వీర్యవంతం చేస్తుందా ?

కావ్యానుభూతి అలౌకికం. ఇలాంటి అనుభవం శాస్త్రాల వల్లగాని, ఇక్షురసాస్వాదన వంటి భౌతిక భోగాలవల్లగాని లభించదు. ఈ అనుభవం అనన్యం. శాస్త్రాదులు అసంవృతిని (infinity) ఆమోదిస్తవి కాని, ఆ అసంవృతిస్వరూపం అవి బోధపరచలేవు. కావ్యం అలా కాక పాఠకుణ్ణి మూర్తప్రపంచం నుంచి అమూర్తప్రపంచానికీ, ఆ అమూర్తప్రపంచం నుంచి అసంవృతికీ చేరవేస్తుంది. అలా చేరవేయబడుతున్నప్పుడు పాఠకుడు పొందే ఆనందం ఇష్టార్థప్రాప్తివల్ల కలుగదు. విమానంలో ఎక్కి తిరిగితే రాదు. చంద్రమండలంలో మొదటి సారిగా అడుగు మోపినా పొడమదు. సహృదయుడు పొందే ఆ అనుభవం అనుభవైకవేద్యం.

భోజ్యపదార్థాలకు ఉప్పు రుచి కల్పిస్తున్నట్లే మానవజీవితానికి లలితకళలే అర్థం, విలువ కల్పిస్తున్నవి. కసాయివృత్తి యందు సాధారణంగా మనకు జుగుప్స కలుగుతుంది. ఆ కసాయివృత్తి పాటించిన ధర్మవ్యాధునికి లోకపూజ్యత సంప్రాప్తించింది. వ్యాసభారతి

లేకపోతే అది సాధ్యపడేదా ? అలాగే దొంగలను, దొంగతనాన్ని మనం క్షమించము. డాస్టవస్కీ 'అనెస్టిటీఫ్' అన్న కథ వ్రాసి ఆ పశ్చాత్తాపహరునికి మనచేత అశ్రుతర్పణం విడిపించాడు. లేడీ మాక్బెత్ అన్న కథతో మరొక రష్యన్ రచయిత దారుణబంధకి పై మన కరుణావృష్టి కురిపించాడు. మనదేశంలోని సామాన్యప్రజానీకానికున్న విలువలన్నీ భారత రామాయణాలవల్ల కలిగినవే. శాస్త్రం వస్తువులప్రయోజనం నిర్ణయిస్తే, కవిత్వాది లలితకళలు వాటికి విలువలను కల్పించి వ్యవస్థీకరిస్తున్నవి.

కావ్యం పాఠకునకు తన్మయీభావం కలిగిస్తున్నది. కనుక, అది అతని సంకుచిత దృష్టిని పటాపంచలు చేసి మనోవైశద్యంకల్పించి పశుత్వం దగ్గరనుంచి పశుపతిత్వం దాక సానుభూతితో గ్రహింపజేస్తున్నది.

తన మూల సిద్ధాంతాలకు విరుద్ధాలైనప్పుడు ప్రియురాలి ఉపదేశాలనైనా పాఠకుడు ప్రియతర వచనాలతో తప్పుకొనిపోవచ్చును. కాని కావ్యమందట్లు గాదు. కావ్యార్థమే హృదయమైపోతుంది. నాగార్జునుని పరిభాషలో చెప్పవలసివస్తే సంసారానికి మూలభూతమైన దృష్టి సమూలం నశించకపోయినా శిథిలమవుతుంది. ఈ ప్రమాదం గుర్తించి ప్లేటో తన దృష్టి కనుగుణంగా వ్రాయని కవులను తన ఆదర్శ రాజ్యం నుంచి బహిష్కరిస్తానన్నాడు. మన అదృష్టం బాగుండి అతనికి ఆ అధికారం సంక్రమించలేదు. నియంతృక రాజ్యాధినేతలు, లలిత కళలకున్న యీ శక్తిని గుర్తించి వాటిని అనుశాసిస్తున్నారు. దీనివలన లలిత కళాఖండాలు లోపించి వాటి ఆభాసాలు మాత్రమే అచటి ప్రజలకు లభిస్తున్నవి.

పురుషార్థాల పార్యంతికఫలం ఆనందమే కదా ! ఆ ఆనందాన్ని సాహిత్యం అప్పటికప్పుడే సహృదయునకు అందిస్తున్నదని అభినవగుప్తుని ఆభాషణం. అలాకాదు, కావ్యం ఉపదేశమే ఇవ్వాలనటమంటే అమృతం అక్కరలేదు. మకరందమే కావాలని కోరటమే కదా.

ఈ సందర్భంలో మమ్మటుడు జ్ఞప్తికి రాకమానడు.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే

సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశ యుజే"

అని ఆయన అన్నాడు. కీర్తి, అర్థసిద్ధి, వ్యవహారజ్ఞానము, అమంగళపరిహారణము కవిత్వప్రయోజనా లని అందలి అభిమానం కొలదీ ఆయన పేర్కొన్నాడు. కాని వాస్తవానికి ఇవి నైకాంతికాలు. కవులకు మార్గాలు చూపిన మహాకవులు నామరూపాలు లేకుండ నశించి

నట్లు చరిత్రనుబట్టి అనుమానించవలసి వస్తున్నది. హోమరు భిక్షాటనం చేసి జీవించినట్లు ప్లేటో చెపుతున్నాడు వ్యవహారజ్ఞానం, శివేతరక్షతి శాస్త్రాలవల్లనూ సిద్ధిస్తవి. కనుక ఆయన పేర్కొన్న ప్రయోజనాలలో అసందిగ్ధమైనది 'సద్యఃపరనిర్వృతి' ఒక్కటే.

మరొక విశేషం—ఏ శాస్త్రానికైనా, ఏ విద్యకైనా మూలం భావన. ఈ భావనను వర్ధిల్ల జేసేవి స్వప్నాలు, కవిత్వాది లలితకళలు మాత్రమే. ఇంతకూ కవిత్వాది లలితకళలవల్ల అలౌకిక అసంవృత్యనుభవం, జీవితార్థవత్త, దృష్టిశైథిల్యం, సహానుభవం, సద్యఃపరనిర్వృతి, భావుకత లభిస్తవి.

ఇంతవరకూ సిద్ధాంతాన్ని బట్టి నిష్పన్నమైన కావ్యస్వరూపం చెప్పుకున్నాము. కాని సిద్ధాంతానికీ, ఆచరణకూ తేడా ఎప్పుడూ ఉంటుంది. త్రిభుజంలోని మూడు కోణాల మొత్తం 180 డిగ్రీలు ఉండాలి. కాని, కొలిచి చూచినప్పుడు కొంత వ్యత్యాసం కనిపించటం విద్యార్థుల కనుభవసిద్ధమే. అలాగే కవిత్వవిషయంలో గూడ.

మనస్సు లక్క వంటిది. లక్కకు ఘనత్వము, శైథిల్యం, ద్రవత్వము అని మూడు అవస్థలున్నవి. ఘనత్వావస్థలో లక్క ఏ ముద్రనూ స్వీకరించదు. శైథిల్యావస్థలో వేసిన ముద్రను స్వీకరిస్తుంది. కాని, గట్టి ఒరపిడి కలిగితే ఆ ముద్ర నిలువదు. ద్రవత్వావస్థలో మరొక ద్రవ్యకణం అందులో పడి ఘనీభవించినప్పుడు ఆ కణం రాపిడికి రాలక అందే నిలిచిపోతుంది.

మనస్సుకు గూడ ఈ అవస్థలు చెప్పుకోవచ్చును. కొన్ని రచనలను, కబుర్లు విన్నట్లు వింటాము. శబ్దాలంకారప్రధానమైన పద్యకవిత్వం, ఆమూలాగ్రం చదివించటం ఒక్కటే విశేషంగా గలిగిన కథలు, నవలలు, నాటకాలు ఈకోవలో చేరుతవి. కొన్ని రచనలు చదువు తున్నప్పుడు మనశ్శైథిల్యం కలుగుతుంది. ఈ స్థితిలో బాహ్యప్రపంచం మరచిపోతాము. కాని తన్మయీభావం కలుగదు. అహంతకు ద్రుతి ఉండదు. వర్ణకకవిత, తెలుగు ప్రబంధాలు (తన్మయీభావం కలిగించే ఘట్టాలు వినా), షా నాటకాలు, పాఠకుల వ్యక్తిత్వాలను మరపించక చదివించే కథలు, నవలలు, నాటకాలు, ఈ కోవకు చెందుతవి. ఈమాట కొందరికి కోపకార ణం కావచ్చును. కాని ఎవరి అనుభవాన్ని వారు పరిశీలించుకొని పఠనసమయంలో అహంత లయించినదో, లేదో, గుర్తుకు తెచ్చుకోవాలి. తన్మయులై వర్ణనీయార్థంలో కరగిపోయా మనుకొంటే ఈపైని చెప్పినది అయథార్థమే.

ఇంక మూడవజాతి రచనలు సమాధ్యవస్థను కల్పించి, అహంతను లయింపజేసి, తమ తమ పాత్రలలోనో, సన్నివేశాలలోనో, వర్ణనీయార్థాలలోనో దాదాపు మిళితం చేసివేస్తవి. ఈ స్థితిలో మనస్సు పూర్తిగాకరిగిపోయిన లక్కవలె రచనాప్రతిపాద్యాలైన అర్థాలన్నింటినీ తనలో లీనం చేసుకొంటుంది. ఇలా లీనమైపోయిన అర్థాలు ఆమరణం మనసులో నిలిచిపోతవి. ఉత్తరకాలంలో తిరిగి ద్రవత్వం పొందినప్పుడు గూడ వెనుకటివాటిని కోల్పోక క్రొత్తవాటిని గ్రహిస్తుంది. ప్రాతవాటితో క్రొత్తవాటిని చేర్చుకొని, పరిపుష్టి పొందుతుంది. ఈ స్థితిని కల్పించే రచనలకు లక్ష్యాలుగా కాళిదాసుని కావ్యాలు, సంస్కృతనాటకాలు, టాల్‌స్టాయ్, డాస్టవిస్కీ, చెకొవ్, టాగూరుల ఉత్తమ కథలు, వేలూరి శివరామశాస్త్రిగారి 'డిప్రెషన్ చెంబు', ఇబ్సన్, యు జి. ఓనిల్. సింజ్, ఓకేసీల రూపకాలు పేర్కొనవచ్చును.

ఇక నాల్గవ జాతి రచనలు సబీజ సమాధ్యవస్థ కల్పించి క్రమక్రమంగా నిర్బీజ సమాధ్యవస్థకు కొనిపోతవి. ఈ రచనలు పాఠకునకు తన్మయీభావం కలిగించి కట్టకడపట విషయ రహితమైన సమాధ్యవస్థ కల్పిస్తవి. సంస్కృతంలో భారత, భాగవత రామాయణాలు, తెలుగులో భారతం, ఇంగ్లీషులో షేక్స్‌పియర్ విషాదాంతనాటకాలు, ముఖ్యంగా హేంలెట్, - కాఫ్కా వ్రాసిన ట్రయల్, కాజిల్ అన్న రచనలు ఈ కోవకు చెందుతవి. ఈజాతి రచనలు ఉత్తమోత్తమాలు.

ఈ విభాగం సామాజికుల హృదయస్పందనం పై ఆధారపడుతున్నది. మరి యీ హృదయాలు, మనస్సులు ఒకే స్థాయిలో ఉండవు. కొందరి మనస్సులు సుశ్లథాలు, సుద్రవాలు; మరికొందరివి యీషచ్ఛ్లథాలు, ఈషద్ద్రవాలు; వేరొక కొందరివి దుశ్శ్లథాలు, దుర్ద్రవాలు. దీనికి తోడు ఆగంతుకాలైన ఆధివ్యాధులు, కఠోరదృష్టులు, విప్లవాలు స్వాభావిక మానసికస్వాస్థ్యం చెరిచి కావ్యార్థాలను యథాతథం గ్రహించనీయవు; ఈ చిక్కులన్నీ పరిహరించటం కోసమే.

> "యేషాం కావ్యానుశీలనాభ్యాసవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయ తన్మయీ
> భావయోగ్యతా తే సహృదయ సంవాదభాజః సహృదయాః"

అని అభినవగుప్తుడు నిర్వచించాడు ఈ నిరుక్తిలోని కావ్యశబ్దాన్ని కొందరు సంస్కృతకావ్యానికి పరిమితం చేయాలంటారు. వీరు-"గుణాః ప్రమాణం న దిశాం విభాగః", అన్న సూక్తిని విస్మరించి సంవృతిని వరిస్తున్నారు. కనుక అభినవగుప్తుని నిర్వచనం యథాతథం గ్రాహ్యం.

ఈ సందర్భంలో మరొక అంశం సంస్మరణీయం. మానవుని మనస్సు కొంతవరకు అతని వయస్సు మీద ఆధారపడుతున్నది. బాల్యంలో వీరాద్భుతాలు రుచించినంతగా శృంగారాదులు రుచించవు. యౌవనంలో శృంగారాదులు మరులు కొలిపినంతగా అద్భుతాదులు మరులు కొలుపవు. కౌమారంలో కరుణాదులు నచ్చినంతగా ఇతరాలు నచ్చవు. వార్ధకంలో శాంతాదులు హత్తినట్లు శృంగారాదులు హత్తవు.

ఇంతవరకు పేర్కొన్న అంశాలను గమనించినప్పుడు రచనలలోని ఉత్తమోత్తమాది భేదాలను అసందిగ్ధంగా సర్వజన సమాదరణీయంగా నిర్ణయించడం దుష్కరమని బోధపడక మానదు. వ్యవస్థాభిలాషియైన సహృదయుడు రచనలలోని తారతమ్యాలను నిర్ణయించుకొనేటప్పుడు తన వయస్సును, అభిమతాలను స్మరించి, వాటికి విపరీతాలై ఇంతకు పూర్వం అవస్థలలో కలుగుతున్నవాటిని బట్టి ఆ యా కోవలకు చెందిన కృతులుగా పరిగణించవలసి ఉంటుంది. వయస్సు మున్నగువానికి అనుగుణాలైన రచనల విషయంలో పాఠకుడు తన నిర్ణయాన్ని ప్రామాణికంగా భావించుకొనకపోవటం మేలు. దీనివలన ప్రమాదానికి తావుండదు.

విశిష్ట అనుభవనిష్పాదక మైన సాహిత్యప్రపంచానికీ, లౌకికప్రపంచానికీ సంబంధం ఏమిటి? లౌకికప్రపంచవాసియైన కవి అలౌకికానుభవ ప్రతిపాదకమైన సాహిత్యసంసారానికి ఎలా ప్రజాపతి అవుతున్నాడు ?

సాహిత్యం శబ్దరూపి. శబ్దాలు, అర్థాలు లౌకికాలు. వీటి గుణదోషాలూ లౌకికాలు. రసదోషాలు కూడ లౌకికాలే. కనుక సాహిత్యం గూడ లౌకికం కావాలి. ఇలా అన్నప్పుడు కొన్ని సందేహాలు కలుగకమానవు. కవిత్వంలో రెక్కల గుర్రాలు, చల్లని నిప్పులు, పగటి వెన్నెలలు మున్నైనవి ఉంటవి. లోకంలో కనిపించే కార్యకారణభావం కావ్యలోకంలో కనిపించదు. లోకంలోని వస్తువులు సుఖమో, దుఃఖమో, మోహమో కలిగిస్తుంటే, కావ్యంలోని అర్థాలు ఆనందంమాత్రమే కలిగిస్తున్నవి. కనుక సాహిత్యం లౌకిక మెలా అవుతుంది?

స్వప్నంలో ఈ విశేషాలు కనిపిస్తున్నవి. అయితే ఎల్ల స్వప్నాలు ఆనందప్రదాలు కావు. కాని కాదాచిత్కంగానైనా ఆనందప్రదస్వప్నాలు కలుగకపోవడం లేదు. ఇలాంటి స్వప్నం కూడ అలౌకికం కావాలి. కాని స్వప్నం కూడ లౌకికమే. సాపేక్షాలు, లేదా హేతుప్రత్యయసంజాతాలన్నీ లౌకికాలే. జాగ్రదవస్థలో ప్రాప్తించిన అర్థాలే సంస్కారరూపాన ప్రాజ్ఞునిలో (*unconscious*) నిలిచి ఉండి నిద్రితుని తీరని కోరికలచే ప్రేరితాలై తైజసుని

(*Preconscicus*)శాసనాన్ని బట్టి వ్యత్యయం పొంది స్వప్నంలో గోచరిస్తున్నవి. అంతేకాని, అభావంనుంచి ఉత్పన్నం కావటం లేదు. కనుకనే యోగదర్శనం స్వప్నాన్ని భావితస్మర్తవ్యంగా పరిగణిస్తున్నది.

కనుక స్వప్నం వలెనే కావ్యమూ లౌకికమే. లౌకికమైన కావ్యం అలౌకికమైన అనుభూతిని ఎలా కలిగిస్తున్నది ? ఈ ప్రశ్న కార్యకారణభావం వలెనే అత్యంతక్లిష్టం. వివాదాస్పదం. బీజం వలన అంకురసిద్ధి అనుభవప్రసిద్ధం. అలాగే కావ్యపఠనం వలని అలౌకికానుభవంకూడ.

అయితే, కావ్యావిర్భూతికీ, స్వప్నోద్భవానికీ కొంత సాదృశ్యం కనిపిస్తున్నది. అమూరవర్తి అయిన (స్వప్నానికి క్రిందటి పగటివేళ గాని, మూడు నాలుగు రోజులలోపల గాని జరిగిన) జాగ్రదవస్థాంతర సన్నివేశం అవలంబనంగా గొని స్వాపి అనవాప్త కామం ప్రాజ్ఞ విలీనసంస్కారాలలో తనకు అనుకూలమైనవాటిని మేలుకొలిపి వైశ్వానరునకు (*conscious*) అవిరుద్ధమైన చతుర్విధాభినయం పట్టించి తైజసుని సమక్షంలో నాటక మాడిస్తుంది. ఈ నాటకానికి తీరని కోరిక కవీ, సూత్రధారుడూ అవుతున్నది. కోరికకు ఇష్టమైన సంస్కారాలు నటులు. ప్రాజ్ఞతైజసులు సామాజికులు. ఈ నాటక ప్రయోగంతో సంతృప్తిపొందుతున్నది[1] ప్రాజ్ఞతైజసులు మాత్రమే. ప్రాజ్ఞునకు దీనితో సంబంధం లేదని మాండూక్యం చెబుతున్నది. ఫ్రాయిడ్ ఉన్నదంటాడు. ప్రాజ్ఞునకు సంబంధం ఉన్నదా లేదా అన్న విషయం మనకు ముఖ్యం కాదు. వైశ్వానరునకు మాత్రం ఇందు కర్తృత్వం కాని, భోక్తృత్వం కాని లేదు. ఇది అటు మాండూక్యానికీ ఇటు ప్రాయిడ్‌కు సమ్మతమే. ఈ హేతువు వలన మందవేదనాత్మైన స్వప్నాలు వైశ్వానరుని ధారణలో నిలువవు. తీవ్రవేదనాత్మైన స్వప్నాలు వైశ్వానరునకు గుర్తుంటవి. స్వప్నాలు తీవ్రతరవేదనాత్మైనప్పుడు అతడు మేల్కొంటున్నాడు. వైశ్వానరునకు గుర్తున్న స్వప్నాలు అర్థరహితంగా విచిత్రంగా కనుపిస్తవి. సంగ్రహంగా చెప్పాలంటే స్వప్నాలు ప్రాయికంగా తీవ్రతమ వేదనాలు కావు.

పైగా జాగ్రదవస్థాబాధితాలు అవుతున్నవి. వాటిలో సాధారణీకృతి ఉండదు. స్వాపి కోరుకొన్నప్పుడు కోరుకొన్న తీరున కోరుకొన్న స్వప్నాలు పొందలేడు. అంటే స్వప్నాలు స్వాపి ఇచ్ఛానువర్తులుకావు. వాటిని అతడు శాసించలేడు. అతడు వలదనుకొన్నా స్వప్నాలు రావచ్చు.

ఇక కావ్యావిర్భూతి—జీవితంలో విన్న విశేషం కాని, కన్న విశేషం కాని రచయితను ఆకర్షిస్తుంది. ఒక్కొక్కప్పుడు అది అతనిని కలవరపెట్టవచ్చును. అలాంటి విశేషాన్ని

---

1. జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః ... స్థూలభుగ్వైశ్వానరః స్వప్నస్థానోऽన్తఃప్రజ్ఞః ప్రవివిక్తభుక్తైజసః— యత్ర సుప్తో న కంచన కామం కామయతే న కంచన స్వప్నం పశ్యతి తత్ సుషుప్తం సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః ప్రాజ్ఞః—

మాండూక్యం : 3-5 మంత్రాలు

రచయిత విడువక మననం నుస్తాడు. ఆ మననంతో ఒకే విధమైన దృష్టి, భావతీవ్రత రచయితలో బయలుదేరుతుంది. దృష్టి ప్రబలమై విస్పష్టమైనకొలది ప్రాజ్ఞభూమిలో భావనలు మోసులెత్తుతవి. ఇలా బయలుదేరుతున్న భావనాంకురాలను వైశ్వానరగత ఔచిత్యానౌచిత్య జ్ఞానం, గుణదోష వివేచనాశక్తి పరిశీలిస్తూ అనర్హాలను సమయించి తక్కినవానికి బలం సమకూరుస్తుంది. దీనితో భావతీవ్రత అధికమవుతుంది. అంటే తాపక శక్తి పెరుగుతుంది. తపనం అతిశయించినకొలది జతుసదృశమైన మనస్సు క్రమంగా కాఠిన్యం కోల్పోయి శిథిలమై ద్రవించిపోతుంది. ఈ క్రమంలోనే అహంత శిథిలమై ద్రవించగా వర్ణనీయార్థం విస్పష్టతరమై చిత్రీకృతిపొందుతుంది. అంటే మథిత పయోధినుంచి లోకోత్తరవస్తువు ఉద్భవించి దేవదానవులను అద్భుతానందాలలో ముంచినట్లు మథితప్రాజ్ఞ సముద్భూత వర్ణనీయార్థాను లోకోత్తరాలై భాసిస్తూ ప్రాజ్ఞ, తైజస, వైశ్వానరులను ఆనందపరవశులను చేస్తవి. సంగీత, లయ, తాళ వృత్త వశంగతుడైన నటుడు మౌళిస్థకుంభ పరిరక్షణలో ప్రాలుమాల నట్లు రచయిత ఆ స్థితిలో రచనాక్రియను మానడు. తనకు కలుగుతున్న అనుభవాన్ని అతడు వ్రాస్తాడు. అయితే రచయిత ఎప్పుడు వ్రాస్తాడు ? అనుభవం కలిగిన తరువాత దానిని గ్రంథస్థం చేస్తాడా ? కాక రచనకు ఉపక్రమించిన తరువాత ఆ అనుభవమే రచనను నడుపుకొని పోతుందా ?

ఈ ప్రశ్నలకు ఇదమిద్ధమని సమాధానం చెప్పలేము. ఇవి రచయిత స్వభావం మీద, రచనమీద ఆధారపడుతవి. ధారణ కలిగిన రచయిత తన కృతి చిన్నదైనప్పుడు ముందు ఆ అనుభవం పొంది ఉత్తరకాలంలో దానిని గ్రంథస్థం కావించవచ్చును. లేదా, కృతిపరిమాణంతో నిమిత్తం లేక అనుభవం పొందుతూ రచన సాగించవచ్చును. కాక మనస్సులో జరుగవలసిన వ్యాపార మంతా కాగితం మీదనే సాగించవచ్చును.

రచయిత కావిస్తున్న యీ సృష్టికీ, స్వాపి పొందుతున్న స్వప్నానికీ కొన్ని సాధర్మ్యాలు, మరికొన్ని వైధర్మ్యాలు ఉన్నవి. కావ్యార్థాలు స్వప్నార్థాలు జాగ్రదవస్థాంతర అర్థాలమీద ఆధారపడుతున్నవి. జాగ్రదవస్థ, లోకమూ లేక కవిత్వమూ లేదు, స్వప్నమూలేదు. ఈ రెండింటియందునూ బాహ్యజగత్తు విస్మృత మౌతున్నది. కావ్య స్వప్నార్థాలు రెండూ విచిత్రాలు, లౌకికధర్మాతిక్రామకాలు, ప్రమాతకు పారవశ్యకారణాలు. ఈ రెంటి ఆవిర్భూతికీ మూలం ప్రాజ్ఞుడే. ఒకసారి పొంది కలను యథాతథంగా స్వాపి వేరొకసారి పొందలేడు. అలాగే రచయిత ఒకసారి సృష్టించిన అనవధారితకృతిని వేరొకసారి యథాతథంగా సృష్టించలేడు. కాకున్న ఆ తాత్పర్యంతో వేరొక కృతిని సృష్టించవచ్చును.

ఇక వైధర్మ్యాలు—స్వాపి తన తీరని కోరికకు దాసుడై కలలు కంటున్నాడు. కవి నిజద్రవణీయ దృష్టిప్రచోదితుడై రచన సాగిస్తున్నాడు. స్వాపికి కల అనివార్యం. అందలి వేదనలూ అనివార్యాలే. కృతిసముద్భూతి అట్టిది కాదు. రచయితకు ఇష్టం లేనప్పుడు రచనను నిలిపివేస్తాడు. రచన పూర్తిగా అతని సంకల్పవికల్పాల మీదనే ఆధారపడుతున్నది. కనుకనే

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'

అని ప్రాచీనులు పేర్కొన్నారు. స్వప్నం వైయష్టికం, దురవబోధం, మార్మికం, జాగ్రదవస్థాబాధితం. స్వప్నం కుంభగత నశ్వరదీపమైతే, కావ్యం స్నేహస్నిగ్ధవర్తులను వెలిగించే బాహ్యరత్నదీపం.

కవి శ్రుతదృష్టార్థప్రబుద్ధుడై ద్రవణీయ నవ్య నవ్యదృష్టితో సమాధ్యవస్థ పొంది కృతి నిర్మిస్తున్నాడు. కావ్యార్థం ప్రాజ్ఞునిలో నుండి బయనుదేరి తైజస, వైశ్వానరగత సంస్కార పరిష్కృతమై పరిపూర్ణరూపం పొందుతున్నది. కవి తన రచనలోని వైశ్వానరగత సంస్కార పరిష్కృతాంశం మాత్రమే వివరించగలడు. గాని ప్రాజ్ఞసముద్భూతాంశం వివరించలేడు. అంటే ప్రతిభాసముత్పన్నాంశం వివరించలేడు. దానిని మరొకనికి నేర్పనూ రించలేడు. ఛందోవ్యాకరణాలంకారాదిశాస్త్రాలు గూడ ఇక్కడ తమ అశక్తతను అంగీకరించక తప్పదు. 'రాజన్ భోజనం దేహి', అన్న నీరసవాక్యాన్ని ఏ శాస్త్రం కవిత్వంగా మారుస్తుంది? ఒక్క కవిహృదయం మాత్రమే ఆ పని చేయగలదు. అయితే కవులందరూ ఒకేతీరున దానిని కవిత్వంగా మార్చలేరు. కవితృకృతి భిన్నత్వం పొందుతుంది.

ఇక లోకానికీ, కవికీ, ఉన్న సంబంధం పరిశీలనార్హం. లోకానికి ఆద్యంతా లున్నట్లు గోచరించదు. విశ్వం యొక్క గమ్యం కాని విశ్వగతవిషయసంఖ్యాప్రయోజనాలు కాని బోధపడవు. ఈ విషయాన్ని విజ్ఞానశాస్త్రాలన్నీ ముక్తకంఠంతో ఘోషిస్తున్నవి. తత్త్వ శాస్త్రాలలోని కొన్ని మతాలు దీనిని అంగీకరించక పోవచ్చును. అయితే ఇవి నాగార్జునుడు, శంకరుడు, కాంటు మున్నైనవారి ప్రశ్నలకు సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది. ఏది ఎలా ఉన్నా ఆకాశాన ఎన్ని నక్షత్రా లున్నవో, ఎందుకున్నవో ఎవరు చెబుతారు? అగ్నికి ఔష్ణ్యం, జలానికి శైత్యం, పృథివికి గంధవత్వం, శిఖలకు ఊర్ధ్వప్రసారణం దేనికి అంటే సమాధానం దొరకదు. ఆ యా గుణకర్మాలు వానికి స్వాభావికా లని సరిపెట్టుకోవాలి. ఇలాంటి లోకం

కార్యకారణబద్ధమై విభిన్న ప్రవృత్తులకు హేతు వవుతున్నది. సాహిత్యసంసారం అపారమే కాని ఏకకావ్యప్రతిపాదితప్రపంచం ఆదిమధ్యాంతసహితం—అందలి సన్నివేశాలు, పాత్రలు, పరిమితాలు, స్వప్రయోజనాలు. లౌకికనియతి, కార్యకారణభావం కావ్యంలో ఉల్లంఘితాలవుతాయి. నదీ ప్రవాహంలో తామర లుంటవి. అగ్నులు చందనశీతలా లవుతవి. శిలలు ద్రవిస్తాయి. చెట్లు అశ్రుపాతం కావిస్తాయి. సహృదయులు విభిన్నప్రవత్తు లయినా కావ్యం నియతంగా ఆనందం కలిగిస్తున్నది.

లోకానికి, సాహిత్యానికి, ఇన్ని వ్యత్యాసాలున్నా లోకం కావ్యానికి మూల మౌతున్నది. సూర్యకిరణం స్ఫటిక విశ్లేషితమై వర్ణసప్తకాన్ని ప్రసవిస్తున్నది గదా. ఇక కవికి లోకానికీ ఉన్న సంబంధం - లోకానుభవ సంపత్తివల్ల కవికి రాగాది రంజిత ద్రవణీయదృష్టి ఏర్పడుతున్నది. శ్రుత, దృష్ట లౌకికార్థంవల్ల యీ దృష్టి ప్రబుద్ధమై కవికి సమాధ్యవస్థ కల్పిస్తున్నది. ఈ యవస్థలో అతని దృష్టి ప్రాజ్ఞ నిలీన లౌకికానుభూతులకు ఆత్మానుగుణ దేశ, కాల, పాత్రాదికముతోబాటు ఆదిమధ్యాంతాలు కల్పించి కవిచే వాటిని ఆస్వాదింపజేస్తూ కృతిని రచింపజేస్తుంది. ఇలా శబ్దనిబద్ధమైన కృతి లౌకికం, అస్వాదనలో మాత్రమే ఇది ప్రాచీనులు పేర్కొన్నట్లు అలౌకికం[2]

అనుభవసంపన్నుడైనా కవి ద్రవణీయ దృష్టివిరహితుడై సమాధ్యవస్థ పొందక కావ్యం నిర్మించలేడు. ఇందులో ఏది లోపించినా కావ్యత్వం లోపించక తప్పదు. పరినిష్ఠిత సమచిత్తులు లోకాన్ని ఆనందమయంగా దర్శించి పరవశులు కావచ్చును. కాని, అలాంటివారు కావ్యనిర్మాతలు కాలేరు. గాఢదృష్టికవితలు కర్మణ్యులు అవుతారే కాని, తన్మయీభావం పొందలేరు. తన్మయీభావయోగ్యత లేకపోవటంవల్ల వీరు కృతి నిర్మించినా అది శుష్కకాష్ఠం అవుతుంది కాని కావ్యం కాదు. కావ్యాస్వాదనకు దృష్టి అక్కరలేదు. కాని తన్మయీభావయోగ్యత మాత్రం అవసరం.

ఆధివ్యాధిపీడితులు, క్షుత్పిపాసార్థితులు అయినవారు యోగానికి వలెనే కావ్యనిర్మాణాస్వాదనలకు అనర్హులు. అశక్తులు. ఈ పరిశీలనను బట్టి సాహిత్యభవితవ్యాన్ని గూర్చి ఏమి చెప్పకోవాలి ?

---

2. "కావ్యార్థనిష్ఠా రత్యాద్యాః స్థాయినః సంతి లౌకికాః
తదోద్భధృనిష్ఠాస్త్వపరే తత్సమా అప్యలౌకికాః॥"

— భక్తిరసాయనం : తృ ౨. 4

కావ్యావిర్భూతికి సమాహిత ద్రవణీయదృష్టి ఆవశ్యకం. కావ్యాస్వాదనకు పాఠకుని యందు తన్మయీభావయోగ్యతాస్తిత్వం ముఖ్యం. ప్రకృతస్థితిగతులు వీటికి ఎంతవరకు పోషకంగా ఉన్నాయి?

1914 నుండి ఇంతవరకూ వాటిల్లిన ప్రపంచయుద్ధద్వితయం వల్ల ప్రపంచ మేథావుల విశ్వాసాలు, ఆదర్శాలు, లక్ష్యాలు బచాబదలై అనవస్థితి పొందాయి ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, పరిష్కృత ప్రజాస్వామ్యంలోనో విశ్వాసం ఉండేది. అణ్వాయుధాలు వచ్చినవెనుక ఆ విశ్వాసం సడలిపోయింది. సాయుధసంఘర్షణ పరిహరించగలిగిన విశ్వకళ్యాణప్రద లక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంతవరకూ వారికి ఒక విస్పష్టదృష్టి ఏర్పడలేదు. విస్పష్టత లేనప్పుడు రచన ఎలా వెలువడుతుంది? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది?

వెనుకబడిన దేశాలకు ఈ చిక్కు లేకపోవచ్చును. అచటి రచయితలకు సోషలిజంలోనో, కమ్యూనిజంలోనో, ప్రాచీనజాతీయవ్యవస్థా సముద్ధరణంలోనో వ్యవస్థితదృష్టి ఉండవచ్చును. నిజానికి అలాగే ఉన్నది. అయితే ఆ దృష్టి ఆ ప్రాంతీయులకు నచ్చవచ్చునేమో కాని, అది విశ్వజనీనం కానొల్లదు. కనుక అట్టి రచనలు విశ్వజనాదృతి పొందజాలవు. నిజానికి ఆ కృతులు ఆ యా దేశపు ఎల్లలు దాటి అవతలికి పోవు. దీనినిబట్టి అగ్రగామి దేశాలలోగాని, వెనుకబడిన దేశాలలోగాని ఉత్తమ కృతులు వెలువడటానికి బొత్తిగా అవకాశాలు లేవని భావించరాదు. సత్కావ్యావిర్భూతికి అవకాశాలు తక్కువని చెప్పటమే ప్రకృత తాత్పర్యం.

ఇక రెండవ అంశం....కావ్యత్వం ఆస్వాదనతో గాని నిరూఢం కాదు. నేటి ప్రజలకు భౌతికభోగాలలో ఉన్న ఆసక్తి మరి దేనిలోనూ లేదు. ప్రభుత్వాలు గూడ తమ ప్రజలు సగటున తలఒకటికి వాడుకొనగలుగుతున్న విద్యుచ్ఛక్తి, వస్త్రాలు, ఆహారపదార్థాలు, మందులు కార్లు, నివేశనప్రదేశాలు, రేడియోలు మున్నుగా గల వస్తువుల పరిమాణాలను బట్టి తాము సాధించిన అభ్యుదయాన్ని నిర్ణయిస్తున్నవి. బాధావిమోచన మేదైనా సేవ్యమే నని, పరమౌషధ మనీ రోగి భావిస్తున్నట్లే అధికారమో, ఐశ్వర్యమో, తత్సాధనమో అనుగ్రహించేదేదైనా అభిలషణీయమని ఈనాడు సామాన్యప్రజానీక మంతా భావిస్తున్నది. ఇప్పటి జీవిత వ్యవస్థ కూడ ఐశ్వర్య, అధికారరూప సద్యఃఫల మివ్వని కర్మను పూర్తిగా త్రోసివేస్తున్నది. కావ్యంవల్లగాని, తక్కిన లలితకళాఖండాలవల్ల గాని లోకోత్తరానుభూతి కలుగుతున్నదే కాని

లౌకికమైన సద్యఃఫలం కలగడం లేదు. కనుక భౌతికభోగలాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూర మౌతున్నది.

భౌతికభోగాలు పరమార్థాలైనప్పుడు తృష్ణ పెచ్చరిల్లక తప్పదు. దాని వలన వ్యక్తిగత సంశయం, ఆందోళన, భీతి కలుగుతున్నవి. వీటివల్ల మైత్రి, కరుణ లోపిస్తున్నవి. ఈ లోపం వల్ల పాఠకులు కావ్యపఠనకాలంలో పొందవలసిన సమాధ్యవస్థ పొందలేకపోతున్నారు. ఈ దుఃస్థితికి రాజకీయపక్షాభినివేశాలు అపూర్వదోహదం కల్పిస్తున్నవి. వివిధదేశాలలో కమ్యూనిస్టుపార్టీలు అవతరించినతరువాత మత, సాంఘిక, సాంస్కృతిక రంగాలు స్వాతంత్ర్యం కోల్పోయాయి. తమ పక్షాలను బలపరచుకోవటానికి కమ్యూనిస్టు పార్టీలు, విజ్ఞానశాస్త్రాల తత్త్వంనుంచి లలితకళల తత్త్వం దాకా నిర్వచిస్తూ తదనుగుణంగా ఉన్నవే యోగ్యాలనీ, విరుద్ధాలన్నీ అభ్యుదయనిరోధకాలనీ ప్రచారం ప్రారంభించాయి. ఆ పక్షాలను చూచి తక్కిన రాజకీయపక్షాలు గూడ తమ తమ ఆశయాలకు అనుగుణమైన దురభిమానాలు రేకెత్తిస్తున్నవి. దీని మూలాన ప్రజలలో సహనం, తన్మయీభావయోగ్యత క్షీణిస్తున్నవి. ప్రాచీనులు జరన్మీమాంసకాదులను సభాంతర స్తంభ కుడ్యసదృశు లనీ, రసాస్వాదనకు అయోగ్యులనీ అన్నారు. ఇవాళ అలాంటివారు రాజకీయపక్ష దురాశపరు లంటే అతిశయోక్తి కాదేమో.

రాజకీయపక్షాలకు నేడు రాజ్యం కూడ తోడవుతున్నది. అంతర్గత శాంతి, న్యాయ సంరక్షణమూ, విదేశదండయాత్రాప్రమాద నిరోధమూ మాత్రమే తన కర్తవ్యమని 19 వ శతాబ్దాంతం వరకూ భావిస్తూ వచ్చిన రాజ్యం 20 వ శతాబ్ది ప్రథమపాద అంతిమభాగం నుంచి వివిధరంగాలలో విశేషాధికారాలను స్వాయత్తం చేసుకొని విశ్వరూపప్రదర్శనం ప్రారంభించింది. అమెరికా (యు. ఎస్. ఎ.) వంటి రాజ్యం కూడ సాంస్కృతిక రంగంలో ప్రవేశించి తన విధానానికి సమ్మతాలైన కృతులనే ఇతరదేశాలలో ప్రచారం చేస్తున్నది. ఇక కమ్యూనిస్టు రాజ్యాలు నిర్వహిస్తున్న పాత్ర చెప్పనక్కరలేదు. ఆ దేశాలలో ప్రభుత్వానికి వంతపాడే కృతులే ప్రచురణభాగ్యం పొందుతున్నవి. ఎదురు తిరిగిన రచయితలు కారాగారాలకు వెళ్ళక తప్పటంలేదు. భావస్వాతంత్ర్యం లేనిచోట ఉత్తమ కృతులు ఎలా వెలువడుతవి? విప్లవానికి పూర్వం తన సాహిత్యంతో ప్రపంచాన్ని ఉర్రూతలూచిన రష్యా ఆ విప్లవానంతరం చెప్పుకోదగిన కృతులను ఉత్పాదించలేకపోయింది.

ప్రజాస్వామిక రాజ్యమైన భారతదేశంలో గూడ ప్రభుత్వం రాష్ట్రస్థాయిలోను, అఖిల భారతస్థాయిలోను అకాడమీలను నియమించి అధికారాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది. కొన్ని

రాష్ట్రాలు పాఠ్యగ్రంథాలను గూడ తామే ప్రకటిస్తూ ప్రాథమికవిద్య నుంచి ఉన్నతవిద్య వరకూ గల చదువుసంధ్యలను గుప్పిట బిగించుకొన్నవి. విశ్వవిద్యాలయాలు కూడ మరెంతో కాలం స్వతంత్రంగా ఉండవు. అయితే కమ్యూనిస్టు రాజ్యాలలో ఉన్న కఠిన శాసనాలు ఇంత వరకూ లేకపోవటం ఒక్కటే అభినంద్యం. ఇక మన అకాడమీలచే సమాదృతి పొందుతున్న కావ్యాల విశిష్టత ఎవరికి వారే ఊహించుకోవచ్చును. ముంజేతి కంకణం ఉండగా అద్దం దేనికి ?

ఇంతకుముందు పేర్కొన్నవాటి కంటె ప్రబలమైన విశేషం మరొకటి ఉన్నది. ఉత్తమకృతుల ఆవిర్భూతికి సమాజంలో కొంత నిలకడ అవసరం. సాంకేతిక విద్యావిజృంభణంతో మున్నెన్నడూ ఊహించనంత త్వరితంగా ఏ ఒక దేశమందో కాక, ప్రపంచమంతటా విపరీత పరిణామాలు వస్తున్నవి. వెనుకటి సామాజిక వ్యవస్థలన్నీ బదాబదలయ్యాయి. నిన్నటి స్థితిగతులు నేడు లేవు. నేడున్నవి రేపుండవు. ఈ పరిణామం అంతకూ తీవ్రతరం, శీఘ్రతరం అవుతున్నది. భౌతిక సుఖలాలసుడైన మానవుడు, ఈ విపరీత త్వరిత పరిణామాలకు స్వాగతం చెబుతాడే కాని శ్రేయోదాయకాలు కావని నిరోధం కల్పించగలడా? మన దేశం శాంతిని కాంక్షించి, సైనిక వ్యయం తగ్గించుకొని తాను కోరుకొన్న మార్గాన జీవించటానికి యత్నించింది.

కాని చైనా తన సైన్యాలను పంపి దురాక్రమణ జరిపింది. దీనితో ఆత్మరక్షణకోసం మనదేశం సైన్యాన్ని పెంచుకోవలసి వచ్చింది. అత్యయిక స్థితిని ప్రకటించి చైనా అనుసరించిన మార్గాలే అనుసరించి యుద్ధసన్నద్ధం కావలసివస్తున్నది. స్వాతంత్ర్యం కాపాడుకోదలచిన దేశాలకు సాంకేతిక విద్యాబలిష్ఠ రాజ్యాలప్రమాదం నుంచి రక్షించుకోవాలంటే ఆ సాంకేతిక విద్యాభివృద్ధికంటె గత్యంతరం ఉన్నదా? ఏది ఎలా ఉన్నా ప్రపంచవ్యాప్తంగా విపరీతపరిణామం మహాప్రవాహం వలె వచ్చి పడుతున్నప్పుడు ఏకైకంగా వ్యక్తులు గాని, రాజ్యాంగం గాని దానిని నిరోధించటం అసంభవంగా కనిపిస్తున్నది.

స్థితిగతులు ఇంత త్వరితంగా మారుతున్నప్పుడు రచయితకు గాని. పాఠకునకు గాని విస్పష్టదృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా ? ఈ ఇరుపక్షాలు విభ్రాంతాలై ప్రతిదీ తాత్కాలిక మని భావించవా ? ఇంతమాత్రాన లలితకళాసృష్టి మొదలంట స్తంభించిపోతుం

దని చెప్పలేము. చెప్పరాదు. కాని జీవితం నిలకడ లేక త్వరితగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోను తక్కిన లలితకళలలోను వస్తవి. సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదనశక్తి గూడ సన్నగిలక తప్పదు. వెనుకటిలోవలె నవ్యకృతులు ఇక మీదట నాలుగు కాలాలపాటు నిలవటం అసంభవంగా కనుపిస్తున్నవి. ఇంతకు మున్ను సమాదృతాలైన కృతులనే అయినట్లు, కానట్లు — విశ్వవిద్యాలయాలు ఆదరించవచ్చును. క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం నిలిచి ఆమీద విస్మృతిపథంలో లీనమైపోతవి. ఈ రచనల యందలి వస్తుశిల్పాలు గూడ పత్రికావార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికారచనమే (Journalism) సాహిత్యంగా చెలామణి అవుతుంది. ఈ లక్షణాలు ఇప్పుడే కొంతవరకు గోచరిస్తున్నవి.

# చిరస్మరణీయం

ఆవుల సాంబశివరావు

[సాంబశివరావుగారు తెనాలితాలూకా మూల్పూరులో మార్చి 12, 1917 లో జన్మించారు. న్యాయశాస్త్రంలో పట్టం తీసుకొని న్యాయ వాదవృత్తిని ఎన్నుకొన్నారు. న్యాయవాద నిర్వహణలో వారికున్న శక్తిని గుర్తించి ప్రభుత్వం వారిని ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ధర్మాసన సభ్యునిగా నియమించారు. తరవాత ఆం.ప్ర. ప్రధాన న్యాయమూర్తి పదవిని నిర్వహించి, పదవీ విరమణ చేశారు.

మొదటినుంచీ వీరు హేతువాదులు. ఆపైన మానవతావాదులు, 'బుద్ధకరుణ' ప్రభావితులు. అందుకని ఎదుటివారిలో 'అహీనపక్షా'న్ని దర్శించడం వీరికి అలవాటు. లెక్కకు మిక్కుటంగా వ్యాసాలు వ్రాశారు. ప్రసంగాలు చేశారు. ఇటీవల వీరి వ్యాస ప్రసంగాలు "ప్రజలు-రాజ్యాంగం" శీర్షికతో సంకలితమయ్యాయి. ప్రస్తుతం ఆంధ్రా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్‌గా ఉన్నారు.]

*    *    *    *

డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు చరిత్రలో విలీనమై ఇప్పటికప్పుడే ఏడాది గడచి పోయింది.

జీవించిన అరువైనాలుగు ఏండ్లలో యాభై సంవత్సరాలు-అంటే-అర్థశతాబ్ది-సాహిత్య సేవ చేస్తూనే వున్నారు. భావుక ప్రపంచంలో విహరిస్తూనే వున్నారు. చిన్నవయస్సులోనే ఆరంభమైన వారి సాహిత్య కృషి, కన్నుమూసేవరకూ నడుస్తూనే వున్నది. ఎత్తిన కలం

దించలేదు కృష్ణరావుగారు. వారి చివరి రచన 'బొమ్మ ఏడ్చింది' అనే నాటకాన్ని అంకితం పొందే అవకాశం, అదృష్టం నాకు కలిగింది.

ఆయన హైస్కూలులో చదువుకుంటున్న రోజులనుండి ఎరుగుదును. మేము ఒక చోటనే చదువుకోకపోయినా, అప్పటికే ఆయన ఛందోబద్ధమైన కవిత్వం, నవలలు వ్రాసి ఉండటాన్ని ఎరుగుదును. దానికితోడు మావి ప్రక్క ప్రక్క గ్రామాలు; ఒకే రకమైన అభిరుచులూను. అందుచేత మాకు చిన్ననాటనే పరిచయం ఏర్పడ్డది. ఆ పరిచయం క్రమేపి స్నేహంగా పెరిగింది, అనుబంధంగా మారింది. మా యిద్దరి దృక్పథాలలోని సామీప్యత ఈ సంబంధానికి బాగా పుష్టినిచ్చింది. ఆ కారణాన యాభై ఏళ్ళుగా జి.వి కె. గారిని సన్నిహితంగా ఆత్మీయంగా ఎరగడానికి నాకు అవకాశం ఏర్పడ్డది.

ఒక్కసారి సింహావలోకనం చేస్తే, చిన్ననాటి కృష్ణరావుగారికీ, చివరికి కన్నుమూసే నాటి కృష్ణరావుగారికీ ఎంత వ్యత్యాసం వుంది! రచయితగా, మేధావిగా, భావుకుడుగా, తాత్వికుడుగా, అన్నిటినీ మించి మనీషిగా ఎంత మారాడు! ఎంత ఎదిగాడు! ఎంత పెరిగాడు! జిజ్ఞాస, భావుకత, చిత్తశుద్ధి వున్న మనిషి ఎంత ఉన్నతంగా పెరగ గలడో, అందుకు జి.వి.కె. గొప్ప నిదర్శనం.

గొప్ప వైవిధ్యంగల జీవితగమనం ఆయనది. పుట్టింది పల్లెలో, సామాన్య రైతు కుటుంబంలో. హైస్కూలు చదువుకూడా పల్లెలోనే. సాంప్రదాయసిద్ధమైన సాహిత్యాభిరుచులతో ఆరంభమైంది అయన కృషి. వ్యాకరణం, అందునా చిన్నయసూరిగారి వ్యాకరణం, కావ్యాలు, ప్రబంధాలు వారిని ముందుగా ఆకర్షించాయి. వాటిలో బాల్యంలోనే ప్రజ్ఞ సంతరించుకొన్నాడు. విరివిగా పద్యాలువ్రాయడం, నవలలు వ్రాయడం హైస్కూలులో వుండగానే మొదలైంది. శతావధానాలు చెయ్యాలనే సంకల్పం కలిగింది. చేశారుకూడా. ఇలా సాంప్రదాయ రీతిలో కృష్ణరావుగారి సాహితీయాత్ర ప్రారంభమైంది.

అప్పుడే ఆర్యసమాజప్రభావానికి లోనైనాడు. సంధ్యావందనాలుకూడా కొన్నిరోజులు చేశాడు.

ఆ వరసనే లాక్షణికగ్రంథాలు ఆకర్షించినై. కావ్యలక్షణాలలోను, లక్షణ శాస్త్రం లోను పరిశీలన జరిపాడు.

కాలేజి చదువు సాగుతూ ఉండగా మానవేంద్రనాథ్‌రాయ్ ప్రభావం ఆయనమీదపడ్డది. దానికి త్రిపురనేని రామస్వామిగారి ప్రబోధం తోడ్పడ్డది. కృష్ణరావుగారి చింతనంలో మౌలిక

మైన మార్పు వచ్చింది. తాత్వికదృష్టి పెరిగింది. హేతువాద దృక్పథం అలవడ్డది. అంతటితో ప్రాథమిక సమస్యలను పునాదుల నుండి పరిశీలించడం మొదలు పెట్టాడు. ఆ పరిశీలన ఒక తపనగా పెరిగింది. కుటుంబ పరిస్థితులను కూడా పాటించని ఆరాటం అది. పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సు పూర్తి చెయ్యకుండానే Ph.D. చెయ్యగలిగిన సామర్థ్యాన్ని సంతరించుకొన్నాడు. అందుకు ఆయన చేసింది తపస్సు. దాని కొరకై ఆయన అనుభవించిన ఈతిబాధలు అన్నీ ఇన్నీ కావు. ఇద్దరం మద్రాసులో ఉన్నాం గనక చూస్తూ వుండేవాణ్ణి. జ్ఞాన సముపార్జనకోసం సర్వమూ మరచి, విద్యాతపస్సు చేసిన ఋషిపుంగవుడు కృష్ణరావుగారు

ఆ తపస్సునుండి పుట్టినవే యుగసంధ్యలాంటి కావ్యాలు, భిక్షాపాత్రలాంటి నాటికలు, కీలుబొమ్మలు లాంటి నవలలు. బొమ్మఏడ్చింది లాంటి నాటకాలు, జేగంటలు లాంటి తాత్విక గ్రంథాలు, కావ్యజగత్తు మొదలైన సాహిత్య పరిశీలనాత్మకమైన రచనలూను. డాక్టరేట్‌కు తీసుకున్న విషయం కావ్యలక్షణాలు. పింగళి సూరన్న కళాపూర్ణోదయాన్ని పరిశీలిస్తూ, ఒక లాక్షణిక గ్రంథాన్ని వ్రాశాడు కృష్ణరావుగారు. ఈ రచన యావత్తూ, రాశిలో మాత్రమే విస్తారం కాదు. వస్తువివరణలోనూ వైశాల్యంవుంది. భావుకతలోనూ వైవిధ్యంవుంది. లోతు వుంది, ప్రతిభ వుంది, ఏటికెతోడు వ్యుత్పత్తివుంది. వచనరచన చేసినా, పద్యరచనచేసినా, ఏ ప్రక్రియలో రచనచేసినా, జి.వి.కె. ది స్వంతమైన సరళి, శైలి, శిల్పమూను. పాండిత్యాన్ని భావుకతను, నవ్యతను జోడించిన ఆధునికుల్లో కృష్ణరావుగారు ఒకరు.

మానవతావాదాన్ని వంటబట్టించుకున్నవాడు ఆయన. ఆ దృష్టి, ఆ ఒరవడి ప్రతి రచనలోనూ ప్రదర్శించాడు. వేదికలెక్కి పెద్దగా ఉపన్యాసాలివ్వనప్పటికీ, రచనలద్వారా మానవతావాదప్రచారానికి కృష్ణరావుగారు గొప్పఆలంబనం. మానవతా దృక్పథాన్ని సాహిత్య సృష్టికి ఉపయోగించి, అన్వయించి, కళాత్మకంగా ఆంధ్రలోకాన్ని ఉత్తేజపరచిన ఘనత కృష్ణరావుగారికి దక్కింది.

ఇబ్బందులకు గురైనా ఆయనగారు జీవితంనుండి విస్తారమైన అనుభవాన్ని సంపాదించుకొన్నాడు. పాత్రికేయుడుగా వున్నాడు. అధ్యాపకుడుగా పని చేశాడు. ఆకాశవాణిలో ప్రయోగకర్తగా ఉద్యోగం చేశాడు. ఆశ్చర్యం, కొంతకాలం ఫర్నిచర్ వ్యాపారం కూడా నడిపాడు. జీవితం ఎన్నిమలుపులు తిరిగినా, ఎన్నిఇక్కట్లకుగురైనా, ఎన్నడూ సత్యాన్వేషణ మానలేదు. అధ్యయనం విరమించలేదు. అధ్యయనంచేసినదాన్ని ఇతరులకు, పాఠకలోకానికి అందించడం ఆపలేదు. నిరంతర సత్యాన్వేషణ వారి జీవితాదర్శం.

వీటికితోడు, వీటినిమించి కూడా నన్ను గొప్పగా ఆకర్షించింది కృష్ణరావుగారిలోని సంస్కారం. వారి ప్రతిఅణువులోను, ప్రతిరక్తబిందువులోను 'మానవత' వున్నది. నిజమైన సిసలైన గొప్పతనమున్నది. ఎన్నడూ, ఎప్పుడూ వారినుంచి 'కొంటెపు' మాట వినలేదు. 'కొంటెపు' ప్రవర్తన చూడలేదు. నేను పొరబడ్డానేమో తెలియదు. కాని నేను గొప్ప మానవతావాదులుగా, భావుకులుగా, మేధావులుగా, సంస్కృతీపరులుగా గౌరవించినవారిలో కూడా అనవసరమైన అహంభావం, అహంకారం, అసహనం చూచాను. అట్టివి కృష్ణరావుగారిలో కంచుకాగడాలతో వెతికినా అగుపించలేదు. తన ఆత్మగౌరవాన్ని పదిలంగా కాపాడుకుంటూ, తోటివారిని మనిషిగా గౌరవించిన సంస్కృతీపరుడు జి. వి. కె. అట్టి 'మనిషి' తో స్నేహం నాకు చిరస్మరణీయం, గర్వకారణం.

వారి మిత్రులమైన కొంతమందిమి, వారి స్మృతిని, విలువైన వారి కృషిని, అమూల్యమైన వారి భావుకతను పదిలపరచాలనీ, భావితరాలవారికి అందించాలనే ఆశతో, ఈ సమాలోచనా గ్రంథాన్ని తెలుగువారి ముందుంచుతున్నాం. ఆదరించగలరని ఆశిస్తున్నాం.

# ధ్వని - ప్రతిధ్వని

జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి

[శాస్త్రిగారు 1926 లో జన్మించారు. చిన్ననాటనే వేదశాస్త్రాల నభ్యసించారు. సంస్కృతం, హిందీ, తెలుగు భాషలలో పాండిత్యాన్ని ఆర్జించారు. అద్వైతం. అలంకారశాస్త్రం అభిమానవిషయాలు. తెనాలి తాలూకా జూనియర్ కాలేజీలో అధ్యాపకులు.

వేదస్వరూపాన్ని ప్రదర్శించే "భారతీనిరుక్తి" అనే బృహద్గ్రంథాన్ని హిందీలోకి అనువదించారు,]

* * * *

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణం ।
ఔచిత్యోపనిబంధస్తు రసస్యోపనిషత్ పరా ॥ "

ఒక మహాకవి లేక రచయిత చేసిన కృతులను పరిశీలించేటప్పుడు ఆ రచన చేయటంలో రచయితను ప్రేరేపించిన తత్త్వాలేవో, ఆ రచయితకు గల దార్శనికదృష్టి యేదో, తదభివ్యంజనా సమర్థమైన రచనారీతి ఎట్టిదో, ఆ రచన ఏ పరమార్థాన్ని ఉద్బోధిస్తున్నదో నిశితంగా పర్యాలోచన చేయటం అవసరము. సహృదయుడే కావ్యానందాన్ని ఆస్వాదింపగలిగినట్లు విమర్శకుడే కావ్యాత్మను దర్శించగలడు.

డా॥ జి. వి. కృష్ణరావు ప్రతిభావ్యుత్పత్తులను సమపాళ్ళుగా తనలో సంలీనం చేసుకొన్న మహామనీషి. ప్రాచ్య పాశ్చాత్య దర్శనాలను తరచి తరచి నాగార్జునప్రవర్తితమైన మాధ్యమిక దర్శనాన్ని విశ్వసించిన తత్త్వశాస్త్రవేత్త. ఇటు భారతీయ కవితాతత్త్వాన్ని, అటు పాశ్చాత్య కళారహస్యాలను ఆకళింపు చేసుకొని, ధ్వనిసంప్రదాయానికి పతాకం పట్టిన

కావ్యతత్త్వమర్మజ్ఞుడు. కళ — జీవితం — వీటిలో అనన్యత్వాన్ని దర్శించిన సౌందర్యోపాసకుడు. ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హెగెల్, మొదలైనవారి తాత్త్విక దృక్పథాలను వివిక్తంగా, నిర్లిప్తంగా పరిశీలించినవ్యక్తి. సిగ్మండ్, ఫ్రాయిడ్, యూంగ్ మున్నైన వాళ్ళ మనస్తత్త్వవిశ్లేషణాన్ని చక్కగా అవగాహనం చేసుకొన్న మనస్తత్త్వవేత్త. మార్క్సు సామ్యవాదాన్ని యం. యన్. రాయ్. నవ్యమానవతావాదాన్ని సునిశితంగా పరిశీలించి ఆర్థిక, సామాజిక, రాజకీయ సమస్యలపై నిర్దిష్టమైన ఒక ఆలోచనను రూపొందించుకొన్న హేతువాది. కళకు, జీవితానికి గల సంబంధాన్ని తార్కికంగా, హేతుబద్ధంగా నిర్ధారించుకొన్న స్వాతంత్ర్య ప్రియుడు. స్వాతంత్ర్యం వివేక మని, అది కార్యకారణబద్ధ మని, వ్యష్టిలో, సమష్టిని. సమష్టిలో వ్యష్టిని దర్శించినప్పుడే స్వాతంత్ర్య పరిరక్షణం జరుగుతుందని విశ్వసించిన ఉదాత్త మనస్కుడు.

ఏవంవిధ మహావిజ్ఞానంతో, రసస్నిగ్ధహృదయంతో డా॥ జి. వి. కె. కథలు, నవలలు, నాటికలు, సాహితీవిమర్శలు, కవిత్వం వ్రాశారు. స్వాతంత్ర్యానంతరం ఒకటి రెంటిని మినహాయిస్తే వారి 'కీలుబొమ్మలు' వంటి నవల తెలుగులో రాలేదనటం అతిశయోక్తి కాబోదు. 'పాపికొండలు' జి. వి. కె. ప్రతిభావ్యుత్పత్తులకు, పరిణత మనస్కతకు దర్పణం పట్టే మరొక నవల. శేముషీసంపన్నుడైన కృష్ణరావు తనకు గల సునిశ్చిత ఆలోచనారీతులను వ్యంగ్యవైభవంతో ఈ నవలలో నిక్షేపించారు. ఇందలి ఇతివృత్తంలో అంతర్లీనంగా ఒక ఆలోచనాస్రవంతి ప్రవహిస్తూ ఉంటుంది. అంతర్వాహినిగా ఒక రసగంగ జాలువారుతూ సహృదయులను తన్మయులను చేస్తూ ఉంటుంది. ఆ రసధునిలో మునకలిడి ఆనందపరవశులం అవడానికి చేసే ఈ ప్రయత్నంలో సహృదయ పాఠకలోకసహకారం ఆవశ్యకము. ఈనవల ధ్వనికావ్యానిక ఒక మచ్చుతునక. కాన, ముందుగా, ధ్వనిసంప్రదాయవైశిష్ట్యం తెలుసుకొనడం అవసరము.

వాగనుశాసనులైన విద్వాంసు లెందరో ఉండవచ్చు. వారందరు కావ్యార్థాన్ని ఆస్వాదింపగల రని అనలేము. కావ్యార్థతత్త్వవేత్తలే దానిని ఆస్వాదింపగల సమర్థులు.

> "శబ్దార్థ శాసనమాత్రేణైవ న వేద్యతే ।
> వేద్యతే స తు కావ్యార్థతత్త్వజ్ఞై రేవ కేవలమ్ ॥"

అని అంటూ భారతీయ అలంకారికులు ధ్వనిసంప్రదాయానికి ఒక మహోన్నతస్థాన మిచ్చారు. ఆ ధ్వనియే కావ్యాత్మ.

> "ధ్వని రాత్మా కావ్యస్య"

ధ్వన్యాలోకకర్త ధ్వనిలక్షణాన్ని ఇలా వివరిస్తాడు.

"యత్రార్థః శబ్దో వా తమర్థ ముపసర్జనీకృత స్వార్థౌ,
వ్యంక్తః కావ్యవిశేషః స ధ్వని రితి సూరిభిః కథితః॥"

అర్థం స్వార్థాన్ని, శబ్దం తన అర్థాన్ని గుణీభూతం చేసుకొని ప్రతీయమానమయ్యే మరొక అర్థాన్ని అభివ్యక్తం చేసినపుడు ఆ కావ్యవిశేషాన్ని 'ధ్వని' అని కావ్యతత్త్వవిదులు అంటారు. వాచ్యవాచకాలు స్వార్థాన్ని (స్వ+అర్థాన్ని) వీడి మరొక రమణీయార్థాన్ని అభివ్యంజితం చేయటం 'ధ్వని' అని తాత్పర్యము.

"రమణీయార్థప్రతిపాదక శ్శబ్దః కావ్యమ్".

రమణీయార్థాన్ని ప్రతిపాదించే ప్రతి శబ్దం కావ్యమే. అది ఛందోబద్ధమై ఉండనవసరం లేదు. అది గద్యమైనా కావచ్చు; పద్యమైనా కావచ్చు. రమణీయార్థప్రతిపాదకమైతే చాలు, అది 'కావ్య' మని వ్యవహరింపబడుతుంది. ఆ రమణీయార్థమే ధ్వని. అదే రసధ్వని. అది సహృదయ సంవేద్యము; బ్రహ్మానందసబ్రహ్మచారి.

ఆ రమణీయార్థం వలన వస్తువు ధ్వనింపవచ్చు; అలంకారం ధ్వనించవచ్చు; కాక, రసం ధ్వనించవచ్చు. ధ్వని వస్త్వలంకారవిలక్షణ మైనది; అది అనిర్వచనీయం; చారుత్వ సంపాదకము.

ఆచార్య ఆనందవర్ధనుడు ధ్వని విశిష్టతను ఇలా వివరిస్తాడు:

"ప్రతీయమానం పున రన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనాం,
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాంగనాసు."

మహాకవివిరచితాలైన వాక్యాలలో వాచ్యార్థము కంటె వ్యతిరిక్తమైన మరొక రమణీయార్థం అభివ్యంజితం అవుతూ ఉంటుంది. స్త్రీలలో అవయవసౌందర్యం కంటె, ఆభరణశోభ కంటె విలక్షణమైన ఒక లావణ్యం గోచరిస్తూ ఉన్నట్లు కవివాక్యంలో వాచ్యార్థం కంటె విలక్షణ మైన రమణీయార్థం ద్యోతకం అవుతూ ఉంటుంది. సహృదయజన నేత్రాభిరామమై భాసమాన మయ్యే స్త్రీల లావణ్యం వలె కావ్యంలో ఆ రమణీయార్థం సహృదయలోచనామృతమైన తత్త్వాంతరంగా భాసిస్తూ ఉంటుంది.

ధ్వనికారుడు ధ్వనిని వస్తుధ్వని, అలంకారధ్వనిగా భావిస్తే, అభినవగుప్తుడు వస్త్వలం కారధ్వనులు రెండును రసపర్యవసాయు లని, 'రసమే కావ్యాత్మ' యని ప్రతిపాదించి రస

ధ్వనిని శిఖరాయమాణంగా భావించాడు. 'రసశూన్యమైనది కావ్యం కాదని, రసం వలననే కావ్యం సజీవంగా ఉంటుందనీ' ఘంటాపథంగా చెప్పాడు.

"నహి తచ్ఛూన్యకావ్యం కించి దస్తి,
రసేనైవ సర్వం జీవతి కావ్యమ్।"

"వస్త్వలంకారధ్వనీ తు సర్వదా రసం ప్రతి పర్యవస్యేతే।"

అయితే, ప్రతిభావంతుడైన మహాకవివాణి యందే రసభావరూపమైన ఈ రమణీయార్థం ధ్వనిస్తూ ఉంటుంది.

జి. వి. కె. ఏతాదృశ ధ్వన్యనుప్రాణితాలైన రచనలే చేశారు. 'ధ్వనిసంప్రదాయానుబద్ధమైన రచనే రసనిష్పాదకమని, మానవహితాపాదక మని' ఆయన భావించారు. విద్యార్థి దశలోనే వ్రాసిన 'యుగసంధ్య' ను పరిశీలిస్తే ధ్వనిసంప్రదాయార్ధ్వము ఆబాల్యము వారికి అభిలషణీయ మని గోచరమౌతుంది.

"సంప్రదాయమ్ము మనకు ఆచార్యకమ్ము
దాననే పూర్వకృతులు స్వాద్యములు నేడు;
సంప్రదాయము విడనాడి చదువుకొన్న
వానిచేత కలుగునా రసానుభూతి ? (యుగసంధ్య—ఆహతవ్యూహము)

సంప్రదాయాన్ని విడనాడటం నేలవిడిచి సాము చేయటం వంటిదే. సంప్రదాయానుసారంగానే శాస్త్రాధ్యయనం, కావ్యాద్యనుశీలనం ఉండాలని, అలా కాకపోతే రసానుభూతి కలుగదని నూనూగుమీసాలనాడే భావించిన భావుకు డితడు.

రచయితపై తత్తద్దేశకాలపరిస్థితుల ప్రభావం తప్పక పడుతుంది. వ్యావహారిక జగత్తులో రచయిత వీటికి అతీతంగా, నిర్లిప్తంగా ఉండలేడు. అలా ఉండటం ధర్మం కూడ కాదు. ఆ నిర్లిప్తత కావ్యజగత్తులో సంభవం కావచ్చు. అక్కడ అలా నిర్లిప్తంగానే ఉండాలి. కాని, లోకం అట్లా కాదే ! లోకవ్యవహారమంతా స్వార్థభావదుష్టమై ఉంటుంది. వ్యక్తి స్వేచ్ఛ కాంద్రు కాంద్రు మంటూ ముందుకు దూకుతుంటుంది. మానవుడు గదా! అతడు స్వేచ్ఛాభిలాషి. పశువైతే బంధాన్ని, దాస్యాన్ని ఔదలదాస్తుంది. స్వార్థప్రతాడితుడైనప్పుడు మానవుడు దానవు డౌతాడు. అతడు అధికార దాహంతో వ్యక్తిస్వేచ్ఛను కబళింప చూస్తాడు. దానితో వ్యక్తులమధ్య సంఘర్షణ ఆరంభమౌతుంది. జీవితం అశాంతికి

నిలయమైపోతుంది. భావుకుడైన రచయిత, కళాకారుడు — వీళ్ళ జీవితాలు కూడ దీనికి అప వాదాలు కావు. అట్టి స్థితిలో రచయిత, కళాకారుడు మెదలక కూర్చుండలేరు. వాళ్ళు తమ వ్యష్టిని సమష్టిలో దర్శిస్తారు. సర్వజనహితకరం, స్వాత్మసుఖాపాదకం, ఆనందపర్యవసాయి అయిన మార్గాన్ని అన్వేషిస్తారు. వివేకసంవలితమైన తన బుద్ధిమంథానంతో రచయిత తత్తద్దేశకాల పరిస్థితులను మథించి మథించి, పరిహరణీయాలను పరిహరించి నవనీతశాంతిని దర్శిస్తారు. తద్దర్శనమే, ఆ యాస్వాదనమే శబ్దమయాకృతిగ, చిత్రాత్మకంగ, శిల్పాత్మకంగ, రాగ-రాగిణీరూపంగ కళాకారుని లేఖిని, తూలిక, శాణాదుల ద్వారా అభివ్యక్తం అవుతుంది.

స్వాతంత్ర్యానంతరం మన దేశంలో పరస్సహస్రాలుగా సమస్యలు ఉప్పతిల్లాయి. వ్యక్తికి వ్యక్తికి మధ్య అడ్డుగోడలు లేచాయి. సహృదయత సన్నగిల్లింది. ఈర్ష్యాద్వేషాలు నాలుకలు చాచి భుగభుగలు వెళ్ళగక్కసాగాయి. అధికారాన్ని హస్తగతం చేసుకోవడమే రాజకీయాలకు ధ్యేయమై పోయింది. రాజకీయనాయకులు ఒకరు ఏటికి లాగితే, మరొకరు కోటికి లాగి, సామాన్య జీవితాలను చికాకు పెట్టుతున్నారు. మానవ జీవనస్రవంతికి వీళ్ళు పెద్ద కొండలై 'పాపికొండలై' అడ్డు నిలిచి, ఆ ప్రవాహంలో సుడిగుండాలురేపి జీవితాన్ని భయంకరంగా మార్చివేస్తున్నారు. ముందుకు సాగిపోలేక, ఒదిగి ఉండలేక భీభత్సంగా మారిపోతున్నది నేడు మానవ జీవితము.

నైతిక విలువలు మారిపోతున్నాయి. మానవత్వం మంటకలిసి పోతున్నది. అధికారం ధనం మానవమస్తిష్కాన్ని శాసిస్తున్నాయి. లక్ష్యమేమిటో, గమ్యమేదో తెలియటం లేదు. కవిత్వం, ధర్మం అంటే ఏమిటో తిరిగి నిర్వచించ వలసిన రోజులు వచ్చాయి. భౌతిక విజ్ఞానం గ్రహాంతరయాత్ర చేయగలిగేటంత ఎత్తుకు పెరిగింది కాని, మానవజీవిత సౌఖ్యానికి అది ఏమాత్రం దోహదం చేయటం లేదు పైగా కుఠారాఘాతంగా పరిణమిస్తున్నది. అయితే భౌతికవిజ్ఞానశాస్త్రాభివృద్ధి పరిహరణీయమా? పెరిగిపోతున్న వింధ్యపర్వతాన్ని అగస్త్యుడు శాసించినట్లు "టెక్నాలజీ"ని శాసించి అదుపులో పెట్టాలా ? అలా అదుపులో పెట్టితే సమాజాన్ని ఎటు మళ్ళించినట్లు ?

మన ఆర్థిక, సామాజిక జీవనవిధానం ఏ రాజకీయమార్గాన్ని అవలంబించాలి ? ప్రజాస్వామ్యం అన్న పేరుతో ప్రజల స్వాతంత్ర్యం కబళింప బడుతున్నదే! ప్రజాస్వామిక ప్రభుత్వాలు ప్రజలను తమ తాబేదారులనుగా చేసుకుంటున్నాయే! ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం అంటే ఇంతేనా ? స్వాతంత్ర్యం లేనినాడు మానవుడికి గతి ఏది ? దీనికి ఏదైనా నిష్కృతి

పరిష్కృతి ఉందా? నైతిక విలువలు మానవత్వానికి ప్రతీకలు. అట్టి నైతికవిలువలతో ప్రజలను ఉత్తమ పౌరులనుగా తీర్చిదిద్దవలసిన విద్యాలయాలు కలుషితరాజకీయాలకు ఆలవాలం అయిపోతున్నాయే! విద్యార్థులు తమ లక్ష్యాన్ని విస్మరించి పెడమార్గాన పడుతున్నారే! ఇక దేశభవిష్యత్తు ఏమిటి? అన్నం, బట్ట సమకూర్చినంతమాత్రాన మానవుడు సంతుష్టి చెందుతాడా? అలా చెందితే మనిషికి, పశువుకి ఇక భేదమేమి ఉన్నది? మనిషికి ఆలోచించి నిర్ణయించుకొనే బుద్ధి, లోకంయొక్క దుఃఖాలతో సంవేదనను పొంది స్పందించే హృదయం ఉన్నాయి. తాదృశ వివేకాన్ని సంవేదనలను పెంపొందించేవి శాస్త్రాలు,కళలే గదా! ఇట్టి అనిశ్చిత, అవ్యవస్థస్థితిలో ఇవి ఎంతవరకు మిగులుతాయి? మానవకళ్యాణానికి ఇవి ఎంతవరకు దోహదం చేయగలుగుతాయి ?

ఇలాంటివి ఎన్నో శంకలు, సమస్యలు వీటిలో జి. వి. కె. హృదయం సంక్షుభితమైంది. ఈ ఆలోచనకు తత్త్వశాస్త్రాధ్యయనం ఆయనకు దోహదం చేసింది. సహృదయత, కళామర్మజ్ఞతలు మానవసమాజం యెడ ఆయనలో సానుభూతిని కలిగించాయి. అందుచేతనే కృష్ణాంవు తాత్త్వికదృక్పథంలో నుంచి రసస్నిగ్ధ హృదయాంబుధినుంచి వాణీకంఠాభరణ స్థగితమైన అనర్ఘమణిగ వెలువడింది ఈ 'పాపికొండలు'. నవల ఆరంభానికి ముందుగ రచయిత విన్నవించుకొన్న వాక్యాలను పరిశీలిస్తే ఆయన తన ఈ రచనకు పరమార్థంగా దేనిని భావించారో అర్థం అవుతుంది.

> "శబ్దసౌష్ఠవం తెలియదు అర్థజ్ఞానం చాలదు. గుణదోషాలు
> ఎరుకపడవు. శ్రేయస్సు నలుపో తెలుపో తేల్చుకోలేదు.
> అయినా, శబ్దమే కాదు, అపశబ్దమే కాదు అశబ్దం కూడా
> రసనిష్పాదకం కావచ్చునని ఎప్పుడో ఎక్కడో విన్న గుర్తు.
> ఆ వినికిడి వలనే యీ సాహసం. దీనితో ఏ పెదవి విరిసినా,
> ఏ కన్ను కురిసినా ఈ పైరు బొందువోక పండినట్లే "

ఈవిధంగా, తన రచనయొక్క పరమార్థం బ్రహ్మానందసహోదరమైనా రసానుభూతి అని ఘంటాపథంగా చెప్పుకొన్నారు రచయిత. 'పెదిమ విరయటం', 'కన్ను కురియటం' తన యీ రచనకు పరమప్రయోజనమని భావించారు. శబ్దం, అపశబ్దమే కాదు, అశబ్దం సైతం ప్రతిభావంతుని భావనాస్పర్శచేత పరుసవేది సోకినంతనే లోహం బంగారమైనట్లు, రసపర్యవసాయి అవుతుందని సూచిస్తున్నారు రచయిత. పెదిమవిరయటం. కన్నుకురియటం జరిగి

నప్పుడే రచయిత యొక్క రచన సార్థకం అవుతుందని, అదే ఉత్తమకృతి అని, ఆలా కానప్పుడు ఆ రచన 'బొందువేసిన పైరే' అవుతుందని ధ్వనింపచేస్తున్నారు ప్రతిభాశాలియైన జి. వి. కె.

కావ్యం వలన యశస్సు, అర్థప్రాప్తి, వ్యవహార వేతృత్వం, శివేతరక్షతి (అమంగళ నాశం), సద్యఃపరనిర్వృతి (ఆనందం) సిద్ధిస్తాయని భారతీయ అలంకారికులు కావ్యప్రయోజనాన్ని చెప్పారు. వీటిలో 'సద్యఃపరనిర్వృతి' శిఖరాయమాణము. ఈ 'సద్యఃపరనిర్వృతి'యే రసస్థితి అని అలంకారికులు భావించారు. వ్యవహారవేతృత్వం 'శివేతరక్షతి' కి ఆధారము. శివేతరక్షతి కలిగినపుడు ఆనందపర్యాయవాచి యైన రసానుభూతిని మానవుడు పొందుతాడు. భావనాభావితాంతఃకరణుడై రసరూపు డౌతాడు. వస్తుతయా జీవుడు రసరూపుడు.

"రసో వై సః; రసగ్గం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి."

అని ఉపనిద్వాణి ఉద్ఘోషిస్తున్నది. యశస్సు, అర్థం స్వార్థసాధకాలైతే, వ్యవహార వేతృత్వం, శివేతరక్షతి సామాజిక ప్రయోజకాలు. 'సద్యఃపరనిర్వృతి' స్వస్వరూపావగతికి ప్రయోజకము. వస్త్వలంకార ధ్వనులతోబాటు రసధ్వనినిగూడ పరమ ప్రమాణంగా భావించి రసఝురీస్నాత హృదయానుభూతితో, మనస్తత్త్వవిశ్లేషణాత్మక శైలిలో జి. వి. కె. ఈ రచనకు పూనుకొన్నారు. కాని, దైవదుర్విపాకం వలన, తెలుగువారి దురదృష్టం చేత రచయిత ఈ నవలను పూర్తిచేయలేక పోయారు. పూర్తిచేసి ఉన్నట్లయితే, సహృదయలోకాన్ని వివేకజ్యోత్స్నాధౌతం చేసి, రసవాహినిలో మునకలు వేయించెడివారే. తెలుగువారికి ఆ భాగ్యం లేదు.

ఇతివృత్తం సంక్షేపంగా ఇది.

అదొక చిన్నపట్టణం. మన పట్టణమూ కావచ్చు; ఆంధ్రప్రాంతంలోని మరే పట్టణమైనా కావచ్చు. అక్కడ ఒక స్కూలు. ఒక కో-ఆపరేటివ్ బ్యాంకి ఉన్నాయి. ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు మాధవరావు. అతడు ధర్మం, న్యాయం, నీతి, నియమం, సంయమం గల మానవతామూర్తి. కర్తవ్యం విస్మరించని ఆదర్శ వ్యక్తి. కవితామర్మం తెలిసిన సహృదయుడు. నైతిక విలువలకై పరితపించే వేదనాజీవి. శారద, మోహన్‌లు ఆయనకు ఔరసులు కారుగాని, వారికంటె మిన్నయైనవారు.('ఔరసులు కారు' అన్నది ఒకటి రెండుచోట్ల మాత్రమే సూచితము) శారద ఎం. ఏ. చదువుతున్నది. మోహన్ విదేశాలకు పోయి ఇంజనీరింగ్‌లో

పట్టా పుచ్చుకొన్న యువకుడు. స్వాతంత్ర్యప్రియుడు. గురుమూర్తి ఆ పాఠశాలలో సీనియర్ తెలుగు పండితుడు. సాహిత్యపు లోతులను స్పృశించిన వ్యుత్పన్నతామూర్తి. సహృదయుడు. నిర్లిప్తంగా కర్తవ్యనిర్వహణం చేసే నిర్మల హృదయుడు. లోకంపోకడలు తెలియని అమాయకుడు. అజాతశత్రువు. తోటి తెలుగుఉపాధ్యాయుడైన నారాయణరావు తక్క, ఆ ఊరిలో ఆయనపట్ల ఈర్ష్యాళువైనవాడు కాగడావేసినాకానరాడు.

వెంకన్నగారు గంభీరహృదయుడు. మంచి మోతుబరి. ఆయనే మాధవరావును ఆ పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా ఆ ఊరికి తీసికొనివచ్చాడు. వారిద్దరిమధ్య గాఢమైన సుహృద్భావం ఉంది. ఈ సంగతి రెండవ కంటివానికి తెలియదు. వెంకన్నగారి భార్య అన్నపూర్ణమ్మ. అన్నపూర్ణమ్మ ప్రేమ, దయ, కరుణ, మమతలతో అందరి హృదయాలలో ఆదరణీయస్థానం సంపాదించుకొన్న ఉదారచిత్త. ధర్మారావు వెంకన్నగారి కుమారుడు. ధర్మారావు ఆ దంపతుల గారాబంలో పెరిగిన యువకుడు. అతడు బి. ఎ. ప్యాసయ్యాడు. వెంకన్నగారు పోమూరు. సంపన్న కుటుంబం. కడుపులోని నీళ్ళు కదలకుండా, ఏ రాజకీయానికి పోకుండా సుఖంగా కాలం గడుపుతున్నవాడు. వెంకన్నగారిగుణాలు ధర్మారావులో చోటు చేసుకున్నాయి. అతడు అందరి మన్ననలకు పాత్రుడు.

కృష్ణమూర్తి ఆ స్కూలు సెక్రటరీగా కొంత పెత్తనం చలాయిస్తున్న వ్యక్తి. సీతారామయ్య కో-ఆపరేటివ్ బ్యాంకిని చేతిలో పెట్టుకొని ఊరిలో కొంత ముఠాగల ఛోటా నాయకుడు. కృష్ణమూర్తికి, సీతారామయ్యకు చుక్కెదురు, శోభనాద్రి రైస్‌మిల్ యజమాని. కొద్దో గొప్పో రాజకీయప్రాపకం ఉన్నవాడు. అతడి భార్యను గురించి ఆమె చావును గురించి, ఆమె శీలాన్ని గురించి ఆ వూళ్లో కథలుగా చెప్పుకుంటారు. శ్యామల శోభనాద్రి ఏకైకపుత్రిక కృష్ణమూర్తి ధర్మారావు అండదండలతో సీతారామయ్యను సాధిద్దామనుకుంటాడు. ధర్మారావుకి స్కూలుసెక్రటరీ పదవిని కట్టబెట్టి, నాటకం ఆడుదామని అతడు తలపోస్తాడు. 'అధికారం లేకుండా నీబోటివాడుండటం మంచిది కాదని, నీబోటివాళ్ళు దేశ సేవకు అంకితం కావాలని' ధర్మారావును ప్రబోధిస్తాడు. శోభనాద్రివాళ్ళు కూడ కృష్ణమూర్తిని అధికారచ్యుతుని గావించాలన్న తలంపుతో ధర్మారావును కార్యదర్శిపదవి చేపట్టాలని ఒత్తిడి చేస్తారు. మిత్రులు కూడ అలాగే ప్రబోధిస్తారు. ఎంతైనా మానవుడు గదా. ఆత్మవంచన చేసుకోవటంలో వాడి కంటె ఘనుడు వాడే. కృష్ణమూర్తి పాలనలో ఏవేవో దోషాలు పొడగట్టసాగాయి. సెక్రటరీ పదవి చేబట్టి సామాన్యప్రజల విద్యాభివృద్ధికి తోడ్పడాలని అతని మనస్సు ఉబలాటపడ

సాగింది. ధర్మారావులో అధికారలోభం అంకురించి మోసులెత్తసాగింది మాధవరావుతో పౌర్వాపర్యాలు విచారించి తుదకు సెక్రటరీ పదవిని చేపట్టాడు. ధర్మారావు అడుసులో దిగబడి పోతున్నాడని మాధవరావు గమనించాడు. అయినా ఇతర రాజకీయాలకంటె ఇది కొంత మేలని తలచి తటస్థంగా ఊరుకుంటాడు.

ధర్మారావు శోభనాద్రివాళ్ళ సహకారంతో సెక్రటరీ అవుతాడు. తన ప్రమేయం లేకుండా ధర్మారావు సెక్రటరీ అవటం కృష్ణమూర్తికి కన్నెర్ర అయింది. అధికారచ్యుతి వలన స్కూలు ప్యూనుకూడా కృష్ణమూర్తిని లెక్కచేయడం లేదు. అది అతనికి శిరఃకర్తనం చేసినంత పని అయింది. ధర్మారావును సెక్రటరీ చేయడమే దీనికంతా కారణమని భావించాడు. ధర్మారావు వెనక మాధవరావు ఉన్నాడని, మాధవరావు సామాన్యుడు కాదని, అందువలన మాధవరావును సాధించడం ద్వారా ధర్మారావుపై కక్ష సాధించాలి అని తలచాడు. దానికై చదరంగంలోని పావులు లాగా, కుటిల రాజనీతితో వ్యక్తులను తన ప్రయోజన సిద్ధికై ఉపయోగించబూనాడు.

పరిస్థితులు ఒకదానివెంట మరొకటి చక్రనేమిక్రమంగా చుట్టుముట్టసాగాయి. నరసయ్య స్కూలు గుమాస్తా. అతడు పిల్లల జీతాలను వాడుకొంటాడు. ఇది తెలియగానే మాధవరావు వానిని పిలిపించి మందలిస్తాడు. ఈ సమస్యను ఎలా పరిష్కరించాలా అని మాధవరావు ధర్మారావులు సదమదమౌతుంటారు. కృష్ణమూర్తే మొదట నరసయ్యకు గుమాస్తా ఉద్యోగం ఇచ్చాడు. అందుకని నరసయ్య కృష్ణమూర్తి సాయం కోరాడు ఒకనాడు కృష్ణమూర్తి తన మనిషి చేత నరసయ్యను కొట్టించి హాస్పటలులో చేర్పిస్తాడు. 'మాధవరావు మనుష్యులెవరో కొట్టా' రని ప్రచారం చేయిస్తాడు. నరసయ్య ఆస్పత్రిలో తీపులు తీసుకుంటూ పడిఉంటాడు. ఇక్కడ నరసయ్య భార్య రాజ్యం, కృష్ణమూర్తి ప్రణయలోకాలలో విహరిస్తూ ఉంటారు 'నరసయ్యను కొట్టించి హెడ్‌మాస్టరు మీద అభాండం వేసినవాడు కృష్ణమూర్తే' అని, కృష్ణమూర్తిని ఎలాగైనా సాధించితీరాలని ధర్మారావు ఉపాయాలను ఆలోచిస్తూ ఉంటాడు.

ఇది ఇలా వుండగా మరొకవైపు నుండి మరొక సంఘటన జరుగుతుంది. బ్యాంకి సెక్రటరీ సీతారామయ్య, మాధవరావు దగ్గరకు వస్తాడు. ఒక పిల్లవాని పరీక్ష నంబరిచ్చి, గురుమూర్తిగారిచేత మార్కులు వేయించాలని, కానిచో కష్టనష్టాలకు గురి అవుతారని బెదిరించి వెళ్ళిపోతాడు. మాధవరావు గురుమూర్తిని జాగ్రత్తగా ఉండవలసినదని హెచ్చరించి ఈ సంగతి ధర్మారావుకు చెప్తాడు. ధర్మారావు గురుమూర్తికి తోడుగా రాముడిని గురుమూర్తి

యింటికి పంపుతాడు ఒకనాటి రాత్రి సీతారామయ్యమనుష్యులు గురుమూర్తిని, రాముడిని తల పగులకొట్టి పరీక్షపేపర్లు ఎత్తుకొనిపోతారు. ఆ దెబ్బలాటలో వీరయ్య అనే వానికి రాముడి చేతిలో చావుదెబ్బలు తగులుతాయి. చాపచుట్టుగా పడిపోయిన వీరయ్యను వాడి మనుష్యులు తీసుకొని వెళ్ళి వాడి గుడిసెలో పడవేస్తారు.

ధర్మారావు, మాధవరావులకు దీని అంతు చిక్కడం లేదు. గురుమూర్తి, రాముడు డా॥ ప్రసాద్ చికిత్సలో కోలుకుంటూ ఉంటారు. 'రాముడి చేతిలో చావుదెబ్బలు తిన్నది వీరయ్య అని, వానివలన కొంత ఆచూకి తీయవచ్చును' అని తలచి ధర్మారావు వాడికి డా॥ ప్రసాద్ చేత చికిత్స చేయిస్తూ ఉంటాడు. 'వీరయ్య నిజాన్ని ఎక్కడ బయటపెట్టుతాడో' అని సీతారామయ్య మనుష్యులు వాడికి విషం పెడ్తారు. ప్రసాదు సమయాని కది తెలుసుకొని, వాని ప్రాణాలు కాపాడతాడు. పరీక్షపేపర్లు పోయాయన్న కారణంతో గురుమూర్తిని విద్యాశాఖవారిచేత సస్పెండ్ చేయిస్తాడు సీతారామయ్య.

ధర్మారావుకి ఒకవైపు సీతారామయ్యను, మరొకవైపు కృష్ణమూర్తిని ఎదుర్కోవలసిన పరిస్థితి వచ్చింది. అతడిలో ఏమి చేయాలా అన్న విచికిత్స కలుగుతుంది. మానసిక సంఘర్షణకు గురి అవుతాడు. పారిపోవడానికి వీలులేనంతగా పరిస్థితులు అతనిని చుట్టిముట్టివేశాయి. ఒకమూల శారదపై తన హృదయంలో అంకురించిన ప్రేమలత పల్లవించ సాగింది. ప్రేమచిహ్నంగా వజ్రపుటుంగరాన్ని శారద అనామికకు తొడుగుతాడు. గురుమూర్తి సస్పెన్షన్ ఆర్డరును శోభనాద్రి ద్వారా సీతారామయ్య చేత రద్దు చేయించాలని ప్రయత్నాలు ఆరంభిస్తాడు. ఈప్రయత్నంలో నైతిక విలువలు నెమ్మదినెమ్మదిగా ఒక్కటొక్కటే అతడిని వీడిపోసాగాయి. శ్యామలనిచ్చి ధర్మారావును తన అల్లునిగా చేసుకోవాలని శోభనాద్రి ఉవ్విళ్ళూరుతుంటాడు. దాని కనుగుణంగానే ధర్మారావు కనిపించగానే శ్యామల హొయలు పోవసాగేది. ధర్మారావుహృదయంలో శారద నిరంతరం మెదులుతూ ఉన్నప్పటికి, తాను ఆశించిన పని నెరవేర్చుకోవటానికై, అధికారపరిరక్షణకై శ్యామలపట్ల ప్రేమను ప్రదర్శిస్తూ శోభనాద్రికి విశ్వాసం కలిగిస్తాడు.

దీనికి తోడు శోభనాద్రి లాంటివాళ్ళను తన చేతిలో ఉంచుకొనటానికి క్రొత్త పరిశ్రమను ఆరంభించాలని నిర్ణయం తీసుకొంటాడు. ధర్మారావు అందువల్లనే మోహన్‌ని స్టేట్స్‌నుండి పిలిపిస్తాడు. మోహన్ అంత తేలికగా మ్రింగుడు పడడు. ఆ ప్రయత్నాలు అలా ఉండగా మునిసిపల్ ఎలక్షన్లు వచ్చాయి. సీతారామయ్యలాంటి పెద్దలు ఎన్నికల వ్యూహ

రచనలో మునిగిపోయారు. అందరు వర్గాలు వర్గాలుగా విడిపోయారు. శోభనాద్రి, ప్రసాద్, ధర్మారావు, రంగయ్య, సుబ్బారావువాళ్ళు సీతారామయ్యకు ఎదురొడ్డి నిలిచారు. కాని, ధర్మారావు దంతా తెరవెనుక భాగవతం. శోభనాద్రి, ప్రసాద్ మున్నైనవారు తెరమీది బొమ్మలై ఆడసాగారు. ప్రచారాలు, డబ్బుసంచులు ముమ్మరంగా పనిచేయసాగాయి.

ఇంతటితో కథ ఆగిపోయింది. మధ్యలో పశ్యంతీ ప్రసాదుల కుటుంబాల చరిత్ర, రాజ్యం యొక్క బాల్యం మున్నైనవి అనుబంధకథలుగా వస్తాయి. పశ్యంతి ఒక విలక్షణమైన ప్రాణి. తరువాతి కథలో ఆమె జీవితపర్యవసానం తెలియుండేది. రాజ్యం బాల్యాన్ని అంత విశ్లేషించి చిత్రించటం తరువాత ఆమె జీవితంలో సంభవింపబోయే సంఘటనలకు మూల మేమో ? ఆమె జీవితం ఎట్టి మలుపు తిరిగేదో ఆ రసహృదయానికే తెలియాలి. ఆ దైవానికే తెలియాలి. ఇంతవరకు చూపెట్టిన సమస్యలు, వ్యక్తుల జీవితాలు తెలుగువారి దురదృష్టం వలన అపరిష్కృతాలుగా, అసమగ్రాలుగా మిగిలిపోయాయి. ఇక జి. వి. కె. రచనాశిల్పాన్ని పరిశీలిద్దాము.

'పాపికొండలు' కృష్ణరావు గారి ప్రతిభావ్యుత్పత్తులకు దర్పణం పట్టే నవల. స్వాతంత్ర్యానంతరం దేశశ్రేయస్సు కన్నా అధికారం మీద శ్రద్ధాశక్తులు పెరిగి పోయాయి. అధికార సంపాదనకై మనుష్యులు పోటీ పడుతున్నారు. ఈ పోటీలో నైతిక విలువలకు విలువ లేకుండా పోయింది. వ్యక్తిస్వేచ్ఛ అపహరించబడుతున్నది. స్వతంత్రమైన ఆలోచనకు అవశ్యకమైన వివేకం లుప్తమైపోతున్నది. ఒక వ్యవస్థ లేదు. సర్వత్ర అశాంతి తాండవిస్తున్నది. రాజకీయాలు స్వార్థదూషితులై, పెద్ద కొండలుగా మానవజీవన ప్రవాహానికి అడ్డుపడి ఆ ప్రవాహంలో జలావర్తాలు పుట్టిస్తున్నారు. ఆ జలావర్తంలో పడి మానవులు సర్వస్వాన్ని కోల్పోతున్నారు. ఈ స్వతంత్రభారతంలో మానవుడు స్వతంత్రమైన ఆలోచనతో బ్రతకలేక పోతున్నాడు. అధికారసంపాదనం, అధికార రక్షణం - ఇవే నేడు మానవుని ధ్యేయాలౌతున్నాయి. ధర్మం, న్యాయం, కర్తవ్యం, దయ, ప్రేమ, కరుణ అన్నవాటికి గ్రంథాలలో తప్ప మరెక్కడ స్థానం లేకుండా పోతున్నది. ఈ పరిస్థితి యిలాగే సాగితే గ్రంథాలలో కూడ వాటికి ముందు ముందు స్థానం ఉండకపోవచ్చు.

ఈ పరిస్థితులను చూచి క్షుభితుడైన జి. వి. కె. భావనాతీవ్రతతో ఈ నవలను రచించారు. హేతుబద్ధంగా, నిశితంగా నేటి పరిస్థితులను పరిశీలనం చేసి వాటిని వ్యంగ్యమర్యాదతో ఈ నవలలో నిబంధించారు. ఇది కేవలం వినోదంకోసం రచింపబడ్డ నవల కాదు.

దీనికి ఒక ప్రయోజనం ఉన్నది. ఒక నిర్దిష్ట లక్ష్యం ఉన్నది. స్వతంత్రభావాన్వేషం, హేతు బద్ధమైన ఆలోచన - ఇవే ఈ నవలకు లక్ష్యాలు. ఈ నవలలో రచయితకు గల ప్రతిభా వైదుష్యాలు ప్రస్ఫుటంగా కన్పిస్తాయి. అడుగడుగునా వక్రోక్తివైభవం పుష్కలంగా కాన వస్తుంది. వ్యంజనాచమత్కృతి పాఠకులను చకితులను చేస్తుంది. వాతావరణచిత్రణం, పాత్ర చిత్రణం, మనస్తత్త్వ పరిశీలనం - ఇది అది అననేల, సర్వం భావోల్బణమే. సర్వం రస బంధురమే. 'పాపికొండలు' లోని విశిష్టత యిది.

ఇతివృత్త నిర్వహణంలో జి. వి. కె. సిద్ధహస్తులు. ఆయన చేతిలో బడిన ఇతివృత్తం ఒంపు టొంపు లేక కమ్మచ్చున తీసిన బంగారు తీగలాగ సహృదయజనాభిరామంగా సాగు తుంది. ఇతివృత్తనిర్వహణంలో జి. వి. కె. అవలంబించిన విధానాన్ని తెలుసుకొంటే గాని, ఆయన ఈ నవలలో పాటించిన ధ్వనిమర్యాద తేటపడదు.

1) బాహ్యవాతావరణచిత్రణం ద్వారా భావికావ్యార్థాన్ని ధ్వనింపచేయడం.

2) మనస్తత్త్వవిశ్లేషణాత్మకమైన వర్ణనల ద్వారా జరుగబోయే సంఘటనలకు కారణా లను ప్రతీయమానం చేయడం.

3) సమస్యాచిత్రణం పాత్రముఖంగానే చేయించి పరిష్కారాన్ని వ్యంగ్యమర్యాదతో సూచించడం

4) వ్యంగ్యాత్మకసంభాషణలద్వారా పాత్రల స్వరూప స్వభావాదులను అభివ్యంజితం చేయడం.

ఈనవలలో ప్రతి సంఘటన, ప్రతి ఆలోచన, ప్రతి వ్యాపారం కారణబద్ధము. ఏదీ యాదృచ్ఛికం కాదు; హేతువినిర్ముక్తం కాదు. కారణాన్వేషణం చేసి ప్రదర్శించడంలో రచ యిత పై విధానాలను ఆలంబనంగా చేసుకున్నారు. పాత్రల ఆలోచనారూపంలో కారణాన్వేషణం పాత్రల చేతనే చేయించి, పాఠకునికి ఆ కారణాన్ని స్ఫురింపజేయడ మనేది భావుకహృదయు డైన జి. వి. కె. రచనలలో గల ఒక మహాలక్షణము. ఈ రచయిత తానుగా చెప్పడు. తానుగా చెప్పిన సన్నివేశాలు అత్యల్పాలు. తానుగా చెప్పిన ఆ వాక్యాలు పరమతత్త్వార్థ బోధకాలు; తపస్సమాధిలో నుండి వెలువడిన ఋషిదర్శనాలు. 'నానృషిః కురుతే కావ్యమ్' అని కదా అభియుక్తవచనము.

బాహ్యవాతావరణచిత్రణంతో నవల ఆరంభ మౌతుంది. ఈ చిత్రణం ధ్వన్యను ప్రాణితము.

"ఆకాశాన కారుదున్నల పరువులు; దక్షిణాన కన్నెచుక్కల మిలమిలలు; చెవులు బ్రద్దలు చేసే గర్జలు. ధర్మారావు తల పైకెత్తి చూచాడు. కందగడ్డనుండి బయలుదేరిన పొడవైన పిలకవలె మెరుపు మెరిసి మటుమాయ మయింది."

రచయిత బాహ్యప్రకృతిచిత్రణవ్యాజంతో ఇందలి యితివృత్తాన్ని పై వాక్యాలలో వ్యంగ్య మర్యాదతో నిక్షేపించారు. ఆకాశాన కారుదున్నల వంటి నల్లని మేఘాలు వాయువీచితాలై పరుగులు తీస్తున్నాయి. దక్షిణదిశన నక్షత్రాలు తళుకుతళుకుమని ప్రకాశిస్తున్నాయి. మేఘాలు గర్జిస్తున్నాయి. ఇది వ్యంజిత మౌతున్న అర్థం. ఇది తత్కాలీన వాతావరణద్యోతకం. దీని నుండి సహృదయ పాఠకుడికి కావ్యార్థాన్ని కూడ ధ్వనింపచేస్తున్నారు రచయిత. అది యిది: ఈ నవలలోని పాత్రలు యుక్తాయుక్త వివేచనాశక్తి కోల్పోయి, మత్తమహిషాలవలె విశృంఖలంగా పరువులెత్తుతుంటారని, ధర్మారావు, నారాయణరావుల వంటి దక్షిణనాయకులను శారద, శ్యామల వంటి కన్యలు వికావికలు చేస్తారని, సీతారామయ్య, కృష్ణమూర్తి మున్నైన వారు నైతిక విలువలను మంటగలిపి (వీరిలో తరువాత ధర్మారావు కూడ ఉంటాడు.) అధికార తృషిత వ్యాఘ్రాలై కోరలు చాచి గాండ్రిస్తారని, తత్ఫలితంగా పాపఫలం కందపిలకవలె మాతృగర్భాన్ని చీల్చుకొని బయటకు వస్తుందని, మేఘాచ్ఛాదితగగనంలాగ జీవితం అంధకార బంధురం అవుతుందని, మహా ప్రతిభతో ధ్వనింపచేశారు రచయిత. శబ్దార్థాల మీద అధికారం కలిగి, ప్రతిభాసమున్మిషితమైన బుద్ధితో భావ్యర్థాన్ని దర్శింపగల కవి మాత్రమే ఇంత రామణీయకంగా చిత్రింపగలడు; ధ్వనింపచేయగలడు. పై వాక్యాలు పాఠకుని చిత్తాన్ని ఆకట్టుకొని, ఎన్నో ఆలోచనలను మేల్కొలిపి ఆలోచింపచేస్తాయి; హృదయాన్ని కరుణరసాప్లావితం చేస్తాయి. ఈవిధంగ, రచయిత తన యీ రచనకు అంగిరసం 'కరుణ' అనీ, మిగిలిన అంగ రసాలు ప్రధానరసానికి పోషకాలు అనీ ధ్వనింపచేశారు. ఆరంభంలోనే వస్త్వలంకారధ్వని ద్వారా రసాన్ని ధ్వనింపచేయడం ప్రతిభావ్యుత్పన్నతాదీప్తు లయిన కృష్ణరావు వంటి వారికే చెల్లును.

ఈ నవలలో వాతావరణాన్ని చిత్రించిన ప్రతి సన్నివేశంలోను ఆ వాతావరణం వర్ణనీయ సంఘటనాభివ్యంజకమై, మనస్తత్త్వవిశ్లేషకమై పాఠకుల మనస్సులను పరవశం చేస్తుంటుంది. వాతావరణాన్ని మనోవిశ్లేషణను ఒక ఆలంబనంగా చేసుకొని రచయిత ప్రధానసంఘటనను చిత్రిస్తారు.

ధర్మారావును పాఠశాల కార్యదర్శిగా చేయా లని మొదట ఊహ చేసింది కృష్ణమూర్తే. ధర్మారావు కార్యదర్శి అయ్యాడు. దీనికి సంతోషించడానికి బదులు అసంతృప్తికి లోనయ్యాడు కృష్ణమూర్తి. ఈ అసంతృప్తికి కారణాన్ని అన్వేషిస్తూ, తత్కారణప్రదర్శక మయిన మనస్తత్వాన్ని ఇలా విశ్లేషిస్తారు జి. వి. కె.

> "ఆకలిదప్పులు తీరితే జంతువులు సంతృప్తి పొందుతాయి. మానవులు అలా కాదు. కోరికలు తీరినా సంతృప్తిపడరు. అవి తాము అనుకున్నప్పుడు అనుకున్న తీరున నెరవేరాలి. అనుకున్నదానికి కొంచెం ఇంచుమించుగా జరిగినా ప్రయోజనం లేదు. అలా జరగడం కూడ అసంతృప్తికి, అశాంతికి హేతువు."

మానవుడి ఆశకు అంతు లేదు. వాడు కోరిన కోరిక తీరడంతోనే తృప్తిపడడు. వాడు కోరినతీరుగానే అది సిద్ధించాలి. అలా కానినాడు వాడికి గంగవెర్రు లెత్తుతాయి. అసంతృప్తి జ్వాలల్లో వాడు మ్రగ్గిపోతాడు. తాను పరాజితుడు అయినట్లు భావిస్తాడు. వాడిలో ప్రతీకారేచ్ఛ బయలుదేరుతుంది. తా నుద్దేశించిన సిద్ధికి, వ్యక్తికి విఘాతాన్ని తలపెట్టుతాడు. ఇది సామాన్య మానవనైజము. ధర్మారావు కృష్ణమూర్తి అభిమతానుసారం సెక్రటరి అయినా,శోభనాద్రివాళ్ళ సాయంతో ఆతడు ఆ పదవిని అధిష్టించాడు. ఇది కృష్ణమూర్తి అసంతృప్తికి హేతువు అయింది. ఆ అసంతృప్తి వలన కృష్ణమూర్తికి ధర్మారావుపై ప్రతీకారేచ్ఛ కలిగింది. ఈ విధంగా రచయిత ప్రతిపాదించిన మనస్తత్వవిశ్లేషక వాక్యాలు కార్యకారణభావ ప్రదర్శకాలు. ఇంతేకాదు, మానవుని ఆశకు మేరలు లేకపోతున్నా యని, ఆకాశాన్ని అంటుతున్న అతని ఆశలే అసంతృప్తికి, అశాంతికి హేతుభూతాలని, నేటి మానవుడికి కనీసం కోరిక తీరగానే సంతృప్తి పొందే పశువుకున్న లక్షణం కూడా లేదని వ్యంగ్యగర్భితంగా ప్రదర్శించారు రచయిత. కృష్ణమూర్తికి కలిగిన అసంతృప్తి నిర్హేతుకం కాదని, కార్యదర్శిపదవిని చేపట్టడంలో ధర్మారావు ప్రవర్తన దానికి కారణమని తెలియజేస్తూ, కృష్ణమూర్తి వంటి వ్యక్తుల కార్యాలకు కారణాలను గూడ అన్వేషించి నిర్లిప్తబుద్ధితో సత్యాన్ని దర్శించటం శ్రేయస్కరమని కూడ ఉద్బోధిస్తున్నారు జి. వి. కె.

ఒక పాత్ర యొక్క మనస్తత్వాన్ని, వాని శీలాన్ని, వాని అజ్ఞానాన్ని ప్రదర్శించవలసి వచ్చినపుడు ఒక విచిత్రమైన సంఘటనను ఎన్నుకుంటారు. ఈ రచయిత తాను నిర్లిప్తుడై, సాక్షిమాత్రుడుగా ఉండి ఆ పాత్రముఖంగానే, వాని అజ్ఞానాన్ని, వాని దౌష్ట్యాన్ని పాఠకుల

ముందుంచి ఆ పాత్ర యెడ జుగుప్సను కలుగజేస్తారు ఇది జి.వి.కె.లోఉన్న రచనాకౌశలం. దీనిని చూచినప్పుడు పాఠకునికి అబ్బురపాటు కలుగుతుంది.

నారాయణరావుకి తాను గొప్ప రచయిత నని, శబ్దచమత్కారాన్ని చెప్పడంలో తాను అందెవేసిన చేయినని ఒకవిధమైన దుష్ట అభిమానం. వాని అల్పశ్రుతత్వాన్ని, కావ్యతత్త్వానభిజ్ఞతను రచయిత వ్యంజ్ఞమర్యాదతో పాఠకుని ముందుంచుతాడు. మహాకవి కాళిదాసరచితమైన 'వాగర్థావివ' శ్లోకాన్ని తరగతిలో విద్యార్థులకు బోధిస్తూ "పార్వతీపరమేశ్వరౌ" అనే పదానికి 'శివకేశవులు' అని అర్థం చెప్తుతాడు నారాయణరావు. మరుసటిరోజున ఒక విద్యార్థి లేచి, 'నిన్న మీరు "పార్వతీపరమేశ్వరౌ" అనే పదానికి శివకేశవు లని అర్థం చెప్పారే, అప్పుడు మహాకవి 'వాగర్థా' అని కాక 'శబ్దార్థౌ' అనిఉండవలసిందే" అని అనుమానాన్ని వ్యక్తం చేస్తాడు. ఈ ఆక్షేపణను, ఈ వెటకారాన్ని తెలుసుకోవటానికి పాఠకునికి కూడ కొంత లింగ వచనజ్ఞానం అవసరం. "ఉపమాన ఉపమేయాలు సమాన లింగ, వచన, విభక్తికాలుగా ఉండాలి' అని తెలిసినప్పుడుగాని, దీనిలో ఉన్న వ్యంగ్యం, స్వారస్యం బోధపడదు. 'వాగర్థౌ' అనే సమస్తపదంలో 'వాక్' శబ్దం స్త్రీలింగం; అర్థశబ్దం పుంలింగము. కాని, "శబ్దార్థౌ" అనే పదంలో రెండూ పుంలింగశబ్దాలే. సమానలింగవచనాలుకల వాగర్థాలతో పార్వతీపరమేశ్వరులను పోల్చడంలో స్వారస్యం ఉందనీ, చమత్కారం అనే పేరుతో ఔచిత్యాన్ని విడనాడితే, అది రసభంజక మౌతుందని రచయిత వ్యంగ్యమర్యాదతో హెచ్చరిస్తున్నారు.

ఈ నవలలో రచయిత చేసిన శబ్దసంయోజనం కేవలం వర్ణసమాహారం కాదు. ఆ శబ్దాలు రూపాయితాలై, అర్థస్ఫోరకాలై కొన్ని దృశ్యాలను మనముందు సాక్షాత్కరింపజేస్తాయి. అట్టి స్థలాల్లో కేవలకీర్తికాంక్షాపరుల అజ్ఞానం, వారి దుష్టశీలం రూపుదాల్చి మన మనస్సులలో మెదలాడుతాయి. అనౌచిత్యం, శీలదౌష్ట్యం నారాయణరావులో ఉన్నదని క్రింది సంఘటన ద్వారా నర్మగర్భంగా సూచిస్తారు.

నారాయణరావు 'ప్రతిజ్ఞాచాణక్యాన్ని' శ్యామల పేరుతో వ్రాసి, నవలల పోటీకి పంపుతాడు. నిర్ణాయకసంఘంలో అతడు కూడ ఒక సభ్యుడు. అందువలన ముందుగానే ఆ నవలకు ప్రథమబహుమతి వచ్చినట్లు శ్యామలకు, శోభనాద్రికి చెప్తుతాడు. ఆమెకు సన్మానప్రయత్నాలు తలపెడతాడు. ఆ నవలను చూచిన గురుమూర్తి 'ఇలా రాసుకొంటూ పోతే యశస్సంతతి తప్పక కలుగుతుందమ్మా' అని ఆశీర్వదిస్తాడు. ఆ పుస్తకం వ్రాయటం బహుమతి రావటంపై శ్యామల, నారాయణరావుల మధ్య సంభాషణ జరుగుతుంది. 'దుర్మార్గుడః! అంత తప్పుడుకూత

కూశాడా?' అని, నారాయణరావు భ్రాంతుడై ప్రశ్నిస్తాడు. 'కర్మధారయంగా కూడ అది సాధువే; చాలా చక్కగా అన్నారు కాదూ?' అని శ్యామల చిలిపినవ్వు నవ్వుతుంది.

గురుమూర్తి వాక్యం లో ఉన్న వ్యంగ్యం, వెటకారం సమాసజ్ఞానం ఉన్న ప్రతి పాఠకుడికి తెలుస్తుంది. షష్ఠీతత్పురుష వలన చెప్పుకొనే అర్థం వాచ్యార్థము. కర్మధారయం చెప్పుకుంటె యశస్సు, సంతతి - రెండూ కలుగుతా యని వ్యంగ్యార్థం కూడ వ్యంజిత మౌతుంది. గురుమూర్తిమాటను శ్యామలచేత అనిపించి, నారాయణరావు ముఖాన కశాఘాతం చేయిస్తారు రచయిత. ఇంతే కాదు, నారాయణరావు దౌష్ట్యాన్ని, దుశ్శీలాన్ని నిర్దయగా, నగ్నంగా మన కళ్ళముందు నిలబెడ్తారు. నేటి పోటీలు, బహుమానాల స్థితిగతులను కళ్ళకి కట్టేట్లు చేస్తారు. ఇలా వివేకోదయం కలిగించి సంప్రదాయబద్ధమైన పాండిత్యం, ప్రతిభ, ఔచిత్యం పైన పాఠకుల హృదయాలలో శ్రద్ధాభక్తులను ఉద్దీపితం చేస్తారు. ఔచితీసంపన్నులైన గురుమూర్తి వంటివారి మీద ఆదరాభిమానాలను కలుగజేస్తారు. ఇట్టి పని కత్తిమీద సామే మరి! ఏమాత్రం తొట్రుపాటు పడినా రసభంగం ఔతుంది. ఔచిత్యవిరహితమైన మాట, చేష్ట అశ్లీలాది దోష దూషితం అవుతుంది. ఔచిత్యదూరమైన కవితాసేవనం భోజనసమయంలో 'సైంధవ మానయ' అన్నప్పుడు లవణానికి బదులు అశ్వాన్ని తెచ్చే ప్రియురాలి సహవాసం వంటిది. జీవితవ్యవహారంలో గాని, కవితాక్షేత్రంలో గాని, అనౌచిత్యం సర్వథా పరిహరణీయము. కనుకనే, ఈ నవలలోని పాత్రలైన మాధవరావు, గురుమూర్తివంటివారు మనోనిగ్రహంతోను, వాక్సంయమంతోను అడుగడుగునా ఔచిత్యాన్ని పాటిస్తూ ఉంటారు. ఈ లక్షణాలను జి. వి. కె. లో కూడ చూస్తాము.

శారదజీవితం భవిష్యత్తులో ఎలా పరిణామం పొంద నున్నదో ఊహించటానికి వీలుగా రచయిత ఒక చిన్న సంఘటనను చిత్రించారు. ఆ సంఘటన చిన్నది కావచ్చును గాని, అది శారద జీవితపర్యవసానాన్ని సూచిస్తుంది.

శారద పైన మోహవాగురలలో చిక్కుకున్న ధర్మారావు తన ప్రేమ కానుకగా వజ్రపుటుంగరాన్ని ఒక కవరులో పెట్టి శారదకు ఇవ్వటానికి తెస్తాడు. మాటలలో మైమరచి ఉన్నప్పుడు ధర్మారావు మిత్రుడు విశ్వనాథం ద్వారా ఆ కవరు శారద చేతిలోకి వస్తుంది. శారద ఆ కవరు తీసుకొని మరునాడు ధర్మారావు ఇంటికి వెళ్ళుతుంది. ముందుగదిలో శ్యామల ధర్మారావుల నవ్వులు వినిపిస్తాయి. శారద మనస్సు చివుక్కు మంటుంది. ఆ కవరుని రాముడి ద్వారా ధర్మారావుకి పంపుతుంది. ధర్మారావు చిరాకుపడ్తాడు. ఆ కవరు తీసికొని శారద

దగ్గరకు వస్తాడు. ఆమె సంశయాన్ని తొలగిస్తూ అనునయిస్తాడు. శారదకు తనపై మక్కువ ఉన్నదని తెలుసుకున్న పిమ్మట ఉంగరం తీసి ఆమె వ్రేలికి పెడ్తాడు. ఆమె చేతులను తన చేతుల్లోకి తీసికొని చుంబనాంచితాలు చేస్తాడు. సంఘటన యిది.

ఇది చదివిన పాఠకుని మనస్సులో ఒక్కమారు శకుంతలాదుష్యంతుల జీవనవృత్తం తళుక్కున మెరుస్తుంది. శారదజీవితం కూడ శకుంతలజీవితం వలె దుఃఖభాజనం కాబోతున్న దని, ధర్మారావు అన్యకాంతాసక్తుడై శారదకు ద్రోహం చేయబోతున్నా డని స్ఫురిస్తుంది. శ్యామలతో ధర్మారావు వికవికలు, పకపకలు దీనిని బలపరుస్తున్నాయి. ఈ భావం మనసు లోకి రాగానే పాఠకుని మనస్సు కరుణతో నిండిపోతుంది. ఇంతే కాదు. మాధవరావు స్కూలు హాస్టల్ నుంచి యింటికి వస్తాడు. శారద పూలమొక్కలకు నీళ్ళు పోస్తూ ఉంటుంది. ఆమెను చూచి మాధవరావు 'అనసూయా ప్రియంవదలు ఏరి అమ్మా' అని అడుగుతాడు. ఈ మాటలు పై ఊహను బలపరుస్తున్నాయి. ఇంతే కాదు, శారద మాధవరావుకి ఔరస సంతతి కాదని, కణ్వమహర్షి శకుంతలను పెంచి పెద్దచేసినట్లు మాధవరావు కూడ శారదను తెచ్చి గారాబంగా పెంచి పెద్దచేశాడని కూడ ధ్వనింపచేస్తున్నాయి మాధవరావు మాటలు. కణ్వమహర్షి వలె తన ధర్మాన్ని నెరపి, జరగబోయే సంఘటనలను నిర్లిప్తభావంతో చూడబోయే మాధవరావు మన కళ్ళముందు ప్రత్యక్ష మౌతాడు. పాఠకుల హృదయాలు రసార్ద్రాలై "జీవితపర్యవ సానం ఇంతేనా ? దీనికి తరణోపాయం లేదా ?" అని ఆక్రోశిస్తాయి. జి. వి. కె. రచన అంతటా కరుణరసాన్ని ఈవిధంగా వ్యంగ్యమానం చేశారు.

మోహన్ స్టేట్సు నుండి వస్తాడు. అతడు ఒక క్రొత్త 'ఫాన్' ను కనుగొన్నాడు. దానికి పరాపేక్ష లేదు. అది స్వయంచాలకము. అది మార్కెట్‌లోకి వస్తే పరిశ్రమ లన్నీ మూలపడతాయి. అప్పుడు వచ్చే పరిణామాలు దురూహ్యాలు. దానికి 'మాధవ్' అని పేరు పెట్టి ఒక సభలో దానిని మాధవరావుచేత ఆవిష్కరింపజేయా లని ప్రయత్నాలు జరుగుతాయి. మాధవరావు దానిని ఆవిష్కరించటానికి తిరస్కరిస్తాడు. అందరు అతనిని ఒత్తిడి చేస్తారు. అప్పుడు మాధవరావు చేత పలికించిన పలుకులు భావగర్భితాలు; కరుణరసాప్లావితాలు. గురు మూర్తి అన్నిటికి ఈశ్వరుడున్నాడు; భయం దేనికి? అని అనునయింప జూస్తే మాధవరావు ఇలా అంటాడు:

> "అవకాశం ఉండగా మానవప్రయత్నం వదలి భగవంతునిమీద భారం వెయ్యటం మూర్ఖత్వం. చూస్తూ చూస్తూ నా బిడ్డను చంపుకోమంటారా? తెలిసి, తెలిసి లోకానికి మహానర్థంకల్పించమంటారా ?

"విషంవల్ల నష్టం లేదు. అమృతం వలె భాసించే విషమే చిక్కు తెచ్చిపెడుతుంది. మీ అందరికి నే నెందుకు కష్టం కలిగించాలి? తరువాతనే తీరికగా నా ఏడ్పు నేను ఏడ్చుకుంటాను."

మాధవరావు హృదయాక్రందనాన్ని మనం సానుభూతితో పరిశీలిస్తే, ఆయన భవిష్యత్తును ఎంత భయంకరంగా ఊహిస్తున్నాడో ద్యోతక మవుతుంది. అట్టి మహానర్థాన్ని ధ్వనింపచేయటమే రచయిత తాత్పర్య మని గూడ అనిపిస్తుంది. అట్టి సాధనాలు ప్రచారంలోకి వస్తే కాపిటలిస్టులు సహింపలేరు. వారి పరిశ్రమలకు విఘాతాన్ని కల్పించే ఏ సాధనాన్నైనా, ఏ వ్యక్తినైనా ప్రపంచంలో నిలవనీయరు. వారి మార్కెట్టే వారికి ముఖ్యం. వారి ధనార్జనమే వారికి ధ్యేయం. వారి మార్గానికి అడ్డు వచ్చినవారిని ప్రాణాలతో ఉండనీయరు. అట్టి గుత్తాధిపత్యం గలవారి చేతుల్లో మోహన్‌కి ప్రాణాపాయం తప్పదని, ఇట్టి వైజ్ఞానిక పరిశోధనలను ఉదారచిత్తంతో స్వీకరించేటంత ఎత్తు వరకు మన సమాజం ఎదగలేదని, వీటిని ప్రస్తుతానికి పరిహరించాలని, అలా కానినాడు విజ్ఞానాభివృద్ధికి కూడ గొప్ప చేటు వాటిల్లగలదని భావించి ఆ యంత్రాన్ని ఆవిష్కరించటానికి మాధవరావు మొదట తిరస్కరిస్తాడు. 'భగవంతునిపై భారం వేసి కర్తవ్య పాలనం చేయడమే ధర్మ' మని భావించే గురుమూర్తి చేత ఎటు చూచినా అనర్థం తొలగనప్పుడు అన్నయ్యను, సభ్యులను చిన్నబుచ్చడం, వాళ్ళకు ఆశాభంగం కలిగించడం ఎందుకు? మీరు నిందలపాలు కావడం ఎందుకు?' అని ప్రశ్నించే శారద చేత, 'ఆటంబాంబు వంటిదాన్ని కనిపెట్టినప్పుడే మానవుడు భయపడలేదు; నాశనం పొందలేదు. దీనివల్ల అంతకన్నా వైపరీత్యం జరుగుతుందంటారా?' అని నచ్చచెప్పే ధర్మారావు చేత ప్రబోధితుడై మాధవరావు ఆ యంత్రాన్ని ఆవిష్కరిస్తాడు.

ఈ సంఘటన ఆయన మనసుకి ఒక శల్యమే అవుతుంది. కార్యకారణ పురస్సరంగా భవిష్యత్తును వివేకవంతులే దర్శించగలరు. ఈ సత్యాన్ని దర్శించాలంటే మానవుడు లౌకిక రాగద్వేషాలకు అతీతుడై ఉండాలి. అలా కానప్పుడు సత్యం బోధపడదు. మాధవరావు తాదృశ సత్యద్రష్ట. మిగిలిన వారందరు ఏదో బంధానికి లోబడ్డవారే. వాళ్లు తాత్కాలిక ప్రయోజనానికి వ్యామోహితు లయినవారే. అందువల్లనే పురుషప్రయత్నానికి తావివ్వక వారు అలా ప్రబోధించారు. మాధవరావు తదతీతుడు. ఏ వ్యామోహానికి లోను గాక జరుగబోయే మహానర్థాన్ని దర్శించగలిగాడు. తనకు, లోకానికి జరుగబోయే మహానర్థాన్ని పరిహరించాలని ప్రయత్నించాడు. ఎంతైనా సామాజిక ప్రాణికదా! అందుకనే, 'నిజంగానే నే నిప్పుడు గ్రుడ్డి

వాణ్ణమ్మా; మీరు చూచి చెప్పిందే నాకు లోకం' అని వాళ్ళ అభిమతాన్ని నెరవేరుస్తాడు. కాని, మనస్సులో అది సెలవేస్తూనే ఉన్నది, అందుచేతనే, ఆయన భవిష్యత్తులో జరుగబోయే పరిస్థితులను ఎరుకపరుస్తూ మోహన్‌కి చెప్పవలసినదిగా ప్రసాదుతో ఇలా అంటాడు.

> డాక్టరుగారూ....మీవాడితో ఒక ముక్క చెప్పండి. జీవిక పోతుంది. ప్రాణం అంతరిస్తుంది. ఇష్టార్థం నశిస్తుంది. గౌరవం మంట కలుస్తుంది. కీర్తి అంతరిస్తుంది. లోకం నిందిస్తుంది - ఇలాంటి భయాలకు తావివ్వవద్దని చెప్పండి. ధర్మాధర్మా లేవో వాడికి నేను చెప్పనక్కరలేదు. కేవల జిజ్ఞాసతో ఎన్నో సార్లు ఎన్నో లెక్కలు చేసి ఉంటాడు. ఆ లెక్కలు చేసుకొన్నట్లే తాను తల పెట్టిన కార్యకలాపాలను కూడ నిర్వర్తించుకోమని చెప్పండి. ఈ ముక్క కూడ చెప్పవలసిన పని లేదు. కాని, పుత్రవ్యామోహం నాలో ఇంకా చావలేదు."

ఈ వాక్యాలను పరిశీలిస్తే మాధవరావు దర్శించిన సత్యం యోగదర్శనం లాగ పొడగట్టుతుంది. అందుచేతనే, తాను దర్శించిన అనర్థాన్ని ధ్వనింపజేస్తూ పై మాటలు అన్నాడు. 'ఒరే అబ్బీ! నీవు కనుగొన్న ఈ సాధనం నీ ప్రాణాలను బలిగొంటుంది; దీనివల్ల నీ జీవనో పాధి పోతుంది; పరిశ్రమించి కనుగొన్న ఈ సాధనం కూడ నీకు దక్కదు: నీ కీర్తిప్రతిష్ఠలు మంటగలుస్తాయి; నీవు నిందల పాలవుతావు' అని హెచ్చరిస్తాడు. ఇంత అయినా, భయానికి తావివ్వవద్దని ఉద్బోధిస్తాడు భయం పశులక్షణము. స్వతంత్ర ఆలోచనలను వదలుకొన్నప్పుడు మానవుడికి పశువుకి భేదం ఉండదని అన్యాపదేశంగా ఉపదేశిస్తాడు. ఈ సందర్భంలో

> "కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి ।
> అకర్తవ్యం న కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి ॥"

అన్న వచనం మాధవరావుపట్ల అన్వర్థ మన్నట్లు అనిపిస్తుంది. ఇక్కడ మరొక విశేషాన్ని గూడ గమనించాలి. 'డాక్టరుగారూ! మీవాడితో ఒక మాట చెప్పండి.' అని అనటంలో 'ఈ సంఘటన వలన ఆయనకు పుత్రవ్యామోహం పోయిందని, ఎప్పటికైనా, ఆ పుత్రుడు తనకు దూరం అయ్యేవాడే' నని తెలుసుకున్న మాధవరావు వీతరాగియైన జీవన్ముక్తుని వలె మనకు గోచరిస్తాడు. ఈ సంసారంలో ఉన్నంతవరకు జీవన్ముక్తునికైనా, పుత్రేషణ పోదనికూడ 'పుత్రవ్యామోహం నాలో ఇంకా చావలేదు' అన్న వాక్యం ద్వారా ప్రతీత మవుతుంది. సంసార నిర్వాణాలకు అభేదం చెప్పే మాధ్యమిక వాదాన్ని విశ్వసించిన వ్యక్తి జి. వి. కె. అందుకనే'

ఆయనకు స్వాతంత్ర్య మంటే అంత ఆదరము; దాస్య మంటే అంత జుగుప్స. కనుకనే, ఆయన మాధవరావు చేత ఆ మాట లనిపించారు. ఈ విధంగా రచయిత మహాప్రతిభతో ఈ సంఘటనను చిత్రించి మన మనస్సులను ద్రవీభవింపచేస్తారు; కన్నీరు కార్పిస్తారు.

భావ్యర్థవ్యంజక మయిన మరొక సంఘటనను పరిశీలిద్దాము.

ధర్మారావు తాను ఆరంభించదలచిన పరిశ్రమకు రూపురేఖలు దిద్దటానికి మోహన్‌ని స్టేట్సునుండి పిలిపించా లనుకుంటాడు. మనస్సులో ఉద్బుద్ధాలయ్యే ఊహలకు ప్రత్యూహాలు చేస్తూ రోడ్డుమీద వెళ్లుతూ ఉంటాడు. హఠాత్తుగ –

> "టప్పున చప్పుడు వినిపించింది. అతడు ప్రక్కకు చూచాడు. బురదగుంటలో అప్పుడే పడిన ముదిచిలుక బొందువు కనిపించింది. చూపు పైకి సారించాడు. శరవేగంతో పోతున్న గ్రద్ద గోచరించింది .... తన దుస్తులవంక చూచు కొన్నాడు. కుడిప్రక్కన పాదాల నుంచి చెంపల వరకు రక్తపు మరక లున్నట్లు ప్రక్క గుంటలోని ఎర్ర బురదనీళ్లు కొట్టుకొన్నవి. అతడు కంపించిపోయాడు."

రచయిత ఈ సంఘటనను భావ్యర్థస్ఫోరకంగా చిత్రించారు. రాబోయే అనర్థపరంపరకు ధర్మా రావే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కారణం అవుతాడని ధ్వనింపచేశారు. 'బురదనీళ్ళలో పడ్డ ముదిచిలుక బొందువు', 'ఆకాశాన ఎగురుతున్న గ్రద్ద', 'రక్తపుమరక లన్నట్లు ధర్మా రావు దుస్తులమీద ఎర్ర బురదనీళ్లు కొట్టుకొనడం' ద్వారా ముదుసలి తల్లియైన అన్నపూర్ణమ్మ మృతికి ధర్మారావు పరోక్షంగానైనా కారణం అవుతాడనీ, ఆ కళంకం ధర్మారావుకు చుట్టు కొంటుందనీ రచయిత వ్యంజితంచేస్తారు.

ఈ సంఘటనను గూర్చి ధర్మారావు కొంత పర్యాలోచన చేస్తాడు. ఆ పర్యాలోచనలో తేలిన సారాంశం ఏమిటంటే — మానవుడు తన బుద్ధితో పర్యాలోచించి ఎంత చేసినా, ఎక్కడో పొరపాటు జరిగి తీరుతుంది. ఫాలాక్షుడైనా ముందు చూడగలడు గాని పైన చూడ లేడే. అందువలన పెక్కు అనర్థాలు వాటిల్లుతాయి. బుద్ధికి గోచరం కాని విషయాలు ఉంటాయి. మానవుడి ప్రజ్ఞ కొన్ని పరిమితులకు లోనయి ఉంటుంది. మనిషి అల్పజ్ఞత్వాన్ని చూపటానికి రచయిత 'మానవులు మూర్ధాక్షులు కాలే'రని అనిపిస్తారు. ఇది ఒక క్రొత్త ప్రయోగము. సహస్రాక్షత్వం, ఫాలాక్షత్వం పురాణాలలో విన్నాం గాని, ఈ మూర్ధాక్షత్వాన్ని కనలేదు; వినలేదు. ఇది జి. వి. కె. అమేయప్రతిభలో నుంచి సృష్ట మయిన శబ్దము. ప్రతి సంఘటన

వెనుక భౌతిక కారణాలతోబాటు బుద్ధికి గోచరించని అదృష్టహేతువు కూడా ఒకటి ఉంటుంది. మూర్ధాభిషిక్తుడైనవాడే దానిని దర్శించగలడు; విప్రతిపన్నాలైన కారణాలను పరిహరింపగలడు. అట్టివాడు ప్రజ్ఞాచక్షువు. అట్టి చూపు లేనివాడు ఎంత జాగ్రత్తగా లెక్కలు కట్టి ప్రవర్తిస్తున్నా, ఆ లెక్కకు రాని పద్దు లుండవచ్చును. ఇది సత్యదూరం కాకపోవచ్చును. అంతమాత్రాన, అదృష్టాన్ని నమ్మి పురుషార్థాన్ని వదలడం కూడ వాంఛనీయం కాదు. ఈవిధంగా ధర్మారావు పర్యాలోచన చేసి కార్యరంగంలోకి దూకుతాడు.

ఏతాదృశ వ్యంగ్యాత్మక చిత్రాలు, వ్యాఖ్యాత్మక వర్ణనలు ఈ నవలలో కోకొల్లలుగా కానవస్తాయి. నేటి కవిత్వాన్ని గురించి, లలితకళలను గూర్చి మాధవరావు ఆలోచన ఇలా సాగుతుంది.

> "శ్రుతి సంగీతం కాదు. ఛందస్సు కవిత్వం కాదు. రంగులు చిత్రలేఖనం కాదు. అసలు కవిత్వమే ఈ రోజులలో చచ్చిపోయి నట్లున్నది .. ....హృదయాన్ని ఊచే రచన రావటం లేదు........ప్రపంచంలోనే ఈనాడు సాహిత్యసర్గశక్తి లోపించినట్లు కనిపిస్తున్నది........మానవుని సృజనాశక్తి కుంటుపడిందా ? మరి సాంకేతికవిద్యా నైపుణ్యం ఎలా విస్తరిల్లుతున్నది? గ్రహాంతరయాత్రా ప్రయత్నాలు ఎలా జరుగుతున్నవి ? టెక్నాలజీ అభివృద్ధి వేరు; స్వచ్ఛంద భావనాశక్తి వేరు. భావనాశక్తి నిజంగా కుంటుపడి ఉంటే, లలితకళలన్నీ దెబ్బతినాలి. తతిమ్మా కళల స్థితి గూడ అలాగే ఉన్నదని అభిజ్ఞులంటున్నారు. ....ఇదే నిజమైతే కారణా లేమిటి? నేటి మానవునికి దేనిలోను నమ్మకం ఉన్నట్లు లేదు. యుద్ధానంతరం మానవునికి నిర్దిష్టలక్ష్యం కనిపించడం లేదు. భౌతిక సౌఖ్యం, ప్రత్యక్షప్రయోజనం, క్రియాసమర్థత - వీటిలో ఉన్న మక్కువ, ఆదరం, అభిమానం, గౌరవం మరి దేనిలోను లేవు. రోగగ్రస్తుడు సద్యస్స్వాస్థ్యం చేకూర్చే ఔషధాన్ని కోరుతున్నట్లే మానవుడు అర్థక్రియాసామర్థ్యాన్ని అభిలషిస్తున్నాడు. అణవ మారణాయుధాల ఉత్పత్తితో స్తిమితత్వం కోలుపోయి, నిత్యశంకితు డౌతున్నాడు. అటాంటివాడు ఆలోచించటానికి, ఆలోచన లోని వైచిత్రిని ఆనందించడానికి తావెక్కడ ?........ప్రపంచం మున్నెన్నడు కని విని యెరుగనంత వేగంగ మారిపోతున్నది........ఇట్టి త్వరిత పరిణామాలు వస్తున్నప్పుడు సాహిత్యం, తక్కిన కళలు వికసించడానికి, ఆస్వాదితాలు

కాపటానికి ఎక్కడ అవకాశం ఉంది?........ఆ పూటకు గంజి లేక కోట్లకొలది ప్రజలు అల్లాడుతున్నారు. రోగాలతో ప్రజలు గోండ్రు మంటున్నారు. ఇలాంటి వారు సాహిత్యాన్ని, మరొక లలితకళను ఆస్వాదించ గలుగుతారా ? జీవితం అర్థవంత మని గ్రహిస్తారా?"

ఇలాంటి అనేక ప్రశ్నపరంపరలతో కవిత్వాది లలితకళల లక్ష్యాన్ని, వాటి వికాసానికి గొడ్డలి పెట్టుగా తయారయిన మానవుల దృక్పథాన్ని వివరించటమే కాక, లలితకళాస్వాదనవల్లనే జీవితం సార్థక మౌతుందని, దేశంలో దారిద్ర్యం పోనంతకాలం సాహిత్యాభివృద్ధి, తద్రసాస్వాదనం అసంభవ మని జి. వి. కె. వ్యంజితం చేశారు. నేటి సాహిత్యపు తీరుతెన్నులను చూచి రచయిత ఎంత ఆవేదన చెందేవారో పై వాక్యాల వలన స్పష్టం అవుతుంది.

కవిత్వ మంటె, ధర్మ మంటె రచయితకు కొన్ని నిశ్చితాభిప్రాయా లున్నాయి. సీతారామయ్య మార్కుల విషయంలో బెదరించి వెళ్ళినతరువాత మాధవరావు గురుమూర్తి యింటికి వెళ్తాడు. వారిద్దరిమధ్య రసవత్తరమైన సంభాషణ ఇలా సాగుతుంది.

మాధవరావు : కవిత్వం అంటె ఏమిటి ?

గురుమూర్తి : తనకోసం ఏడిస్తే దుఃఖం, లోకం కోసం ఏడిస్తే కవిత్వం అనుకొంటాను.

మా : ఒకడు రెంటి కోసం ఏడుస్తా డనుకోండి; అప్పుడది ఏమౌతుంది ?

గు : ధర్మం

మా : ఒకవేళ లోకం కోసం ఏడ్చినట్లు నటిస్తాడనుకోండి. అప్పుడో ?

గురు : రాజకీయం

మా : ధర్మం జయిస్తుం దని, కావ్యం మూడు కాలాలపాటు ఉంటుందనీ అంటారు, మీ రేమంటారు ?

గురు : అది మానవజాతి ఆశ. అంతేకాని, అది లక్షణం కాదు. లక్షణ మంటే నెగ్గిన దంతా ధర్మం, నిలిచిన వాక్యమంతా కావ్యం కావలసి వస్తుంది. పైగా ధర్మంకోసం ఎందరో ఆహుతి అవుతున్నారు. ఎన్నో మహాకవుల కావ్యాలు నామమాత్రావశిష్టాలు.

మా : కావ్యప్రయోజన మేమిటి ?

గురు : అలంకారికులు ఏవేవో చెప్పుకున్నారు. ఒకటితప్ప తక్కినవన్నీ సందిగ్ధాలు, నైకాంతికాలు. ఆ ఒక్కటీ 'సద్యఃపరనిర్వృతి'.

ఈవిధంగా, రచయిత కవిత్వం, ధర్మం, రాజకీయం, కావ్యప్రయోజనం—వీటి నిర్వచనాలను ప్రసన్న గంభీరంగా చెప్పటమే కాక, కావ్యప్రయోజనాలలో 'సద్యఃపరనిర్వృతి' కి మకుటం పెట్టారు.

నేడు విద్యాప్రమాణాలు పడిపోతున్నాయి. మంత్రులు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, అందరూ దీనికి బాధ్యత వహించవలసినవారే. విద్యార్థులు, తమ లక్ష్యాన్ని విస్మరించి రాజకీయ నాయకుల చేతులలో కీలుబొమ్మలై వారెట్లాడిస్తే అట్లాడుతున్నారు. విద్య యందు భక్తిశ్రద్ధలు సన్నగిలిపోతున్నాయి. విజ్ఞానాన్ని త్రోసి రాజని సర్టిఫికెట్టుకి పట్టం కట్టుతున్నారు. ఆ యోగ్యతాపత్రాన్ని సంపాదించటానికి విద్యార్థులు ఎన్ని త్రోవలైనా త్రొక్కుతున్నారు. అధికారులు, తల్లిదండ్రులు దీనిని ఆమోదిస్తున్నారు; ప్రోత్సహిస్తున్నారు. దేశభవిష్యత్తు ఏమైపోతుందో అన్న ఆవేదనకూడ లేదు ఎవరికి. ఈ పరిస్థితిని చూచి రచయిత హృదయం వేదనావ్యథితం అయింది. పాఠకుల మనస్సులలో ఆలోచనా తరంగాలను ఉద్బుద్ధం చేయటానికై ఆయన ఒక సంఘటనను ఎన్నుకొన్నారు. ఈ సంఘటనే తరువాత గురుమూర్తి సస్పెన్షన్‌కి హేతువు అయింది.

సీతారామయ్య మాధవరావు ఇంటికి వస్తాడు. ఒక పిల్లవాని పరీక్ష నంబరు ఇచ్చి, 'దీనిని మంత్రిగారు పంపారు; మీ మాటను గురుమూర్తిగారు కాదనరు; గురుమూర్తిగారివద్ద పేపర్లు ఉన్నవి; వారితో చెప్పి మార్కులు వేయించండి; కాకపోతే, బ్రతుకుతెరవే పోతుంది' అని హెచ్చరించి వెళ్ళిపోతాడు. వెంటనే మాధవరావు మనఃఫలకంపై ఒక భయానకదృశ్యం నర్తించసాగింది. ఆ దృశ్యాన్ని ఇలా చిత్రించారు రచయిత.

> "వెంటనే అతని కన్నులకు ఆనకట్టలు కొట్టుకొనిపోవడం, వంతెనలు కూలడం, రోడ్లు బదాబదలు అవడం, గనులు ప్రేలడం, పరిపాలన అస్తవ్యస్తం కావడం, చదువుసంధ్యలు మాసిపోవడం, నీతినియమాలు అంతరించడం భయంకర రూపంలో ప్రత్యక్షమయ్యాయి. మహాప్రవాహంలో బ్రతుకు చుక్కాని లేని పడవలాగ కొట్టుకొనిపోతున్నది."

ఎంతటి బీభత్సదర్శనము! ఇలా ఆలోచించి దర్శించగలిగినవారుంటే, దేశంలో విద్యాప్రమాణాలు నేడు ఇంత దిగజారిపోయి ఉండేవికావు. రోజుకుఒక రైలుప్రమాదం జరుగుతుండేదికాదు.

కోట్లాది రూపాయల ధనం వెచ్చించి కట్టిన డాములు బీటలువేసిపోయేవి గావు. కార్యదక్షత ఇంత నశించి యుండేది కాదు. నీతినియమాలు ఇంత అంతరించిపోయేవి కావు. అందువల్లనే మనవారు విద్యాలయాలను పవిత్ర దేవాలయాలుగ భావించాలని, పవిత్రభావనతో ఆదరించాలని ఆదేశించారు, అలా కానినాడు, ఈ విద్యాలయాలనుండి దిగుమతి అయ్యే విద్యార్థులే అన్యాయాలకు, అత్యాచారాలకు దిగుతారు. పాలనావ్యవస్థ అవినీతికి నిలయ మైపోతుంది. అన్ని విలువలు, ప్రమాణాలు అంతరించి పోతాయి. శాంతిభద్రతలు లుప్తమై ఒక అవ్యవస్థ సమాజాన్ని అంతట ఆవరిస్తుంది. ఈ విషయాలను కళ్ళకు కట్టేటట్లుగ చిత్రించారు రచయిత. మాధవరావు వలె ఆలోచింపగల వివేకశీలురు కావాలని అన్యాపదేశంగా ఉద్బోధించారు.

డా॥ జి. వి. కె. కర్తవ్యశూరులు. కర్తవ్యపాలనంలో ఎన్ని ఇబ్బందులు ఎదురయినా, వాటిని ఎదుర్కొనటం మనుష్యధర్మ మని భావించినవారు ఆయన. అన్యాయాలను చూచి బెదరి పారిపోవటం, సంన్యాసాన్ని స్వీకరించటం అనుచిత మని భావించేవారు. అయితే వైరాగ్యం, సంన్యాసం అంటె ఆయనకు ఆదరం లేదని భావించరాదు.

"న సంసారస్య నిర్వాణాత్ కించిదస్తి విశేషణం
న నిర్వాణస్య సంసారాత్ కించిదస్తి విశేషమ్ ।
నిర్వాణస్య చ యా కోటిః కోటిః సంసారస్య చ
న తయో రంతరం కించిత్ సుసూక్ష్మ మపి విద్యతే॥"

— మూలమాధ్యమిక కారికలు

సంసారం కంటె నిర్వాణం విశేషమైనది అని గాని, నిర్వాణం కంటె సంసారం విలక్షణ మయినది అనిగాని తలచరాదు. నిర్వాణం ఏ కోటికి—స్థాయికి—చెందినదో సంసారం కూడ అదే శ్రేణికి చెందినది. వీటిలో ఒకదానిని అల్ప మనిగాని, వేరొకదానిని అనల్ప మనిగాని, భావించరాదు. ఆ రెంటికి సూక్ష్మ మయిన అంతరం కూడ లేదు. ఈవిధంగా సంసారంలో ఉండే నిర్వాణసుఖాన్ని అనుభవించాలి' అనే మాధ్యమికవాదాన్ని అభిమానించినవారు జి. వి. కె.

గురుమూర్తిని సస్పెండ్ చేశారని విద్యార్థులు సమ్మె చేద్దా మనుకొంటారు. మాధవరావు ధర్మారావులు ఆ సమ్మెను ఆపే ప్రయత్నంలో ఉంటారు. గురుమూర్తి 'తన మూలంగా మాధవరావుకి చిక్కులు కలిగాయని, తాను రాజీనామా చేసి సంన్యాసం పుచ్చుకుంటె చిక్కులు అన్నీ తీరిపోతాయి' అని తలస్తాడు. తన అభిప్రాయాన్ని మాధవరావు ముందు వ్యక్తం

చేస్తాడు. అప్పుడు మాధవరావు హేతుబద్ధంగా, యుక్తిసహంగా మాట్లాడిన తీరు పాఠకుల మనస్సులో ఆలోచనలను ఉద్దీప్తం చేస్తుంది.

> "మాస్టారూ! ఎవరి కర్మ వారనుభవించాలన్నారు. ఎవరూ కాదనరు. కాని, మంచిపని ఒకటి చేసి, దానికి చెడు అనుభవించటంలో అర్థం లేదు. మానవ ప్రయత్న మనేది ఉన్నది. ఒక కుటీరం ముట్టుకొన్న దనుకోండి....కారణాలకు మూలం పూర్వజన్మ కర్మమో, ఇహజన్మకర్మమో కావచ్చును. ఇది కాదనను. కాని తగలబడుతున్న కుటీరం కాపాడుకోవటం ధర్మం. కాబట్టి ప్రత్యక్షకారణ మైన అగ్నిని ఆర్ప యత్నించాలి. ఆరిందా మంచిదే; ఆరకపోతే విచారపడ నవసరంలేదు....మీ దుఃస్థితికి అధికారుల అన్యాయం ప్రత్యక్షకారణం. దీనిని పరిహరించటం కర్తవ్యం. దీనికోసమే విద్యార్థులు తారసిల్లుతున్నారు........ ప్రత్యక్షకారణం వాళ్లు గుర్తించారు. సంసారనిస్సారతను గ్రహించిన మీరు అదికూడా గమనించరేదేమో ననిపిస్తుంది....పోతే, సంన్యాస మంటున్నారు... నాటి తపోవనాలు నేడులేవు. నాటి కాయగసరులు నేడు అయాచితంగా అప్రయత్నంగా లభించవు. నేటి సంన్యాసి స్థితి ఎలా ఉన్నది? గృహస్థుల ఇండ్లకు భిక్షకు పోవాలి.....ఈ స్థితిలో సంన్యాసం ఎలా నిర్విఘ్నంగా సాగుతుంది ? ఏ భిక్షతో అవసరం లేనివారు - అంటే ఆకలిదప్పులు లేనివారు - సంన్యాసు లయితే తప్పు లేదు. వారు నిజంగా పూజ్యులు.........సంన్యాస మంటే కేవల కాషాయవస్త్రధారణ కాదను కొంటాను. ప్రతిఫలాపేక్ష వదలి జీవయాత్ర సాగించటం సంన్యాస మేమో ననిపిస్తున్నది. కాషాయవస్త్రం కట్టి సాధించేది వ్యవహారరంగంలో ఉండే సాధించవచ్చు నంటాను. ఇంతకాలం మీరుసాధిస్తూ వచ్చింది అదే నని నా భావన. దయచేసి మీ తలపు మానుకోవాలి.కాదంటారా నా తప్పుచూపి, నన్ను కూడ ఒప్పించండి. నేనూ మీవెంట వస్తాను."

ఈ విధంగా రచయితకు జీవితం పట్ల ఒక విలక్షణ మయిన దృక్పథం ఉంది. మాధవరావు చేత జీవితకర్తవ్యాన్ని గురించి, సంన్యాస తాత్పర్యాన్ని గూర్చి చేయించిన వ్యాఖ్యానం కర్తవ్యవిముఖుడైన అర్జునుడికి భగవానుడు చేసిన గీతోపదేశం లాగా సాగుతుంది. గురుమూర్తి సంన్యాసవిరతుడు అవుతాడు. 'సంసారం కంటె నిర్వాణం మిన్న' అని కార్యకారణ పురస్సరంగా గురుమూర్తి నిరూపించ గలిగితే, మాధవరావు తాను కూడ సంన్యాసాన్ని

స్వీకరించటానికి సిద్ధమే అని అంటాడు. ఈవిధంగా మాధవరావు కర్తవ్యనిష్ఠ, నిర్లిప్తత, వీతరాగిత్వం వ్యంజిత మయి, పాఠకుల హృదయాలు మాధవరావు పట్ల శ్రద్ధాపరిప్లుతాలు అవుతాయి. జి. వి. కె. భావించిన జీవితదర్శనం ఇది.

ఒక సంఘటన, లేక సంభాషణ, కాక, వ్యాఖ్యానాత్మక వివరణం ద్వారా తాను భావించిన జీవితాన్ని, లేక తాను దర్శించిన స్థితిని, చమత్కారంతో, సున్నితమైన వ్యంగ్యవచో వైభవంతో చిత్రిస్తారు ఈ రచయిత. పాఠకులకు వివేకోదయాన్ని కలిగించి కళ్ళు తెరిపిస్తారు. నేటి రాజ్యం విశృంఖలం. దానిని శాసించగల ధర్మం గాని, న్యాయం గాని, పాపపుణ్యాల వివేకం గాని, నేడు లుప్తం అయినాయి. ఈ పరిస్థితిని చూచి రచయిత హృదయం వేదనా విశ్లథం అవుతుంది. ప్రస్తుతదేశపరిస్థితిని మాధవరావు చేత ప్రతిభాస్ఫోరకంగా ఎలా వ్యాఖ్యానింపజేశారో పరిశీలించండి.

> "రాజకీయాలు అధికారసంపాదనసాధనా లయ్యాయి. అధికార దాహంతో మానవుడు అన్ని విలువలను పోగొట్టుకొంటున్నాడు, దేనిలోను వానికి విశ్వాసం లేకుండా పోయింది. వివేకం అంతరించిపోయింది. ప్రజాభిప్రాయమైనా రాజ్యాన్ని శాసిస్తున్నదా అంటె అదీ లేదు. రాజ్యాంగాన్ని సైతం యథేచ్ఛగా మార్చగలుగుతున్నది ప్రభుత్వం. ధర్మం, పుణ్యం-ఈ భావాలు ఏనాడో అంతరించిపోయాయి. ఈ 'రెండుకాళ్ళజంతువు' కి అధర్మశాసనాన్ని ఎదిరించగల 'మగసిరి' లేదు. రాజ్యం, అధికారం మనిషి తలపైకి ఎక్కి స్వారీచేస్తున్నాయి. ఈ స్థితిలో ఎవడికొంపలో వాడు ప్రశాంతంగా నిద్రపోయే స్థితి లేదు."
> (చూ. 317, 318 పే.)

డా॥ జి. వి. కె. సర్వతోముఖప్రతిభ గల రచయిత. ఆయన సిగ్మండ్ ఫ్రాయిడ్ చేసిన మనస్తత్త్వ విశ్లేషణను లోతులకు పోయి అధ్యయనం చేసినారు. ఇటు భారతీయధ్వని సంప్రదాయాన్ని కూడ కూలంకషంగా పరిశీలించిన మనీషి. 'ఫ్రాయిడ్ ప్రతిపాదించిన స్వాప్న శిల్పం, ఆనందవర్ధనుడి ధ్వనిసంప్రదాయం' రెండూ ఒకటే అని ప్రతిపాదించిన ప్రతిభాశాలి. ఫ్రాయిడ్ మతానుసారం మానవుని అచేతనం (unconscious) లో దాంతమైన వాంఛయే స్వప్నం. స్వప్నభావా లన్నీ ఆత్మాశ్రితాలు. స్వాపి స్వప్నానికి నాయకుడు. కలలో కనిపించే వ్యక్తులలో స్వాపి లేనపుడు ఆ కనిపించే వ్యక్తులలోనే ఎవనిమాటుననో ఒకని మాటున అతడు దాగిఉంటాడు. తీరని కోర్కెలను పురస్కరించుకొని బయలుదేరే

దృశ్యాలను బహిర్గతం కాకుండా తైజసం (preconscious) నిరోధిస్తుంటుంది. దానికి లోబడి దృశ్యాలు క్లుప్తీకరణం, వ్యత్యయీకరణం, మిలితీకరణం, విపర్యయీకరణం, సంకేతీకరణం పొంది స్వప్నరూపంలో బహిర్గత మౌతాయి. ప్రతి స్వప్నానికి రెండర్థాలుంటాయి - అభివ్యక్తార్థం, అంతరార్థం.

అలాగే ధ్వనివిషయం గూడ.

"అపారే కావ్యసంసారే కవి రేవ ప్రజాపతిః ।
యథాస్మైz రోచతే విశ్వం తథేవం పరివర్తతే॥"

అని ధ్వన్యాలోకకర్త వచనం. స్వాపియే స్వప్నానికి నాయకుడైనట్లు, అపారమైన కావ్యప్రపంచానికి కవియే సృష్టికర్త. అతడికి ఇష్టమైన తీరులో ఈ విశ్వాన్ని పరివర్తితం చేస్తాడు.

స్వప్నానికి రెండర్థాలు ఉన్నట్లు, శబ్దానికి రెండర్థా లుంటాయి - వాచ్యార్థం, వ్యంగ్యార్థం. స్వాపియొక్క జీవితాదిప్రకరణం తెలిసినవాడే అభివ్యక్త స్వప్నంలోని అంతరార్థాన్ని తెలుసుకోగలుగుతాడు. వాచ్యార్థం గ్రహించినంతమాత్రాన కావ్యార్థం అర్థం కాదు. ప్రకరణాదికం ఊహించగలిగిన సహృదయునకే కావ్యార్థం అవగతం అవుతుంది. స్వపార్థాల క్లుప్తీకరణాదులకు తైజసశాసనం ఎలా కారణమో, కావ్యంలోని ధ్వనికి ఔచిత్యం అలా కారణం. తైజసం లేని స్వప్నం భగ్నమైనట్లు ఔచిత్యం లేకపోతే కావ్యమే ఉండదు. (చూ. స్వప్న శిల్పము-ధ్వని-నవతోరణం)

రచయిత ఫ్రాయిడ్ స్వప్నశిల్పానికి, భారతీయుల ధ్వనిశిల్పానికీ ఉన్న సామ్యాన్ని బాగా అవగాహనం చేసుకొని, స్వప్నశిల్పం ద్వారా ఉద్దిష్టార్థాన్ని ఎలా ధ్వనింపచేశారో గమనించండి.

నరసయ్య గురుమూర్తి వలన సాయం అపేక్షించి వెళ్లుతాడు. కాని, నిరాశోపహతుడై ఇంటికి తిరిగివస్తాడు. ఇంట్లో కరెంటు దీపాలు పోయాయి. ఇంట్లోనుండి మాటలు ఇలా వినిపిస్తాయి.

ఇందూ, ఇందూ !

అమ్మా

నేనేరా బాబూ! నేనే ఎందుకు వణికి పోతున్నావు? జ్వరం వచ్చిందా? ఏదీ చూడనీ......

ఊహుఁ

మా బాబుగా కాసిని తాగు. పక్కమీద పోసుకునేవు. ఇంకాసిని.

చాలే, లైటేది ?

కరెంటు పోయింది. నేనిక్కడే ఉన్నాగా, ఇంకా భయం దేనికి ?

నీ చేయి తడిగా ఉన్నదే. స్నానంచేసి వస్తున్నావా ?

అంత గావుకేక పెట్టావు దేనికిరా ?

అమ్మా, అమ్మా.

అబ్బా ఉండరా, ఇంత గట్టిగా మెడపట్టుకుంటే ఊపిరాడొద్దూ ?

లైటు వేయమ్మా.

కరెంటు పోయిందని చెబితిసిగా, ఎందు కంతభయం ? నేను దగ్గరే ఉన్నాగా ?

మరే, మరే ఎవడో దొంగ వచ్చాడమ్మా.

"మనయింట్లో ఏముందని దొంగ వస్తాడురా? వట్టి కలవరింత కాని."

"వట్టిది కాదమ్మా. నేను చూచాను. చిన్న బలుబు వెలుగుతున్నది. ఎవడో నల్లగా బడితెలాగా ఎంత ఎత్తున ఉన్నాడని! నిజంగా చూచానమ్మా. ఆ ఎదురు గోడవద్ద గొంతుపిసుకుతుంటె నువ్వు మూలుగుతున్నావు. భయంపుట్టి కేక పెట్టాను. అంతలోనే లైటు పోయింది."

"మరి నేను బ్రతికి ఉన్నానే ? పిచ్చి తండ్రీ! ఏమో పీడకల వచ్చి ఉంటుంది."

"కల కాదు. ఈ కళ్ళతో చూచానే."

"కలలో గూడ అంతే. నిజంగా కళ్ళముందు జరుగుతున్నట్టుగానే ఉంటుంది, బాబు. దొంగ రాలేదు, దొర రాలేదు. పక్కకు తిరిగి కళ్లు మూసుకొని పండుకో."

"నువ్వుగూడ ఇక్కడే పండుకోవాలి."

"బయటి తలుపువేయలేదు. వేసివస్తా......"

ఇంతలో నరసయ్య తలుపును కిర్రుమని చప్పుడు చేస్తూ లోపలికి వస్తాడు. దీనికి పూర్వం రచయిత బాహ్యవాతావరణాన్ని ఇలా చిత్రిస్తాడు.

"నియంతృకరాజ్యంలోని ప్రభుత్వాధికారం లాగా వ్యక్తిత్వాలను రూపుమాపుతూ కారు చీకటి వర్షిస్తున్నది. అధికారం మెట్టిన పార్టీ ఛోటానాయకులవలె దీప స్తంభాలు అనుచరులకు కాంతులు పంచుతున్నవి. ఔత్తరాహ ఔద్ధత్యం అసంవృతులను పీడిస్తున్నది. ఆకాశంలోని చుక్కలు ఔన్నత్యం ఆసరా చూచుకొని ఏకాంతసంచారులకు కన్నుగొడుతున్నవి."

ఈ విధంగా పూర్వరంగాన్ని స్థాపించి స్వప్నం కాని స్వప్నాన్ని మహాప్రతిభతో రామణీయకంగా చిత్రించి రాజ్యం కృష్ణమూర్తుల రహస్యసమాగమాన్ని మనోజ్ఞంగా ధ్వనింపచేశారు. 'రాజ్యం చేతులు తడిగా ఉండటం, గొంతు పిసకటం, మూలగటం, చిన్న లైటు ఆరిపోవటం, నువ్వుకూడ ఇక్కడే పండుకోవాలి అనడం' — వీటిద్వారా రచయిత వ్యంజితం చేయదలచిన అర్థం ధ్వనితం అవుతున్నది. ఇది రచయితకు గల రచనానైపుణికి నికషోపలం. ఇంతేగాక, తరువాత రాజ్యం నరసయ్యల మధ్య జరిగిన సంభాషణలోని కొన్ని వాక్యాలు ఇవి —

రా　కళ్ళూ, కాళ్ళు పీకుతున్నాయి. పోయి పండుకొంటున్నా

నర :　మేలుకొమ్మని యేడ్చిం దెవరు ?

రా :　ఇంకా దేనికి లేండి.

ఈ మాటలలోనుంచి తొంగిచూస్తున్న వ్యంగ్యం పాఠకుల ఊహకు వదలివేయడం ఉచితము.

ఇక్కడ ఒక విశేషం మనం గమనించాలి. ఉత్తమ ప్రకృతికమైన శృంగార రసమే వర్ణనీయం గాని, అధమప్రకృతిక శృంగారం వర్ణితమై వ్యంజితం కారాదు. రాజ్యం కృష్ణమూర్తుల దుశ్శీలాన్ని అభివ్యక్తం చేయటానికి ఈ సంఘటనను ఎన్నుకున్నారు రచయిత. అవర్ణనీయాన్ని వర్ణించారు. ఉద్దిష్టార్థం నెరవేరింది. అశ్లీలాన్ని, జుగుప్సను పరిహరించటానికై రచయిత స్వప్నశిల్పాన్ని ఆలంబనంగా చేసుకున్నారు. అంతవరకు బాగానే ఉంది. రాజ్యం నరసయ్యల మధ్య జరిగిన రెండు మాటలు అనౌచిత్యవిరహితాలా ? అంటే, కావే ! అయితే, ఔచితీమర్యాదను ఇటు జీవితంలోను, అటు రచనారంగంలోను అక్షరాలా పాటించే జి. వి. కె. ఈ మాటలను ఎందుకు అనిపించారు ? అంటే, ఈ అనౌచిత్యంలో కూడ ఒక ఔచిత్యం ఉంది; ఒక ధ్వని ఉంది. వర్ణితమైన శృంగారం 'రసాభాసం' అనీ, అది శుద్ధరసం కాదని, అది ఆస్వాద్యం, అభిలషణీయం కాదని ధ్వనింపచేయటానికే ఆ మాట లనిపించారు రచయిత.

"తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః" (కావ్యప్రకాశ)

('తదాభాసాః = రసాభాసాః, భావాభాసాః')

ఆలంబనవిభావ, అనుభావాది దృష్టితో స్థాయీభావం అనుచితం అయినప్పుడు, అనగా, సామాజిక వ్యవస్థకు, ధార్మిక వ్యవస్థకు విఘాతం కలిగించేది అయినప్పుడు లోకమర్యాదను అతిక్రమించినప్పుడు రసనిరూపణం ఎంత చక్కగా జరిగినా, అది 'రసాభాసం' అవుతుందే కాని, రసదశను పొందజాలదని భావం. ఇట్టి అలంకార శాస్త్రమర్యాదను ధ్వనింపచేయటానికే రచయిత అనౌచిత్యసంవలితమైన ఔచిత్యంలో ఆమాటలు అనిపించారు. ఒక వాస్తవిక సంఘటనను స్వప్నమా ? అన్నట్లు భ్రాంతిని కలుగచేయడంలోనే ఉంది జి. వి. కె. చాకచక్యం.

ఈవిధంగా రచయిత ఫ్రాయిడ్ మనస్తత్వవిశ్లేషణాన్ని ఆలంబనంగా చేసుకొని, ఈ నవలలో పిల్లల శీలస్వభావాదులను చిత్రించారు. ఈ నవలలో ధనుంజయుడు, ఇందుశేఖరం మున్నైన పిల్లల మనస్తత్వం విచిత్రంగా ఉంటుంది. కొంత గడుగ్గాయిలుగా చురుకుపాలు కొంచెం ఎక్కువ మోతాదులో కలవాళ్ళుగా ఉంటారు. వాళ్ళల్లో తెలివితేటలు కొట్టవచ్చినట్లుగా కనిపిస్తాయి. దాంత వాంఛలను ఆ విధంగా బహిర్గతం చేయటానికి అవకాశం ఇస్తే వాళ్ళ భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందని రచయిత ఉద్దేశ్యం కావచ్చు.

ధనుంజయుడిలో ఉన్న చురుకుదనం, మాటకారితనం, చిలిపిచేష్టలు వయసుకి మించినవిగా అనిపిస్తాయి. వాడిలో అన్యాయాన్ని ఎదిరించాలన్న తపన ఎక్కువగా కానవస్తుంది. ఇంతటి వాగుడుకాయ అయినా, మాధవరావు ముందు, వాడు వినీతుడు. మాధవరావు శ్రేయస్సును కోరేవాడు. శారద దగ్గర అతడు గారాబు తమ్ముడు. వారిద్దరి మధ్య ఉన్న అనుబంధం అనిర్వచనీయం. వాళ్ళిద్దరు ఏ తల్లిదండ్రుల సంతానమో! ఎవరికీ తెలియదు. ఏకగర్భజనితులైనవారిలో గూడ తాదృశమైన అనురాగాన్ని, అనుబంధాన్ని చూడలేము. ధనుంజయుడు పాఠకులకు ఒక 'రిలీఫ్'. వాడే లేకపోతే, సమస్యాతోరణాలతో గిజిగానిగూడు లాగా అల్లుకొనిపోతున్న ఇతివృత్తం పాఠకుల హృదయాన్ని ఊపిరాడనీయకుండా చేసివేస్తుంది.

అలాగే ఇందుశేఖరాన్ని గూడ తీసుకోవచ్చు. వాడు రాజ్యం నరసయ్యల సంతానం. నరసయ్యకోసం కృష్ణమూర్తి వస్తాడు. వాడు కృష్ణమూర్తితో మాట్లాడిన తీరు, వాడిలో ఉన్న ధైర్యం, ఎదుటివాని ముఖం చూచి స్వభావాన్ని గుర్తించగల నేర్పు, వాక్చాతుర్యం; కార్య

కారణజ్ఞానం చూచి మనకు ఆశ్చర్యం కలుగుతుంది. నరసయ్య దెబ్బలు తిని హాస్పటల్‌లో ఉన్నప్పుడు, ఒకరోజు సంజవేళ పార్కులో ఒక బల్లమీద కూర్చుని జేబులో నుంచి ఒక్కొక్క గోలీ తీసి చెరువులోకి గిరాటు పెట్టుతుంటాడు. కళావిహీనంగా దిగులుగా ఉన్న వాడి ముఖాన్ని చూచి ఓదార్చబోతాడు మాధవరావు. అప్పుడు వాడు మాధవరావుతో మాట్లాడిన తీరు, వాడి వెటకారం, వాడి ఆరిందాతనం చూస్తే, ఒకవైపు ఆశ్చర్యం, మరొకవైపు కరుణ మనకు కలుగుతాయి. ఆడుతూ, పాడుతూ, చీకూ చింతా లేక తిరుగుతుండవలసిన సమయంలో వాడు అలా దిగులుగా, నిరాశతో, ఉన్నాడంటే, పరిస్థితులు ఆ లేతహృదయాన్ని ఎంతగా గాయపరచినాయో అర్థమౌతుంది. తండ్రివలన లభించిన ఆప్యాయత, వాడు తల్లి దగ్గర పొందలేక పోతున్నట్లు కూడ అనిపిస్తుంది. రాజ్యం వాడిని 'ఇందు' అని పిలుస్తుందట; నరసయ్య 'శేఖర్' అని పిలుస్తాడట. 'నాపేరు శేఖర్. అంతే కాని, ఇందూ కాదు, మందూ కాదు' అని వాడు మాధవరావుతో అంటాడు. తల్లిపిలుపు చల్లనిపిలుపు గదా! అలాంటి వాడికి తల్లిపిలుపు అంత వెగటై పోయిందేమిటి ? తల్లి ప్రవర్తన, తండ్రి దుస్థితి వాడి పసిహృదయాన్ని కలత పెడుతుండవచ్చు. ఇలాంటి ఆలోచనలు పాఠకులలో కలుగుతాయి.

రాజ్యం బాల్యం అతి విచిత్రంగా గడిచింది. రాజ్యం తండ్రి రామచంద్రయ్య జిల్లా బోర్డులో విద్యాశాఖా కార్యదర్శి. అతడికి ఆరుగురు సంతానం. రాజ్యం నాల్గవ ఆడపిల్ల. ఆ యింట్లో ఏ గోల చేసినా ఆడపిల్లలే. వాళ్ళమధ్య, ఈర్ష్యలు, పట్టింపులు మెండు. అందులో రాజ్యం ఇల్లు పీకి పందిరి వేసేది. కమల రాజ్యం తోబుట్టువు. ఒకనాడు కొంచెం మంచిరిబ్బన్ పెట్టుకున్నది కమల. అంతే. రాజ్యం చేతిలోని కత్తెర కమలజడ మీద ఆడింది. నిత్యం ఆమె చేసే ఆగడాలకు అంతు లేదు. తల్లి కామాక్షమ్మ రాజ్యంతో విసిగి వేసారిపోయింది. రాజ్యానికి అది ఒక మానసికవ్యాధి అని రామచంద్రయ్య చెప్పేదాకా కామాక్షమ్మకు తెలియదు. తరువాత రామచంద్రయ్య రాజ్యాన్ని దేశమంతా నాలుగు నెలలు త్రిప్పి చూపించి తీసుకువస్తాడు. తరువాత రాజ్యం స్వభావంలో పెద్ద పరివర్తనం వచ్చింది. ఎవ్వరు ఏమన్నా సహించి ఊరుకుంది. ఆ ఉడుకుమోతుతనం అంతా పోయింది. తరువాతనే నరసయ్యతో ఆమె వివాహ మయింది.

రాజ్యం బాల్యంలోని స్వభావచిత్రణం అలా చేసి ఒక పరిష్కారం చూపడంలో మనస్తత్త్వ విశ్లేషణప్రభావం రచయితపై ఎక్కువగా కానవస్తుంది. అందరికన్న మిన్నగా ఉండాలనే ఒక ఉత్కటవాంఛ ఆమెలో ఉంది. పరిస్థితుల ప్రభావం వల్ల వాంఛాపూర్తికి

అవకాశం కలగలేదు. ఆ వాంఛ వికృతరూపాన్ని ధరించి, ఈర్ష్యగా, అసూయగా, ఓర్వలేని తనంగా, పరపీడనశీలంగా అభివ్యక్తం అయింది. రామచంద్రయ్య, దేశంలోని సుందర దృశ్యాలను చూపి ఆమెలో మానసిక పరివర్తనం తెచ్చాడు. అట్టి రాజ్యానికి నరసయ్యతో వివాహం అవుతుంది. కుటుంబజీవితంలో ఆమెకు సుఖం లభించలేదు. కడుపునిండా తిండికి ఒంటినిండా బట్టకు ఆమె నోచుకోనలేదు. నరసయ్య దెబ్బలు తిని పడిఉన్నపుడు కృష్ణమూర్తి ఆ సంసారాన్ని ఆదుకోబోతున్నా డని భ్రమపడ్డది ఆమె చేతనమనస్సు. ఈ అవకాశాన్ని చూచుకుని అచేతనంలో దాగి ఉన్న వాంఛ బుసలు కొట్టుతూ లేచింది. అందుకనే కష్ణమూర్తి పశువాంఛకు లొంగిపోయి ఉంటుంది. తన కొడుకును పెద్ద చదువులు చదివించి, పెద్ద ఉద్యోగాలు చేయించా లని ఆకాశసౌధాలు కట్టుతుంది. దీనికి విఘాతం వస్తే, రాజ్యం తిరిగి తన బాల్యంలోకి పోవచ్చు; కృష్ణమూర్తికి ప్రాణసంకటం కావచ్చు 'ఎంతకాలం ఈ ఆట ఆడ తాడో అది త్వరలోనే తేలుతుందిగా' అని కృష్ణమూర్తిని గూర్చి రాజ్యం నరసయ్యతో అంటుంది. ఈ మాటను బట్టి ఆమె మనస్సు మరల బాల్యంలోకి ప్రవేశించి కృష్ణమూర్తిని చికాకుపరచవచ్చు నని స్ఫురిస్తుంది.

ఇందులో అనుబంధకథలుగా రెండు కుటుంబాల చరిత్ర లున్నాయి. ఒకటి అయ్యన్న శాస్త్రిగారి కుటుంబచరిత్ర, రెండవది బసవయ్యగారి కుటుంబ కథ. ఈ రెండు కథలు కథా శిల్పం దృష్టితో చూస్తే మనోజ్ఞంగా సాగా యనిపిస్తుంది. అయితే, అయ్యన్నశాస్త్రిగారు, బస వయ్యగారు మధ్యలోనే మృత్యువు ఒడిలో విశ్రాంతి తీసుకుంటారు. అయినప్పుడు రచయిత ఆ వ్యక్తులను అంత ఉదాత్తంగా ఎందుకు చిత్రించినట్లు? వారి వ్యక్తిత్వచిత్రణం ప్రధాన ఇతివృత్తానికి ఎంతవరకు ఉపయోగిస్తుంది? అందుకనే, రచయిత అయ్యన్నశాస్త్రిగారి పశ్యంతిని, బసవయ్యగారి మనుమడైన డాక్టర్ ప్రసాదును వారికి, వారి సంస్కారాలకు ప్రతీకలుగా నిలుపుతారు. వీళ్ళిద్దరి భావిజీవితంలో పరంపరాగత మయిన వ్యక్తిత్వాలను, నిలుపుకొనేవారో, ప్రవాహపు సుడిగుండాలలో పడి కొట్టుకొని పోయేవారో ఆ రచయితకే తెలియాలి. వాళ్ళ జీవితాలు ఎలా రూపు దిద్దుకొన బోతున్నాయో, వాటి ఛాయలు మసక మసకగా ఇప్పుడిప్పుడే ఆరంభమయ్యాయి.

అయ్యన్నశాస్త్రిగారు వేదాధ్యయనం, వ్యాకరణశాస్త్రం అధ్యయనం చేసిన మహాపండి తుడు. వైదికధర్మానుష్ఠాత. 'ధర్మం తాత్కాలికం కాదని, ఫలంతో నిమిత్తం లేదని, ధర్మానుష్ఠానమే తన కర్తవ్య' మని భావించిన విశ్వాసి. అందుకే ఇంగ్లీషు చదువుతున్నా డని

తన తమ్ముడు నరసింహం ముఖాన్ని చూడటానికి కూడా ఇష్టపడనివాడు. హరిజనుడికి వ్యాకరణశాస్త్రం బోధించ నని, అధ్యాపకవృత్తికి రాజీనామా యిచ్చిన అమాయకుడు. యాయవారం ఎత్తుటకు సిద్ధపడ్డాడు. లోకధర్మం, జీవితమూల్యం గుర్తించని వ్యక్తి. పశ్యంతి పార్వతమ్మ అయ్యన్నశాస్త్రిగార్ల ఏకైక పుత్రిక. నాలుగేళ్ళవరకు అ, ఇ, ఉ లు తప్ప మాటలు రాని పిల్ల. చూస్తూ కూర్చుండేది. అందుకే, వ్యాకరణశాస్త్రపండితుడైన శాస్త్రిగారు 'పశ్యంతి' అని పిలిచేవారు. ఏకభుక్తాలతో కాలం గడుపుతున్నా, ధర్మం, న్యాయం, పట్టుదల వీడని దృఢప్రతిజ్ఞుడు శాస్త్రిగారు.

పశ్యంతి ఊహలు, ఆలోచనలు లేని బాలిక కాదు. డాక్టరు ప్రసాదు సూచనమేరకు పశ్యంతిని ముందు కూర్చుండబెట్టుకొని విద్యార్థులకు వేదం చెప్ప నారంభించారు శాస్త్రిగారు. కొన్నాళ్ళకు 'పశ్యంతీ' వాక్కు 'మధ్యమా' 'వైఖరీ' రూపం దాల్చి పశ్యంతి మాట్లాడ సాగింది. అయ్యన్నశాస్త్రిగారి వాక్కు దారుణాఖండలశస్త్రతుల్యం; మనస్సు నవ్యనవనీత సదృశం. అయితే, తాను నమ్మిన ధర్మం విషయంలో కొంచెం ఇంచుమించు అయినా, రాజీ అంటూ లేదు. అందుచేతనే ఏకభుక్తాలతో గడుపుతూ పక్షవాతగ్రస్తుడై కళ్ళుమూస్తారు శాస్త్రిగారు.

తరువాత నరసింహం పార్వతమ్మను, పశ్యంతిని తన యింటికి తీసుకొనివచ్చి పశ్యంతికి యింగ్లీషు చదువు చెప్పిస్తాడు. హైస్కూలులో శారద పశ్యంతికి సహాధ్యాయిని. పార్వతమ్మ, నరసింహం ఇద్దరు చనిపోతారు. 'పినతల్లి, తమ్ముళ్ళు ఇద్దరు, తాను, కుటుంబ భారం ఎలా ఈదుకు రావాలి? అన్నది పెద్ద సమస్య అయింది పశ్యంతికి. మాధవరావు సహాయంతో పశ్యంతి డా॥ ప్రసాదు హాస్పటల్‌లో 'నర్సు' గా చేరుతుంది. సంక్షిప్తంగా ఆ కుటుంబ కథ యిది.

రచయిత ఈ కథను ఉదాత్తంగా చిత్రించారు. ప్రాచీనశాస్త్రాలన్నా, నిర్లిప్తబుద్ధితో ధర్మాన్ని, న్యాయాన్ని పాలించేవారన్నా గొప్ప ఆదరం ఉంది జి. వి. కె. కి. అందుచేతనే అయ్యన్నశాస్త్రిగారి జీవితాన్ని అంత ఉదాత్తంగా, అంత ఆదర్శవంతంగా చిత్రించారు రచయిత. అయితే, 'దూరదృష్టి లేక, ఇట్టి ఆదర్శమూర్తులు జీవితాన్ని ఇక్కట్లపాలు చేసుకొంటున్నారు గదా' యని వారి మీద ఒక జాలి, కరుణ ఉంది. 'జీవితాన్ని ఉపేక్షించి, జీవితపు విలువను విస్మరించడం అనుచిత'మని భావించేవారు ఈయన. అయ్యన్నశాస్త్రిగారు పరంపరాగతమైన ధర్మానుష్ఠానం అన్న పేరుతో జీవితాన్ని ఉపేక్షించారని, కర్తవ్యాన్ని విస్మరించారని,

తత్ఫలితంగా శాస్త్రిగారి జీవితం ఏకభుక్తాలతో అలా పర్యవసన్న మయిందని వ్యంగ్య మర్యాదతో ధ్వనింపచేశారు,

ఇక, బసవయ్యగారి కుటుంబచరిత్ర పరిశీలిద్దాం.

బసవయ్యగారు భాష్యాంతవై యాకరణులు. పేరు మోసిన వైద్యులు. ఆయన చేసిన రోగనిదానాలు, చికిత్సావిధానాలు ఆ ప్రాంతంలో కట్టుకథలుగా చెప్పుకొనేవారు. ఆయన డబ్బు కోసం ఎన్నడు వైద్యం చేయలేదు. ఆయన తనవృత్తిలో స్వతంత్రుడు. తాను చెప్పిన పథ్యం చేయని రోగిని ఎంత ధనికుడయినా, ఎంత అధికారి అయినా తిరిగి తన గుమ్మం తొక్క నిచ్చేవాడు కాదు. నాడి చూచి క్రిందటి రోజు ఆ రోగి ఏమి తిన్నాడో చెప్పేవాడు. తాను వైద్యం చేస్తున్న రోగి ఇంజక్షను చేయించుకొన్నాడని తెలుసుకొని, వైద్యం మానివేశాడు. మళ్ళీ సంచికట్టు విప్పలేదు.

బసవయ్యగారి కుమారుడే మార్కండేయులు. మార్కండేయులు ఇంగ్లీషు చదివి వైద్య పట్టా పుచ్చుకొని చిన్న బస్తీలో ప్రాక్టీసు ప్రారంభిస్తాడు. తండ్రి నుంచి వచ్చిన ఆత్మాభి మానం, దయాదాక్షిణ్యాలు అతడు చంపుకోలేకపోయాడు. అందువల్ల వైద్యవృత్తిలో అంతగా రాణించలేకపోయాడు. ప్రసాదు మార్కండేయులు కొడుకు. తాత దగ్గర చిన్ననాడే నాడి చూచి రోగనిదానం చేయ్యడం నేర్చుకొన్నాడు. వైద్యపట్టా పుచ్చుకొని ఆ ఊళ్ళోనే ప్రాక్టీసు ప్రారంభించాడు. వైద్యవృత్తిలో తాతగారి ఆత్మాభిమానం,ఆత్మవిశ్వాసం, రోగనిదాననైపుణ్యం మున్నైన గుణాల నన్నిటిని ప్రసాద్ పుణికిపుచ్చుకున్నాడు. వైద్యంలో అతడు చూపే నేర్పు, రోగనిదానం బసవయ్యగారిని జ్ఞప్తికి తెస్తుంటాయి. అతడు సాహితీప్రియుడు. న్యాయం, ధర్మం తప్పి నడవడ మంటె అతడికి జుగుప్స. ఆయన కాంపౌండర్లు, నర్సులు న్యాయ బద్ధంగా, ధర్మోపేతంగా తమ కర్తవ్యాన్ని నిర్వర్తిస్తుంటారు. పశ్యంతి ప్రసాదు ఆస్పత్రిలో నర్సుగా పని చేస్తుంటుంది.

ఈ కథలో రచయితకు ఆయుర్వేద వైద్యవిధానంపై ఎంత మక్కువ ఉన్నదో ద్యోతక మవుతుంది. పారంపర్యంగ వస్తున్న నాడీజ్ఞానం, రోగనిదానం అంతరించాయి అనీ, ఇది పథ్యం, ఇది అపథ్యం అని నిర్ణయించగల వస్తుగుణజ్ఞానం లుప్తమైపోవడం వల్లనే నేటి వైద్యవిధానం ఇంత అధ్వాన్నంగా తయా రయిందనీ, వైద్యవృత్తికి ఆవశ్యక మయిన చిత్తశుద్ధి కానరావటం లేదనీ తన ఆవేదనను వ్యక్తం చేయటానికే రచయిత బసవయ్యగారి ఇతివృత్తాన్ని ఇంత మహోన్నతంగా చిత్రించారు.

ఈ రెండు కుటుంబాల గాథను పరిశీలించినప్పుడు, అయ్యన్నశాస్త్రి బసవయ్య గార్ల వ్యక్తిత్వచిత్రణం చేయటంలో రచయిత మనసులో మరొక భావం గూడ అంతర్వాహినిగ జాలువారుతున్నట్లు స్ఫురిస్తుంది. ఇద్దరూ వైయాకరణపండితులే. వైయాకరణపండితులకు సహజమైన కఠినవాక్కు కలవారే వారిద్దరు. వారిద్దరి హృదయాలు నవనీతసదృశాలే. ఇద్దరు ధర్మాభిరతిగలవారే. ఆ ధర్మసాధనకై వ్యవస్థీకరింపబడిన ఆచారవ్యవహారాలను, విధానాలను చిత్తశుద్ధితో ఆదరించి ఆచరించినవారే. అయితే, అయ్యన్నశాస్త్రిగారు ధర్మసాధనాన్ని ధర్మమని భావించి, దానితో తాదాత్మ్యం చెంది లోకాన్ని, జీవితాన్ని విస్మరించినవారు. ధర్మం త్రికాలాబాధ్యం. కాని, తదాచరణసాధనాలు దేశకాలాశ్రితాలు. మారుతున్న లోకంలో ధర్మాన్ని, న్యాయాన్ని విడనాడక జీవితం మనుగడకై సాధనాలను, విధానాలను మార్చుకొనవలసిన అవసరం ఉంది. క్రొత్త సాధనాలను చేపట్టవలసి ఉంటుంది. కేవలవిధానాల మీద పట్టుదల చూపితే జీవితం దుఃఖభాజనం అవుతుంది. అంతే కాదు. ధర్మాచరణానికి కూడ భంగం వాటిల్లుతుంది. శరీరం ధర్మసాధనం గదా! ఈ విషయాన్ని శాస్త్రిగారు విస్మరించారు. జీవితాన్ని ఉపేక్షించారు. కర్తవ్యాన్ని మరిచారు. ఆయన కొంత లోకజ్ఞతతో ఉదారంగా ప్రవర్తించి ఉన్నట్లయితే నరసింహానికి ఇంగ్లీషుచదువుతో పాటు తన వేదశాస్త్రాలను గూడ అందించి ఉండేవారు. అతడు జీవికాసంపాదనంతో పాటు వేదశాస్త్రాధ్యయనం చేసి ఉభయతారకంగా జీవితం గడిపేవాడు. అతడు అంత మోయలేని కుటుంబభారం మోయవలసి వచ్చేది కాదు. సమష్టికుటుంబం విచ్ఛిన్నమూ అయిఉండేది కాదు. పశ్యంతి జీవితం - సంప్రదాయబద్ధమైన కుటుంబంలో పుట్టిన ఆమె జీవితం సంప్రదాయాన్ని విడనాడి రోగుల పుండ్లు కడుగుతూ నర్సుగ జీవితాన్ని గడపవలసి వచ్చేది కాదు. అయ్యన్నశాస్త్రిగారి ధర్మాభిరతి, న్యాయవర్తనం ఆమెలో సంక్రమించి ఉండవచ్చు. కాని, ఆయన జీవితమార్గానికి, ఈమె జీవితవిధానానికి మధ్య, కాలం ఎంత అంతరం తెచ్చిపెట్టింది! వంశ పారంపర్యంగా వచ్చిన సంప్రదాయం, విలువలు, ప్రమాణాలు దేశకాలపరిస్థితులచేత ఎంత ప్రభావితాలు అవుతాయో, దేశకాలవాతావరణానికి అనుగుణంగా జీవితాన్ని మలచుకొని సంప్రదాయరక్షణం చేయటం ఎంత ఆవశ్యకమో రచయిత అభివ్యక్తం చేశారు.

శాస్త్రిగారి యితివృత్తానికి సమాంతరంగా బసవయ్యగారి జీవితవృత్తం నడుస్తుంది. అయితే, ఆయన లోకంపోకడ తెలిసిన మనీషి. ఏ వైద్యవిధానం వల్లనైనా లోకం సద్యఃస్వాస్థ్యాన్ని కోరుతుండటం గమనించాడు. అంతే. తన వైద్యవృత్తిని వదిలివేశాడు. కొడుకు మార్కండేయులు ఇంగ్లీషు చదువులు చదివి, ఆంగ్లవైద్యం చేస్తుంటే చూచి తటస్థంగా

ఊరకున్నాడు. మనమడు ప్రసాదుకి నాడీపరిజ్ఞానం, రోగనిదాననైపుణ్యం అందించాడు. ప్రసాదు సాహిత్యవ్యాసంగం చేస్తానని హఠం చేస్తుంటే, ప్రోత్సహించి 'మెడిసిన్'చదివించాడు. కనుకనే, ప్రాచీన ఆయుర్వేద విజ్ఞానంతో, రోగనిదానం చేస్తూ, ప్రసాదు అల్లోపతివైద్యాన్ని అంత సమర్థవంతంగా చేస్తాడు. వైద్యవృత్తిలో అతడు చిత్తశుద్ధి, ఆత్మవిశ్వాసం, స్వతంత్ర ప్రవృత్తి, రోగనిదానకౌశలం తాతగారి నుండి పుణికిపుచ్చుకున్నాడు. కాలం తెచ్చిన మార్పులు, నేర్పిన పాఠాలు అతనిలో పని చేయసాగుతాయి. బసవయ్యగారు అడిగి ఒక్క దమ్మిడి పుచ్చుకున్నపాపాన పోలేదు. ప్రసాదు డబ్బుగుంజకుండా వైద్యం చేసిన పుణ్యాన పోలేదు. నాడు అది ఆయనకు ధర్మం అయితే, నేడు ఇది ఇతడికి న్యాయం అయింది. నాటికి ఆయన జీవితం సుఖంగానే వెళ్ళమారింది. నేటికి ఇతడి జీవితం సుఖతరంగానే సాగుతున్నది. వంశపారంపర్యంగా వచ్చిన వైద్యవిద్య ఆ కుటుంబంలో అవిచ్ఛిన్నంగానే సాగుతున్నది. ఇదంతా, బసవయ్యగారి లోకజ్ఞతకు నిదర్శనము. అయ్యన్నశాస్త్రిగారిలో ఆ లోకజ్ఞత లుప్తం అవటం వల్లనే, ఆ కుటుంబంలో వంశపారంపర్యంగా వస్తున్న వేదశాస్త్రాలు శాస్త్రిగారితో పాటు అంతరించాయి. ఆ కుటుంబంలోని వాళ్ళందరు దుఃఖభాజనులే అయ్యారు. ఈ అంతరాన్ని గుర్తింపచేయటానికే జి. వి. కె. మహా ప్రతిభతో ఈ రెండు కుటుంబాల గాథను ఇంత సుందరంగా చిత్రించారని స్ఫురిస్తుంది.

డా॥ జి. వి. కె. సునిశితపరిశీలన నుంచి తప్పించుకున్న వస్తువు ఏదీ ఈ జగత్తులో లేదనిపిస్తుంది. అవకాశం వచ్చినప్పుడు కథానుగుణంగా పరిశీలితాంశాలను మహాచాతుర్యంతో ఉపయోగించుకుంటారు ఈయన. పాత్రల మనస్తత్త్వాలను, స్వరూపస్వభావాదులను కొన్ని పదార్థాలతో పోల్చి చూపి మన కళ్ళముందు నిలబెడతారు. శ్యామల శారదలను పోలుస్తూ ధర్మారావు వాళ్ళ స్వరూపస్వభావాదులను ఇలా విశ్లేషిస్తాడు.

> "శ్యామల... కనకపుష్యరాగం. దోషం ఉంటే ఉండవచ్చు. శారద.... నిర్మల స్ఫటికమణి. పుష్యరాగం ఎంతసేపటికీ తన తేజస్సునే వెలారుస్తుంది. సంపూర్ణ సౌందర్యావిష్కారం జరగాలంటే పరిష్కార మభిలషిస్తుంది. స్ఫటికమణి అలా కాదు. తన నిర్మలత తనకుండగా సవిధవర్తిని నిర్మలంగా ప్రదర్శిస్తుంది. స్వయంవ్యక్తిత్వం ఉన్నవానికి కావలసింది స్ఫటికమణి గాని ఎంత అనర్ఘమైనా పుష్యరాగం మాత్రం కాదు."

ఈ విధంగా రచయిత సునిశిత పరిశీలనాదృష్టితో వస్తుతారతమ్యాన్ని చూపుతూ, శ్యామల శారదల వ్యక్తిత్వాన్ని సౌందర్యాన్ని సాక్షాత్కరింపజేస్తారు.

శారద, మోహనులు కలిసి వెళ్ళుతున్నారు. వారిద్దరి పోకడను, వాళ్ళను చూస్తున్న మాధవరావు ఉద్వేగానుభూతులను చిన్న చిన్న సమాసాలతో ఎంత కనులపండువగా చిత్రించారో చూడండి.

> "అన్నాచెల్లెళ్ళు వెళ్ళుతుంటే మాధవరావు బహువిలంబి కౌశేయం, వేణీమూల నిబద్ధమందారం చూస్తూ కూర్చున్నాడు. అతని కన్నులలో హిమగిరితుంగ శృంగ పతజ్ఝరి, ఫణిఫణాఫలక భాస్వన్మణి మెరిశాయి."

మరొక చిత్రణాన్ని పరిశీలించండి. శోభనాద్రి యింట్లో శ్యామల ధర్మారావుల మధ్య నర్మ గర్భాలైన మాటలు, చేష్టలు సాగుతాయి. శ్యామల మనసు అదుపు తప్పుతుంది. ఆ సందర్భంలో రచయిత వాక్యాలివి.

> "శ్యామల కేదో మహాప్రవాహంలో కొట్టుకొని పోతున్నట్లుయింది. అప్రయత్నంగా ఆమె చేతులు అతడి కంఠావలంబనం పొందాయి. తెలివంది చూచుకొనేటప్పటికి లలాటతిలకం రక్తముక్తాయితమై నాసాగ్రాన వ్రేలుతున్నది."

ఇక్కడ సమాసస్వభావాన్ని గూర్చి కొంత తెలుసుకొనటం అవసరం. శబ్దం అర్థానికిశరీరం; అర్థం శబ్దానికి ఆత్మ. ఈ శబ్దార్థాలు అవినాభూతాలు. సమాసంలో విభిన్నశబ్దాలు, విభిన్న అర్థాలు ఏకాకృతిని పొంది మరొక రమణీయార్థాన్ని బోధిస్తాయి వ్యస్తపదాలు సమాహృతిని చెంది ఏకపదంగా తమను భాసింపచేసుకొంటాయి. అట్లే వాచ్యార్థాలు సమస్త స్థితిని పొంది ఏకార్థబోధకాలు అవుతాయి. అప్పుడు సమాసం భావుక హృదయాలను రసస్నిగ్ధం చేస్తుంది. ఇక్కడ 'లలాటతిలకం, రక్తముక్తాయితం, నాసాగ్రం' అనే అలతి అలతి సమస్తపదాలు వ్యస్తదేహాలుగా ఉన్న శ్యామలాధర్మారావుల సమాసస్థితిని, సాత్త్వికభావోదయాన్ని రామణీయకంగా అభివ్యంజితం చేసి సహృదయులను ఆనంద పరవశులను చేస్తాయి. రచయిత అవకాశం వచ్చిన ప్రతి సన్నివేశంలో ఇట్టి దృశ్యాలను మధురభావోద్దీపకంగా చిత్రించి మనకు సాక్షాత్కరింపజేస్తారు. ఈ నవలలో రచయిత ప్రదర్శించిన వ్యంగ్యవచోవైభవం అనితరసాధ్యము. వక్రోక్తులు, వ్యంగ్యాత్మక సంభాషణలు ఈ నవలలో పరశ్శతాలు. వాటిని వివరించబూనుకుంటే మరొక సమాలోచనవ్యాసం అవుతుంది. ఆపనిని భావుక విమర్శకులకు వదలివేయటమైనది.

ఈ నవలకు 'పాపికొండలు' అన్నపేరు పెట్టటంలోనే రచయితకు గల ప్రతిభ ద్యోతమానం అవుతుంది. పాపికొండల మధ్య గోదావరి సన్నగా, మహావేగంగా, సుడిగుండాలతో

భయంకరంగా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ కొండల మధ్య, ఒక నిర్ణీతమార్గాన జాగ్రత్తగా నావికుడు నౌకను నడుపుకొనలేకపోతే, ఆ నావ సుడిగుండాలలో పడి విశకవితం అవుతుంది; ఆ ప్రవాహంలో పడి కొట్టుకొనిపోతుంది. గలగలమంటూ ఆనందంతో పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహించే ఆ గోదావరి - ఆ జీవనది - పాపికొండలు కారణంగానే అంత భయంకరంగా, అంత ప్రాణోపద్రవకరంగా ఉంటుంది.

అలాగే, ఈ నవలలోని పాత్రల జీవనస్రవంతికి అధికారతృషితులయిన కొందరు వ్యక్తులు అడ్డుగోడలై నిలుస్తారు. వారి జీవితాలలో సుడిగుండాలు లేపుతారు. ఆ జలావర్తాలలో పడి ఎందరో బలి అయిపోతారు అనీ, వాళ్ళు కొంత జాగరూకతతో, కొంత వివేకంతో ప్రవర్తించి ఉన్నట్లయితే, కొంత సంయమంతో వ్యవహరించి ఉన్నట్లయితే వాళ్ళ జీవిత పర్యవసానం అంత దుఃఖభాజనం అయి ఉండేది కాదనీ ధ్వనింపచేయటానికే రచయిత నవలకు ఆ పేరు పెట్టారు.

ఏవంవిధ వ్యంగ్యమర్యాదతో డా॥ జి. వి. కృష్ణరావు ఎన్నో సద్రచనలు చేశారు. ఈ నవలలో వారు తల్లిదండ్రులు, సంతానం, అధికారులు, అధికృతులు, ప్రేయసీప్రియులు మున్నగువారి సంబంధాలను ఔచిత్యసముపేతంగా, మర్యాదబద్ధంగా, రసోల్బణంగా, సహజరమణీయంగా చిత్రించి, పాఠకులలో స్వతంత్రము, వివేకసంపన్నమూ అయిన ఆలోచనను ఉద్దీప్తం చేసిన కవికుశలుడు. జి. వి. కె. భౌతిక శరీరం నేడు లేదు. కాని,

> "ఉపేయుషా మపి దివం సన్నిబంధవిధాయినాం ।
> ఆస్త ఏవ నిరాతంకం కాంతం కావ్యమయం వపుః॥"

అన్న అలంకారిక వచనానుసారం కృష్ణరావు మనోహరమయిన కావ్యశరీరాన్ని ధరించి నాకలోకంలో విహరిస్తుంటారని అనటంలో అతిశయోక్తి లేదు.

> "జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

# ఆదర్శశిఖరం

కోగంటి రాధాకృష్ణమూర్తి

[రాధాకృష్ణమూర్తిగారు తెనాలితాలూకా కూచిపూడిలో 1914లో జన్మించారు. పట్టభద్రులు. రాడికల్ హ్యూమనిస్టు, రాయ్ జీవితం, ఇండియాలో విప్లవం, మల్లెపూలు(కథలు), మార్క్సిజమ్-రాడికలిజమ్, గాంధీమార్గం వీరి ముఖ్య రచనలు. విహారి, రాడికల్, సమీక్షలకు సంపాదకులు. కృష్ణరావుగారి ఆబాల్యమిత్రులు ]

*     *     *     *

"ఇందుకా మీకు మేము చదువులు చెప్పించేది?"

నడిబజార్లో నిలవేసి నిగ్గదీసి అడిగిన రామయ్యమామకు సమాధానం ఏమి చెప్పాలో తోచక గుడ్లు మిటకరించవలసి వచ్చింది.

అంతటితో వూరుకొంటేగా! "అవే! ఏవో గొడవలు చేస్తున్నారని విన్నాములే. అసలు అవి మీకెందుకు రా! హాయిగా చదువుకొంటూ తిని కూర్చుండలేక పైగా చీవాట్లు, చెప్పు దెబ్బలు కూడా తింటున్నారటగా?"

అప్పటికి గాని రామయ్యమామ ఎత్తిపొడుపులు నాకు అర్థం కాలేదు........రెండవ ప్రపంచయుద్ధం కారుమేఘాల్లాగా ముంచుకొస్తున్న రోజు లవి. పరజాతి, పరపాలన మీద ఉన్న అసహనం, ద్వేషంతో జాతి మొత్తం బ్రిటిషు వ్యతిరేకతను చూపసాగినది. మేము మాత్రం ఏకాకులుగా యుద్ధ అనుకూలప్రచారం సాగిస్తున్నాము.

ఎక్కడకు వెళ్ళినా మా మీటింగుల్లో పిల్లికూతలు, అవహేళనలు, అల్లర్లు, నిందలు మామూలు సంఘటనలు. తెనాలి పట్టణంలో ఒక మీటింగుహాలు నుంచి బయటకు వచ్చి కారులో కాలు పెట్టుచున్న యమ్. యన్. రాయ్‌పై ఒక ప్రముఖ కమ్యూనిస్టు కార్యకర్తగా వ్యవహరిస్తున్న యువకుడు చెప్పు విసరటం జరిగింది.

కృష్ణరావు మా మీటింగుల్లో, ప్రచారంలో ప్రత్యక్షంగా భాగస్వామి కాకపోయినా మాకు కావలసిన సాహిత్య సరంజామా అందచేస్తూ మాకు అన్నివిధాల సహకరిస్తూ ఉండేవాడు.

"అది కాదు మామయ్యా! అది వొక పెద్ద గొడవలే. మీకు చెప్పాలంటే..........." అని తప్పించుకొనటానికి ప్రయత్నించాను.

"కుదర దంటావు. అంతేగా ? అవును, ఆ గొడవలు మాకు తెలియవులే. మరి మా బాధలు మీకు తెలుసా?" అని ఎదురు ప్రశ్నవేసి ముందుకు సాగిపోయాడు. తరువాత నెమ్మది మీద ఎప్పటికో గాని రామయ్య మామ ఆంతర్యం నాకు అర్థం కాలేదు.

'దాచిన ధనంబువంటిది కూచిపూడి' అని యాచన కొరకు భట్రాజులు పొగడుతూ మా గ్రామంలో ఇంటింట తిరగటం నా చిన్నతనంలో చూచాను. ఆ సూత్రం కొలది కుటుంబాలకు మాత్రమే అన్వయిస్తుంది. మిగిలిన గ్రామస్థు లందరూ సర్వసామాన్యులే.

కృష్ణరావు తలిదండ్రులు పై వర్గానికి చెందినవారు మాత్రం కాదు. అయినా తమ కున్న కొద్దిపాటి మాగాని భూమితో తృప్తి చెంది శ్రమను లెక్క చేయక కుటుంబం బరువు, బాధ్యతలను గౌరవంగా సరిదిద్దుకొన గలిగినవారిలో మిన్నగానే వుండగలిగారు. ఒకరికి పెట్ట గల స్తోమతు లేకపోయినా ఒకరి దగ్గరకు వెళ్ళవలసిన అవసరం రాకుండానే తమ జీవనం సాగించ గలిగినారు.

'పేరు పెద్ద' అయినా అంతవరకు కూచిపూడి గ్రామంలో ఉన్నతపాఠశాల స్థాపన ప్రయత్నాలు జరుగలేమ. స్తోమతు కలిగి, చదువు-సంధ్యలలో విశేష ఆసక్తి వున్నవారు మాత్రమే తమ బిడ్డలను పై చదువులకు తెనాలి పట్టణం, తదితర దూరప్రాంతాలకు పంపటం కద్దు. కృష్ణరావు తలిదండ్రులు అంత సమర్థులు కారు. పైగా నిరక్షరాస్యులు కూడాను. తమ పుత్రుని సుపుత్రుని చేసిన, తద్వారా తాము కూడ 'భుక్తిని,ముక్తిని' పొందగలమనే కాంక్షతో తమ ఈతిబాధలను కూడ సరకు గొనక ఐదారు మైళ్ళ దూరంలో వున్న తుమ్మెళ్ళ గ్రామం

లోని ఉన్నతపాఠశాలలో చేర్పించారు. ప్రక్కనున్న యలవర్రు మేనత్తగారి గ్రామం. అచ్చటనే వుండి రోజూ రెండు మైళ్ళు కాలినడకనే ప్రయాణం చేస్తూ కృష్ణరావు తురుమెళ్ళ గ్రామం వెళ్ళి వస్తూవుండేవాడు. చివరి సంవత్సరం కొల్లూరు ఉన్నత పాఠశాలలో తన చదువులు పూర్తిచేశాడు.

'పువ్వు పుట్టగనే పరిమళిస్తుంది' అను నానుడి కృష్ణరావులో నిజరూపం ధరించినది. వికాసం క్రమపద్ధతిలో సంతరించు కొనసాగినది. హైస్కూలు చదువులు పూర్తిచేయక మునుపే కవిత్వం అలవరచుకున్నాడు. ఛందోబద్ధము, రమ్యము, ఆకర్షణీయము నైన శబ్దముతో పద్యములు అల్లసాగినాడు. చిరుతప్రాయంలో విన సొంపు అయిన కవితను గూర్చుట అసాధారణ మయిన విషయము.

ఆంధ్రభాష యందున్న అభిమానముతో బి. ఎ. లో తెలుగును ప్రత్యేక పాఠ్యభాగంగా తీసుకొని వ్యాకరణసూత్రములను, అలంకారశాస్త్రమును లోతుగా తరచి ఆకళింపు చేసుకొన గలిగినాడు. నన్నయ ముందుకాలం నుండి నేటివరకు జరిగిన తెలుగు భాషాభివృద్ధి, గమనాన్ని సోయగాలు కరతలామక మైనవి.

కృష్ణరావు కవితాసామగ్రి మెరుగులు దిద్దుకొనసాగినది. వరూథిని, శివరాత్రి, యుగ సంధ్య ఆదిగా గల కావ్యకర్తగా మేటి అనిపించుకొన గలిగినాడు. అప్పటి లోకం పోకడల ననుసరించి 'శతావధాని', 'అష్టావధాని' కావాలనే కోర్కె కృష్ణరావులో జనించినది. అందుకు కొన్ని సమావేశాలు జరిపి తన ప్రయత్నంలో 'సఫలీకృతుడు' గా పండితుల మెప్పు బడయగలిగినాడు.

ఇంతటితో కృష్ణరావు సంతృప్తి చెందలేదు. ఆంధ్రసాహిత్యంతోపాటు సంస్కృత, ఆంగ్ల సాహిత్యాలలోని ఔచిత్యముల గుర్తెరిగి తదనుకూలమయిన భావపటిమతో గద్యములో కూడ తన ప్రతిభను చూప ప్రారంభించాడు. సునీథ (నాటిక), జఘనసుందరి (నవల), భిక్షాపాత్ర (నాటిక), కొన్ని కథలు ఈ సమయంలో వెలువడిన ప్రధానరచనలు.

మేలురకం రచనలు సాగించగలిగినా ప్రబంధవాసనలు వీడని కృష్ణరావును మేము చనువుతో, సరసోక్తులతో పరిహాసం చేస్తూ వుండేవాళ్ళము. ముసి ముసి నగవులతో మాకు సమాధానం చెప్పటం వినా మాకు ముందుకు వెళ్ళగల అవకాశం మాత్రం చిక్కనిచ్చేవాడు కాదు. సాహిత్యరచనల్లో తాను చేస్తున్నది మాత్రం ముందు అతిగోప్యంగా వుంచటం కృష్ణరావు

అలవాటు. అలాగే ఇతరపనులు కూడ. బి. ఎ. పరీక్షకు ఫీజు చెల్లించాడు. తీరా పరీక్షల సమయంలో గైరుహాజరు. 'ఏమి టీపని' అని ఆరా తీస్తే 'క్లాసు రాదేమో' నని మాని వేశా నన్నాడు. కొన్నిటిలో కృష్ణరావు మనస్తత్వం మాకు తమాషాగా కనబడుతుండేది.

ఎర్రగా, సన్నగా, నిడుపాటి ముక్కు, తీక్షణ మయిన కనుదోయితో, ఎప్పుడూ తెల్లని లాల్చి, గ్లాస్కో ధోవతి ధరించి భక్తు ఖావకవిగా కనపడే కృష్ణరావు ఒకనాడు కాక తాళీయంగా 'ఫుల్‌సూటులో' కనబడటం నాకు మరీ వింత కల్గించినది.

"ఏమిటీవేషం?" అన్నట్లు ఎగాదిగా చూచాను.

"వైజాగ్ వెళ్ళుతున్నాను". ముక్తసరిగా సమాధానం.

"ఎందుకో?"

"మెడికల్ కోర్సులో చేరబోతున్నాను." అప్పటివరకు తన సీటుసంగతి, ప్రయాణం సంగతి రహస్యంగానే అట్టిపెట్టుకున్నాడు

ఆరోజుల్లో యం. బి. బి. యస్. లో చేరటానికి ఇప్పటి కట్టుదిట్టాలు లేవు సరిగదా, ప్యూర్ బైయాలజీకోర్సు కూడా అక్కరలేదు. డొనేషన్సు రూపంలో, ఇతరత్రా ముడుపులు చెల్లించుకొనటం, ముందుగా పేరు నమోదు చేయించుకొనటం, పలుకుబడి గల వ్యక్తులతో సిఫారసు చేయించుకొనటం కూడా అవసర ముండేది కాదు. కృష్ణరావు అప్లికేషను ఎప్పుడు పంపాడో ఎవరికీ తెలియదు. సీటు వచ్చినది. అదికూడా మాకు తెలియనీయలేదు. తీరా సూటు, బూటు వేషంలో ప్రయాణం కట్టినప్పుడే అసలు విషయం తెలుసుకొనగలిగినాము.

"ఆ వాతావరణం నీకు సరిపడుతుందా ? కప్పల్ని చూస్తేనే గాభరా పడేవాడివి మనుషుల్ని ఎలా కోస్తావు ?" అని ఎగతాళి చేస్తూనే మేము కృష్ణరావుకు వీడ్కోలువిందు చేశాము.

వారం రోజులు కూడా నిండలేదు. తిరిగి కృష్ణరావు తెనాలిలో దర్శన మిచ్చాడు. 'ఏమిటి సంగతి' అని నిగ్గదీస్తే నీళ్ళు నమిలాడు. 'మళ్ళీ ప్రయాణ మెప్పుడు' అని అడిగితే సమాధానం లేదు. 'మా మాటలు ఖరారు చేయాలని వచ్చావా ?' అని అంటే, అవునన్నట్లు తల వూపాడు.

యం. ఎ చదువులకు కాశీప్రయాణం కట్టాడు. ఈసారి మేము హృదయపూర్వకంగా వీడ్కోలిచ్చి పంపాము. మొదటి సంవత్సరం పూర్తిచేశాడో, లేదో కూడ మాకు తెలియ నివ్వలేదు. రెండవ సంవత్సరం మాత్రం ప్రయాణం కట్టలేదు.

x x x x x

"ఇకనైనా మా వెంట రాకూడదు ?"

"ఎందుకూ?"

"నిచ్చెనెక్కి గోడలపై వాల్‌పోస్టర్సు అంటించటానికి, వాడవాడలా తిరిగి కరపత్రాలు పంచటానికి, వేదికలపై నిలబడి మహోపన్యాసాలు దంచటానికి."

"అవి చేయలేకనే గదా! దేశం తిరిగి వచ్చినది."

"భూమి గుండ్రం"

కృష్ణరావులో మార్పు కనబడినది. ప్రబంధసీమలను అధిగమించి వాస్తవప్రపంచానికి చేరుతున్నట్లు కనపడసాగినాడు. కాశీలో తన డిగ్రీ కోర్సు పూర్తి చేయకపోయినా అచ్చట ఉన్న కొలదికాలం మాత్రం ఇందుకు దోహదం కలిగించినది. దాని ఫలితంగా 'కావ్యజగత్తు' అవతరించినది.

ఒకనాడు మాకు హఠాత్తుగా ఒక విషయం బయట పెట్టాడు. "నేను గుంటూరు 'దేశాభిమాని' పత్రికలో చేరబోతున్నాను."

"భుక్తికీ, ముక్తికీ దగ్గరమార్గం."

నా మాటలకు కృష్ణరావు చిన్నబుచ్చుకున్నాడు. చివరకు తమాయించుకొని 'అది కాదు, మనది కూడా యుద్ధ అనుకూల ప్రచారమే కదా! పత్రిక ఆశయ మెట్టిదయినా మన ఆశయ సాధనకోసం దానిని ఉపయోగించుకొనటానికి ప్రయత్నిస్తాను' అని మాకు హామీ యివ్వటానికి ప్రయత్నించాడు.

"హర్షింపదగిన విషయమే ! మరి కాని . ...." అని మా సందేహాన్ని వెల్లడిస్తూనే కృష్ణరావును అభినందించాము.

పి. వి. కృష్ణయ్య చౌదరి జస్టిసుపార్టీ నాయకుడు. లాయలిస్టు. ప్రభుత్వం నుంచి లాభం పొందాలనే దృష్టితో వినయవిధేయతలు ప్రకటించి గుంటూరులో నామమాత్రంగా

'దేశాభిమాని' పత్రిక స్థాపించి యుద్ధప్రచారం పేరుతో ప్రభుత్వం నుంచి మించిన అండ దండలను పొందగలిగినాడు. ఆ పత్రిక ధ్యేయం అంతవరకే.

కృష్ణరావుకు తాను స్వీకరించిన పత్రికాబాధ్యత మూడునాళ్ళ ముచ్చటే అయినది. అచ్చటి క్రమశిక్షణ, కట్టుబాట్లు, పత్రికాస్వాతంత్ర్యపరిధులు, ఆశయాలు కృష్ణరావుకు ముళ్ళమీద కూర్చున్నట్లుగా బాధ కలిగించటంతో అనతికాలంలోనే తన ఉద్యోగానికి స్వస్తి చెప్పి తెనాలి చేరుకున్నాడు.

గోళ్ళు గిల్లుకుంటూ కూర్చొనటం కృష్ణరావులాంటి వ్యక్తికి వల్లకాని పని. మరి ఏదో ఒకటి చేయగల చొరవ; చాకచక్యమూ లేదు. చివరకు మిగిలింది అధ్యయనము. రచనా వ్యాసంగము మాత్రమే.

"మనకు ప్రింటింగు ప్రెస్ వుంటే బాగుంటుంది." అని ఒకనాడు నెమ్మదిగా తన అభిప్రాయం బయటపెట్టాడు.

నిజమే! యుద్ధప్రచారానికి వివిధరకాల విప్లవసాహిత్యం ప్రచురించాలి. అందుకు ఇతర ప్రెస్‌లు మాకు సహాయపడటానికి సిద్ధంగా లేవు. స్వయంగా మాకే ఒక ప్రెస్ స్థాపించవలసిన అవసరం కనబడినది. ఒక ప్రింటింగు ప్రెస్‌ను కొనుగోలు చేసి తరువాత 'నలందా ప్రెస్' గా పేరు మార్చాము. ఇందులో కృష్ణరావు కూడ భాగస్తుడే. 'ప్రజాసాహిత్యపరిషత్తు' పేరుతో ప్రచురణసంస్థను, 'సమీక్ష' పేరుతో పత్రికను కూడ స్థాపించాము.

కాని, యుద్ధకారణంగా అన్నీ కొరతలే. అన్నిటికీ రేషనుపద్ధతే. ప్రెస్‌కు, పుస్తకాలకు, పత్రికకు కావలసిన కాగితం కోటా సంపాదించాలంటే తలప్రాణం తోకకు వచ్చేది. నిజం చెప్పితే సరియైన కోటా లభించేది కాదు. అబద్ధం చెప్పటానికి మనసు అంగీకరించేది కాదు. వ్యాపారసరళిలో లాభాలు గాకపోయినా ప్రజలకొరకే అన్నట్టు నానా యాతనలు పడి సాహిత్యం వ్రాయటం, అచ్చు వేయటం మాత్రం అలవాటు చేసుకున్నాము. అప్పట్లో అది మాకు చేతి చమురుగా తయారయినా కొన్ని రచనలను అచ్చురూపంలో గ్రంథస్థం చేయగలిగాము.

కృష్ణరావు యీ పరిధిలో కూడ హెచ్చుకాలం వుండలేకపోయినాడు. అది ఆయన సహజధోరణికి వ్యతిరేకం. నార్ల సంపాదకత్వంలో అప్పుడు మద్రాసులో వెలువడుతున్న 'ఆంధ్రప్రభ' దినపత్రికలో సహాయసంపాదకునిగా చేరుటకు అవకాశం లభించినది. మేము ఘనంగా కాకపోయినా సన్మానించి 'ఈసారి అయినా ఒకచోట స్థిరపడటం మంచిది' అని

సలహా యిచ్చి కృష్ణరావుకు వీడ్కోలిచ్చాము. కృష్ణరావు ఎక్కడున్నా రాణించాలనేదే మా కోర్కె.

1950 ప్రాంతంలో నేను మద్రాసు వెళ్ళినప్పుడు కృష్ణరావు 'ఆంధ్రప్రభ' లో పని చేయటం మానుకున్నాడు. పిహెచ్. డి. డిగ్రీ కొరకు పరిశోధనలు ప్రారంభించినట్లు తెలుసుకున్నాను. అప్పటికే కృష్ణరావు ఇద్దరు, ముగ్గురు బిడ్డల తండ్రి.

"ఏమిటి? మళ్ళీ చదువుల్లో పడ్డావా?"

"చదువులకు అంతేమిటి?" కృష్ణరావు సమాధానం.

"అక్కడ పిల్లల చదువుమాట దేవుడెరుగు. ఇక్కడ అయ్యగారు మాత్రం చదువుల అంతు తేల్చుకుంటున్నారు." అని భార్యామణి చురక అంటించింది.

"మరి యీసారి అయినా?"

"బ్రేకుమాత్రం పడ నివ్వనులే." అని కృష్ణరావు నాకు గట్టిగా హామీ యిచ్చాడు.

"పిల్లలు ఎదుగుతున్నారు. చదువుల్లోపడ్డారు. వాళ్ళను వదలి నేను ఇక్కడకు రావటం ఇబ్బందిగానే వున్నది. ఏదో ఒక ఉద్యోగంలో ఖాయంగా వుండి ఏదైనా చేసుకొనవచ్చును గదా! నా మాట లెక్కచేయటం లేదన్నయ్యా!" అని యశోద విస్తుపోయినది.

"ఇందులో దిగిన తరువాత తప్పదుగా! పూర్తి చేసిన తరువాత ఉద్యోగంలో ఖాయ పడతాడులే," అని ఆమెను తృప్తిపరచటానికి నేను శతవిధాల ప్రయత్నించాను.

కృష్ణరావుకో ఏదో సాధించాలనే తపన మాత్రం చల్లారలేదు. పిహెచ్.డి. చేయటానికి అనుమతి లభించటం సామాన్యమయిన విషయం కాదు. ఆయన పోస్టుగ్రాడ్యుయేట్ కాదు. కనుక అనుమతి పొందటం అసాధారణమైన విషయమే. కృష్ణరావు రచించిన 'భిక్షాపాత్ర' నాటిక అప్పట్లో ఆంధ్రవిశ్వవిద్యాలయ రిజిష్ట్రారుగా నున్న శ్రీ కె.వి.గోపాలస్వామి నాయుడు గారిని మిగుల ప్రభావితుని చేసినది. విశ్వవిద్యాలయంలో ఆ నాటికను రంగస్థలం మీద ప్రదర్శనకూడ చేయించారు. వారి పలుకుబడితో మద్రాసు విశ్వవిద్యాలయంవారి అనుమతిని కృష్ణరావు ప్రత్యేకంగా పొందగలిగినట్లు వినికిడి.

ఎన్నో తళుకుబెళుకులతో అల్లిక లల్లబడి మృదుమధురమై పండితులను సైతం మైమరపించగలిగిన స్వతంత్ర రచన - పింగళిసూరన 'కళాపూర్ణోదయం' ఎంపిక చేసుకొని దానిపై ఇంగ్లీషులో ఒక బృహద్గ్రంథాన్ని వెలువరించటం కృష్ణరావు ప్రతిభకు ఎనలేని గీటురాయి.

అట్టి ప్రతిభావంతమయిన పరిశోధన పూర్తిచేయగలిగినా డాక్టరేట్ డిగ్రీ పొందుటకు కృష్ణరావు నానా యాతనలు పడవలసివచ్చినది. అది వేరే గాథ.

ఒకప్రక్క తన పరిశోధనాకార్యక్రమం కొనసాగిస్తూనే మరొకప్రక్క ఇతర రచనలు కూడ సాగించటం కృష్ణరావువంటి వ్యక్తులకే సాధ్యపడగలదు. వాస్తవిక సమాజాన్ని ప్రతిబింబించగల 'కీలుబొమ్మలు' (నవల) పూర్తిచేశాడు. దీనిని తెరపై ఎక్కించటానికి కొన్ని ప్రయత్నాలు కూడ జరిగినవి. కాని ఫలించలేదు. ప్లేటో తాత్త్వికవిచారాన్ని విపులీకరిస్తూ 'జేగంటలు' (1వ భాగము) కూడ ఈ సమయంలోనే వెలువడినది. అంతే కాదు, ఉత్తరోత్తరా ప్రచురించిన, ప్రచురించా లనుకొన్న కొన్ని ఉత్తమగ్రంథాలకు ఇప్పుడే బీజాంకురం జరిగినది. అందులో కొన్ని ముద్రితమయినా మరికొన్ని అముద్రితంగా మిగిలియుండవచ్చు నని నా అనుమానం.

x x x x x

తెనాలిలో వి. యస్. ఆర్. కళాశాల ప్రారంభోత్సవం జరిగి సంవత్సరం కావస్తున్నది. కృష్ణరావు తన పరిశోధనా వ్యాసాన్ని విశ్వవిద్యాలయ అధికారులకు అప్పగించి తెనాలిలో ప్రత్యక్ష మయ్యాడు.

"ఉద్యోగానికి అప్లికేషను పెట్టమంటావా?"

"అసలు ఉద్యోగంలో నీవు నికడగా ఉండేగా?" అప్పుడు నేను ఆ కళాశాల గవర్నింగుబాడిలో సభ్యుడను.

కృష్ణరావునుంచి హామీ పొందాలనే కోర్కె నాకు లేదు. కృష్ణరావును ఉద్యోగంలో గట్టిగా నిలబెట్టటమే నా అభిమతం. ప్రయత్నించక తప్పినది కాదు. కృష్ణరావు మీద నాతోబాటు ఇతరసభ్యులకు కూడ అభిమానం లేకపోలేదు. పైగా డాక్టరేట్ డిగ్రీ వరించబోతున్నది. ఆ ఉద్యోగానికి అన్నివిధాల అర్హత కలిగిన వ్యక్తి.

స్వస్థలం కావటం చేతనో లేక అధ్యాపకవృత్తి తన మానసికవికాసానికి, రచనావ్యాసంగానికి సహకరిస్తుందనో రావు పదిసంవత్సరాలు ఆ ఉద్యోగంలో వుండగలిగాడు. ఈ మధ్యకాలంలో డాక్టరేట్‌డిగ్రీతోబాటు 'కళాపూర్ణోదయ' పరిశోధనావ్యాసాన్ని గ్రంథరూపంలో వెలువరించటం, జేగంటలు-2, 3 భాగాలను పూర్తిచేయటం జరిగినది. వీటితోబాటు మరికొన్ని రచనలకు పునాదులు వేసుకున్నాడు.

1962 అనుకుంటాను. 'ఉద్యోగం మానివేశాను' అని కృష్ణరావు చెప్పటం నాకు దిగ్భ్రాంతిని కలుగజేసినది. వివరం మాత్రం అడిగినా చెప్పలేదు. తీరా విచారిస్తే అహం దెబ్బతిన్నట్లుగా గ్రహించగలిగాను.

"నీకు బొత్తిగా లౌకికజ్ఞానం లేదు."

"వేరే చేయగలిగినది కూడా లేదు" అని సమాధానం వినా ఆంతర్యం మాత్రం బయటపెట్టలేదు.

మళ్ళీ ఉద్యోగం కొరకు వేట. ఎలా ప్రయత్నించాడో, ఏవిధంగా సంపాదించగలిగాడో నాకు తెలియ నీయలేదు. ఆల్ ఇండియారేడియో, విజయవాడ స్టేషనులో ఉద్యోగం చేపట్టాడు. ఒకసారి కంట్రాక్టు చెల్లినా తిరిగి కంట్రాక్టు పద్ధతి పై అదే ఉద్యోగంలో రిటైర్‌మెంటు వరకు కొనసాగటం నాకు ఆశ్చర్యంగానే కనబడినది.

"ఈసారిమాత్రం చివరివరకు నిలబడ్డావు' అని చమత్కరిస్తే "కుటుంబభారం నెత్తిన బడితే మోయక తప్పదుగా," అని భార్య యశోద సమాధానం చెప్పినది.

ఉద్యోగం చేస్తున్నా, చేయకపోయినా కృష్ణరావు తన రచనాపాటవాన్ని నిర్విఘ్నంగా చివరివరకు కొనసాగిస్తూనే వచ్చాడు. అదికూడా ఒక ప్రత్యేకశాఖకు పరిమితం కాలేదు. ఒక వంక స్వయంగా అధ్యయనం సాగిస్తూ మరోవంక ఉత్తమరచనలు చేస్తూ వచ్చాడు. కృష్ణ రావులో "విద్యార్థి గురువు" లక్షణాలు విడదీయరాని బంధంగా పెనవేసుకొని యున్నవి. ప్రయోజనాత్మకం, వాస్తవికం అయినవాటినే సృష్టించటానికి సర్వవిధాల కృషి చేస్తూ వచ్చాడు. చివరిలో తన ఆరోగ్యం దెబ్బ తిని బాధపడుతున్నా రచనాధోరణులకు మాత్రం ఫుల్‌స్టాప్ పెట్టలేదు.

కృష్ణరావు రచించిన పద్యాలు, కథలు, నాటికలు, నవలలు, తాత్విక విచారాలు, సాహిత్యమీమాంసలు. పరిశోధనావ్యాసం దేని కది ఒక ప్రత్యేకతను సంతరించుకొని పాఠకుని మనోభావముల వికసింపచేయగల వనటంలో అతిశయోక్తి లేదు. వాటి యుచితా నుచితములను వెలువరించుట కితర వ్యాసకర్తలు అనేకమంది యుండుటచే నిచ్చట నేను ముచ్చటించ నవసరము లేదని భావించుచున్నాను.

కృష్ణరావు బట్టకట్టుట నేర్చినప్పటినుంచి మరణశయ్య చేరువరకు నిరంతరం ఊర్ధ్వాభిముఖంగా పయనించటానికే ప్రయత్నించాడు. తన యీ ప్రయత్నంలో ఆశించినంతవరకు కృతకృత్యుడు కాగలిగాడు. జీవితమార్గంలో కొన్ని వడిదుడుకులు ఎదుర్కొనవలసి వచ్చినా అంతర్లీనంగా కృష్ణరావు తనలో వున్న సత్యాన్వేషణ ప్రేరణకు అంతరాయం మాత్రం కలుగనీయలేదు.

జీవనవికాసానికి మానసిక అభివృద్ధి తప్పనిసరి. స్వేచ్ఛా, స్వాతంత్ర్యముల కది పట్టుగొమ్మ. అందుకొరకు కృష్ణరావు చివరివరకూ అవిరళకృషి సాగిస్తూనే వచ్చాడు. అతడొక 'ఆదర్శశిఖరం' గా నిలువగలడు.

# నాకు తెలిసిన జి.వి.కె.

సంజీవదేవ్

[సంజీవదేవ్ గారి జననం 1918. నివాసం తెనాలి తాలూకా తుమ్మపూడి. విద్యాలయాల్లో విద్యను అభ్యసించలేదు. కాని, తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, ఉరుదు, ఫ్రెంచ్ భాషలు తెలుసు. చిన్నవయస్సులోనే హిమాలయాలకు వెళ్ళారు. 'ప్రబుద్ధ భారత' అనే ఆంగ్లమాసపత్రికలో కొంతకాలం ఉండి విశ్వసంస్కృతితో సంబంధం ఏర్పరచుకొన్నారు. లక్నోలో ప్రొఫెసర్ అసిత్‌కుమార్ హాల్దార్ సాన్నిహిత్యంలో, కులూ లోయలో, ప్రొఫెసర్ నికోలస్ సాంగత్యంలో చిత్రకళాపరిజ్ఞానాన్ని సంపాదించారు. సాహిత్యం, చిత్రకళ, మనోవిజ్ఞానశాస్త్రం, ప్రాక్పశ్చిమదర్శనాలు అధ్యయనం చేశారు. వీరు ప్రకృతిచిత్రకారులు. తెలుగువిజ్ఞానసర్వస్వం - లలిత కళాసంపుటానికి సంయుక్త సంపాదకులు.

తేజోరేఖలు, రూపారూపాలు, తెగినజ్ఞాపకాలు వీరిరచనలలో కొన్ని.]

* * * *

తననుగురించి స్వయంగా తనకు తెలిసినదానికంటే తననుగురించి ఇతర్లకు ఎక్కువ తెలుస్తుందా? ఇక్కడ ప్రశ్న ఎక్కువ తెలియటం తక్కువ తెలియటం కాదుకాని, మరో మాటలో చెప్పాలంటే, తననుగురించిన కొన్ని విషయాలు తనకు బాగా తెలిస్తే, మరికొన్ని విషయాలు తననుగురించినవే ఇతర్లకు బాగా తెలుస్తాయి. ఇది ఎక్కువగా గుణదోషవిచారణకు

సంబంధించి వుంటుంది. తనలోని గుణాలు తనకు తెలిసినంతగా తనలోని దోషాలు తనకు తెలియవు. తనలోని దోషాలను తనకంటే ఇతర్లు ఎక్కువ గ్రహించగలరు. గుణం లేని మనిషికాని, దోషంలేని మనిషికాని వుండడు. ఒకరిలో అవి ఎక్కువ వుంటే మరొకరిలో ఇవి ఎక్కువ వుంటాయి.

డాక్టర్ జి. వి. కృష్ణరావు తనను గురించి తాను తెలుసుకొన్నది ఎంతవరకు వాస్తవానికి దగ్గరగా వుంటుందో తెలియదుకాని, ఆయన్ను గురించి ఇతర్లు తెలుసుకొన్నట్లు నమ్మేది మాత్రం వాస్తవానికి కొంతదూరంలో వుంటుంటుంది తరుచుగా. ఆయనతో పరిచయంలోని నా మొదటి అనుభవం ఆయన్ను గురించి నేను తెలుసుకోటం వాస్తవానికి దూరం అయింది అనేది. అంటే ఆయనలో నేను ప్రథమంగా గ్రహించింది ఆయనలో ఏది వున్నదో దాన్ని కాక ఆయనలో ఏది లేదో దాన్ని. తార్కికవిధానాన్ని వదలి మామూలు మాటల్లో చెప్పాలంటే, ఆయన్ను మొదటగా నేను సవ్యంగా అర్థం చేసుకోలేకపోయాను అని.

అది రెండు దశాబ్దాల క్రిందటి విషయం. 1959 ఫిబ్రవరిలో తెనాలిలోని వి. యస్ ఆర్ కాలేజీలో నా ప్రసంగం ఏర్పాటయింది. నేను సభాస్థలానికి ప్రవేశించగానే ఒక సన్నని వ్యక్తి ఫ్రెంచ్ కట్ మీసంతో (అటువంటి మీసం వున్నట్లు గుర్తు), తెల్లచొక్కామీద సిల్కు ఉత్తరీయంతో, నాకు ఎదురొచ్చి కరచాలనం చేసి చిరునవ్వుతో 'చిక్కిపోయినట్లున్నారేం ?' అని అన్నారు. నేను ఆశ్చర్యపోయాను. ఎవ రీ అపరిచితవ్యక్తి. నన్ను పరిచితునివలె పలకరించారా అని! మాటలసందర్భంలో తెలిసింది ప్రసిద్ధమేధావి డాక్టర్ జి. వి. కృష్ణరావు ఆయనని. చాలాకాలం క్రిందట ఒక సభలో నేను ప్రసంగిస్తుండగా ఆయన శ్రోతల్లో వున్నారట. అప్పుడు నన్ను చూచారట వక్తను శ్రోతలు గుర్తుగా చూడటం సహజంగా జరుగుతుంది కాని, శ్రోతలను వక్త గుర్తుగా చూడటం జరగదు వారెవరో తనకు తెలియనప్పుడు. కనుక ఇదే జరిగింది మా ఉభయులకూ సంబంధించినంతవరకు.

సభ ప్రారంభం కాబోయేంతవరకు ఆయన నావద్దనే కూర్చొని చాలా త్వరత్వరగా మాట్లాడుతున్నారు అనేక సూక్ష్మవిషయాలను గురించి. ఎందుకో నాకు అనిపించింది, నా భావాలతో ఆయన ఏకీభవించటం లేదని చాలా విషయాలలో. నా భావాలతో ఏకీభవించని వారిమీద నాకు కోపం రాని అలవాటు ఏర్పడి వున్నందున నాకు ఆయనమీద అయిష్టం కలగలేదు. ఇంతలో సభ ప్రారంభమైంది. కళాశాల ప్రిన్సిపాల్ అయిన రేగలాండ్ అధ్యక్షత వహించాడు. ఆ సభలో నాదొక్కటి మాత్రమే అపూట ఉపన్యాసం. అందువల్ల కళాతత్వాం

మీద విపులంగా ఉపన్యసించాను. ఆ సందర్భంలో శుద్ధకళకూ, నైతికకళ (didactic art) కూ వున్న భేదాన్ని వివరిస్తూ నేను శుద్ధకళను సమర్థించాను. నా ప్రసంగం ముగిసిన తరువాత సభాధ్యక్షత వహించిన రేగ్‌లాండ్ తన తుది పలుకుల్లో నా కళాదృష్టికి భిన్నంగా నైతికకళను సమర్థించాడు.

సభలో ముందుభాగంలో నా కెదురుగా కూర్చున్న జి. వి. కె. అధ్యక్షుని అనుమతిని పొంది చాలా ఉద్రేక ముఖభంగిమతో వేదిక మీదికి వచ్చి తన మాటలు ప్రారంభించారు. ఆ వైఖరి చూచి అనుకొన్నాను, ఆయన నా ప్రసంగం మీద ఏదో దాడి చేయబోతున్నారని. తీరా ఆయన వ్యతిరేకత నా ప్రసంగం మీద కాక రేగ్‌లాండ్ నాకు వ్యతిరేకంగా పలికిన పలుకులమీద. జి.వి.కె. చేసిన ఆ చిన్న ప్రసంగంలో నాభావాలను సమర్థించటం కూడ జరిగింది. దానిమూలంగా వ్యక్తమైంది ఏమంటే, సభాప్రారంభానికి ముందు నాతో ఆయన మాట్లాడిన మాటలను నేను అపార్థం చేసుకొన్నా నని, నా భావాలతో ఆయన ఏకీభవించలేదని నాకు కలిగిన విశ్వాసం మిథ్యావిశ్వాసం మాత్రమే అని. నిజానికి ఆయన నా భావాలతో ఏకీభవించి వున్నట్లు ఆయన వేదిక ఎక్కి పలికిన పలుకులవల్ల విదితమైంది. అందుకే అంటున్నది ఆయన్ను మొదట నేను సవ్యంగా అర్థం చేసుకోలేకపోయా నని. కొందరి స్వరూపస్వభావాలు కలుస్తాయి; కొందరివి ఎంతో భిన్నంగా వుంటాయి; మాటలవైఖరికీ, ఆ మాటల వెనక దాగి వున్న భావాల వాస్తవానికీ కూడ ఎంతో భిన్నత్వం వుంటుంది. ఇదెంతో జి. వి. కె. లో వుండేది.

ఆటుతరువాత చాలాకాలం ఆయనతో మళ్ళీ కలపటం జరగలేదు. తెనాలిలోని వి. యస్. ఆర్. కాలేజీ నుంచి జి.వి.కె.బయటికి శాశ్వతంగా వచ్చినతరువాత ఆయన కొంత కాలానికి విజయవాడ రేడియోస్టేషన్‌లో ప్రవేశించటం జరిగింది. అప్పటినుంచి తిరిగి ఆయనతో సంబంధం ఏర్పడింది నాకు. ఆయనలో రెండు ప్రధాన మానసికశక్తులు పని చేస్తుండేవి— ఆలోచన, ఆవేశం. తార్కికమైన తాత్వికాలోచన విశ్లేషణాత్మకమైన పదునుతో ఆయనలో మేల్కొని వుండేది. ఆదేవిధంగా ఒక ఆవేశంకూడ ఆయనలో పొంగులు పారుతుండేది. సమన్వయస్వభావం, వ్యతిరేకతలను వోర్చుకొనే స్వభావం ఆయనలో తక్కువ వుండేది. తన అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలతో రాజీపడటం ఆయన ఎరగరు. ఇతర్ల ధోరణిని తాను వప్పుకోటంకంటే ఇతర్లచేత తన ధోరణిని వప్పించటం ఆయనకు ఎక్కువ సంతృప్తి. ఆ పనిలో ఆయనకు కొంత ఎక్కువ ఆవేశం ప్రజ్వలించేది.

రేడియోస్టేషన్‌లో నా ప్రసంగాలను రికార్డు చేసేటప్పుడు పని ఆయనే చేయిస్తుండే వారు. నా ప్రసంగాలను శల్యపరీక్ష అంటారే, అటువంటి శల్యపరీక్షను చేసి వాటిలోని కొన్ని పదాలను నా ఇష్టంతోనే సవరించేవారు. కొన్ని సంస్కృతపదాల ప్రయోగం దాక్షిణాత్యభాషలో ఒకవిధంగా, ఔత్తరాహిక భాషల్లో మరోవిధంగా వుంటాయి. నా రచనల్లోని సంస్కృత పదాలు ఎక్కువగా ఔత్తరాహికపద్ధానంలో ప్రయోగించబడుతుండేవి. అటువంటప్పుడు నా ప్రసంగాల్లోని అటువంటి పదాలను సవరించాలని రికార్డు చేయబోయేముందు ఆయన నాకు సూచించేవారు. ముందుగా నేను అంగీకరించేవాడిని కాదు తేలికగా. కాని, పదే పదే, అట్లా కాదు, ఇట్లా వుంటే బాగుంటుందని మొండిపట్టుగా కాక నర్మోక్తులతోనే గట్టిగా చెప్పేవారు. నాకు తెలుసు ఆయన నాకంటే ఎక్కువ ప్రతిభాస్వితుడనీ, విశిష్టవిద్వాంసుడనీ. అటువంట ప్పుడు ఆయన మాటకు అంగీకరించటంలోనే ఔచిత్యం వున్నదని నేను విశ్వసించి నా పదా లను ఆయన సూచనప్రకారం సవరించేవాడిని. పదాల సవరణను మాత్రమే కోరేవారు కాని భావపరివర్తన చేయమని ఆయన ఎన్నడూ కోరి ఎరగరు.

ఔత్తరాహిక భాషలలో వాడే సంస్కృతపదాలు 'సఫలత', 'పూర్ణత' అనే పద్ధతుల్లో వుంటే తెలుగులో 'సాఫల్యం', 'పూర్ణత్వం' అనే పదాలు వాడబడుతుంటాయి. అందువల్ల జి. వి. కె. అభిలాష ఏమిటంటే, 'సఫలత' అనే బదులు 'సాఫల్యం' అంటే బాగుంటుందనీ, 'పూర్ణత' కు బదులు 'పూర్ణత్వం' అంటే బాగుంటుందనీ, ఇటువంటి స్వల్పమైన తేడాలతో వున్న పదాలను మాత్రమే వాడేవాడినికాని పూర్తిగా మౌలిక భేదాలున్న ఔత్తరాహిక సంస్కృతపదాలను వాడేవాడిని కాదు. ఉదాహరణకు ఉత్తరదేశపు భాషల్లో నవలను 'ఉపన్యాస్' అంటారు. తెలుగులో ఉపన్యాసం అంటే 'లెక్చర్' అవుతుంది. ఆ భాషల్లో 'ఉద్యోగ్' అనే పదాన్ని 'ప్రయత్నం' అనే అర్థంలో, 'పరిశ్రమ' అనే అర్థంలో వాడతారు; ఉద్యోగ మంటే తెలుగులో 'నౌకరీ' చేయట మని వాడుకలో వుంది. ఈవిధంగా చాలా సంస్కృతపదాలు ఉత్తరదేశంలో ఒక అర్థంలో, దక్షిణదేశంలో మరొక అర్థంలో వాడుకలో వుంటూ వస్తున్నాయి. మా సమావేశాల్లో ఇటువంటి విషయాలెన్నిటినో చర్చించుకొనేవాళ్ళం.

శరీరం వేరు, మనసు వేరు కాక రెంటికీ అవినాభావసంబంధం కలిగి వుండివున్నా కూడ, రెంటి ప్రభావం ఒకదానిమీద మరొకటి వేస్తున్నదనే సత్యం వున్నాకూడ, ఈ సత్యం జి. వి. కె. విషయంలో కొంత భిన్నంగా వుండేది. ఆయన శరీరం ఒక ఎముకలగూడు. అనారోగ్యం ఆయన శరీరంలో నిరంతరం మేల్కొనే వుండేది. కాని విచిత్రం ఏమంటే

ఆయన మానసం మాత్రం ఎంతో ఆరోగ్యంగా వుండేది. ఆయన శారీరక అనారోగ్యం మేలొ్కని వుంటే, ఆయన మానసికారోగ్యం మేలొ్కని వుండేది. ఎటువంటి శారీరక దుస్థితిలో కూడ అయన జీవితంలో మానసిక దుస్థితి ప్రాదుర్భవించలేదు. తన శారీరక ప్రభావం నుంచి తన మనసును ఏవిధంగానో దూరంగా వుంచగలిగేవారు ఆయన. సందేహం లేదు, వైజ్ఞానికంగా శరీరం అనేది మనసు అనేది అభిన్నాలు. అయినప్పటికీ మానవుడు తన సాధనద్వారా శారీరక ప్రభావం నుంచి, సంపూర్ణంగా కాకపోయినా కొంతవరకైనా, మనసును స్వాతంత్రంగా వుంచగలడు అనే సత్యానికి జి. వి. కె. జీవితం ఒక బలమైన తార్కాణం!

1970 లో తుమ్మపూడిలో మా ఇంట సంక్రాంతినాడు ఒక సాహితీ గోష్ఠి జరిగింది. ఆహ్వానాన్ని అందుకొని జి. వి. కె. వచ్చారు తుమ్మపూడి. వారు వచ్చేవరకు ఉదయపు సమావేశం పూర్తయింది. అప్పటికి నేను సమావేశం ముగించుకొని వచ్చి ఇంట కూర్చొనివున్నాను. ఆయన వచ్చి నవ్వుతూ అన్నారు "ఈవేళకు సమావేశం అయిపోయివుంటుందనే నమ్మకంతోనే ఈ సమయంలో వచ్చాను. నా ఆరోగ్యం నిన్నటినుంచీ మరీ బాగుండలేదు. అసలు రాకుండానే వుండాలనుకొన్నాను. కాని రాకుండా వుండలేకపోయాను. అయితే సమావేశంలో పాల్గొని ప్రసంగించేలాంటి ఓపిక నేడు లేనందున మన ఉభయులం మాత్రమే సమావేశమవుదామని వచ్చాను. అంటే అసలు రాకుండా వుండటం కాని, వచ్చి సమావేశంలో పాల్గొనటం కాని చేయక ఆరెంటికీ మధ్యమార్గాన్ని అవలంబించాను," అని. ఆయనకు పెద్దగా నవ్వటం అంతగా అలవాటుండేది కాదు ఎప్పుడో అరుదుగా తప్ప. ఆరోజు మాత్రం పెద్దగా నవ్వటం ప్రారంభించారు.

ఆయన భోజనం చేయకుండా సిగరెట్లతో మాత్రమే ఆకలిని తీర్చుకొంటూ నాతో చాలా సమయం వివిధవిషయాల చర్చలతో గడిపారు. ప్రత్యేకించి ఆ ఘడియల్లో మా సంభాషణల్లో ప్రాధాన్యం వహించింది తొమ్మిదవ శతాబ్దంలోని విఖ్యాత కాశ్మీరవిద్వాంసుడు ఆచార్య ఆనందవర్ధనుడు రచించిన "ధ్వన్యాలోకం" గురించి. ఆ గ్రంథం అంటే జి. వి. కె. కి చాలా ఇష్టం. అందులోని కొన్ని శ్లోకాలు ఆయనకు కంఠస్థం కూడ. అభిధ, లక్షణ లాంటివి సాహిత్యంలో వాటి ప్రముఖస్థానాన్ని అవి కలిగివున్నా కూడ వ్యంజనకు సాహిత్యంలో వున్న స్థానం ఒక విశిష్టమైంది. రసస్పృష్టికి అది బలియమైన ఉపకరణం. ఇటువంటి మాటల్లో ఆయన తన అభిప్రాయాలను అభివ్యక్తపరచే ప్రయత్నం చేస్తుంటే మధ్య మధ్య దగ్గు వచ్చేది. కొత్తవారికి ఆయన టి. బి. రోగిగా గోచరించేవారు. కాని ఆయన్ను ఆక్రమించుకొన్న వ్యాధి

టి. బి. కాదు. అది ఉబ్బసం. మధ్యాహ్నానంతరం ఆయన తిరిగి వెళ్ళిపోయారు. రాజాలక, రాకుండా వుండజాలక రావటం జరిగింది తుమ్మపూడికి!

మేము కలుసుకొన్నప్పుడు మా సంభాషణలు ప్రధానంగా సాంస్కృతిక విషయాలకు చెందినవై యున్నా కూడ ఎప్పుడైనా సామాజిక, ఆర్థిక విషయాలు కూడ వాటిలో తొంగి చూచేవి; రాజకీయవిషయాలు వాటిలో అంతగా చోటు చేసుకొనేవి కావు, నేను సాధారణంగా ఏ సిద్ధాంతాలకూ అంతగా కట్టుబడి వుండేవాడిని కాదు. జి. వి కె. రాడికల్ హ్యూమనిస్టు సిద్ధాంతాలతో ఎక్కువ ఆసక్తిని కనపరుస్తుండేవారు. ఏ విషయంలోనైనా ఆయన పై భాగాన్ని మాత్రమే స్పృశించి తృప్తిపడేవారు కాదు; దాని అందని లోతులను అందుకొని దాని గాఢత్వాన్ని గూఢత్వాన్ని కూడ కైవసం చేసుకొనేవారు.

నాగార్జునుని మాధ్యమిక సిద్ధాంతం ఎంతో తార్కికజటిలత్వం కలిగి చాలా నిగూఢమైనట్టిది. అటువంటిదాన్ని జి. వి. కె. సాకల్యంగా గ్రహించి దాని జటిలత్వాన్ని కొంత వరకు తగ్గించారు. మాధ్యమికసిద్ధాంతాన్ని అర్థం చేసుకోట మనేది ఈన్‌స్టయిన్ సాపేక్షక సిద్ధాంతాన్ని (Relativity) అర్థం చేసుకోటంతో సమానమైన కష్టమైంది. అయినా అటువంటిదాన్ని జి.వి.కె. అర్థం చేసుకొన్నారు. అర్థం చేసుకోటం మాత్రమే కాదు, దాన్ని గురించి విపులంగా వివరించగలిగారు కూడ. జి. వి. కె. మతవిశ్వాసాలకూ కట్టుబడిన వ్యక్తి కాదు. అయినా, బౌద్ధం అంటే ఆయనకు అభిమానం. బౌద్ధం అనేది అన్ని మతాలవలె మతంగా కాక ఒక బుద్ధిమూలకమైన హేతువాదబద్ధ జీవనవిధానంగా వుండటమే అందుకు కారణం.

ఒకనాడు ఏదో నా ప్రసంగాన్ని రికార్డు చేయటానికి విజయవాడ రేడియో స్టేషన్‌కు వెళ్ళాను. జి.వి.కె. నా ప్రసంగాన్ని రికార్డు చేయించిన తరువాత ఆ సాయంత్రం నన్ను తమ విజయవాడ నివాసానికి తీసుకొని వెళ్ళారు. ఆ రోజుల్లో వాళ్ళ ఒకబ్బాయి అనారోగ్యస్థితిలో వున్నాడు. ఆ విషయం జి.వి కె.కి కొంత వ్యథ కలిగిస్తుండేది. మాటల సందర్భంలో ఆయన అన్నాడు: "ఇటువంటి ఇబ్బందులను కూడ మనసులోకి రానీయకుండా బాధ పడకుండా వుండ వచ్చు కాని అటువంటి బాధ పడకుండా వుండటం మరీ పచ్చి స్వార్థ మవుతుంది." ప్రతిదానికీ బాధపడటం ఎంత పనికిరాదో ప్రతిదానికీ బాధపడకుండా వుండటం కూడ అంత పనికిరాదు, అనేది ఆయన నమ్మకం. అయితే ఆ బాధను ఎక్కువకాలం వుండనీయరాదు.

ఒక వ్యక్తిలోని నిజస్వభావాన్ని కొంతవరకైనా సక్రమంగా తెలుసుకోవాలంటే ఇంటి వద్దనే తెలుసుకోవాలి. తాను పని చేసే కార్యాలయాల్లో కాని, వీధుల్లోకాని, మరోచోట మరో

కోట కాని వ్యక్తి తనలోని కొన్నిటిని దాచటం, తనలో లేని కొన్నిటిని నటించటం మొదలైనవి జరిగే ప్రమాదం వుంది. కాని ఆ వ్యక్తి ఇంట వున్నప్పుడు అటువంటి ప్రమాదం అంతగా వుండదు. ఈ ప్రత్యేకతను తన ఇంట వున్నప్పటి జి. వి. కె. లో కూడ గ్రహించాను. కాఫీ ఆవిరి, సిగరెట్టుపొగా, వీటి మధ్య ఆయన చాల స్వేచ్ఛగా సంచరించారు. ఇదివరకు చెప్పని మాటలు ఎన్నో చెప్పసాగేరు. ఇదివరకు వినని నామాట లెన్నో వినసాగారు. జీవితంలో సౌందర్యస్థానాన్ని గురించి ఎక్కువగా ముచ్చటించుకున్నాం. వ్యక్తిసౌందర్యం, వస్తుసౌందర్యం, స్థలసౌందర్యం, సేంద్రియ (organic) సౌందర్యం, నిరింద్రియ (norganic) సౌందర్యం మొదలైన విషయా లెన్నో మా సంభాషణలకు వస్తువులైనాయి.

మధ్యలో కొంతసేపు అసలు విషయాన్ని వదలి ఏవో దైనందిన వ్యవహారాలను గురించి ముచ్చటించుకొని తిరిగి అసలు విషయానికి వచ్చాం. ఆయన వెంటనే ప్రశ్న వేశారు: నా దృష్టిలో సౌందర్యం వ్యక్తిగతం(subjective)అయిందా లేక వస్తుగతం (objective) అయిందా అని. 'ఉభయగతం' అని నేను జవాబు చెప్పేను. ఈ విషయంలో తాను ఇంత వరకూ ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నట్లు తెలిపేరు. "సౌందర్యం వ్యక్తిగతం మాత్రమే అని నమ్ముదామా అంటే అది వస్తుగతం అనే సత్యం అడ్డు వస్తుంది. ఇది నిజమని నమ్ముదామా అంటే అది అడ్డువస్తుంది. అందువల్ల ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాను. కాని మీ జవాబు 'ఉభయగతం' అనేది నా సందేహాన్ని తీర్చింది. అంటే సౌందర్య అనేది వ్యక్తిగతం మాత్రమే కాదు, వస్తుగతం మాత్రమే కాదు, ఆ రెండూ కూడా అన్నమాట," అని ఆయన సంతృప్తిని ప్రకటించారు. ఆయనలో రాజీపడే స్వభావం చాలా తక్కువ. అయినప్పటికీ సక్రమమైన హేతువు స్పష్టంగా కనిపించినపుడు రాజీ పడటానికి వెనకాడే రాతిస్వభావం కాదు ఆయనిది. అతి మేధావులు ఒకోసారి పసిపిల్లలవలె సంచరిస్తారు. మళ్ళీ 'ఉభయగతం' అనే నామాటను తీసుకొని "అవును, సౌందర్యం ఉభయగతం, ఉభయగతం, ఉభయగతం" అనటం విని నాకు నవ్వు ఆగలేదు. నా నవ్వులో తన నవ్వును కూడ కలిపేరు ఆయన!

నాగార్జునుడు అంటాడు: "అస్తి నాస్తి తదుభయం నాస్తి" అని. ఉన్నది, లేదు అనే రెండూ లేవు, ఈ పేరడాక్సును గురించి కొంతవరకు చర్చించుకొన్నాం. "కొన్ని పేరడాక్సులు మాటల్లో అనటానికి మాత్రమే కుదుతాయి కాని కార్యరూపంలో కుదరవు; ఇందుకు ఏమంటారు మీరు," అన్నాను. ఆయన కొంచెంసేపు మౌనంగా ఆలోచనలో పడి అన్నారు: "అవును, అందుకే అది పేరడాక్సు. కార్యరూపంలో కుదిరినదంతా మాటల్లో కూడ కుదురు

తుంది కాని మాటల్లో కుదిరినవన్నీ కార్యరూపంలో కుదరవు". దాన్ని బలపరుస్తూ నేనొక ఉదాహరణ చెప్పేను. "మనిషికి రెక్కలు వచ్చి ఆకాశంలో ఎగిరిపోయాడు అని మాటల్లో అనవచ్చు కాని, మనిషికి రెక్కలు రావటం జరగదు. ఆకాశంలో ఎగిరిపోవటం జరగదు వాస్తవజీవితంలో. అయితే ఇది స్వప్నజీవితంలో జరుగుతుంది." ఇందుకు మా ఉభయుల మధ్య ఏకాభిప్రాయమే కుదిరింది. కొన్నిటిలో ఏకాభిప్రాయం కుదరక తప్పదుమరి.

కొంతసేపు జి. వి. కె. తన జీవితంలోని సుమారభూతకాలానికి సంబంధించిన ఘటనాచక్రాన్ని త్రిప్పటం చేశారు. చిన్నప్పటి చదువులు, అప్పటి భయాలు, బాధలు, వ్యథలు, నిరాశ నిస్పృహలు, అభిలాషలు ఆశయాలు, ఇష్టాలు అయిష్టాలు, చేదులు తీపులు ఈవిధంగా ఎన్నో విషయాలు. "కళాపూర్ణోదయం" మీద తాను రచించిన 'థీసిస్' ను ఆంధ్ర విశ్వవిద్యాలయం స్వీకరించకపోవటం, మద్రాసు విశ్వవిద్యాలయం దాన్ని స్వీకరించి తనకు 'డాక్టరేట్' ను ప్రసాదించటం మొదలైనవాటిని గురించిన వెన్నో మాటలు నడిచాయి.

తరువాత తన స్వీయరచనలను గురించి ముచ్చటిస్తూ అన్నారు: ''వ్రాయాలనుకొన్న వన్నీ ఇంతవరకూ వ్రాయలేకపోయాను. ఇంతవరకు వ్రాసినవి తక్కువ, వ్రాయాలిసినవి చాలా ఎక్కువ. వ్రాయాలిసిన వాటన్నిటినీ వ్రాయలేనేమో అని ఒకోసారి సందేహంవేస్తుంది" అని కొంచెం గంభీరముద్ర దాల్చారు. అందుకు నే నన్నాను, ''వ్రాయలేనేమో అని సందేహం కలిగితే పరవాలేదు. కాని భయం మాత్రం కలగకుండా వుండాలి. సందేహం అనేది జ్ఞానాన్ని వృద్ధి చేస్తుంది, భయం అనేది జీవితాన్ని పాడుచేస్తుంది." ఆయన నిజం అంటూ తల వూపేరు. నేను అక్కడనుండి రైలుస్టేషన్‌కు చేరుకొన్నాను.

ఒక చలికాలపు మధ్యాహ్నానంతరం నేను మా ఊరి బకింగ్‌హాం కాలువ వెంట ఉత్తరంగా, నులివెచ్చని తెల్ల ఎండలో నీలాకాశం క్రింద నీలజలాలమీద ఎగురుతూన్న తెల్లకొంగలను చూస్తూ పోతున్నాను. అకస్మాత్తుగా ఒక ఎర్రబస్సు విజయవాడ వైపునుంచి వచ్చి నా దగ్గర ఆగిపోయింది. నేను ఆశ్చర్యంగా బస్సువైపు చూస్తుండగానే నవ్వుముఖంతో జి.వి.కె. బస్సునుంచి దిగేరు. జారిపోతున్న సిల్కు ఉత్తరీయాన్ని మెడచుట్టూ చుట్టుతూ అన్నారు : "మీ చొక్కారంగును చాలాదూరంనుంచే గుర్తించి బస్సును ఆపమని గొడవ చేశాను. ఇప్పుడది మీసరిగా వచ్చి ఆగింది. ఏమీలేదు, కనిపించారు కనుక పలకరించి పోదామని దిగేను. మన సంభాషణలకిది సమయం కాదు. బస్సులోని ఇతర ప్రయాణికులు బాధపడతారు నేను ఆలస్యం చేస్తే. సరే వస్తాను," అంటూ తిరిగి బస్సు ఎక్కి తెనాలి వైపుకు వెళ్ళిపోయా రాయన.

మనుషుల మీద ఎంత ఆప్యాయతో ఆయనకు! అందుకే అంటాను మానవతయే ఆయన మతం అని.

అయితే, ఆయన మానవతలో ఒక లోపం గోచరించేది. ఇష్టమైన వ్యక్తుల మీద ఎంత ప్రీతి వుండేదో ఇష్టం కాని వ్యక్తులమీద అంత రోత వుండేది. అనుకొన్నాం కదూ ఆయనలో రాజీమార్గం తక్కువని. ఇష్టంకాని వ్యక్తుల మీద కూడ ప్రీతిని పెంచుకోవాలనే ఆదర్శం ఆయనలో నిద్రాణమై వుండి మేల్కొనటం లేదేమో, తెలిసేది కాదు. అందుకే అనిపిస్తుంది ఆయనలో ఆలోచనకుతోడు ఆవేశం కూడ తీవ్రంగా వుండేదని. నరాల బలహీనం గల మనుషులకు కోపం వస్తే శరీరం వణికిపోతుంది. అదే జి. వి. కె.లో కనిపించేది. ప్రతి సదాశయం సదాచరణంగా మారటం కష్టం. ఆచరణ వున్నా లేకపోయినా సదాశయం వుండటం మంచిది. చాలామంది మహామేధావుల వలెనే ఆయనకు కూడ లౌకికవ్యవహారాలకు సంబంధించిన జ్ఞానం తక్కువగా వుండేది. లోకపు పోకడలు, తంతులు తమాషాలు, కపటాలు మోసాలు, మిథ్యావినయాలు నటనలు, ఏ ఎండకు ఆ గొడుగు పట్టడం మొదలైన చీకటి గుణాలు ఆయనకు తెలిసేవి కావు.

విజయవాడ రేడియోస్టేషన్‌ను ఆయన వదలిన తరువాత ఆయనతో చాలాకాలంవరకూ అంటే ఆయన జీవనసంధ్యవరకూ నాకు మళ్ళీ సంబంధం లేకుండా పోయింది. 1979 వ సంవత్సరం మార్చి 30 న తెనాలి లోని ఆయన అభిమానులు ఆయనకు సన్మానసభ ఏర్పరచటం, అందులో డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇంకా మరికొందరు పాల్గొనటం జరిగింది. సభాకార్యక్రమానికి ముందు మేమంతా తెనాలిలో జి.వి.కె. గారింటికి పోవటం జరిగింది. ఎంత కాలానికో తిరిగి ఆయన్ని చూడటం జరిగింది. గుర్తుపట్టటానికి వీలుకాని వైఖరిలో వున్నారాయన. ఆ కనిపించేది జి.వి.కె. కాదు, ఆయన నీడ మాత్రమే అనిపించింది! నే నెరిగిన జి.వి.కె. ఏడీ? నే నెరగని జి.వి.కె. ఈయన. నాకు తెలిసిన జి.వి.కె. ఏనాడో మరణించి నాకు తెలియని జి.వి.కె. ఈనాడు జీవించి వున్నాడు! అయినా, నాకు తెలియని ఈనాటి జి.వి.కె. లోనే నాకు తెలిసిన అనాటి జి. వి. కె. ని అనుభూతి చెందసాగేను ఆ వసంత సంధ్యలో.

# రచయిత బాధ్యత

జి. వి. కృష్ణరావు

ఒకానొక రచనలోని ఒక పాత్ర అంటుంది....'తనకోసం ఏడ్వటం దుఃఖం, లోకం కోసం ఏడ్వటం కవిత్వం; ఉభయులకోసం ఏడ్వటం ధర్మం' అని. చమత్కారం కోసమే అన్నా యీ మాటలో ఎంతో సత్యమున్నది. నిజానికి ప్రపంచ విఖ్యాతి పొందిన కవులంతా లోకంకోసం స్పందించి ఆవేదించినవారే.

క్రౌంచ మిథున విషయక శోకమే వాల్మీకి నోటినుంచి శ్లోకంగా వెలువడి ఆదికావ్యంగా అవతరించింది. సుప్రసిద్ధ నాటకకర్తయైన ఇబ్సన్ తన కాలంనాటి సమాజంలోని అనిష్టస్థితి. గతులను, వ్యవస్థలను, సమస్యలను చిత్రించి ప్రజలను పర్యుత్సుకులను చేశాడు.

## సమాజ చిత్రణ

పుష్కిన్ మొదలుకొని గోర్కీ వరకు అనల్పసంఖ్యాకంగా ఉన్న రష్యన్ రచయితలు తమ సమాజంలోని ఎచ్చులొచ్చులను,వ్యసనాలను,దుర్భరదారిద్ర్యాన్ని, అవినీతిని, అధర్మాన్ని తూర్పారబట్టారు. సంస్కారవంతుల హృదయాలలో మారుమ్రోగుతున్న ఆదర్శ సంఘర్షణా ఘాతాలను కార్యశూరుల నేత్రాలలో మెరుస్తున్న నూతన వ్యవస్థా పూర్వక ఆశాజ్యోతులను చిత్రించి యావజ్జాతిని ఉర్రూతలూచారు.

ఆ కవులు గతించారు. ఆనాటి స్థితిగతులు అంతరించాయి. అయినా ఆ యాకృతులు నేటి సహృదయుల హృదయాలలో మెదలుతూనే ఉన్నై. ఉత్తమ కావ్యాలుగా ఆకృతి పొందుతూనే వున్నవి.

కాని నేడు వెలువడుతున్న ఆంధ్ర సాహిత్యం పరిశీలిస్తే యీనాటి మన జీవితం, అందులో ఉబుకుతున్న ఆశా నైరాశ్యాలు, అంకురిస్తున్న సమస్యలు గోచరిస్తున్నవా ? మన సరిహద్దులలో శత్రుసైన్యం తిష్ఠవేసింది. దేశంలో దారిద్ర్యం ఆక్రోశిస్తున్నది. ఒక ప్రక్క జనసంఖ్య పెరుగుతున్నది. మరొకప్రక్క పంట పెంపుదలకై రైతు సతమతమవుతున్నాడు. వేరొక ప్రక్క పారిశ్రామికాభివృద్ధికై ప్రయత్నాలు సాగుతున్నవి. ఇంకొకప్రక్క అవినీతి బుసకొడుతున్నది. క్రొత్తప్రాతల కలయికతో ప్రాత విలువలు రాలిపోతున్నవి. క్రొత్త విలువలు చివురొత్తలేకపోతున్నవి ప్రాచీన కుటుంబవ్యవస్థ అస్తవ్యస్త మవుతున్నది. ఏది దారి ? ఏది గమ్యం ? అని విద్యావంతులు విప్రతిపన్నులవుతున్నారు. విభిన్న పక్షనాయకులు విభిన్న శంఖాలూదుతున్నారు. కొందరు వినగలుగుతున్నారు - కొందరు వినలేకపోతున్నారు. కొందరు అర్థం చేసుకొంటున్నారు. కొందరు అర్థం చేసుకోలేకపోతున్నారు. అయినా భారతం యీ నినా**దాంతో** బూరటిల్లుతూనే వున్నది.

కాని ఈ ఉద్వేగాలు, ఆరంభాలు, సంరంభాలు, సందేహాలు, శక్తతలు, అశక్తతలు అనాసక్తతలు మన సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నవా ?

ఈనాటి కొన్ని రచనలు గతాన్ని త్రవ్వి త్రవ్వి ఎగరోజుతున్నవి. కొన్ని అన్యదేశీయులను అనుకరించి అరణ్యరోదనం చేస్తున్నవి. కొన్ని ప్రణయకలాపాలను పాడి పాడి దస్సిపోతున్నవి. కొన్ని వైయష్టిక సమస్యలను పనవి పనవి వానప్రస్థం వెళ్లుతున్నవి. కొన్నిట అరపులేకాని కరపులుండవు. కొన్నిట గూళ్ళే కాని పూరేళ్లుండవు. కొన్నిట శబ్దాల గారడీలు, కొన్నిట ప్రాసల బురుడీలు.

లోకాన్ని అవగతం చేసుకోవటం

ఇవి ఈనాటి మన సాహిత్యంలో సాగుతున్న సాము గరిడీలు.

మరి కారణం ?

ఇక్కడ ఇప్పుడు యీ పంచేంద్రియాలకు గోచరమవుతున్న లోకాన్ని దర్శించలేక మన రచయితలు ఎప్పుడో ప్రవర్తిల్లు లోకాలను సంస్మరిస్తున్నారు. ఒకవేళ ఇప్పటి మన ఈ లోకాన్ని దర్శిస్తున్నా అవగతం చేసుకోలేకపోతున్నారు. అవగతం చేసుకొన్నా స్వార్థప్రాకారం లోపల నాలుగు కంబాలాట ఆడుతున్నారేకాని యీలోకంకోసం స్పందింపలేకపోతున్నారు.ఇప్పటి మన యీ లోకాన్ని అవలోకించి అవగతం చేసుకొని దీనికోసమే ఆవేదన పొంది నివేదింప గలిగినపుడే రచయిత కవి ఔతున్నాడు, కానినాడు కవియశఃప్రార్థి అవుతున్నాడు.

# కీలు బొమ్మలు

ఆర్. యస్. సుదర్శనం

[సుదర్శనంగారు 1927 లో మదనపల్లిలో జన్మించారు. విద్యాభ్యాసం మదనపల్లి, మద్రాసులలో. ఆంగ్లంలో ఎమ్.ఎ. పట్టంపొందారు. ప్రస్తుతం రాజమండ్రి ప్రభుత్వకళాశాల ప్రిన్సిపాల్‌గా ఉన్నారు. సుదర్శనంగారి విమర్శనగ్రంథం 'సమాజం-సాహిత్యం' నవల 'సంసార వృత్తం' ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ బహుమతులను అందుకొన్నాయి. వీరి ఇతర రచనలు : అనుబంధాలు, మళ్ళీవసంతం, అసుర సంధ్య(నవలలు), కాలం తెచ్చిన మార్పు(కథాసంపుటి), సాహిత్యంలో దృక్పథాలు (విమర్శ), నిశాంతం (కవిత).

శ్రీ సుదర్శనం ఇండియన్ పి. ఇ. యస్. సభ్యులు ]

* * * * *

"అధికసంఖ్యాకులకు శ్రేయస్కరమైనదే ధర్మం, వారికి ఉపయోగిస్తేనే శాస్త్రం, వారికి ఆనంద మిస్తేనే కళ అని అంటున్నారు. ధర్మ మేదో శాస్త్ర మేదో, కళ యేదో నాకు నేను, నీకు నీవు చెప్పుకోటానికి వీలు లేదు. అధికసంఖ్యాకులు ఏమనుకుంటున్నారో దానిని బట్టి చెప్పుకోవాలి. ఈ తత్త్వంతో శివాలు ఎత్తిస్తున్నారు. ప్రజలు 'వివేకం ఉన్నది విచారించుకొందా' మని మరచిపోయి శరభ దశ్శరభలు కొడుతున్నారు. ఈ పరిస్థితిలో మనవంటి అల్పసంఖ్యాకులకు రెండే మార్గాలు ఉన్నాయి. మన వ్యక్తిత్వం పూర్తిగా విడిచిపెట్టి అధిక

సంఖ్యాకులలో లీనమై పోవాలి. వీళ్ళు చెప్పింది వేద మని ఒప్పుకోవాలి........లేదా సంకుచిత స్వార్థాన్ని అధిగమించి సర్వమానవకోటికి — అంటే ప్రతిఒక్క మానవునికి శ్రేయస్కర మైన ధర్మమార్గాన్ని చూపించగలగాలి....అలాంటి గురుతరబాధ్యతే వివేకవంతుల మీద ఉంది. ఈ రెండూ జరగకపోతే మనం నామరూపాలు లేకుండా నాశనమైపోతాము. ఇవీ ఇప్పటి పరిస్థితులు." కీలుబొమ్మలుగా ప్రవర్తిస్తున్న మనుష్యులకి స్వయంనిర్ణయం సాధ్యమా ? అనే ప్రశ్నకు సమాధానం అన్వేషించడంలో కృష్ణరావుగారు అనుభవించిన అంతర్మథనం, పొందిన నిర్వేదం 'కీలుబొమ్మలు' నవలలో విస్తృతంగా అభివ్యక్తి పొందింది. గ్రామీణుడైన ఈ రచయిత గ్రామాలను గురించి, 1950 ప్రాంతాల జరిగిన సంఘటనలు దృష్టిలో ఉంచుకొని. ఇచ్చిన తీర్పు — "ఈనాటి గ్రామాలు కేవలం మురికి కూపాలు. అసత్యం, అధర్మం వాటికి ఆలంబనాలు. డబ్బు, అధికారం, అజ్ఞానం వాటి కులదేవతలు....ఆ సంగతి వాటికి తెలుసు. ఆదే మరీ ఘోరం. తెలియకపోతే ఏనాటికైనా తెలపటానికి అవకాశం ఉన్నది. కాని, తెలిసి తెలిసి చేస్తున్నప్పుడు ఎన్ని జీవితాలు ధ్వంసమై ఏమిటి ప్రయోజనం?" నవలలో రచయితకు ప్రతినిధి డా॥ వాసుదేవశాస్త్రి. అతని ద్వారా రచయిత పలికిన మాటలే పైన ఉల్లేఖింప బడినవి.

నవలలో సమస్యని ధర్మానికి చెందిన సమస్యగా రచయిత రూపొందించారు, వ్యక్తి తన ధర్మాన్ని విస్మరించడం, సమాజంలో ధర్మచ్యుతికీ, సార్వజనిక సంక్షోభానికీ ఎలా దారి తీస్తుందో నిరూపించేవిధంగా కథాసంవిధానాన్ని ఏర్పరిచారు. పుల్లయ్య చంద్రశేఖరానికి మార్వాడీ దగ్గర ఐదువేల రూపాయల ఋణానికి పూచీపడ్డాడు. చంద్రశేఖరం స్థితి చితికి పోవడంతో పుల్లయ్య తన బాధ్యతను వెనక్కితీశాడు. అలా చెయ్యడానికి ఏర్పడిన పరిస్థితు లను విశ్లేషించడంలో రచయిత వ్యక్తి మనస్సు యొక్క సంశ్లిష్టస్థితిని (complexity) ప్రధానమైన భూమిక చేసుకొన్నారు. దానికి తోడుగా వర్గరాజకీయాల్ని చిత్రించారు. ఫలితంగా గ్రామానికి వాటిల్లిన ఆపదనూ, నష్టాన్నీ చిత్రించారు. ఇలా వ్యక్తిమనస్తత్వము, వర్గరాజ కీయాలు, సామాజిక సంక్షోభము మూడు పొరలుగా ప్రదర్శించడంలో రచయితకు ఫ్రాయిడ్ సిద్ధాంతాలూ, మార్క్సిస్ట్ రాజకీయాలూ, 1950 నాటి కొన్ని సంఘటనలూ ఆలంబనమైనవి. ఈ మూడింటినీ ప్రత్యేకంగా నవలలో గుర్తిస్తూ, వ్యాఖ్యానిస్తూ వివరణకు పూనుకొంటే ఈ వ్యాసం పరిధి చాలా విస్తృత మౌతుంది. అందువల్ల అటువంటి పరిశీలనను పాఠకులకే వదలిపెట్టి ముఖ్యంగా గమనించవలసిన కొన్ని విషయాలు మాత్రమే ప్రస్తావిస్తాను.

కృష్ణరావుగారు ధర్మాచరణవిషయంలో వ్యక్తికీ అతని అంతఃకరణకూ ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. పుల్లయ్య ధర్మాన్ని విస్మరించడంలోనూ డా॥ వాసుదేవశాస్త్రి ధర్మచ్యుతిలోనూ ఫ్రాయిడ్ ప్రతిపాదించిన అవచేతన (sub-conscious mind) ప్రమేయం చాలా ఉన్నది. కాని అలా జరిగిన పొరపాటుని సమయం మించిపోకుండా సవరించుకోవడానికి వ్యక్తి చేతనకు (consciousness) అవకాశం ఉన్నది. అదే పురుషకార్యం. పుల్లయ్య ఆ అవకాశాన్ని ధైర్యంగా ధర్మనిర్వహణకు ఉపయోగించకుండా, పిరికితనంతో, స్వార్థంతో, దాన్ని జారవిడుచుకొంటాడు. డా॥ వాసుదేవశాస్త్రి అలా కాకుండా, చీకట్లో జరిగిన పొరపాటుకు బాధ్యత వహించి సామాజికంగా దాన్ని సవరించడానికి సిద్ధపడతాడు. కాని శాస్త్రి పొరబాటులో భాగస్వామిని అయిన పద్మ అందుకు అంగీకరించదు! 'తన కా సాహసం లేదు' అంటుంది. అప్పుడు డాక్టరు విరక్తిగా అంటాడు ; "మిమ్మల్ని కన్న భరతవర్షం ధన్యం. మీకు మార్గదర్శకులైన సీతారాములు ధన్యులు ఫో, పద్మా ! ఫో. నా ఇల్లు నరకకూపం. నా హృదయం పాపపంకిలం"........"ఆమెను నెట్టివేసి దభేలున తలుపు వేసుకున్నాడు. కస్తూరి పేరు చెప్పుకుని గబ్బిలాల పెంటలో పొరలాడే జాతికా తానింతకాలం హృదయం పిండిపోస్తున్నది!...." రచయిత డాక్టరు ద్వారా చేసిన ఈ వ్యాఖ్యానంలో రచయిత ఆదర్శవాదం వ్యక్తమౌతున్నది. ఇందులో మానవతావాదం లేదు. రచయిత ధర్మానికి ఇచ్చిన ప్రాధాన్యం, ఆ ధర్మాన్ని నిర్వహించలేని అశక్తులనూ. పిరికివాళ్ళనూ ఆయన ఏవగించుకొన్న తీరు, రచయితను ఆదర్శవాదిగానే నిరూపిస్తున్నవి. వ్యక్తిధర్మాచరణ విషయంలో అన్ని పాత్రల వైఖరి కూడా నిరాశాజనకంగానే రచయిత చిత్రించారు. గుమాస్తా సత్యనారాయణ-"పుల్లయ్య మరచిపోతే గుర్తుచేయడం అతని ధర్మం కాదా ? ఆయనకు కోపం వస్తేనో ! గంపెడు సంసారం ఎలా ఈదాలి ? ఇప్పుడు అంతగా మించిపోయింది ఏమీ లేదు," అంటూ జాప్యం చేస్తాడు. పొట్టిరామయ్యవంటి పేద రైతులు పుల్లయ్య ఇచ్చే పుగాకు కాడకు మురిసి పుల్లయ్యను సమర్థిస్తూ ఇచ్చకాలు పలుకుతారు. మలయ్య వంటి ప్రత్యర్థి, ప్రత్యర్థిగానే పుల్లయ్యని ఇబ్బందిలో పెట్టడానికి చూస్తాడు. సంఘసేవిక అమ్మాయమ్మ దృష్టిలో చంద్రశేఖరం కుటుంబానికి వచ్చిన దుస్థితి తన హస్టలు పరపతిని పెంచడానికి ఒక మంచి అవకాశం. ఈ విధంగా అసలు నిజమేమిటో అన్వేషించే అభినివేశం ఎవ్వరిలోనుకన్పించదు! ధర్మాన్నిగూర్చి సత్యాన్ని గూర్చి పట్టించుకున్నది ఒక్క డా॥ వాసుదేవశాస్త్రి మాత్రమే. బాధితుడైన చంద్రశేఖరం కూడా సత్యాన్ని నిగ్గదీసే ప్రయత్నం చెయ్యకపోవడం మనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. తన అసమర్థతని భార్య ఎదుట, సమాజం ఎదుట అంగీకరించలేని చంద్రశేఖరం

పుల్లయ్య తలపెట్టిన అన్యాయాన్ని ఆలంబనం చేసుకొని, బాధితుడుగా ఇతరుల సానుభూతి పొందడానికి ప్రయత్నిస్తాడు! నిజానికి చంద్రశేఖరం పుల్లయ్యల మధ్య ఈ వ్యవహారం మొదట్లోనే వాళ్ళిద్దరూ కలిసి తేల్చుకుంటే సమస్యే ఉండేది కాదు గదా! అనే ఊహ వస్తుంది మనకు. కాని అలా జరగకపోవడానికి బలమైన కారణం : వారిద్దరి వ్యక్తిగత మనస్తత్వాలే కాదు; వారు రాజకీయంగా భిన్నవర్గాలకు చెంది ఉండటమే ! ఐతే రచయిత ఈ కారణాన్ని నవల ఉత్తరార్థం దాకా నొక్కిపెట్టి మొదట్లో వైయక్తిక కారణాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. పదహారవ అధ్యాయంలో వాసుదేవశాస్త్రి చంద్రశేఖరాన్ని పుల్లయ్య దగ్గరకు తీసుకు వెళ్ళి వ్యవహారం తేలుస్తా నంటాడు. దానికి చంద్రశేఖరం "రాజీ కుదరడం అసంభవ" మంటాడు. "ఇది కేవలం మా ఉభయుల మధ్య వచ్చిన తగాదా కాదు.....వేలకొలదిగా ఉన్న కార్మికలోకానికి సంబంధించిన సమస్య" అంటాడు. దానికి శాస్త్రి వ్యాఖ్యానం, రచయిత అభిప్రాయాన్ని వ్యక్తం చేసే వ్యాఖ్యానం, ఇలా ఉన్నది — "ఔను ఇవాళ నాకు కడుపు నొప్పి వచ్చినా సామాజిక సమస్యే ! రోగం వచ్చి మూలపడినా సామాజికసమస్యే ! తన వ్యక్తిగత సమస్యలను ఏకైకంగా ఎదుర్కొని పరిష్కరించుకొనే దమ్ములు లేక ప్రతివాడూ వాటిని సమాజానికి అంటగడుతున్నాడు. సామాజికసమస్య లంటున్నాడు. సమాజం కోసం తాను త్యాగం చేస్తున్నా నంటున్నాడు. నలుగురినీ రెచ్చగొడుతున్నాడు. దానితో వివేకాన్ని చంపి ఉద్రేకానికి నాగస్వరాన్ని పడ్తున్నాడు."

ఇలా ఆధునికయుగంలో వ్యక్తిగత సమస్యలు రాజకీయ సమస్యల స్వరూపాన్ని ధరించే వైనం చిత్రించిన తరువాత, రాజకీయాల స్వైరవిహారం ఎట్లా ఉంటుందో రచయిత చక్కగా చిత్రించారు. రాజకీయాలలో యువకులూ, విద్యార్థులూ ఆదర్శవాదులే. కాని వాళ్ళు కూడా 'కీలుబొమ్మలే' అన్న సత్యాన్నీ ఆవిష్కరించారు. షాహుకారు మల్లయ్య కొడుకు 'విప్లవం వర్ధిల్లాలి' అంటూ జండా పట్టుకొని నినాదాలు చేస్తాడు! పుల్లయ్య కొడుకు రామారావు వామపక్ష రాజకీయాలలో పాల్గొంటూ పట్టణంలో తండ్రికి దూరంగా ఉంటాడు. కాని చంద్రశేఖరం విషయం తెలిసి తండ్రికి ధర్మాన్ని బోధించడానికి గ్రామానికి వస్తే పోలీసుల చేత అరెస్టు చేయబడతాడు. దీనికి కారణం పుల్లయ్య ప్రత్యర్థి మల్లయ్య తంత్రమే కాదు, అమ్మాయమ్మ స్వార్థమే కాదు, తండ్రియైన పుల్లయ్య కూడా తన పరపతి నిలుపుకొనేందుకు అతని అరెస్టుకు ఐదువందలు లంచ మివ్వడం! తరువాత చంద్రశేఖరం కేసు ఓడిపోవడం, పాటకజనం ఊరేగింపు, పుల్లయ్య గిత్త బెదరడం, పోలాయి కొడుకుని కుమ్మడం పోలాయి దాన్ని చంపడం, పుల్లయ్య ఉద్రేకం, చంద్రశేఖరం పాటకజనాన్ని రెచ్చగొట్టడం, మల్లయ్య

అమ్మాయమ్మలు మలబారు పోలీసుని రప్పించడం, వాళ్ళ దౌర్జన్యకాండ, పోలాయి మరణం, వాసుదేవశాస్త్రికి దెబ్బలు తగలడం వగైరా సంఘటనలు గ్రామంలో చెలరేగిన సంక్షోభాన్ని చిత్రిస్తాయి. రచయిత కృష్ణరావు నవలకు వ్రాసిన మున్నుడిలో ఇలా అన్నారు: "వ్యక్తులను గాని, పార్టీలను గాని, వస్తున్న ఎన్నికలను గాని ఉద్దేశించి దీనిని వ్రాయలేదు....ఈ రచనకు కళానుభూతే ప్రధానం. పార్టీ ఆవేశాలను సాధ్యమైనంతవరకు మరచి చదివినప్పుడే ఆ అనుభూతి ఇందులో సాధ్యం". పార్టీ రాజకీయాలను విస్పష్టంగా చిత్రించకుండా మనుష్యుల మధ్య సంబంధాలను ప్రాతిపదిక చేసుకొని చిత్రణ చెయ్యాబూనుకోవడం వల్ల నవలలో కొంత అస్పష్టత తప్పలేదు. ఒకవైపు పుల్లయ్య, మల్లయ్య ప్రత్యర్థులైనప్పటికి షాహుకారు వర్గం వారు. అమ్మాయమ్మ వంటివారు సంఘసేవ, దేశసేవ నినాదంగా పెట్టుకొని, రాజకీయాలలో పలుకుబడి సంపాయించుకొన్న స్వార్థపరులు. వీళ్ళకు రాజకీయం వృత్తి. చంద్రశేఖరం అసమర్థుడైన ఆదర్శవాదీ, తన అసమర్థతను కప్పిపుచ్చుకునేందుకు కార్మికవర్గంలో చేరి వాళ్ళకు నాయకత్వం వహించే ఉద్రేకి. ఈ రాజకీయవర్గాల తతంగంలో ప్రభుత్వౌజోక్యం, పోలీసుల దౌర్జన్యం ఒక మలుపు. ఫలితం పుల్లయ్య, సర్దారు పుల్లయ్యగా ప్రభుత్వపరమైన ఆదరణను పొందడంతో నవల ముగింపు. ఈ రాజకీయాలను గురించి శ్రీ మహీధర రామమోహనరావు, కె. చిరంజీవి, 1950 నాటి ఆంధ్రదేశపు పరిస్థితులను చిత్రిస్తూ నవలలు వ్రాశారు. అవి కేవలం రాజకీయనవలలు. రాజకీయాల కంటె భిన్నంగా దృష్టి సారించి మానవసంబంధాలతో ఉత్పన్న మయ్యే సంక్షోభాన్ని 'ధర్మం' దృష్ట్యా చిత్రించడానికి కృష్ణరావుగారు పూనుకొన్నారు. అందువల్ల నవలలోని ఇతివృత్తాన్ని 'ధర్మం' దృష్ట్యానే పరిశీలించవలసి ఉన్నది. 'ధర్మం' కీలకమైన విలువ రచయిత దృష్టిలో.

'ధర్మా'న్ని రచయిత నిర్వచించ లేదు. దానిని మానవసంబంధాలలో నిజాయితీగా వ్యవహరించడం, నిజాయితీగా వ్యవహరించేందుకు తగిన నిబ్బరం, ధైర్యం, సాహసం, స్వార్థరాహిత్యం కలిగి ఉండడం, సందర్భశుద్ధితో ప్రవర్తించడం, అవే వ్యక్తిప్రవర్తనగా నవలలో చిత్రించి ఉన్నారు. కాని విచిత్ర మేమిటంటే ఈ ఆదర్శాన్ని అందుకోగల్గిన వ్యక్తి ఒక్కరూ లేకపోవటం. తన అనుభవం దృష్ట్యా గ్రామాలలో ఈ ఆదర్శసాధన అసాధ్య మని వాసుదేవశాస్త్రి తేల్చుకొన్నాడు. అందుకే అతను గ్రామాని కంటే బస్తీ మేలని గ్రామాన్ని వదలిపెట్టాడు. కాని తన అనుభవమే అనుశాసనం గాదనీ, రామారావువంటి యువకులు తప్పక గ్రామోద్ధరణకు పూనుకోవాలనీ అతని అభిప్రాయం. అదే రచయిత అభిప్రాయం కూడా! 12 వ అధ్యాయంలో రామారావు ఆలోచనల ద్వారా రచయిత తన అభిప్రాయాన్ని

ఇలా స్పష్టం చేశారు. "మొదటినుంచీ రాజకీయనాయకులు....జాతిపేరుతో, సంఘం పేరుతో, క్రొత్త దేవతను సృష్టించారు. ఆ దేవతకు బలికావడం వ్యక్తిధర్మ మని చెప్పారు........డబ్బు అధికారం ఎవరికి చేదు? అసలు మానవుని ఆడిస్తున్నవి ఇవి కావా ? కాబట్టి మన నాయకుల సిద్ధాంతాలలో లోటు ఉన్నది....మానవజీవితం మానవజీవితం కోసమేకాని, పారలౌకికసిద్ధి కోసరంగాదు. ధర్మం, ధర్మంకోసమే. ఆ ధర్మమే మానవజీవితం. తల్లి పిల్లవాణ్ణి ఎందుకు ప్రేమిస్తున్నది? పెరిగి పెద్దవాడై పోషిస్తాడని చేస్తున్నదా? లేదు .... ధర్మానికి ఫలసిద్ధి పరమార్థం గాదు. ఈ ధర్మానికి మానవుని అంతఃకరణమే పరమప్రమాణం. ఈ అంతఃకరణం ఎప్పుడూ వివేకచోదితం. ఈనాటి దురవస్థ పోవాలంటే .... ధర్మానుష్ఠానం లోనే ఆనందం ఉన్న దనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుంది. అంతకు తప్ప మరొక మార్గం లేదు. ఇలా చేయకపోతే వర్తమానం నరకకూపం. భవిష్యత్తు సందేహాస్పదం." మూకతత్త్వంతో కీలుబొమ్మలుగా ప్రవర్తిస్తున్న మనుష్యులకి స్వయంనిర్ణయం, స్వాతంత్ర్యం తమ అంతఃకరణకి కట్టుబడి ప్రవర్తించడం ద్వారానే సాధ్యమని కృష్ణరావుగారి సందేశం. సామాజికస్పృహ, సామాజికశ్రేయస్సు దానికి భిన్నం కావు!

# కళాపూర్ణోదయము సిద్ధాంత ప్రబంధము

నాగుళ్ళ గురుప్రసాదరావు

[శ్రీ నాగుళ్ళ గురుప్రసాదరావు 1933 వ సం॥లో జన్మించారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుండి ఉపాధ్యాయపట్టాని పొందారు, వివిధవిద్యాసంస్థలలో ఆయా పదవులు నిర్వహించి, ప్రస్తుతం విజయ వాడ సిద్ధార్థకళాశాలలో ఆంధ్రశాఖాధిపతిగా ఉన్నారు.

సాహిత్యము, చరిత్ర, తత్త్వశాస్త్రము గురుప్రసాదరావుగారి అభి మానవిషయాలు, 'భారతి'లో, తెలుగుదినపత్రికలలో చాలారోజులు గ్రంథసమీక్షలు చేశారు. వారు వ్రాసిన వ్యాసములు ప్రముఖ పత్రిక లలో ముద్రితాలైనవి.

ప్రాచీన నవీనసాహిత్యములపట్ల సమానమైన అనురాగం కలవారు. గ్రాంథికభాషావాదియైనా, వ్యావహారికభాషాప్రయోజనాన్ని గుర్తించిన వారు. సాహిత్యప్రపంచంలో మూఢవిశ్వాసాలకు తావులేదని, సాహి త్యము వర్గాలను, వర్ణాలను మించినట్టిదని వీరి యభిప్రాయము.

కట్టమంచి, రాళ్ళపల్లి చూపిన దారులలో ముందుకు పోయే సాహిత్యవిమర్శకులు.]

*   *   *   *

"ఊహించి తెలియరాకుండ సూరపరాజు
క్రమఁ గళాపూర్ణోదయము రచించె"

అని తెనాలిరామకృష్ణుఁడు, పింగళిసూరన్న రచించిన కళాపూర్ణోదయమును గూర్చి యొకమాట యన్నట్టు పండితలోకమున వదంతి యున్నది. అతఁడు నైషధమును గూర్చి, ఆముక్తమాల్యదను గూర్చి, వసుచరిత్రమును గూర్చి యిట్టి యభిప్రాయములనే వెల్లడించెను. ఈవిధముగా రామకృష్ణుఁడు కొంటెకోణంగియై తాను రచించిన పాండురంగమాహాత్మ్యము గొప్పతనము చాటుకొనుటకే యనుచితప్రసంగము చేసె నని విమర్శకులు సరిపుచ్చుకొన్నప్పటికి, నతని వాక్యములలో నొక కొంత వాస్తవము లేకపోలేదు. ఏవిధముగాఁ జూచినప్పటికిఁ గళాపూర్ణోదయము విలక్షణ మయిన — కాదు విశిష్ట మయిన - ప్రబంధము. అది సమకాలిక సాహిత్యపద్ధతిని దాఁటి యవతరించిన కావ్యము. ప్రతిభ - వ్యుత్పత్తి - అభ్యాసము అను మూఁడు కావ్యకారణములు పుష్కలముగాఁ గలిగిన యొక మహాకవి, కొన్నివందల యేఁడ్లు ముందుగా లోకస్థితికి నిదాన మయిన స్త్రీపురుషుల శృంగారము నందలి వివిధము లయిన యంతస్తులను జ్ఞానచక్షువుతో దర్శించి, వానిని యనితరసాధ్యముగా వర్ణించిన ప్రణయప్రబంధము. ఇతిహాస, పురాణ, కథాసరిత్సాగరాదులలోని కథలు చాల వని నిశ్చయించుకొని. సూరన తన ప్రణయదర్శనము ప్రకటించుటకు విశేష మయిన యాత్మప్రత్యయముతో విస్తృత మయిన యొక కథను సృష్టించుకొనెను. ఇది మూఁడు జన్మములకు ముడిపడిన కథ. దీనిలో చిన్న పన్న పాత్రలు దాదాపు నలువది యున్నవి. మరియు నిది కథానాయకురాలి రెండవ జన్మముతో మొద లగును. తరువాత నామె మొదటి, మూఁడవ జన్మములు వర్ణితము లగును. అందువలన దీనిని విమర్శకులు 'పద్యరూప మగు నవల' యని కొనియాడిరి.

కాని కళాపూర్ణోదయము ఇప్పటి తెలుఁగు నవలల వంటిది గాదు. దానిని రచించిన సూరన సూక్ష్మాతిసూక్ష్మ గతులతోగూఁడిన మానవజీవితమును దర్శించి, దాని పరమార్థమును గుర్తించి గ్రహించినవాఁడు. ఇతరుల తృప్తికి వ్రాసినవాఁడు గాఁడు. సాహిత్యప్రపంచమున స్థిరపడిన సంప్రదాయములకు భిన్నముగా రచనము చేయఁగలిగిన ధీరుఁడు. ఒక మహార్థము నావిష్కరింప వలయు నను లక్ష్యశుద్ధి గల మహాకవి. కావ్యశాస్త్రలక్షణములు కమనీయముగా నొకచోట కుదురుకొన్న ప్రబంధమును రచించిన ప్రతిభాశాలి.

కావుననే యొకతడవ చదివినంతమాత్రమునఁ గళాపూర్ణోదయ మర్థము గాదు. కనీసము దానిని మూఁడుసారులయిన శ్రద్ధతో పూర్వాపరములు సమీక్షించుకొనుచుఁ జదువవలెను. ఈవిధముగాఁ జదువుటకు ఓర్పు నేర్పు కావలెను. అవి లేనప్పుడు రామకృష్ణుని మాదిరిగా అవిచారరమణీయముగా అనుకొనుట తప్పదు. ఆ వికటకవి మాటలు ప్రాచీన

కాలమున సాహితీప్రపంచమున వ్యాప్తికి వచ్చిన యభిప్రాయములకు మచ్చుతునకలు. అయి నను గళాపూర్ణోదయమునకు వ్యాఖ్య రచించినవారు లేకపోలేదు. అసంపూర్ణము లయిన యా వ్యాఖ్యానములు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములలో నున్నవి.

ఏది యేమయిన ఆంధ్రదేశములో మొదటినుండి గళాపూర్ణోదయమునకు రావలసినంత కీర్తి రాలేదు. ఆ కావ్యము నుద్ధరించిన ఖ్యాతి మహామనీషి కట్టమంచి రామలింగారెడ్డిగారికే చెందును. విప్లావకము లయిన యభిప్రాయములు గలవారు పింఛికొట్టినట్టు కళాపూర్ణోదయము చదివి, యందలి కవితావిలాస వైచిత్రిని, పాత్రపోషణవైభవమును 'కవిత్వతత్త్వవిచారము' నందు వెల్లడించిరి. అప్పటికిఁగాని యాంధ్రపండితలోకము కన్ను తెఱవలేదు. అది మెదలు కొని యెందఱో విద్వాంసులు కళాపూర్ణోదయమును తఱచి చూచిరి. వారిలో టేకుమళ్ళ అచ్యుత రావు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వేఁపరాల సూర్యనారాయణశాస్త్రి, దుపూర్వి వేంకట రమణశాస్త్రి, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి, పింగళి లక్ష్మీకాంతము మున్నగువారు ముఖ్యులు,

జి. వి. కృష్ణరావుగారు కళాపూర్ణోదయముపై సిద్ధాంతప్రబంధమును రచించుటకు ముందే, దానిని గూర్చి వెడలిన విమర్శవాఙ్మయము కొంత యున్నది. అది గ్రంథరూపమున, వ్యాసరూపమున వెలుఁగు చూచినది. వానిని రచించిన విద్వాంసుల వాక్యములనే యితరులు చిలకపలుకుల వలె వల్లించుట సదాచారమైనది. ఇంక కళాపూర్ణోదయమును గూర్చి యెవరైన చెప్పవలసిన దేమున్నది? యని విద్వాంసుల మనుకొనువారు భావించిరి. వారిమాటలు యథార్థము లని విశ్వసించిన సామాన్యపాఠకులును గలరు. ఒకవిధమయిన జడస్థితి యేర్పడినరోజులలో ఈ సిద్ధాంతప్రబంధమును రచించి కృష్ణరావుగారు సంచలనము సృష్టించిరి. ఒక క్రొత్త చూపుతో కళాపూర్ణోదయమును చదువవలసియున్నదని వారి సిద్ధాంతప్రబంధమును నిష్పక్ష పాతముగా, కూలంకషముగాఁజదివినవారు చదివినవారి మాటలు విన్నవారు విశ్వసించిరి. కళాపూర్ణోదయమునకు సంబంధించినంతవరకు మొదట రామలింగారెడ్డి గారి మాదరిగా, తరు వాత కృష్ణరావుగారు సూరన కావ్యకళాపరమార్థమును స్వానుభవమును బట్టి చిత్తశుద్ధితో, గుర్తించుటకు యత్నించి కృతకృత్యులైరి. కాని వారి పోకడలు వేఱు.

కృష్ణరావుగారు కళాపూర్ణోదయము నొక మహాకవి రచనముగా గుర్తించి, యాతని కళాసిద్ధాంతములను దర్శించి, భారతీయసాహిత్య విశిష్టలక్షణములను తెలిసికొని, అలంకార శాస్త్రతత్త్వమును గ్రహించి యీ సిద్ధాంతప్రబంధమును రూపొందించిరి. పురస్సిద్ధాంతములతో

వారు కళాపూర్ణోదయమును చదువలేదు. దానిని విమర్శింపలేదు. ఈ సిద్ధాంతప్రబంధములో వారు అచ్చమయిన "సహృదయుడు" గా గోచరింతురు. తెలుఁగు వారి విమర్శలో వెల్లడి యయిన - వెల్లడియగుచున్న - దోషములు వారికి లెస్సగాఁదెలియును. కావుననే వా రీవిధముగా వ్రాసిరి.

'If the past judged the work of art on the basis of extraneous and dogmatic principles, the present is also probably committing the same mistake by applying a new set of ideologies and idiosyncracies'

(Page 101)

"If the past has judged the poets from the point of view of Sanskrit Literature, the present is perhaps repeating it from the standpoint of western criticism. Added to this, modern critics influenced by the west appear to estimate a poet taking some other poet as an absolute criterion."

(Page 103)

కృష్ణరావుగారు కోరినదెల్ల వస్తునిష్ఠ మయిన విమర్శ. విమర్శకుడేది చెప్పుచున్నను, దానికి కవి రచించిన కావ్యమే యాధారము కావలయును. జ్ఞానము - వ్యక్తి, వస్తువు అను రెండిటిని ఆశ్రయించినట్టిది. పంచదార తియ్యగా నుండు నను జ్ఞానము పంచదారనే కాక, దానిని తిను వ్యక్తిని గూడ ఆశ్రయించి యుండును. జ్వరము వచ్చిన వ్యక్తికి అది చేదుగా నుండును. జ్ఞానమువంటిదే సౌందర్యమును.

"When such is the meaning, every cultured man will try his level best to improve or adjust himself to every work of art so that he may have as full a vision of its beauty as possible. He keeps aside his personal whims and fancies, likes and dislikes, theories and opinions, and closely follows the artist step by step"

(Pages 100, 101)

కావ్యము స్వయంసంపూర్ణక మయిన నిర్మాణము. అంగము లన్నియు అంగితో నెడతెగని బంధము కలిగియుండవలెను. అంగములకు స్వతంత్రమయిన యునికి లేదు. అవి అంగికి

సహాయులు మాత్రమే. కవి యీ చూపుతోడనే కావ్యమును రచించును. పాఠకుఁడీ చూపుతోనే కావ్యమును జదువవలెను.

> "In the whole process the rules and methods followed are strictly those of the artist"
>
> (Page 101)

సూరన ప్రభావతీప్రద్యుమ్నములో (ఆ 2. పద్య 3)

> "ఒకటఁబూర్వోత్తరవిరోధ మొందకుండఁ
> దత్తదవయవవాక్యతాత్పర్యభేద
> ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
> బలుకనేర్చుట బహుతపఃఫలము గాదె."

అని యనెను. ఆ మాటల కుదాహరణముగా కావ్యసృష్టి చేసెను. దానిని విమర్శించి మంచి సెబ్బరలు విడమర్చి చెప్పెడివారు ఆ మహాకవి మాటలు పాటింపవలయును. కావ్యము నుండియే కావ్యవిమర్శన సూత్రములు వెలువడు ననియు, విమర్శకుఁడు వానినే ప్రమాణముగా స్వీకరింపవలయు ననియు కృష్ణరావుగారి సిద్ధాంతము. ఈ సిద్ధాంతమే వారి సిద్ధాంతప్రబంధ నిర్మాణమునకు అస్థిభారము. కళాపూర్ణోదయమును గూర్చి వారేమి చెప్పినను, అది యా కావ్యనిర్మాణమును, దాని లక్షణములను దాఁటి, యితర విషయముల నాశ్రయింపకుండఁ జెప్పినట్టిదే. కావుననే యితరవిద్వాంసులు పనికిరాని వని ప్రకటించిన ఘట్టములు కళాపూర్ణోదయమున అతిముఖ్యము లని కృష్ణరావుగారు నిగ్గు తేల్చిరి. ఒకటి, రెండుదాహరణము లిత్తును.

కళాపూర్ణోదయము ఎనిమిది యాశ్వాసముల కావ్యము. సూరన కథను జెప్పిన రీతికి, పాత్రపోషణము గావించిన పద్ధతికి, పాత్రలనోటఁబలికించిన పలుకులకు ముగ్ధులయిన కట్టమంచి రామలింగారెడ్డిగారు "షష్ఠాశ్వాసములోని 189 వ పద్యము వఱకు నుండునంత ప్రౌఢముగఁదరువాతి భాగములు లేవు. ఈ గ్రంథ మంతటితో సమాప్తి జేసియున్న సమ్మాన్యతరమై యుండును. ఏడవ, ఎనిమిదవ యాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వమూలశక్తులు బలహీనములు" (కవిత్వతత్త్వవిచారము. పొరట 185) అని ఖరాఖండిగా జాటిరి. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిదియు రామలింగారెడ్డిగారి బడియే. వారును షష్ఠాశ్వాసము నందలి 192 వ పద్యముతో "....కళాపూర్ణోదయకథ సమాప్తము - తక్కిన

భాగమును మధురలాలసా పరిణయ మనియో, కళాపూర్ణవిజయ మనియో పిలువవచ్చును"
(కళాపూర్ణోదయము. పొరట 365) అని పరోక్షముగా రెడ్డిగారిని సమర్థించిరి. వాస్తవమునకు శాస్త్రిగారి 'భావప్రకాశికాటీక' యింతటితో ముగిసిన దనవచ్చును.

కృష్ణరావుగారు వీరిరువురతో నేకీభవింపలేదు. కవిత్వమున రమణీయవర్ణనములు ముఖ్యాంగము లని ప్రపంచము నందలి విమర్శకు లెల్లరు నంగీకరించినట్టిదే. అట్టి వర్ణనములు షష్ఠాశ్వాసము తరువాత నున్నవి. పురోహితుఁడు కళాపూర్ణునితో మాటాడిన తీరు, యుద్ధ దృశ్యములు, స్వగృహోన్ముఖు లయిన సైనికుల మనఃప్రవృత్తి సరసముగా వర్ణితము లయ్యెను. కళాపూర్ణుడు కారణ మెట్టిదయినను - స్వల్పకారణమునకే సంగ్రామములు సంభ వించు నని మనము మఱవరాదు - దండయాత్రలుచేయుట రాజనీతి. యావద్దేశమును చక్రవర్తిక్షేత్రముగా సంభావించు రాజు దండయాత్రలు చేయకతప్పదు. సత్త్వదాత్ముఁడు కళాపూర్ణునకు రాజనీతి సవినయముగా నుపదేశించుట సహజము. మధురలాలస శిశువుగా నున్నప్పుడు పెక్కు కథ లుపన్యసించి, మణిహారము బొమ్మ నుండి తొలఁగుటచేఁదరువాత నేమియుఁజెప్పలేకపోయెను. పాఠకునకుఁదెలియవలసిన యంశములు కొన్ని మిగిలిపోయెను. వానిలో సుగ్రహుని కథ ముఖ్యము. శిశువు కథ లెట్లు చెప్పఁగలిగెను ? చెప్పుచు చెప్పుచు నడుమ నేల యాగిపోయెను? దానికి హేతు వేమి ? మృగేంద్రవాహనాలయమున మణికంధరు డేల తన వీణను భద్రముగా దాచెను? ఈ ప్రశ్నములకు సమాధానము షష్ఠాశ్వాసము తరువాత గాని లభించదు. కాన యా భాగము ప్రధానకథతో విడరాని చిక్కని పొత్తు కలది యగు చున్నది. కావుననే కృష్ణరావుగారు

> "No purpose will be served by viewing artistic creations with the bias of the modern age"
>
> (Page 121)

> "These considerations, therefore, lead to the opinion that the critic might not have approached the poem from a proper angle" (Page 129)

అని స్పష్టముగా వక్కాణించిరి.

కళాపూర్ణోదయములో మణికంధరుని తీర్థయాత్రావిధానము, పంచమాశ్వాసములో యోగయోగాంగములు సుదీర్ఘముగా వర్ణింపఁబడెను. విమర్శకు లీరెండింటి వర్ణనము కథా

గమననిరోధక మని తేల్చి చెప్పిరి. కాని కృష్ణరావుగారు వారి వాదమును గాదనిరి. మణిస్తంభుఁడు మణికంధరుని వృత్తాంతమును కలభాషిణికి చెప్పుచు, అతని తీర్థయాత్రలను విపులముగా వర్ణించెను. దుష్టసంకల్పముతో వచ్చిన యాతని దివ్యశక్తుల యెడ నమ్మిక గలిగి, కలభాషిణి యతని ననుసరించి వెళ్ళుట కీ ఘట్టము మిక్కిలి తోడ్పడును. కథాపురోగమనమునకు సహాయకారి యగును. మధురలాలస శిశువుగా నున్నప్పుడు కళాపూర్ణుని యాస్థానములో సరస్వతీచతుర్ముఖవిలాసాదికథలు వక్కాణించెను గదా! అప్పు డట యలఘువ్రతుఁ డున్నాఁడు. అతఁడీ శిశువు మహిమ కాశ్చర్యము పొందెను. కాని యా మహిమలను గూర్చి యాతని కింకను సంశయము లుండనేయున్నవి. ఇంకను ఆ శిశువు నొరసి చూచుట కాతఁడు

> "సకలబోధములకు నిధివి
> నీవెఱుంగనియవిలే వెవ్వి యోగముల్
> చెప్పవలయు............" (ఆ 5. పద్య 141)

నని శిశువు నడిగెను. అందుల కామె యోగయోగాంగములు వివరించెను. శ్రోత యగు అలఘువ్రతుని వైపు నుండి చూచిన ఈ వర్ణనము ప్రకరణోచితమే యగును. కొంద ఱెదుటివారి గొప్పతనము నంతతొందఱగా సంగీకరింపరు గదా! ఈ ఘట్టము సూరన లోకజ్ఞతకు నుదాహరణ మని కృష్ణరావుగారి తలంపు. ఈవిధముగా నితరవిమర్శకులు - ముఖ్యముగా కట్టమంచి రామలింగారెడ్డిగారు - కళాపూర్ణోదయములో ఏవి దోషము లని వక్కాణించిరో, యవి గుణములే యని కృష్ణరావుగారు సోపపత్తికముగా రుజువు చేసిరి. వారు కళాపూర్ణోదయమునెంత సూక్ష్మదృష్టితో పరిశీలించిరో పాఠకుల కిట్టే బోధపడును. కథాప్రధాన మయిన కావ్యముగాఁగాక, మహోత్తమ మయిన కళాసృష్టిగాఁ గళాపూర్ణోదయమును పరిగణించిననే తప్ప, యీ రహస్యము లర్థము గావు. ఈ రక మయిన పరిశీలనమునకు ఆద్యులు కృష్ణరావుగారే.

అష్టమాశ్వాసమున లక్ష్మీనారాయణసంవాదము కలదు. దానిలో విశిష్టాద్వైత బహూకారము, అన్యమతనికారము గలవు. ఈ ఘట్టము నిష్ప్రయోజన మని రామలింగారెడ్డిగారనఁగా, కృతిపతిమెప్పుకొఱకు స్వార్థముతో వ్రాయఁబడిన దని యితరు లనిరి. కృష్ణరావుగారు తాత్త్వికముగా ఆ ఘట్టమును సమర్థించిరి. సూరన "విశిష్టాద్వైతమతము ననుసరించి కళావిర్భావవిధానమును వర్ణింపనిశ్చయించినవాఁడు," అని వా రీ సిద్ధాంతప్రబంధమున ప్రతిపాదింప సమకట్టిరి. కావుననే యీ లక్ష్మీనారాయణసంవాదము సూరన తాత్పర్యమున

కత్యావశ్యకముగా చూపట్టినది. ఇతర విమర్శకులు చూపిన దోషముల నెంతగా ఖండించినను, కృష్ణరావుగారు వారి వాదమునందలి యౌచిత్యమును గుర్తించిరి. కావుననే వారీ విధముగా వ్రాయఁగల్గిరి

> "The episode of Lakshmi–Narayana–Samvada is definitely out of place and betrays one–sided outlook while the description of Manikandhara's piligrimage, Madhuralalasa's marriage, and Kalapurnodoya's expedition and conquest are somewhat lengthy. Apart from these three minor faults Kalapurnodayam is superb and unique" (Page 358)

ఈ వాక్యములు కృష్ణరావుగారి సమచిత్తతకు, గుణగ్రహణపారీణతకు నిదర్శనములు. కళాపూర్ణోదయము మీఁద సాగిన విమర్శకు మొదట విమర్శకుల పఠనానుభూతియే మూల ద్రవ్యము. కవిపక్షమునుండి యీ కావ్యమును సమీక్షించి, దానికి నూతనవ్యాఖ్యానము చేయఁగా కృష్ణరావుగారు సంకల్పించిరి. కావుననే కళాపూర్ణోదయము నందలి ప్రతి సన్నివేశము సప్రయోజనముగా వారి బుద్ధికి పొడకట్టినది. అయినప్పటికి ఆ సన్నివేశముల దోషములను గూడ వారు చాటిరి. ఈ విధముగా సహృదయతతో గుణాగుణములను జూపిన విమర్శకు లెందఱో లేరు.

మహాతాత్పర్యము కలిగిన కళాపూర్ణోదయకథను సూరన స్వతంత్రముగా సృష్టించెనా? అనఁగా ఉత్పాద్యమా ? లేక యాయన యితర గ్రంథముల నుండి దానిని స్వీకరించెనా ? అనఁగా ప్రఖ్యాతమా? ప్రఖ్యాత మయిన కథను గ్రహించి దానిని తాను వెల్లడింప నిశ్చయించిన జీవనపరమార్థమునకు అభివ్యక్తిసాధనముగా మలఁచు కొనెనా ? అనఁగా మిశ్రమా ? ఈ ప్రశ్నములకు విమ్మరకులు తమ యూహాపోహలనుబట్టి యెవరికి తోఁచినట్టు వారు సమాధానములు చెప్పిరి. బాణుని కాదంబరి, కథాసరిత్సాగరము, లింగపురాణము, మార్కండేయ పురాణము, ప్రబోధచంద్రోదయము, మనుచరిత్రాది కావ్యములు కళాపూర్ణోదయకథ కాధారము లని వారు నిర్ణయించిరి. కృష్ణరావుగా రీవిషయమును నాలుగు వైపుల నుండి పరిశీలించిరి. ఈగ్రంథములోని ఘట్టములు కొన్ని సూరన కాధారములు కావచ్చు ననియు, ఇప్పట్ల ఆయన ఆ సత్యమును మఱుగుపుచ్చక యంగీకరించె ననియు వారు చెప్పిరి. మొత్తము మీఁద కళాపూర్ణోదయకథ సూరన యొక్క అసాధారణభావనాశక్తికి ఫలముగా ప్రభవించిన దని వారు సోదాహరణముగా నిరూపించిరి. వారి మాట లిట్లున్నవి:

"..........There is no dearth of evidence to show that the Kalapurnodayam is the product of the poet's own imagination. The so-called sources can be interpreted in different ways but it can be maintained that they cannot be called regular sources.

At the most, some of them may be considered as having influenced in the construction of the world's best stories; and those influences of which he is consciously aware have been duly acknowledged by him by way of suggestion ..........."

(Page 77)

ఈ యాధారగ్రంథములలో నొక కథాసరిత్సాగరమే సూరన కెక్కువగా నుపయోకపడిన దని వారు నిర్ణయించిరి.

ఇఁక కళాపూర్ణోదయకథకు మూఁడు రకము లయిన యంతరార్థములు కల వని విమర్శకులు చెప్పిన మాటలను కృష్ణరావుగారు జాగ్రత్తగా పరిశీలించిరి. ఆధ్యాత్మిక, కాముక, చారిత్రికము లయిన అంతరార్థములను ప్రతిపాదించుటయే సూరన లక్ష్య మని యా విమర్శకులు రుజువు చేయుట కెంతో ప్రయత్నించిరి. కళాపూర్ణుని వృత్తాంతము శ్రీకృష్ణదేవరాయల రాచ ఱికమును ధ్వనింపఁజేయుచున్నదఁట! ఇట యంతరార్థము ఆంగ్లభాషయందలి "Allegory" అను పదమునకు పర్యాయపదము. కృష్ణరావుగారు Allegory మూలతత్త్వమును ముట్టి, విమర్శకుల రాద్ధాంతముల యందలి బలహీనతలను వెల్లడించి, కళాపూర్ణోదయకథ కే యంతరార్థము లే దనిరి. ఈ కావ్యము ద్వ్యర్థికావ్యము కాదు, త్ర్యర్థికావ్యముకాదు, శ్లేషకావ్యము గాదని నిరూపించిరి. అంతరార్థము కావ్య మందంతటఁగాని యేకదేశమునఁగాని యొక క్రమము ననుసరించి యుండవలయును. అస్పష్టత యెక్కడ నుండరాదు. ఇది Allegory యొక్క ప్రధాన లక్షణము. విమర్శకులు నిరూపించిన త్రివిధార్థము లొక క్రమము ననుసరించి లేవు. స్వాభిప్రాయములు సూరన కతిదేశించిన తీరు వారి మాటలలో కనఁబడును. కృష్ణరావుగారీ సందర్భమున

"Whatever may be the drawbacks of ancient Telugu poets, they can never be charged with obscurity like Spenser, Browning and others" (Page 97)

అని యొక గొప్ప మాటను చెప్పిరి. ఛందస్సు పరిపూర్ణముగా భావవ్యక్తీకరణకు సాధనము గాఁజాల దని యెలుఁగెత్తి చాటు నేఁటి బాలవిమర్శకులు వారి మాటలు చెవినిబెట్టుట మంచిది.

కృష్ణరావుగారు పాత్రపోషణము, కథాపాత్రభూమిక, సన్నివేశసంవిధానము,మున్నగు అంశముల యందే కళాపూర్ణోదయవిశిష్టత నాన్యతోదర్శనీయముగా గోచరించుచున్న దని విపులముగా నిరూపించిరి. ఇప్పట్ల పాత్రల పేరులు కథతో ఎట్టి యవినాభావసంబంధము కలిగియున్నవో చక్కఁగా వివరించిరి. దీనికి వారు పెట్టిన పేరు నామవక్రత. కళాపూర్ణోదయమునందు సరస్వతీచతుర్ముఖుల శృంగారము వర్ణిత మయ్యెను గదా! ఆ దేవతామూర్తుల శృంగారచేష్ట లన్నియు భూలోకమున మూర్తులు ధరించి ప్రభవించినవి. ఒక్కొకక్క చేష్ట యొక్కొక్క ప్రాణి యయ్యెను. ఆ ప్రాణి తదనుగుణముగా సార్థక మయిన పేరు పొందెను. కళాపూర్ణుఁడు, మణిస్తంభుఁడు, మదాశయుఁడు, స్వభావసిద్ధుఁడు, అభినవకౌముది, మధుర లాలస, రూపానుభూతి మున్నగు పాత్రము లన్నియు ఆ యాదిమదంపతుల విలాసచేష్టలలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క సజీవరూపము. ఆ పాత్రముల కా పేరులు తప్ప యితరము లయిన పేరు లుండుటకు వీలు లేదు. మణికంధరుఁడు మొదలయిన పేర్లు గూడ నిట్టివే. ఆ గంధర్వునికి మణికంధరు డన్న పేరు గాక మఱి యొక పేరు పెట్టినచో కలభాషిణి తాను నలకూబరుని ప్రేమించుచున్నదాన నను ఆత్మవంచనకే పాల్పడదు. నలకూబరసమాగమము కొఱకు మణిస్తంభుని వెంట పోయి కరవాలఘాతముతో మరణించి యుండెడిది గాదు. అనఁగా కళాపూర్ణోదయకథయే యుండెడిది గాదు. ఆ విధముగనే శాలీనునకు మణిస్తంభుఁడను వ్యవహారనామ మేర్పడకపోయినచో, సుముఖాసత్తి యను నామాంతరము పొందిన సుగాత్రి తన భర్తను మృగేంద్రవాహనాలయములో గుర్తించి యుండెడిది. అప్పుడు మణిస్తంభుఁడు మైదు చేసి కలభాషిణిని ద్వారక నుండి తీసికొని వచ్చుటకుఁగాని, తదనంతర కథ ప్రవర్తిల్లుటకుఁ గాని యవకాశ ముండెడిది గాదు. ఈవిధముగా కథతో నీలక్షీరములవలె కలిసిపోయిన పాత్రల పేర్లను సృష్టించెను. కథనుబట్టి పేర్లు, పేర్లనుబట్టి కథ రూపొందినది.

సూరన కథాసంవిధానములో మఱియొక విశేషము గోచరించును. ఆయన మొదట దుర్ఘటకార్యములను వర్ణించును. ఆ వర్ణనములు బోడితలకు మోకాలికి ముడిపెట్టినట్టు లుండును దీనివలన పాఠకుఁడు విభ్రాంతివిచికిత్సలకు లోబడును. కాని తుదకు సూరన తన సంవిధాన చాతుర్యముతో ఆ దుర్ఘటకార్యములకు చిక్కని ముడి వేయును. సుగాత్రీశాలీనుల వృత్తాంతమే దీనికి తార్కాణము. సుగాత్రి తనకు సంతానము కలుగునట్లు, శాలీనుఁడు తనకు ఆమెవల్ల

సంతానము కలుగకుండునట్లు సరస్వతీదేవి నుండి వరములు పొందుదురు. ఇవి పరస్పర విరుద్ధములు. కాని యా వరము లిచ్చినది సరస్వతీదేవి గదా! అవి వ్యర్థము లగుటకు వీలు లేదే! సూరన అటు సరస్వతీదేవి వాక్కునకు, ఇటు నాయికానాయకుల శీలమునకు భంగము కలుగ కుండ ఆ రెండు వరములకు సాఫల్యము చేకూర్చును. ఇది యథార్థ మగు నొక యింద్రజాలమే.

ఈవిధముగా కృష్ణరావుగారు కళాపూర్ణోదయకథాకవితా శిల్పరహస్యముల నిరవశేష ముగా బయటఁబెట్టిరి. ఇతర విమర్శకులు వీనియందలి కొన్ని యంశములను తడవక పోలేదు. కాని కృష్ణరావుగారి చూపు వేఱు. కళాపూర్ణోదయము నందలి ప్రత్యంశము కావ్యమహా తాత్పర్యమునకు అనుగుణముగా నున్నదని నిరూపించుట వారికే చెల్లినది. కళాపూర్ణోదయ విమర్శ సాహిత్యమున నిది యపూర్వము.

ఇది యంతయు నొక యెత్తు. కృష్ణరావుగారు కళాపూర్ణోదయము కళావతారవిధాన మును అభివ్యక్తీకరించు చున్నదని గావించిన నిరూపణము మఱియొక యెత్తు. ఈనిరూపణము వారి యుపజ్ఞకు ప్రబల నిదర్శనము. వారి సిద్ధాంతప్రబంధములో 250 వ పౌరట నుండి చివరిదాఁక ఈ రహస్యమే విపులముగా ప్రబలము లయిన యుపపత్తులతో బయటఁబడినది. కృష్ణరావుగా రిట్లనిరి.

> "As it has been pointed out on many an occasion, the central idea or the theme of the Kalapurnodayam is the complete emergence of art. That is to say the complete process by which a work of art con ceive by the poet in accordance with the laws of beauty finds outward artistic expression"
>
> (Page 250)

సూరన కళావిర్భూతి యెట్లు జరుగునో కళాపూర్ణోదయమున నొక మహాకథాముఖమున నిరూపింప నిశ్చయించెను గదా! మఱి యాయన యే తాత్త్వికసత్యము ప్రాతిపదికగా ఈ నిరూపణము గావించెను ? అని యెవరైన ప్రశ్నింపవచ్చును. విశిష్టాద్వైతదర్శనము నాధార ముగాఁ జేసికొని సూరన కళావతార మెట్లు జరుగునో వివరించె నని కృష్ణరావుగారిసిద్ధాంతము. ఇది వారి కల్పనము గాదు. మఱి గట్టిగా నున్న తొమ్మిది యుపపత్తులతో వారు ప్రతిపాదించిన కళాలీల. 252 వ పౌరటలో కృష్ణరావుగా రాయుపపత్తులను జూపిరి. మణికంధరుని వృత్తాం

తము, సుముఖాసత్తీ మణిస్తంభులను, నామధేయములు, సరస్వతీచతుర్ముఖుల లీల, కవిశాస్త్రవ్యసనాతిధన్యులగువారి సాయము కావ్యప్రచారము కొఱకర్థించుట, విశిష్టాద్వైతప్రతిపాదనము, కావ్యమీమాంస మున్నగున వన్నియు ఆ యుపపత్తులలోనివే. కావున కృష్ణరావు గారి సిద్ధాంతము కేవల మూహ గాక, కళాపూర్ణోదయకావ్యమూర్తి ననుసరించి సాక్షాత్కరింపఁజేసికొనిన సత్య మగుచున్నది. వారు తన యభిప్రాయములను సూరన కారోపింపలేదు. తన మాటల నాయన కంటఁగట్టలేదు.

సౌందర్యము సర్వేశ్వరుని యనంతకల్యాణగుణములలో నొక గుణము. అది శాశ్వతము. పరిణామదూరము. విశ్వజనీనము. అనేకత్వమున ఏకత్వముతో విరాజిల్లునట్టిది. సుందరసృష్టి సర్వేశ్వరుని రూపమే. దేశకాలబద్ధుఁడగు జీవుఁడు గావించు సౌందర్యసృష్టి సర్వేశ్వరుని సౌందర్యగుణమునకు రూపాంతరమే. సర్వేశ్వరుఁడు తన విభూతిని జీవుఁడు చేయు సౌందర్యసృష్టి ద్వారా ప్రదర్శించును. జీవుడు సర్వేశ్వరుని యుపకరణము మాత్రమే. ఆయన కరుణామయుఁడు ఒక్కొక్కవేళ ఒక్కొక్కనిపై సర్వేశ్వరుఁడు కరుణ చూపును. తత్ఫలముగా జీవుఁడు సౌందర్యావిష్కరణమునకు పూనుకొనును. అతఁడు సర్వేశ్వరుడు ఏకైకశరణ్యుఁడని విశ్వసించి, తదనుగ్రహార్థము పాటుపడవలయును. దీనికి భక్తియే సాధనము. దీనికి చరమఫలము మోక్షము.

"When beauty is a quality and a beautiful object a mode of Brahman, the artist is only an instrument selected by Him for its manifestation. One will be selected to be an artist either by one's great merit or by divine grace. Barring these two, there is no other way open to become a genuine artist"

(Page 334)

"As Brahman is the ultimate goal and the very basis of the universe and as the creative faculty is the gift of divine grace, the poet or any artist must create in a spirit of complete devotion to Him"

(Page 335)

"This poetry or any Art devoted and dedicated to Brahman will certainly, Surana opines, put the agent on the path of Bhakti, the royal road to release or Moksha"

(Pages 336. 337)

కలభాషిణీ, నారద, మణికంధరుల వృత్తాంతములు పయి సిద్ధాంతముల కుదాహరణ ములు. కళాపూర్ణుని వృత్తాంత మంతయు కళావిర్భూతియే. అది సరస్వతీచతుర్ముఖుల లీల. ఈ విధముగా కృష్ణరావుగారు కళాపూర్ణోదయము కళావతార విధానమును ప్రతిపాదించుచున్న దని సిద్ధాంతీకరించిరి.

మొదట మార్క్సుదొరగారి చూపుతో కృష్ణరావుగారు సాహిత్యమును సమీక్షించిరి. హేతువాదము నాశ్రయించిరి.కాని వారంతతో ఆగలేదు. ప్రాచ్యపాశ్చాత్యశాస్త్రములను జక్కగా జదివిరి. దర్శనములలో పండితులైరి. సాహిత్యవిషయమున వారు పిడివాదములు చేయలేదు. మొండి పట్టుదల చూపలేదు. ఎక్కడ సౌందర్య మున్నదో దానిని వా రారాధించిరి. వారి హృదయప్రవృత్తి గిడుగుంబాటి నట్టిది గాదు. వారి సాహిత్యసంస్కృతి యంతయు కళాపూర్ణోదయసిద్ధాంతప్రబంధమున గోచరించును. నేంటి సాహిత్యవిమర్శకులు నేర్చుకోదగిన యుత్తమవిషయము లెన్నియో దీనిలో నున్నవి.

# చిన్ననాటి ముచ్చట్లు

తుమ్మల వెంకట్రామయ్య

[వెంకట్రామయ్యగారు 1914 లో తెనాలితాలూకా కొల్లూరులో జన్మించారు. కాశీవిద్యాపీఠంలో చదువు. సంస్కృతాంధ్రాంగ్లాలను అభ్యసించారు. "నవశక్తి" "ప్రజాశక్తి" "విశాలాంధ్ర" పత్రికల సంపాదకవర్గసభ్యులుగాను, సహాయ సంపాదకులుగాను పనిచేశారు. "తెలుగుతల్లి", "అభ్యుదయ" సంపాదకవర్గంలో ఉన్నారు. "ఉదయిని" సాహిత్యపత్రిక నడిపారు. ద్వితీయ ప్రపంచసంగ్రామ కాలంలో "స్వతంత్రభారత్" అనే రహస్యపత్రికను నడిపారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీ సభ్యులుగా కొంతకాలంఉన్నారు. 194~-51 మధ్యకాలంలో డిటెన్యూగా నిర్బంధంలో ఉన్నారు.

"ఎర్రజెండా", "చెల్లీ" మొదలైన గేయాలు, అనేకగ్రంథాలు రచించారు.

ప్రస్తుతం 'అరసం' అధ్యక్షవర్గసభ్యులు. విశాలాంధ్రపబ్లిషింగ్ హౌస్ ప్రచురణ సంపాదకవర్గ సభ్యులు.

డా॥ జి. వి. కృష్ణరావుకు బాల్యమిత్రులు. ]

* * * *

"isolated intellectual అయిన కృష్ణారావో, (వేంకటకృష్ణయ్య భావ కవిత్వంలో మునిగి కృష్ణరావుగా తేలాడు)..............."

పై వాక్యం అన్నది గోపీచంద్. 1938లో గోపీచంద్ రాసిన "పట్టాభిగారి 'సోషలిజం'"లో కృష్ణరావు ప్రస్తావన అలా వచ్చింది. పీఠిక బదులు ఒక మిత్రునికి సంబోధనరూపంలో పరిచయవాక్యాలు రాశాడు గోపీచంద్. ఆ పరిచయవాక్యాలలో ఇతర మిత్రులతోపాటు కృష్ణరావు ప్రసక్తి కూడా పై విధంగా వచ్చింది. "పట్టాభిగారి 'సోషలిజం'" అనే గ్రంథానికీ, జి. వి. కృష్ణరావు కీ సంబంధమల్లా బాదరాయణసంబంధమే.

నేనిపుడు ప్రస్తావించే చిన్ననాటి ముచ్చట్లు కృష్ణరావు గురించి గానీ, డాక్టర్. జి. వి. కృష్ణరావు గురించి గానీ కాదు. ఎక్కువ భాగం నా సహాధ్యాయి అయిన "కృష్ణయ్య" ను గురించే.

గుంటూరుజిల్లా తెనాలితాలూకా కొల్లూరు హైస్కూలులో 1932-33 వసంవత్సరాలలో మేమిద్దరం సహాధ్యాయులం. "గవిని వెంకటకృష్ణయ్య" గా మాస్కూలులో చేరాడు. హైస్కూల్ రిజిస్టర్‌లో "గవిని" అనే ఉన్నా, కొన్నాళ్ళ తర్వాత ఆ ఇంటిపేరును "గవను" గా మార్చుకున్నాడు వెంకటకృష్ణయ్య. తన పుస్తకాలపై అలాగే రాసుకో మొదలుపెట్టాడు. ఆనాడు అలా ఎందుకు మార్చుకొన్నాడో చెప్పాలంటే, శబ్దార్థాల అన్వేషణే అందు కతనిని ప్రేరేపించింది. ఆనాడేదో చెప్పాడు. నిఘంటువు చూపాడు. అతని ఆనాటి వాదన వివరాలూ జ్ఞాపకం లేవు. కాని, ఇపుడొక నిఘంటువును తిరగవేస్తే "గవంక" అంటే "దుర్గమపురద్వార" మనీ, "గవను", "గవని" అనే శబ్దాలు "గవంక" శబ్దానికి రూపాంతరాలనీ తేలింది. "గవని" కంటే "గవను" అనే శబ్దం పై ఎందుకు మోజు పడ్డాడో తెలియదు.

ఇంతకూ "పేరులోన ఏమి పెన్నిధి ఉన్నది" అని అనిపించవచ్చు. ఫిఫ్తుఫారంలోనో యస్. యస్. యల్. సి. లోనో ఒక విద్యార్థి శబ్దాలగురించి, శబ్దార్థాలనుగురించీ ఇంత శ్రద్ధ కనబరచుతున్నాడంటే, అందులో మరి ప్రత్యేకత లేదా ?

ఉన్నది. అప్పటికే అతను "బాలరచయిత". "నవలారచయిత" కూడా. నవల పేరు గాని, నవలలోని ఇతివృత్తంగాని జ్ఞాపకం లేదు గాని, మా స్కూలుకు రాకముందే నవల రాశాడు. స్వంతడబ్బుతో అచ్చు వేయించుకొన్నాడు. తెనాలి, బెజవాడ రైల్వేస్టేషన్లలో పుస్తకా లమ్మేవారికి, ఆ నవలను ఇవ్వడం వారాడబ్బు ఎగగొట్టడం — అది వేరే కథ. ఎలాగూ ఎగగొట్టే వ్యవహారమే గదా అని వాళ్ళు ముద్రించిన ధరకుగాక, కారుచౌకగా అమ్మివేశారు. 'రైల్వేసాహిత్యం' జాబితాలో చేరిపోయింది ఆ నవల కూడా.

జి. వి. కృష్ణయ్య మా హైస్కూలులో మొదటినుండీ చదవలేదు. అర్ధసంవత్సరం పరీక్షలు ముగిశాక, తురిమెళ్ళ (తెనాలితాలూకా) హైస్కూలునుండి టి. సి. తీసుకొని 1932 జనవరి 11న చేరాడు. ఇలా చేరడానికి ఒక కథ—కథ కాదు; ప్రబలమైన కారణమే—వుంది.

ఎందుకో ఒక ఉపాధ్యాయుడిపై కృష్ణయ్యకు కోపం వచ్చింది. వీలు చూచుకొని బ్లాక్‌బోర్డుపై చాక్‌పీస్ తో పద్యమో, పద్యభాగమో రాశాడు. ఈ నేరస్థుణ్ణి పట్టుకోడానికి ఏమంత శ్రమ పడనవసరం లేదు. పద్యాలు గిలకగలిగే ప్రతిభ గల విద్యార్థి ఎవరో పసిగట్టారు. టి. సి. ఇచ్చి పంపివేశారు. మాస్కూలు హెడ్మాస్టర్ చెన్నుభొట్ల భానుమూర్తిగారు. విద్యార్థులచే క్రమశిక్షణ పాటింపచేయడంలో చండశాసనుడు. అందుచేత ఎవరి సలహాయో తీసుకొని తలిదండ్రులు, మాస్కూలుకు పంపారు కృష్ణయ్యను.

## మా పరిచయం

ఒకరోజున సన్నగా, పొడుగ్గా ఒకవైపుకు ఒరిగిపోయిన గడలా ఉన్న విద్యార్థి నాకు కాస్త దూరంలో నడుస్తూంటే, ఎవరో "అతనే కొత్త స్టూడెంట్. మన క్లాసులో చేరాడు. స్వగ్రామం కూచిపూడట" అని అన్నారు. తేరిపార చూశానుతప్ప, పరిచయం చేసుకోలేదు. క్లాసుకు వెళ్ళిపోయాను.

ఏటేటా విద్యార్థుల ప్రతిభను ప్రోత్సహించటానికి మా స్కూలులో పోటీలు జరిగేవి. అందులో ప్రథములుగా వచ్చినవారికి, ఎవరో దాత లిచ్చిన డబ్బుతో పుస్తకాలు కొని, విద్యార్థులకు బహూకరించేవారు. క్లాసుపుస్తకాలలోని విషయం గాకుండా వేరేదో నిర్ణయించి దానిపై వ్యాసం రాయమనేవారు. తెలుగుభాషలో జరిగే పోటీలలో జి. వి. కృష్ణయ్య నేనూ, మరి కొందరూ పాల్గొన్నాం.

న్యాయనిర్ణేతలైన తెలుగు సీనియర్, జూనియర్, పండితుల కొక సమస్య వచ్చింది బహుమతిని ఎవరి కివ్వాలనే విషయంలో. విషయాని కంత ప్రాధాన్యం ఇవ్వక, చిన్నయ సూరిగారి బాలవ్యాకరణసూత్రాలను తు. చ. తప్పకుండా పాటిస్తూ, నీతిచంద్రిక ధోరణిలో జటిల గ్రాంధికసరళిలో రాసిన విద్యార్థికా? సరళగ్రాంధికంలో విషయపుష్టితో రాసినవిద్యార్థికా? న్యాయనిర్ణేతలు చెరొకపక్షం వహించారు. ఎవరూ పట్టుదల వదలుకోలేదు. చివరకు తమ ప్రధానోపాధ్యాయుడే ప్రధానన్యాయమూర్తి అనుకొని, ఆయనకు తమ 'తగాదా' విన్నవించుకొన్నారు. ప్రధానోపాధ్యాయులు "భట్టిప్రోలు పంచాయతీ" చేశారు. బహుమతి మొత్తంతో

రండు గ్రంథాలను కొని ఇద్దరికీ చెరొక గ్రంథం ఇవ్వాలని నిర్ణయించారు. ఈ విషయాలన్నీ మా ఉపాధ్యాయులే తర్వాత కొంతకాలానికి మాకు చెప్పారు.

ఆ బహుమతిగ్రహీతలలో ఒకడు జి. వి. కృష్ణయ్య. రెండవవాణ్ణి నేను. చిన్నయ సూరి శైలి అనుకరించిందీ, అలవర్చుకొందీ జి. వి. కృష్ణయ్య అని వేరే చెప్పనవసరంలేదు. ఐతే, అంత చిన్నతనం లోనే, దాదాపు స్వయంకృషితోనే అతనికి ఆ శైలి ఎలా అలవడిందా అన్నదే ఆశ్చర్యం. నాకు ఉత్తరరామచరిత్ర, అతనికి మనుచరిత్ర కావ్యాలు బహుమతిగా ఇచ్చారు.

ఆ బహుమతులను పుచ్చుకొన్న నాటినుండీ, మేము సన్నిహితుల మయాం. ఈ సంద ర్భంగా మరో ఘటన కూడా చెప్పాలి. చిన్నయసూరి బాలవ్యాకరణమో, లేక దాని ననుసరించి రాసిన సులభవ్యాకరణాలలో విద్యార్థులు ఆ రోజుల్లో చదవవలసి ఉండేది. కాని, జి. వి. కృష్ణయ్య అప్పటికే చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రాలను బాగా ఆకళింపు చేసుకొన్నాడు. ఇదే అప్పు డందరినీ ఆశ్చర్యపరచిన విషయం.

ఒకసారి తెలుగు పరీక్షాప్రశ్నపత్రానికి జవాబులు రాయవలసివచ్చినప్పుడు, జి. వి. కృష్ణయ్య, పాఠ్యాంశాలు రాయలేదు. ప్రశ్నపత్రంలోని ప్రశ్నలు చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రాల ప్రకారం ఎలా తప్పో ఉదహరిస్తూ, ఆ సూత్రాలను ఉటంకించుతూ వివరించు కొంటూ పోయాడు. అసలు ప్రశ్నలకు సమాధానాలు రాయనే లేదు. ఇది దిద్దవలసివచ్చిన తెలుగుపండితుడు చిత్తశుద్ధి గలవాడు. కృష్ణయ్య వ్యాకరణపరిజ్ఞానానికి ఆశ్చర్యపడ్డాడు. ప్రశ్నావళికి సమాధానాలు రాయలేదు గనుక అతనికి సున్నా చుట్టాలి. కాని అతని వ్యాకరణ పరిజ్ఞానం చూసి ఉబ్బితబ్బిబ్బులయాడు. ఏమీతోచక హెడ్మాస్టర్‌తో సంప్రతించాడు. ఆయన కృష్ణయ్యను పిలిపించి "అబ్బాయ్! నీ పాండిత్యం వెలగబెట్టడానికి ఇది పద్ధతి కాదు. నీవు పరీక్షల్లో ప్యాస్‌కావాలంటే ప్రశ్నలకి సమాధానాలే రాయాలి. Annual Examinations లో ఇలాగే రాస్తే, దిద్దేవాడికి వొళ్ళుమండి సున్నా చుడ్తాడు." అని హెచ్చరించాడు. ఆ తర్వాత మళ్ళీ అలా జవాబులు రాయలే దనుకొంటాను.

నానాటా మా స్నేహం వృద్ధి చెందింది. ఒకే గదిలో ఉండి చదువుకొనేవాళ్ళం. చదువు కొనేవాళ్ళమా? చెప్పలేను. ఎందుకంటే ఆనాటి దేశరాజకీయ ఘటనలు, జాతీయోద్యమం నన్ను ప్రభావితం చేస్తున్నది. ప్రబంధాలు, మతగ్రంథాలూ ఇతర తెలుగుసాహిత్యగ్రంథాలూ అతన్ని

ఆకర్షిస్తుండేవి. క్లాస్‌పుస్తకాలు రొటీన్‌గా కాస్త చదివినా, పూర్తిగా వాటిపై కేంద్రీకరించలేదు అపుడపుడూ ఏవో పద్యాలు గిలుకుతూ వుండేవాళ్ళం.

ఉన్నట్లుండి కృష్ణయ్యకు ఒక Brain wave వచ్చింది. పిల్లలకు పనికివచ్చే ఒక కథలపుస్తకమూ, ఒక శతకమూ మేమిద్దరం రాసి దానిని అచ్చువేయించి, టెక్స్టుబుక్ కమిటీవారికి పంపించాలని. ఆ కమిటీ అప్రూవ్ చేస్తే, ఎలాగో తంటాలుపడి జిల్లాబోర్డుద్వారా స్కూళ్ళలో క్రింది తరగతుల విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా పెట్టించాలని. అదే నెరవేరితే, అచ్చుఖర్చులు పోను లాభానికి లాభం, కాస్తో కూస్తో కీర్తి సంపాదించుకో వచ్చని. నేనంత ఉత్సాహం చూపలేదు. ఐతే, అతను వదలిపెట్టలేదు. తను రాయడమేగాక, నాచేత కూడా రెండో మూడో కథలు రాయించాడు. అలాగే శతకం కోసం కొన్ని పద్యాలు రాయించాడు. ఆ కథలను "కుసుమగుచ్ఛావళి" అనీ శతకానికి "బాలశతకం" అనీ కాబోలు పేరుపెట్టాం. "బాలా" అని సంబోధిస్తూ ఆ శతకంలోని పద్యాలను రాసినట్లు జ్ఞాపకం. రచయితలు "కయిజంట". ఆనాటినుండే మేమిద్దరం "కయిజంట" గా మెలిగాం. ఈ పుస్తకాలు తీరా అచ్చయి, టెక్స్టుబుక్ కమిటీకో, అందుకు సంబంధించిన మరొక కమిటీకో అప్రూవల్‌కు పంపితే, "అప్రూవ్డ్ ఫర్ లైబ్రరీస్" అని ఎంతోకాలానికి తెలియచేశారు. చేతిచమురు వదలిందని బాధపడ్డాం.



ఐతే విద్యార్థులలో మా 'పరపతి' పెరిగింది. విద్యార్థులు "కవిజంట" అని అనేవారు. ఉపాధ్యాయులు ముద్దు ముద్దుగా "కపిజంట" అనీ అనేవారు. "కయి" అంటే చేయి, కవి అని రెండర్థాలున్నాయని తెలుగు భాషను అంతగా అధ్యయనం చేయని తోటివిద్యార్థులకేం తెలుసు? "కయిజంట" తప్పనుకుని, "కవిజంట" అనేవారు.



పెళ్ళిళ్ళ సీజను వచ్చేసరికి వధూవరులను ఆశీర్వదించే పంచరత్నాలు రాసిపెట్టమని మాపై ఒత్తిడి వచ్చేది. ఏ ఒకటి రెండు సందర్భాలలో తప్ప ఆ ఒత్తిడికి లొంగలేదు. బాగా మిత్రులైనవారికో, బంధువులైనవారికో ఆశీస్సులు పద్యరూపంలో రచించాము. ఇటీవల కొల్లూరులో "కుసుమగుచ్ఛావళి" గానీ, "బాల" శతకం గానీ దొరుకుతుందేమో నని గాలిస్తూ వచ్చాను. మా మిత్రుడూ, బంధువూ ఐన గోగినేని వెంకటకృష్ణయ్యగారు కనపడి "ఆ పుస్తకాలు లేవు గాని, మీరిద్దరూ నా పెళ్ళికి రాసిన పద్యా లున్నాయి." అని అన్నారు. వారిది క్రాప గ్రామం. మా స్కూలులో మా సీనియర్ విద్యార్థి. మేం రాసిన పద్యాలను, మా సహ విద్యార్థులు "క్రాప మిత్రసంఘం" పేరిట 3-3-1933 న అచ్చు వేసి, ఆ ఆశీస్సులను

చదివారు. "నెచ్చెలికాన్కలు" అనేది ఆ పద్యాలకు శీర్షిక. ఆ ఆశీస్సులను ఫ్రేము కట్టిన పటం గాలివానకు తడిసి అక్షరాలు కొద్దిగా వెలసిపోయాయి. కాని, స్పష్టంగానే ఉన్నాయి. పరీక్షల సమయమో, పరీక్షలు దగ్గరకి వచ్చినసమయమో జ్ఞాపకం లేదు కాని, పద్యరచనా వ్యాసంగం మాత్రం మానలేదు.

పెళ్ళిపద్యాలన్నీ దాదాపు ఒక మూసలోనే ఉంటాయి. ఒక పద్యంలో భగవంతుని ఆశీస్సు, తర్వాత వధూవరుల్ని పేరు పేరున సంబోధించి, మరో రెండు పద్యాలు, దంపతుల కేవేవో హితవులు చెప్పడం వగైరా వగైరా. ఐతే మా విషయంలో కొంత మార్పు కనబడు తోంది. జాతీయోద్యమ ప్రభావం వల్ల ననుకొంటాను. భగవంతుని స్థానంలో భారతమాతను ప్రస్తావించాం. ఇపుడు తలుచుకొంటే నవ్వు వస్తుంది.

వైవాహిక జీవితసమస్యలేవో మాకు తెలియవు. వధూవరులు ఒకోసారి మాకంటె పెద్దలు. ఐనా జీవితం ఎంతో పండిన వాళ్ళలా ఆశీస్సులు.

ఇవిగో ఆ "నెచ్చలి కాన్కలు" —

## నెచ్చెలి కాన్కలు

సీ॥ విశ్వకళ్యాణంబు వీక్షించు తాపసుల్
ఏ తల్లి యొడిలోన నెదిగినారు

జాతిని పోషించు భూతదయాపరు
లే విమల చనుబాల్ద్రావినారు

క్షత్రియు లేతల్లి కడుపు చల్లగ విశ్వ
విఖ్యాతవీరులై వెలసినారు

పరమపవిత్రతలౌ పతివ్రతలే తల్లి
ప్రేమ నమ్మా యని పిలిచినారు

తే॥గీ॥ మధురమధురభావకవితన్ మాతృదేవి
సంస్తుతిన్ జేయు కవులకు జనని యెవతె
అట్టి భారతజనయిత్రి యనవరతము
భూషణాంబను కృష్ణుని బ్రోచుగాత ॥

ఉ॥ పుట్టువుఁదొట్టి యెట్టి ఘనపుణ్యవిశేషము లాచరించితో
యిట్టి గొనాలపేటి షణదేశ్వరబింబముఖి న్వధూటి చే
పట్టఁగఁగల్గు కల్మిపుడు వట్టెను నీపె యొనర్చు సేవలం
దెట్టి దొసంగు వాటిలిన నెన్నక ప్రోవగదయ్య మిత్రమా.

మ॥ అతివా, నీవును ధన్యురాలవు సుమీ యత్యంతసౌందర్యునీ
మతిమంతు న్నిటు బెండ్లియాడుటను నీ మాతాపితల్ సోదరుల్
అతిప్రేమన్ గొని తెచ్చియిచ్చిరి వరున్ హర్షానురాగంబులన్
పతిఁబూజింపుచు ప్రేమమై నరయుమా బంధు ల్సఖుల్ మెచ్చగాన్ ॥

మ॥ పరదాస్యంబున గ్రుంకిపోయి నిజసౌభాగ్యంబు గోల్పోయి పే
దరికం బెల్లెడ ప్రాకిపోవ కడ కీదౌర్భాగ్యరూపంబునన్
కరుణాపూరితబాష్పముల్ విడచు నాగారాబు తల్లిన్ భవత్
భరతోర్విన్ భజియింపుడో మనములన్ భక్త్యానురాగంబులన్॥

తే॥గీ॥ మేఘవారంబు వీడని మెఱపువోలె
పూవు డిగనాడియుండని తావివోలె
క్షణద నెడబాయనట్టి పగలువిధాన
నలరుడీ ప్రేమతోడుత నాలుమగలు

—ప్రాప మిత్రబృందము

కళ్యాణమండపము
ప్రాప. 3-3-'33.

## ఆర్యసమాజ ప్రభావం

తన ఊరైన కూచిపూడి వాస్తవ్యు లనుకొంటాను పండిత గోపదేవుగారు. ఆయన ఆర్యసమాజ సిద్ధాంతాలను ప్రబోధించుతూ తెలుగులో పుస్తకాలు ప్రచురిస్తూ ఉండేవారు. బహుశా కూచిపూడి అందుకు కేంద్రస్థాన మనుకొంటాను. ఆయన ప్రభావం జి. వి.కృష్ణయ్య పై ఎంతో ఉండేది. ఆ విషయాలు నాతో చెబుతూ ఉండేవాడు. తర్వాతికాలంలో ఆయనకు ఒక గ్రంథం (విగ్రహవ్యావర్తని) అంకితం చేశాడు కూడా. హిందీలో దయానందసరస్వతి రాసిన "సత్యార్థప్రకాశిక" అనువాదం చేయమని నాకిచ్చాడు. హైస్కూలులో చేరకముందే

నేను హిందీ చదివి వుండటంవల్ల నాకాపని అప్పగించాడు. బ్రాహ్మణ. బ్రాహ్మణేతర ఉద్య మాలకు, వివాదాలకు ఆ రోజుల్లో మా ఊరొక కేంద్రం. స్వసంఘపౌరోహిత్యోద్యమం అందులో ఒక భాగం. బ్రాహ్మణేతరులు ముఖ్యంగా కమ్మవారు జంధ్యాలు వేసుకొని, పెళ్ళిళ్ళు మొదలైనవి చేయిస్తూ ఉండేవారు, ఇదొక సాంఘిక తిరుగుబాటుగా భావించేవారు. ఇలాంటి వాతావరణంలో, వేదాధ్యయనం అన్ని కులాలవారు చేయవచ్చనీ, యజ్ఞోపవీతాన్ని అన్ని కులాలవారు ధరించవచ్చుననీ ఆర్యసమాజ ప్రచారకులు చేసే బోధలు. బహుశా జి. వి. కృష్ణయ్యను ఆకర్షించాయి. యజ్ఞోపవీతం ధరించాడో. లేదో గుర్తులేదు కాని, రోజూ మా హైస్కూలు సమీపంలోని కాల్వలో స్నానం చేసి ఒడ్డున కూర్చొని సంధ్యావందనం చేసే వాడు. బ్రాహ్మణులలో ఏ కొద్దిమందో తప్ప, చాలామంది నిష్ఠతో గాక, కేవలం ఆచారం కోసం దినచర్యలలో ఒక భాగంలాగా సంధ్యావందనం చేసేవారు. కృష్ణయ్యమాత్రం అలా కాదు. అతినిష్ఠతో చాలాసేపు ముక్కు మూసుకొని కూర్చుని వున్న ఇతనిని కొందరు బాహా టంగానే గేలి చేసేవారు. మరికొందరు చాటుమాటున అపహాస్యం చేసేవారు. ఐనా, చలించే వాడు కాదు. కాలేజీచదువునాటికి ఈ దురవస్థ తప్పిందనుకొంటాను.

**అవధానాలపై మోజు**

ఎప్పుడో గుర్తులేదు కాని, శతావధానం చేయడానికి కూడా సిద్ధమయ్యాడు. చేశా డేమో మరి. అష్టావధానం చేయాలంటే కొంచెం కష్టపడాలి గాని, శతావధానం ఏముంది ? కొన్నాళ్ళు మనుష్యులు లేకుండానే ఏ చెట్లవద్దో నిలబడి వాళ్ళే మనుష్యు లనుకొని, వారే ఇచ్చిన ఊహలకు ప్రశ్నలకు జవాబుగా పద్యా లల్లితే సరి అని అనేవాడు.

ఎవరో రెచ్చగొట్టి సవాలు చేస్తే ఏదో గ్రామంలో మా ఇద్దరి పేర్లూ ఇచ్చి వచ్చాడు. నేను బెదరిపోయాను. ఆతర్వాత అతను ఒంటరిగా వెళ్ళి శతావధానం చేసి ఆ పందెం నెగ్గా డేమో జ్ఞాపకం లేదు కాని, అంతపనీ చేయగల సాహసియే అతను.

1933 మార్చి 20 తో మా స్కూలులో అతని విద్య ముగిసింది. అప్పటితోనే మా దారులు వేరయ్యాయి. గుంటూరు ఏ. సి. కాలేజిలో ఆతని విద్యాభ్యాసం ప్రారంభమైంది. మరి కొన్నాళ్ళకు నేను కాశీవిద్యాపీఠ్ (జాతీయవిద్యాసంస్థ) "శాస్త్రి" కోర్సు చదువుదా మని కాశీ వెళ్ళాను. కాని, పూర్తి చేయకుండానే ఒక సంవత్సరం తర్వాత తిరిగివచ్చాను.

కాలేజీలో అతడు యం.యన్.రాయ్ అనుచరుల బృందంలో చేరాడు. నేను కాశీనుండి కమ్యూనిస్టు తీర్థం' పుచ్చుకు వచ్చాను. మా దారులు చీలిపోయాయి.

కాలేజీలో చదివే రోజుల్లో పుస్తకపఠనం ఎంత ఎక్కువయిందో, అంతకంటె పుస్తకాలు కొని చదవడం కూడా ఎక్కువయింది. సాహిత్య, తాత్విక గ్రంథాలు అతని చేతిలో ఎక్కువగా కనపడేవి. ఆస్కార్‌వైల్డ్ ప్రభావంతో ఒక కథో, చిన్న నవలో రాసినట్లుగుర్తు. పుస్తకాలకోసం, ఎంతో డబ్బు వెచ్చించేవాడు. ఆ రోజుల్లోనే అతనిదృష్టి విశ్వసాహిత్యంపై పడింది. బుద్ధి పరిణతి చెందింది. పాండిత్యం పదునువారింది. పాశ్చాత్యసాహిత్యాన్ని కావ్యలక్షణాలను మథించడంతోపాటు. సంస్కృత లాక్షణిక గ్రంథాల అధ్యయనం సాగించాడు.

మావూరి వాస్తవ్యుడే ఐన కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి (కవి) సోదరుడు లక్ష్మీనరసింహశాస్త్రి మావూరి జాతీయ పాఠశాలలో నా సహాధ్యాయి.సంస్కృతం, హిందీ చదువుకొన్నాడు. తండ్రి కూడా పండితుడే నని జ్ఞాపకం. తర్వాత కూచిపూడి దత్తుపోయి గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగా మారాడు. ఈయన తెలుగులో కవిత్వం రాయడమే గాక సంస్కృతగ్రంథాలనువదించాడు. తర్వాత సంస్కృత, అలంకార, వ్యాకరణశాస్త్రాలలో ప్రావీణ్యం సంపాదించాడట. ఈయన పరిచయంతో సంస్కృత లాక్షణిక గ్రంథాలవైపు మక్కువ కల్గినట్లు, తత్ఫలితంగానే సంస్కృతంలో కూడా ఏదో డిగ్రీ సంపాదించాడనీ విన్నాను. కాని అతడెప్పుడూ ఆ డిగ్రీని ప్రదర్శించుకోలేదు గనుక నేనంతగా ఈవిషయం పట్టించుకోలేదు.

నేను తెనాలిలో తరుచు ఉంటున్న సమయంలోనే కృష్ణరావు (ఇకమీదట కృష్ణరావే అనాలిగదా మరి!) తమ బంధువు లొకరితో కలిసి ఒక ఫర్నిచర్ షాప్ పెట్టాడు. నర్సరావుపేటలో తయారైన కుర్చీలు వగైరా తెప్పించి ఇక్కడ అమ్మేవారు. ఇందులో ఏదన్నా కొంత లాభం వస్తే కనీసం తన పుస్తకాల ఖర్చుకు కలిసివస్తుందని అతని అంచనా.

> ''సంగీతము చేతనే కాదు–
> సాహిత్యం చేత కూడా
> బేరసారము లుడుగున్''

తెనాలిలో గాంధిచౌక్ సమీపంలోనే ఈ షాపు వుండేది. అప్పటికే గోపీచంద్‌తో కృష్ణరావుకు పరిచయం ఐంది. కృష్ణరావుద్వారానే గోపీచంద్‌తో నాకూ పరిచయంఏర్పడింది. గోపీచంద్, ఆయన అభిమానులూ ఎక్కువగా ఈషాపులో తిష్ఠ వేసేవారు. అక్కడ ఎక్కువగా రాజకీయాల కన్నా సాహిత్యం పైన, ఆనాడు వస్తున్న పత్రికలలోని కథానికలు వగైరా పైన చర్చలు జరిగేవి. ఎంతో సందడిగా వుండే ఈ కొట్లో బేరాలు మందంగా ఉండేవి. స్త్రీలు తొంగి చూసి వెళ్ళిపోయేవాళ్ళు. పురుషులు, మా ముఖాలు చూసీ, మా చర్చలు చూసీ, ఇది

షాపు కాదు కాబోలనుకొని వెళ్ళిపోతూండేవారు. అప్పటికీ మాలో కొందరం మా గొంతులు తగ్గించి 'ఏం కావాలండీ' అని అంటూనే వుండేవాళ్ళం. కొన్నాళ్ళకు షాపు మూతపడింది. ఒక్క సంగీతం చేతనే కాదు, సాహిత్యం చేత కూడా బేరసారము లుడుగున్ అనిపించింది. మాబోటివాళ్ళవల్లగదా అతనికి ఇంత నష్టం వాటిల్లిందని అపుడనిపించినా, ఇపుడలా భావించ డం లేదు. ఆనాటి చర్చలు అతని భావిసాహిత్య జీవితానికి ఎంతో తోడ్పడి ఉండవచ్చు.

## "కౌముది" సంపాదకత్వం

సంవత్సరం గుర్తు లేదు కాని, బహుశా 1935-37 ల మధ్య "కౌముది" అనే మాస పత్రికను కృష్ణరావు సంపాదకత్వాన నిర్వహించబడింది. కథలు, గేయాలు సాహిత్యవిమర్శలే కాక సామాజికశాస్త్రసంబంధమైన వ్యాసాలు కూడా అందులో చోటు చేసుకొన్నాయి. ఆర్థిక సాధకబాధకా లతనివైతే, సంపాదకబాధ్యతలలో సహాయపడటం నా వంతు. పత్రికను తీర్చి దిద్దడంతోపాటు తగు సలహా లిస్తూ, తనూ కొన్ని రచనలు చేస్తూ గోపీచంద్ మంచి అండగా ఉన్నా డీపత్రికకు. పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, పులుపుల శివయ్యగార్ల వ్యాసా లీపత్రికలో ప్రచురింపబడ్డాయి. శివయ్య ఆర్యద్రావిడ సంఘర్షణను, వారి వారి దేవుళ్ళ వాహనాలను గురించి వివరించడానికి ప్రయత్నించినట్లు గుర్తు. విజేతలైన ఆర్యులు, ఓడిపోయిన ద్రావిడుల దేవుళ్ళను తమ దేవతలకు బానిసలను చేశారని ఆయన భాష్యం. ఉదాహరణకు శివుని వాహ నం నంది, గరుడుని వాహనం పాము, గణపతి వాహనం ఎలుక మొదలైనవి ద్రావిడుల దేవుళ్ళనీ — ఇలా ఏమేమో వివరించాడు. దురదృష్టవశాత్తూ ఇప్పుడు "కౌముది" లభ్యం కావడం లేదు. రెండో మూడో సంచికలు వచ్చాక ఆ పత్రిక ఆగిపోయింది.

## మరో "గోరాశాస్త్రి"

రచయితగా గోరా శాస్త్రి ప్రసిద్ధి చెందకముందే మరో "గోరా శాస్త్రి" ని కౌముదీ పత్రిక నిర్వాహకులు సృష్టించవలసి వచ్చింది.

నే నొక కథ రాశాను ఈ పత్రికకని. కథావస్తువు బాగానే వుందిగాని కథావిధానం మార్పు చేయాలన్నాడు గోపీచంద్. కథానికా టెక్నిక్ తెలియని నా రచనపై ఆయన "చెయి చేసు" కొన్నాడు. ఆయన చెయి పడింది గనుక ఏ పేరూ లేకుండా ప్రచురిద్దామని నే నన్నాను. "ఫర్వా లేదు, నీ పేరుతోనే ప్రచురించు" అన్నాడు గోపీచంద్. నే నాకథను ప్రక్కన పెట్టివేశాను. కృష్ణరావు అందుకు అంగీకరించాడు. దాదాపు పత్రిక పూర్తికావస్తున్న దశలో ఎవరో ఒక మిత్రుడు వచ్చి "కొంప మునిగిందోయ్! ఈ సంచికలో ఏయే వ్యాసాలు

ఎవరెవరు రాశారో అప్పుడే బజారు కెక్కింది. ఇందులో ఒక్క 'బ్రాహ్మణరచయితా' లేడట. మీకూ అంటగడుతున్నారు ఈ కులతత్వాన్ని." కాసేపు తర్జనభర్జనలు పడ్డాం. ఇంతలో గోపీచంద్‌కు ఒక పరిష్కారమార్గం దొరికింది. పక్కకు నెట్టిన నా కథకు రచయితగా ఒక "బ్రాహ్మణనామం" తగిలిద్దామని అన్నాడు. గోపీచంద్‌లోని "గో" ను, వెంకటరామయ్య లోని "రా" ను చేర్చి దానితోకకు "శాస్త్రి" తగిలించి, "గోరా శాస్త్రి" ని తయారుచేసి, ఆ పేరుతో నా కథను ప్రచురించాం.

ఇప్పటి "గోరా శాస్త్రి" అప్పటి కింకా రచయితగా జీవితం ప్రారంభించాడో లేదో తెలియదు. రాజమండ్రినుండి వెలువడుతున్న "నవశక్తి" వారపత్రికలో (1937-38) నేనూ పనిచేస్తుండేవాణ్ణి. గోవిందు రామశాస్త్రి గారప్పుడు "కజ్జలరేఖ" పేరుతో "నవశక్తి" లో గేయాలు రాశాడు. ''తెలుగుస్వతంత్ర'' ప్రారంభమయ్యాకనే బహుశా ఆయన ''గోరాశాస్త్రి'' గా ప్రసిద్ధు డయ్యాడనుకొంటాను. జి. వి. కృష్ణరావు సంపాదకత్వాన వెలువడ్డ ''కౌముది'' లోని ''గోరాశాస్త్రి'' ని, ఇప్పటి గోరాశాస్త్రి గారికి అంటగడతారేమో నని చెప్పడానికే ఇంత రాయవలసి వచ్చింది.

రాడికల్ డెమాక్రటిక్ పార్టీని, ''కావ్యజగత్తు'' రాసేనాటికి (1942?) కృష్ణరావు బాగా సమర్థించుతూనే వున్నాడు. ఐనా, అతడు రాజకీయ కార్యకర్తగాకన్నా, సాహితీపరుడుగానే బాగా గుర్తింపబడ్డాడు. చిన్ననాటి చిన్నయసూరి గ్రాంథికవాదాన్ని వదలివేశాడు. పద్య కావ్యాలు మాత్రం గ్రాంథికంలో రాసేవాడు. రాజకీయాలలో మేం ఒకరి కొకరం దూరమైనా, పరస్పరం మా మా రాజకీయధోరణులు విమర్శించుకొంటున్నా, మా వ్యక్తిగత స్నేహానికి విఘాతం కలుగలేదు

తెనాలిలో రాడికల్ డెమాక్రటిక్ పార్టీ తరపున వెలువడుతున్న ''విహారి'' పత్రికను నిర్వహించుతున్న రోజుల్లో కృష్ణరావును చూద్దామని ఆ కార్యాలయానికి వెళ్ళాను. కొద్దిసేపట్లో ఒక యువకుడు వచ్చాడు. ''ఏమండోయ్ ! బెజవాడనుండి కమ్యూనిస్టు రచయిత ఒకాయన దిగాడట. తుమ్మల వెంకట్రామయ్యట ఆయన పేరు. ఐతే, ఇవ్వాళ్ళిక్కడేదో..........." ఆ వాక్యం పూర్తి కాలేదు. పూర్తి కానివ్వలేదు కృష్ణరావు.''ఇదిగో నీవు చెప్పే వ్యక్తి ఈయనే" అంటూ నన్ను చూపించాడు. పాపం ఆ కుర్రవాడు చిన్నబోయి, ఒక నమస్కారబాణం వేసి ''వస్తానండీ" అంటూ వెళ్ళిపోయాడు.

అతని తొలి రచనలలో (నాటికో, కథో, జ్ఞాపకం లేదు) కమ్యూనిస్టులను అపహాస్యం చేసిన వాక్యాలున్నవి. అలాగే సాహిత్యవ్యాసాలలో కమ్యూనిజంపై గల కొన్ని వ్యాఖ్యలు

కూడా మా దృష్టిలో కాలపరీక్షకు నిలిచేవి కావు. మేం కలిసినప్పుడు ఇలాంటి విషయాలు అతని దృష్టికి తేకపోలేదు. ఐతే "We agree to differ" అనే ధోరణిలోనే ముగిసేది మా ఇష్టాగోష్ఠి.

చిన్ననాటి చిన్నయసూరి శిష్యుడు వ్యావహారికభాష వైపు ఎందుకు మొగ్గాడు అన్నది విచిత్రంగానే కనపడవచ్చు. ఎందరో పండితులే వ్యావహారికభాష వైపు మొగ్గడమే గాక, పాశ్చాత్యసాహిత్యధోరణులను తత్వాలను అధ్యయనం చేస్తున్న కాలంలో ఇది తప్పనిసరి అని అతనికి తోచింది. విజయవాడలో అభ్యుదయ రచయిత లేర్పరచిన ఒక సాహిత్యగోష్ఠిలో తన యీ పరివర్తనను విశదీకరించాడు.

సమకాలీన పండితుల, సాహిత్యవేత్తల గురించి ఇష్టాయిష్టాలు కూడ మా సంభాషణల్లో దొర్లేవి. వేలూరి శివరామశాస్త్రిగారంటే ఎనలేని గౌరవం. త్రిపురనేని రామస్వామిచౌదరిగారి భగవద్గీతలోని సెటైర్ పట్ల ప్రత్యేకించి అమిత అభిమానం. పడితులుగా చలామణీ అవుతున్న కొందరిపట్ల ఏవగింపు. లోకం, ప్రపంచం, విశ్వం — ఇలాంటి పదాలు ఏ అర్థంలో, ఏ సందర్భంలో వాడాలో వివరించుకుంటూపోయి, శబ్దార్థజ్ఞానం కొరవడిన పండితమ్మన్యులను గురించి బాధపడేవాడు.

గోపీచంద్‌వంటిది కాకపోయినా, గోపీచంద్‌లో వలెనే ఇతని తాత్విక ధోరణిలో కాల క్రమేణా కొంత మార్పు వచ్చినట్లు కన్పడుతుంది. విజయవాడలో ఉన్నప్పుడు ఒకసారి అనారోగ్యంగా ఉన్న అతన్ని చూడటానికి వెళ్ళాను. యాచకులు భిక్ష తీసుకొన్న తర్వాత "కృష్ణార్పణం" అనే మాట వెనుక ఉన్న తాత్వికాంశాలంటూ ఏమేమో చెప్పాడు. తర్వాత దీనినే, తెనాలిలో తనకు జరిగిన సన్మానానికి ప్రత్యుత్తరంగా ఇచ్చిన ఉపన్యాసంలోనో, మరెక్కడో గాని, ప్రస్తావించినట్లు గుర్తు.

కృష్ణరావు రచనలను సమీక్షించడమో, విశదీకరించడమో, బేరీజు వేయడమో కాదు నా యీ వ్యాసరచనలోని ఉద్దేశ్యం. డాక్టర్ జి. వి కృష్ణయ్య వ్యక్తిత్వాన్ని, సాహితీ జీవితాన్ని రూపొందించిన కొన్ని అంశాలను పేర్కొనటమే నా ప్రధానోద్దేశ్యం.

మా చిన్ననాటి స్నేహస్మృతిగా మిగిలింది మేమిద్దరం హైస్కూలులో చదువుతున్న రోజుల్లో కలిసి ఉన్న ఫొటో. రెండవది, తనరచనలను నాకెన్నో ఇచ్చినా ఇప్పటికీ నావద్ద మిగిలిన ఒకేఒక పుస్తకం"కావ్యజగత్తు" పై 16-7-'42న "To T.V.Ram G.V.K." అంటూ గిలికిన సంతకం. నేను జైలులో 1948-51 మధ్య డెటిన్యూగా ఉన్నప్పుడు కృష్ణరావూ నాతో ఉన్నాడు; భౌతికంగా కాదు. "Passed....Supdt." అంటూ సంతకం చేసి జైలు సూపరింటెండెంటు అనుమతించగా నాతో సహజీవనం చేసిన "కావ్యజగత్తు" తొలిపుట లోని పై అక్షరాల ద్వారా.

# "ఆదర్శశిఖరాలు"

## విలువల హరివిల్లు

'హితశ్రీ'

[అసలు పేరు యమ్.వి.యన్ ప్రసాదరావు. 1936 లో జన్మించారు. వి.యస్.ఆర్.కళాశాలలో కామర్స్ శాఖాధ్యక్షులు, వైస్ ప్రిన్సిపాలు. శతాధిక కథారచయిత. నాటికలు, నవలలూ వ్రాశారు. నాటికలలో 'విముక్తుడు', నవలలో 'సామాన్యుడికామన' ముఖ్యమైనవి.]

*           *           *           *           *

డాక్టర్ జి. వి. కృష్ణరావు నాటికల సంపుటి "ఆదర్శశిఖరాలు" జీవితపు విలువల సమగ్రతని ప్రతిపాదించే విశిష్టగ్రంథం. తెలుగుసాహిత్యంలో ఇలాంటి ప్రయత్నం అపూర్వమూ, అద్వితీయమూ. ఈ విషయాన్ని పరిశీలించే ముందు సమాజం, సంస్కృతి, విలువలు, విలువల సమగ్రత అనే భావనల్ని గురించి కొంచెం స్పష్టంగా తెలుసుకోటం అవసరం.

**సమాజం**

మానవసమాజం అంటే జనాభా + సంస్కృతి అని ఒక నిర్వచనం. అయితే మానవ సమాజం ఈనాడు ఏనాడు కూడా ఒక్కటిగా లేదు — గుంపులు గుంపులుగా ఉంది. భౌగోళిక చారిత్రక, రాజకీయ, ఆర్థిక కారణాలవల్ల దూరదూరంగా విసిరివేయబడ్డ ఈ గుంపులు పత్యేక సంస్కృతులతో ప్రత్యేక సమాజాలుగా ఏర్పడినాయి. ఇందువల్ల నష్టం ఉండకపోను గాని, ఇది నైతిక ప్రమాణాల్లో తేడాలకు దారి తీసింది. ఉదాహరణకి, ఒక సమాజంలోని వ్యక్తి అదే సమాజంలోని ఇంకొక వ్యక్తి ప్రాణం తీస్తే అది నేరం. కాని యుద్ధంలో ఇంకొక

సమాజంలోని వ్యక్తిని నేలకూలిస్తే అది వీరం! ఒక సమాజం తన జీవిత ప్రమాణం పెంచుకోటం ధర్మం, కాని అందుకు ఇంకో సమాజాన్ని దోచుకోటం అధర్మం కాదు! ఈ తేడాలను త్రోసివేసి, మానవప్రవర్తనాప్రమాణాల్లో ఐక్యత సాధించి, ఒకే ప్రపంచ మానవసమాజం నెలకొల్పటం సంభవమా? సంభవం కాకపోతే మానవసంస్కృతి మొత్తం నేలమట్టం కాక తప్పదు. సంభవం కావాలంటే సంస్కృతి మరింత సంస్కారవంతం కావాలి. అంటే మానవ సంస్కృతి సాధారణస్థాయి ఇంకా ఎంతో పెరగాలి. బలవంతుడిదే బతుకు అనే ప్రాథమిక స్థాయినుంచి శాంతియుత సహజీవనం స్థాయికి అది ఎదగాలి.

## సంస్కృతి

అసలు సంస్కృతి అంటే? స్థూలంగా, సంప్రదాయం. ఒక జనాభా ఏర్పరచుకొన్న జీవితవిధానం. తరతరాలుగా వారసత్వంగా సంక్రమిస్తున్న సాముదాయికమైన అలవాట్ల సముదాయం. ఈ అలవాట్లు ఆచరణకి సంబంధించినవి కొన్ని, ఆలోచనకి సంబంధించినవి కొన్ని. ఆచరణకి సంబంధించినవి ఆచారవ్యవహారాలు. ఆలోచనకి సంబంధించినవి సామాజిక ఆశయాలు, విలువలు, తలంపులు మతవిశ్వాసాలు లాంటివి. సాంప్రదాయకంగా వస్తున్న ఈ అలవాట్లు ప్రామాణికాలై వ్యక్తుల ప్రవర్తనకి నమూనాలుగా నిలిచిపోతాయి. సమాజం లోని ప్రతివ్యక్తి వాటిని అనుసరించటం ధర్మమని సమాజం భావిస్తుంది. అనుసరించనివారిని శిక్షిస్తుంది. ఇదంతా భౌతికం కాని సంస్కృతి. అంటే ప్రవర్తనకి సంబంధించింది. భౌతిక సంస్కృతి అనేది కూడా ఉంది. ఇది సాంకేతికపరిజ్ఞానంతో ఉత్పత్తి చేసే వస్తుసంచయానికి సంబంధించింది. ఒక సమాజం సంస్కృతి ఆ సమాజం పరిగణించే విలువల్ని ప్రాతిపదికగా చేసికొని రూపొందుతుంది. సంపదకి ఎక్కువగా ప్రాముఖ్యం ఇచ్చే సంస్కృతిలో అర్థకామాదులకి సంబంధించిన విలువలకి ప్రాధాన్యం ఉంటుంది. సమష్టిశ్రేయస్సుకి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చే సంస్కృతిలో సామాజికవిలువలు ఎక్కువ ఆదరణ పొందుతాయి. పారలౌకికవిషయాలకి ఆధిక్యం ఉన్న సంస్కృతిలో నైతిక, తాత్త్విక, మతవిషయాలకి సంబంధించిన విలువలకి ప్రాబల్యం ఉంటుంది.

## విలువలు

ఇక్కడ "విలువ" అనే పదాన్ని కొంత స్పష్టం చెయ్యాలి. విలువ అంటే ఒక వస్తువులో మన మెప్పుకి గాని ఆసక్తికి గాని పాత్రమైన గుణం. విలువ ఒక అనుభూతి. కాని, అందువల్ల అది ఆత్మాశ్రయం అనుకోకూడదు. అనుభూతి వెనక వస్తువు ఉంటుంది,

కోరిక ఉంటుంది. విలువ, విలువఅనుభూతి రెండూ ఒకటే. విలువల ప్రత్యేక అస్తిత్వాన్నీ, వాస్తవికతనీ తత్త్వవేత్త లందరూ అంగీకరించారు. విలువల్ని మూడు తరగతులుగా విభజించవచ్చు.

1. మనోవైజ్ఞానిక, జీవశాస్త్రవిషయకమైన విలువలు: ఇవి వాసనలకీ, ప్రవృత్తులకీ సంబంధించినవి.

2. వ్యవస్థాత్మకమైన విలువలు : ఇవి ఆర్థిక, నైతిక, రాజకీయ, రసాత్మక, జ్ఞాన, మతవిషయకమైన విలువలు.

3. తాత్త్వికపు విలువలు : ఇవి సత్యం, శివం, సుందరం అనే భావాలత్రిపుటికీ, దైవానికీ సంబంధించిన విలువలు.

## విలువల సమగ్రత

ఈ వివిధరకాల విలువలన్నిటికీ సాపేక్షత ఉందని చెప్పటానికి వీల్లేదు. అయితే, ఆర్థిక విలువలు సాధనాలకి, మాత్రమే చెందినవి కనుక వాటికి ఇతరవిలువలతో సాపేక్షత ఉంది. విలువల్ని ఇంకా సూక్ష్మీకరించవచ్చు. ఉదాహరణకి ఆర్థికవిలువల్ని మనోవైజ్ఞానిక, జీవశాస్త్రవిషయమైన విలువలుగా కలిపివెయ్యవచ్చు. ఇలా సూక్ష్మీకరించినప్పుడు తార్కిక, నైతిక, రసాత్మకవిలువలు మాత్రం ఇతరవిలువలలోకి మార్చటానికి వీలులేని కేవలమైన, మౌలికమైన విలువలుగా నిలిచిపోతా యని కొందరు తత్త్వవేత్తల అభిప్రాయం. ఆర్థికవిలువలు తప్ప మిగతా తరగతుల విలువలన్నీ కేవలమైనవేనని ఎక్కువమంది తత్త్వవేత్తల మతం. ఈ చర్య ఎలా ఉన్నా విలువలకి ఒక ఆధిక్యతాక్రమాన్ని నిర్ణయించవచ్చు నని ఒప్పుకున్నారు. సాధారణంగా మత, తాత్త్విక విలువలది పై స్థానం; ఆర్థికవిలువలది కింది స్థానం; నైతిక, రసాత్మకాది విలువలది మధ్యస్థానం. ఈ క్రమం మానవుడి మానసిక, చేతనాత్మక, సామాజిక వికాసాన్ని సూచిస్తుంది. కేవలం మనోవైజ్ఞానిక, జీవశాస్త్రవిషయక వాసనల చేత శాసించబడే ప్రాథమిక దశ నించి బయటపడి, పరిసరాలను అర్థంచేసికొని, అదుపులోకి తెచ్చుకొని, సమాజంలో ఒక వ్యక్తిగా ప్రవర్తన సరిదిద్దుకొంటూ, సహజీవనం కొనసాగిస్తూ, చైతన్యవంతుడై స్పందిస్తూ, సామాజిక వ్యవస్థల్ని అభ్యుదయకరంగా సరిదిద్దుతూ మానవుడు తన జీవితాన్ని అర్థవంతం చేసికొన్న, చేసికొంటున్న కథే విలువల చరిత్ర. విలువల్ని ఎక్కువ తక్కువల క్రమంలో నిర్ణయించటంలో ఉద్దేశం విలువల "అసలువిలువలు" బేరీజు చేసి వాటి ఆధిక్యాన్ని నిచ్చెనమెట్ల వరసలో చూపించటం కాదు.

పై విలువల్నే పాటించి కిందివిలువల్ని నిర్లక్ష్యంగా చూడాలని చెప్పటమూ కాదు. ఉదాహరణకి ఆర్థికవిలువలు కిందిస్థానంలో ఉన్నాయని వాటిని విస్మరించటానికి వీల్లేదు. ఏది సాధించాలన్నా శరీరం మొదటిసాధనం. శరీరాన్ని పరిరక్షించే భౌతికవిలువల ప్రాముఖ్యత వాటికుంది. కాని శారీరక ఆవశ్యకతల కోసం ఎదటివాడి మీద దాడి జరిపితే, మొదటికే మోసం కావచ్చు. అందువల్లే సమాజాలమధ్య ఎలాఉన్నా సమాజంలోని వ్యక్తుల మధ్య సహజీవనం వృద్ధి పొందుతూ ఉంది. అలాగే, పై విలువలే ముఖ్యమని హిమాలయాల్లో ముక్కుమూసుకు కూర్చుంటే, సామాజికబాధ్యతల్ని విస్మరించటమే కాక జీవితం అసమగ్రం చేసికోవలసి వస్తుంది. ధర్మార్థకామాలు కూడా పురుషార్థాలే కదా మరి. అందువల్ల ఏ "విలువ" విలువ దానికుంది. విలువలన్నీ ఆవశ్యకాలే. మానవుడి ఆవశ్యకతలకి అనుగుణంగానే ఈ వివిధ రకాల విలువలు రూపొందాయి. మానవుడి ఆదర్శ, ఆవశ్యకతల క్రమంలోనే విలువలక్రమమూ ఉంటుంది. కనుక గమనించవలసింది విలువల సమగ్రత కాని పాక్షికత కాదు. విలువల సమగ్రతని అనుభవంలోకి తెచ్చుకోటమే సమగ్రజీవితాన్ని అనుభవంలోకి తెచ్చుకోటం. అదే అర్థవంతమైన జీవితం. అదే సంస్కృతికి పరాకాష్ఠ. కలిసి అలాజీవించే వ్యక్తులు + వారి సంస్కృతే ఆదర్శసమాజం. అలాంటి ఆదర్శసమాజాల సమాహారమే ఆదర్శమానవసమాజం. ఇదే ఏ రచయితనైనా, కళాకారుడినైనా ఆకర్షించి కలతపెట్టే మంచి కల. ఇది నిజం కావాలంటే వివిధ సంస్కృతులు వాటి వాటి మంచి లక్షణాల్ని ఇచ్చి పుచ్చుకొని, చెడుని వదిలి ముందుకు సాగాలి. అందుకే ఋషులవంటి రచయితల కృషి.

## మన సంస్కృతిలోని విలువలు

మన భారతీయ సంస్కృతి గొప్పదనుకొంటున్నాం. కాని ఇవి ఉన్నచోటనే ఉందా ? కొత్త అంశాలను ఇముడ్చుకొని మరింత అభ్యుదయకరంగా పరివర్తన చెందుతోందా ? లేక, ప్రత్యేకతల్ని పోగొట్టుకొంటూ లుప్తమై పోతోందా ! ఇవే మేధావి, దార్శనికుడు, రచయిత రసజ్ఞుడు డాక్టర్. జి. వి. కృష్ణరావుకు కలతపెట్టిన ప్రశ్నలు. వీటి సమాధానాల కళాత్మక హెచ్చరికలే జి.వి.కె. నాటికల సంపుటి "ఆదర్శశిఖరాలు" లో రసాలయశిఖరాలై నిలిచాయి.

జీవితాన్ని క్రమబద్ధం చేసి సామరస్యాన్ని పెంపొందింపచేసే ఒక తాత్త్వికదృక్పథంతో కూడిన జీవితవిధానం మన సంస్కృతిలోని విశేషం. అందువల్ల మన సమాజంలో తాత్త్విక, నైతిక, రసాత్మక విలువలకి అమితమైన ఆదరణ ఉంది. ఇవి మన జీవితాల్లో అల్లుకుపోయిన విలువలు. అయితే ఈ విధానం కొన్ని మూఢనమ్మకాలకి దారితీసింది. సమా

జంలో రకరకాల అంతస్తుల్ని ఏర్పరచింది. ఆకలి గురించి పట్టించుకో నివ్వలేదు. సాంకేతిక పరిజ్ఞానం, ఉత్పత్తి పెరుగుదలలకు దోహద మివ్వలేదు. ఫలితంగా దుర్భరదారిద్ర్యం పేరుకు పోయింది. ఈ స్థితిలో మన సంస్కృతిపై పాశ్చాత్యసంస్కృతి ప్రభావం పడింది. ఫలితంగా ఆధునిక శాస్త్రీయ సాంకేతికపరిజ్ఞానాలు మనకి లభించాయి. హేతువాదం చోటుచేసుకొంది. పరిశ్రమలు నెలకొని సంపద పెరిగింది. అది ఏదోవిధంగా చేజిక్కించుకోవాలనే తాపత్రయమూ పెరిగింది. వస్తుగత సంస్కృతి బాగా అబ్బి విలాసాల వెంట పరిగెత్తటం జరుగుతున్నది. వస్తుదాస్యంతో భావదాస్యమూ ప్రబలింది. నీతినియమాలు అడుగంటి ధర్మం, ఉదార వర్తన, రసజ్ఞత లుప్తమైపోతున్నాయి. ఆర్థికవిలువల్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. పాశ్చాత్య సంస్కృతి నుంచి అది నేర్చుకొన్నాం. కాని ఆర్థికవిలువలే అన్ని విలువలూనా ? తిండి, బట్ట, ఇల్లు వంటి ఆవశ్యకమైన వస్తువుల ఆర్జనలు ముఖ్యమైన విలువలే. విలువల సమగ్రతలో వాటి స్థానాన్ని గుర్తించాలి. లేకపోతే ఆ సంస్కృతి దెబ్బతింటుంది. కాని ఆర్థికవిలువలు మిగతా విలువల్ని అణగదొక్కేవిధంగా జీవితవిధానం మలచుకొంటే జీవితంలో సామరస్యం లోపిస్తుంది. అట్లాంటి జీవితం దిక్చక్రం వెంట పరుగే. దురదృష్టవశాత్తూ ఆ పరుగుపందాలే నేడు కనిపిస్తున్నాయి. ఏమవుతున్నదీసమాజం ? ధర్మానికి పట్టం కట్టి, సత్యం శివం సుందరాలని దర్శింపచేసే జీవితవిధానాన్నిచ్చిన సంస్కృతిని మనం క్రమంగా మర్చిపోతున్నామా అంటే మనల్ని మనం మర్చిపోతున్నామా ?

తత్త్వమసి !

## "ఆదర్శశిఖరాలు" సంపుటిలోని నాటికల సందేశం

డాక్టర్ జి. వి. కృష్ణరావు "ఆదర్శశిఖరాలు" సంపుటి లోని నాటికల ద్వారా అందచేసే సందేశం ఇదేనని నా అభిప్రాయం. ఈ సంపుటిలోని మొదటినాటిక "భిక్షాపాత్ర". ఇది ఆకలికి, అంటే ఆర్థికవిలువల తరగతికి సంబంధించింది. చిట్టచివరిది "ఆదర్శశిఖరాలు" ఇది సత్యం, శివం, సుందరాల ఆవిష్కారానికి, అంటే తాత్త్విక విలువలకి సంబంధించిన నాటిక. మధ్య ఉన్న పదకొండు నాటికలు నైతిక, సామాజిక, రాజకీయ, రసాత్మక, మనోవైజ్ఞానిక విలువలకి సంబంధించినవి. ఈ నాటికలూ, వాటిని సంపుటిలో గుదిగ్రుచ్చిన విధానమూ విలువల సమగ్రతని ప్రతిపాదిస్తున్నాయి. ప్రదర్శిస్తున్నాయి. అంతేకాదు, ఇవి కృష్ణరావు జీవితానుభవాలకీ, స్పందనలకీ సాధారణీకరణాలు కూడా. చదువై, ఉద్యోగం రాక కటకటపడే కృష్ణరావు కోపఘూర్ణితమానసు డయ్యాడు. ఆ మానసిక స్థితిలో ఆయన క్రట్టెధ్యట వేద

వ్యాసుడు భిక్షాపాత్రతో సాక్షాత్కరించినాడు. కృష్ణరావు దానిని బద్దలు చేశారు. తిండిపెట్టని విలువలు దేనికి ? అది దక్కేవరకు సంక్షోభం తప్పదు. తర్వాత కృష్ణరావు నిలదొక్కుకొన్నారు. రాజకీయస్పృహ, సామాజికస్పృహ ఆయన్ని కలవర పెట్టాయి. ఫలితంగా "యాదవ ప్రళయం", "డమడమాలబండి", "స్వర్గమా,నరకమా?", "పాడుసంఘం", "ఫ్రెంచికామెడీ" నాటికలు వెలువడ్డాయి. ఆయన హేతువాదదృష్టిని ప్రతిబింబింపచేసేది ''విధినిర్ణయం"నాటిక. దేశంలో ధర్మం మూడు పాదాల మీద నడుస్తోంది. ఎన్నడూ ధర్మం తప్పి ఎరగని కృష్ణరావు విచలితులయారు. ఆ ఆవేదనలో ఆయన కలంనించి "దానధార", ''ధమ్మిల్లం", "సునీథ" హెచ్చరికలుగా వెలువడ్డాయి. మొదటినించీ కృష్ణరావు రసలుబ్ధుడు. రసాత్మక వాక్యం వింటే పరవశించి పోయేవారు. రసభంగం ఏమాత్రం సహించలేక పోయేవారు. ఆయన రసదృష్టికి తార్కాణం ''ధమ్మిల్లం" నాటిక. కృష్ణరావుని అమితంగా ప్రభావితం చేసింది బుద్ధకరుణ. ఆ వృత్తాంతమే''ప్రతిక్రియ". ఇక జీవిత మంతా ఎన్ని ఒడిదుడుకులకు లోనైనా సామరస్యం లక్ష్యంగా ఒక తాత్త్విక దృక్పథంతో, స్వాతంత్ర్యంతో, ధర్మనిబద్ధతతో, రసానందానుభూతితో జీవించి, సత్యం, శివం, సుందరాల త్రిపుటిని ఆవిష్కరింప చేసుకొన్న స్వీయ ఆదర్శశిఖరాలే "ఆదర్శశిఖరాలు" నాటికలు. ఈ నాటికలన్నీ వెరసి విలువల సమగ్ర స్వరూపాన్ని మన ముందుంచుతాయి. విడివిగా జీవితపు విలువల్ని ప్రతిపాదిస్తూ చాలామంది రచయితలు ఎన్నో నాటికలు రాశారు, కాని ఇలా విలువల సమగ్రతనీ, పూర్ణస్వరూపాన్నీ, రసాత్మకమైన నాటికల్లో అపూర్వప్రతిభతో ఆవిష్కరించిన ఘనత డాక్టర్ జి.వి. కృష్ణరావు దొక్కరిదే.

**ఇతివృత్తాలు**

ఈనాటికల్ని విడిగా పరిశీలిద్దాం.

మొదటి నాటిక "భిక్షాపాత్ర" లో ఇతివృత్తం ఆకలి. కాశీలో వేదవ్యాసుని ఆశ్రమ వాసులకి కొన్నాళ్లు భిక్ష దొరకదు. ఆకలితో అలమటించి పోతారు. వారిస్థితి చూసిన వ్యాసుడికి కన్నీరొలుకుతుంది. వ్యాసుని భిక్షాపాత్రలో అశ్రుకణం పడుతుంది. అదే తన జీవిత ప్రభాతకాలంలో పడితే తనకి సరైన దృష్టి ఏర్పడేదని ఆయన పరితపిస్తాడు. ''ఈ నిర్భాగ్య మానవలోకాన్ని కష్టాలపాలు చేశాను. ఈ మానవులకు చాతుర్వర్ణ్యం విధించాను. బీదలకు ద్రోహంచేసే కర్మసిద్ధాంతమూ, అవతారవాదమూ బోధించి దాస్యం అంగీకరింపచేశాను. నా 'గీత' ఈ కర్మభూమిలో ఎంత కాల ముంటుందో అంతవరకు నివృత్తి లేకుండా చేశాను.

ఈ సంఘమే మారిపోకుండా ఆశాసించాను. ఈ భిక్షాపాత్రతో ఆకష్టజీవుల్ని జీవించమన్నాను. మహాపరాధం చేశాను" అని వాపోయి, వ్యాసమహర్షి భిక్షాపాత్రతో, శిష్యులతో, బ్రాహ్మణ వాటికకు భిక్షాటనకోసం వెడతాడు. కాని భిక్ష దొరకదు. ఒక్కొక్క నెత్తురుబొట్టుతో ఒక్కొక్క శ్లోకం వ్రాసి అన్ని మహాపురాణాలు లోకాని కందించిన కవికి తిండిలేదు. లోకంలో కళ, కవిత్వం, మనీష, సౌందర్యం, సౌకుమార్యం నిలువున ఎండిపోవలసిందే నన్నమాట ! ఇలాంటి లోకాన్ని సహించటమా ! వ్యాసమహర్షి ముఖంలో ప్రళయార్క తేజం పుంజీభవిస్తుంది. భిక్షాపాత్ర బద్దలు చేస్తాడు. మూడుతరాలదాకా కాశీలో విద్య, ధనం, భక్తి ఉండరాదని శపిస్తాడు. ఇంతలో అన్నపూర్ణ వ్యాసమహర్షినీ, శిష్యులనీ భోజనానికి ఆహ్వాని స్తుంది. కాని కాశీవిశ్వనాధుడు భోజనానికి కూర్చున్న వారిని తరిమివేస్తాడు. "ఏమన్నావు ? మా భూ త్రైపూరుషం ధనమ్! ఈ భూస్వర్గంలో నీవు ఉంటానికే యోగ్యుడవు కావు - ఏది సహించినా అధర్మాన్ని క్షమించలేను....నా రాజ్యంలో అసలు విప్లవం తలఎత్తటానికి వీల్లేదు" అని వారిని కాశీనుంచి బహిష్కరిస్తాడు. "ఈ మూర్ఖుని రాజ్యంలో మా గురుకులం ఉండటా నికి యోగ్యం కాదు. మేము ఈ దేశాన్ని బహిష్కరించవలసి ఉంది" అని వ్యాసమహర్షి శిష్యులతో వెళ్ళిపోతూ ఉంటే "స్వస్తిప్రజాభ్యాః......."అనే శ్లోకం ఆలయంనించి వినిపిస్తూ ఉంటుంది. "ఇదీ లోకం!" అనుకొంటాడు వ్యాసమహర్షి.

ప్రజలందరికీ అన్నం పెట్టలేని ఈ వ్యవస్థ మీద తిరుగుబాటు "భిక్షాపాత్ర". ఈ పరి స్థితికి దారితీసిన సంస్కృతిలోని లోపం మీద బలమైన సమ్మెటపోటు. ఒక విప్లవశంఖానాదం. కనీస భౌతికావశ్యకతలు తీరకపోతే మిగతా విలువలకి నీడలేదని హెచ్చరిక. కళాత్మకంగా ఇది తెలుగు నాటికల్లో తలమానికం. కృష్ణరావు మేధాశక్తికీ, భావావేశానికీ, రచనాపటిమకీ, శైలికీ నికషం. ఈ నాటికని భారతీయభాష లన్నిటిలోకీ అనువదించి ఆకాశవాణి జాతీయ నాటికగా ప్రసారం చేసింది.

"పాడుసంఘం" వ్యంగ్యనాటిక. ఇందులో మిల్లు యజమాని పురుషోత్తం, ఆయనకి ప్రతిపక్షంగా మిల్లుకార్మికుల నాయకుడైన అల్లుడు సత్యనారాయణ, కొడుకు మహేశం, సేవ కుడు వెంకయ్య తమ తమ దృక్పథాల్లోంచి మాత్రమే ఆలోచిస్తూ సంఘం కుళ్ళిపోతున్నదను కొంటారు. సంఘం అంటే తాముతప్ప మిగతావాళ్ళంతా అని ఎవరికివారు అనుకొంటారు. పురుషోత్తం మనుమడు ప్రసాద్ అనే చిన్నపిల్లవాడు "ఓ సంఘం, ఓసంఘం, ఓసంఘం" అంటూ వీధిలోకి పరిగెత్తటంలోని వ్యంగ్యవైభవంతో నాటిక ముగుస్తుంది.

''యాదవప్రళయం'' లో కృష్ణుడి రాజకీయపుటెత్తులవల్ల ద్వారకలో యదు, వృష్ణి వంశాలకూ భోజాంధకవంశాలకూ అంతఃకలహా లేర్పడి యాదవప్రళయం జరుగుతుంది. కృష్ణుడు పశ్చాత్తప్తుడై విచారిస్తాడు - ''రాజుల కిరీటాలతో బంతులాటాడాను. తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేశాను. ఈ నాటకమంతా ఎందుకాడాను ? ఏమి జరిగింది? రస నిష్పత్తియైనా జరిగిందా ? ఎవరైనా మిగిలితే గదా చెప్పడానికి ! పాపం ఆ అర్జునుడు కురుక్షేత్రసంగ్రామ ప్రారంభంలోనే మొత్తుకున్నాడు. ఈ మహాకల్మక్షేత్రం శ్మశానవాటిక అయిపోతుందన్నాడు. జాతిసాంకర్యం, ధర్మచ్యుతి, కర్మహాని జరుగుతుందని భయపడ్డాను. అంతా జరిగింది. ఈ యాదవప్రళయం జరుగుతుందని ముందుగానే గ్రహించాను. కానీ లాభ మేముంది ? చేసిన ప్రయత్నాలన్నీ వమ్మైపోయాయి. ఎందుకిలా జరిగింది ? నిషాదుడి విష దిగ్ధమైన బాణం తగిలి ఇప్పుడు అంగలార్చి ప్రయోజన మేముంది? అని విలపిస్తూ కృష్ణుడు మరణిస్తాడు. ఈనాడు పరస్పరవినాశానికి దారితీసే రాజకీయచర్యలకు పాల్పడుతున్న పెద్ద రాజ్యాలకు ఈ నాటిక ధ్వన్యాత్మకమైన హెచ్చరిక.

''డమడమాలబండి'' వ్యక్తిశ్రేయస్సుని పాటించని రాజకీయపార్టీ విధానంపై తీవ్ర విమర్శ. పీడితప్రజాసముద్ధరణ, విప్లవం, సుస్థిరకీర్తి, మహత్తర అభ్యుదయం వంటి నినా దాల్ని విరివిగా వాడే కామ్రేడ్లు ప్రవర్తన్, కామేశ్వరరావు, లక్ష్మయ్య పార్టీగొడవే గాని అమా యిక కార్మికస్త్రీ సుబ్బమ్మ మొర ఆలకించరు. నాటికలో మధ్యమధ్య చిన్నపిల్లలు డమడమాల బండి లాగుతారు. ఆ చప్పుళ్ళవంటివేనా ఆ పార్టీ రాజకీయనినాదాలు? నాటిక చివర జయ అనే పిల్ల ''అన్నాయ్, అన్నాయ్, బండి ఆపవూ ?'' అంటుంది. ''ఆగదు ఆగదు'' అంటాడు ఆ చిన్ని అన్నాయ్. ఇందులో ధ్వనిస్పష్టం. విమర్శసంగతి అలా ఉంచి, ఇది రసాత్మకంగా మహత్తరమైన నాటిక.

బలిచక్రవర్తి మూడడుగులదానం కథ ''దానధార''. రాబోయే విపత్తును ఊహించి భార్గవుడు దానధారాస్రవంతిని అరికట్టవలసిందని బలిచక్రవర్తిని కోరతాడు. అధికారసము పార్జన, సంరక్షణలే ఏకైకలక్ష్యం కాదని. మాటకూ, చేతకూ సంబంధం ఉండాలనీ, నీతి నియమాలు అవసరమనీ చెప్పి ఆయన సలహా బలి నిరాకరిస్తాడు. బలి బావమరది విప్రచిత్తి వామనుడి కుతంత్రాన్ని కుతంత్రంతో ఎదుర్కొబోతే బలి చక్రవర్తి ''ఎప్పుడైనా చెడు మార్గాలు గమ్యాన్ని చేరవేస్తాయా ? విషవృక్షం అమృతఫల మిస్తుందా ?'' అంటూ వారించి దాన మిచ్చి వేస్తాడు. మార్గాలు లక్ష్యాల నిరంతర చర్చలో లక్ష్యాలు మంచివైతే చాలదు, మార్గాలూ మంచివే కావాలని సూచించే ఈ నాటిక సంస్కృతిలోని నైతికవిలువలకి దర్పణం పడుతున్నది.

భార్య జానకికి ప్రాణగండ ముందని ఎవరో జోస్యం జెబితే నమ్మి, కాకతీయంగా ఆమె వ్యాధి గ్రస్తురాలై కెవ్వున వేసిన కేక విని గుండె ఆగి మరణిస్తాడు నాగేశ్వరరావు "విధినిర్ణయం" నాటికలో, భార్య బ్రతికే ఉంటుంది. ఆమె జ్వరం తగ్గిపోతుంది కూడా. పీడకలలలో వేసిన కేక అది, అంటే. హేతువాదపు విలువను వ్యత్యస్త సంఘటన ద్వారా బలంగా మనసుకు నాటే విధంగా ప్రదర్శించిన నాటిక ఇది.

"ధర్మిల్లం" నాటికలో సాహిత్యంలో ఔచిత్యం కోసం మేరువులాగా నిలబడ్డ నక్కీరుడి మూర్తిమత్వాన్ని రచయిత అద్భుతంగా చిత్రిస్తారు. రాజ్యం అంతా క్షామం ప్రబలినా రాజు పట్టించుకోకుండా కవితాకాలక్షేపాలు చేస్తుంటే, ఆస్థానకవి నక్కీరుడే బాధపడతాడు. రాజుకి బుద్ధి చెప్పటానికి శివుడు ఒక పన్నుగడ పన్నుతాడు. యోగివేషందాల్చి శివభట్టు అనే నిరక్షరకుక్షుకి పద్యం వ్రాసి ఇచ్చి, రాజ్యసభలో చదివి బహుమతి తెచ్చుకోమంటాడు. తానూ సభకి వెడతాడు. శివభట్టు తానే రచించా నని ఆ పద్యం సభలో చదువుతాడు. అందులో "సహజగంధంబైన వేదద్విషద్ధరణీ నాయిక సింధురేంద్ర గమనా ధమ్మిల్ల బంధంబు...." అనే పదాలు వస్తాయి. నక్కీరుడు వెంటనే "ధమ్మిల్ల బంధం సహజగంధ మనటానికి ఉపపత్తి" ఏమిటంటాడు. (కేశాలకు సహజంగా, సువాసన ఉండదు కనుక). యోగివేషంలో ఉన్న శివుడు " పార్వతీ ధమ్మిల్లబంధం సహజగంధం'', అంటాడు. నక్కీరుడు వివాదాంశం మానవప్రకృతిగాని దైవప్రకృతి కాదని తప్పుపడతాడు. శివుడికి కోపం వచ్చి మూడోకన్ను తెరుస్తాడు. నక్కీరుడు నిర్భయంగా ''తలచుట్టూ కళ్ళు మొలిచినా తప్పు తప్పే." అంటాడు. పరమేశ్వరుడు కోపించి 'ఓరీ కవితా దురహంకార దుర్విదగ్ధుడా!... నికృష్టకుష్ఠిరోగివై ప్రజాపరిత్యక్తుడవై నూరేళ్ళు బతుకు' అని శపిస్తాడు. నక్కీరుడు వంటి సాహితీమేరువు ఉన్నంతకాలం రాజుకి కవితాగోష్ఠులనించి క్షామనివారణంవైపుకు దృష్టి మరలటం అసంభవం. నక్కీరుడిని వెడల నడచటానికి శివుడికి ఇంతకంటె ఉపాయం లేదు మరి. రసజ్ఞశేఖరుడు, రసబుద్ధుడు, రససిద్ధుడు అయిన కృష్ణారావు కాక మరెవరు రాయ గలరు ఇలాంటి నాటిక!

''తమ్మపడిగ'' చరిత్రాత్మకం, కొండవీటి అధిపతి పెదకోమటి వేమభోపాలుడు దేవర కొండ అధిపతి మాదయ లింగమనేడు చేతిలో ఓడిపోతాడు. లింగమనేడు రాజవంశ పరం పరాగతమైన నందికంత పోతరాజు ఖడ్గం అపహరిస్తాడు. అతని ప్రతిబింబం తమ్మపడిగలో తాపించి దానిమీద కాండ్రిస్తూ ఉంటాడు. శ్రీనాథుడు అది తెలిసి లింగమనేని తన పాండి త్యంతో ఆకర్షించి అయనను ఏమి కావాలో కోరుకోమంటే తమ్మపడిగ కోరతాడు. దానికి

బదులు రత్నాలు, అగ్రహారాలు, ఆందోళికా, ఛత్రచామరాలు చివరికి అర్ధరాజ్యం ఇస్తానంటాడు లింగమనేడు. కాని శ్రీనాథుడు పట్టుపట్టి సందికంతపోతరాజు ఖడ్గం, తమ్మపడిగ మాత్రమే స్వీకరించి వేమభూపాలుడికి, సమర్పిస్తాడు. ఇది ఆనాటి విలువల ప్రశంసమాత్రమే కాదు. తన దేశానికి తన విద్య ఉపయోగపడే విధంగా ప్రతిపౌరుడూ ప్రవర్తించాడని ధ్వనిచటం ఈ నాటికలక్ష్యం.

"ప్రతిక్రియ" ఇతివృత్తం బౌద్ధకులపతి విశ్వంతరుడు హేమచంద్రుడనే వ్యాపారికి చేసిన విచిత్రమైన ప్రతిక్రియ. విశ్వంతరుడు చిన్నప్పుడు రాహులుడు అనే బీదవాడు. హేమచంద్రుడి దగ్గిర కొలువుంటాడు. అతను కొత్త పాదుకలు తెమ్మంటే తెస్తూ మధ్య వర్షం పడితే వస్త్రంలో, వాటినిదాచి అతని కాళ్ళకి తొడగబోయేటప్పుడు తన చెమట బిందువులు వాటిమీద పడగా తుడుస్తాడు. హేమచంద్రుడు మరకలు చూసి కోపంతో ఆ పాదుకలతో అతన్ని కొడతాడు. తర్వాత కొన్ని సంవత్సరాలకు రాహులుడు విశ్వంతరుడనే పేరుతో బౌద్ధభిక్షువై హేమచంద్రుడికి దీక్ష ఇప్పిం చేటప్పుడు ఆ పాదుకలనే అతని కాళ్ళకి తొడుగుతాడు. బౌద్ధభిక్షువుగా తాను పొందిన విద్యాసంస్కారానికి కారణం హేమచంద్రుడే కనుక ఆయన్నే తన గురువుగా భావించి పాదుకలను పూజిస్తున్నానని వెల్లడిస్తాడు. ఈ అద్భుతమైన ప్రతిక్రియకి హేమచంద్రుడు ద్రవించి పోయి పశ్చాత్తప్తుడవుతాడు. ఈసమయములో ఈ ఉదాత్త ప్రతిక్రియని మరింత దీప్తిమంతం చేస్తూ దీనికి వ్యత్యస్తంగా సుధన్వుడనే యోధుడు హేమచంద్రుడికి బౌద్ధదీక్ష ఇప్పించటం ద్వారా తనకు అపచారం చేశాడని విశ్వంతరుడి మీద పగపట్టి ఆయనపై బాణం వదలి ఆయన మరణానికి కారకుడవుతాడు. ఈ నాటిక పూర్తియ్యేసరికి మహాకరుణ మనల్ని, ముంచివేయకమానదు. కళ్ళు చెమర్చకుండా ఉండవు. నాటికలోని భిక్షువులతో, ప్రజలతో కంఠం కలిపి మనమూ "బుద్ధం శరణం గచ్ఛామి" అనకుండా ఉండలేము.

"ఫ్రెంచికామెడీ" సరదానాటిక. అసలు ఫ్రెంచికామెడీ అంటే మోదాంత నాటికకీ ప్రహసనానికి మధ్యస్థంగా ఉండే నాటిక, లేదా నాటకం. ఇలాంటి నాటికలో కుతూహలం రేకెత్తించే ఇతివృత్తం, మోదాత్మకమైన పాత్రచిత్రణా, సున్నితమైన హాస్యం కలిసి ఉంటాయి. ప్రస్తుతనాటికలో మధుకుమార్ అనే బీద యువకుడు చిన్నప్లాటుతో వెంకటేశ్వరన్ అనే సినీ డైరెక్టర్‌కి రివాల్వర్ అమ్మి, రాఘవరావు అనే ఇంకొకవ్యక్తికి అమ్మబోయి మోసానికి పట్టుబడతాడు. అతన్ని వెంకటేశ్వరన్ తన సినిమాలో బుక్ చేసుకోటంతో నాటిక సుఖాంతంగా ముగుస్తుంది.

''సునీథ" ఆస్కార్‌వైల్డ్ ''సలోమే" నాటికకు స్వేచ్ఛానుసరణ. ఇందులో సునీథ అనే రాకుమార్తె తనని నిరాకరించాడనే కారాణంతో బుద్ధఘోషుడు అనే సన్యాసి తలతీయించి నీపెదవుల్ని ముద్దాడతాను'' అని తాను చేసిన ప్రతిన ఆ ఖండిత మస్తకం పెదవుల్ని చుంబించి నెరవేర్చుకొంటుంది. తర్వాత తానూ ప్రాణాలు కోల్పోతుంది. సునీథ సంచలనాత్మక కథ. స్త్రీని ఆమె ఆరాధించిన ఒకవిలువ, అది ఎలాంటిదైనా, ఎలా వెర్రెత్తిస్తుందో స్పష్టం చేస్తుంది.

"స్వర్గమా, నరకమా''? రాజులరాజ్యకాంక్షకి ఆహుతైపోయిన యోధుల కథ. ఈ నాటిక యుద్ధంలో దెబ్బతిన్న ఇద్దరు యోధులమధ్య సంభాషణరూపంలో నడిచింది.

ప్రసిద్ధమైన జక్కణాచార్య విషాదగాధ ఇతివృత్తంగా గలనాటిక "ఆదర్శశిఖరాలు." దోషభూయిష్టమైన జాతకం నమ్మి భార్య ననుమానించి దూరదేశంలో ఓ రాజు కొలువులో చేరి మహాదేవుడనే పేరుతో మసలుతున్న జక్కణశిల్పాచార్యుడి అధ్వర్యం కింద తయారయిన విగ్రహానికి ప్రతిష్ట జరగబోతున్నది. ఆ సమయంలో ఆయన కుమారుడు కేదారుడు మతామహుడిని వెంటబెట్టుకొని అక్కడికి వచ్చి విగ్రహంలో దోషం ఉందని తండ్రిఅని తెలియక జక్కణతో పందెం కడతాడు. అంధుడైన తాత అది జక్కణాశిల్పమని చేతితో తడివి గ్రహించి అడ్డుపడబోతాడు. నిర్దుష్టమైన వస్తువు ప్రపంచంలో లేదంటాడు. కాని కేదారుడు ప్రజలధనంతో కట్టిన దేవాలయం వారిలో శాశ్వతంగా భక్తిభావం రేకెత్తిస్తూ ఉండాలనీ, ప్రజాద్రోహానికీ, శిల్పద్రోహానికీ ఒడిగట్ట ననీ అంటాడు. పందెం జరుగుతుంది. తప్పించుకొనే అవకాశం ఉన్న జక్కనా అపచారానికి పూనుకోడు. విగ్రహం బొడ్డు వద్ద శానంతో తొలిస్తే కప్ప బయటికి దూకుతుంది. దోషం రుజువు అవుతుంది. రాజు జక్కణ చేతులు నరికిస్తాడు. ప్రతిష్ట ఆగకుండా కేదారుడు తన దగ్గిర ఉన్న జ్యోతిర్లింగాన్ని రాజుకిచ్చి అది తన తల్లి తను పుట్టకపూర్వం చెక్కిందంటాడు. జక్కణాచార్యుడు కొడుకుని గుర్తుపడతాడు. అంధుడైన అతని మామ అతని భార్య అతనికోసం కన్నులు కాయలు కాచేటట్లు ఎదురు చూస్తోందని చెబుతాడు. ముగ్గురూ రాజ్యం విడిచి బయలుదేరుతారు. ఆ ముగ్గురూ ఆదర్శశిఖారాలే. సత్యంకోసం నిలబడాలి. శివం, అంటే మంగళకరమైంది జరిగేలా ప్రయత్నించాలి. సుందరమైంది, అంటే మానసిక సమరస స్థితి కలిగించేది ఆవిష్కరించాలి. ఈ ఆదర్శాలే వారి జీవితాన్ని నడిపించాయి. ఈ అంతిమ విలువలు అందరికీ మణిదీపాలు కావాలనేదే ఈ నాటిక ఆశయం.

"ఆదర్శం"

ఈ వివిధ ఇతివృత్తాలు ఈ గ్రంథంలో ఒక క్రమంలో సంపుటీకరించబడి ఒక పూర్ణత్వాన్ని సాధిస్తూ, సమాజంలోని వ్యక్తికి ఒక ఆదర్శప్రవర్తనాపద్ధతిని నిర్దేశిస్తున్నాయి. మానవుడు సంతరించుకోవలసిన విలువల్ని విలువల సమగ్రతనీ ధ్వనిస్తున్నాయి. అసలు ఈ విలువ అనే భావనని తత్త్వశాస్త్రంలో ప్రవేశ పెట్టిన తత్త్వవేత్త కాంట్, నేష్, లోజ్ వంటి తత్త్వవేత్తలు ఈ భావనని అభివృద్ధిపరచారు. విలువల పూర్ణత్వాన్ని దర్శించి డాక్టర్ జి. వి. కృష్ణరావు ఒక ఆదర్శాన్ని మన ముందుంచారు. ఆర్థిక, సామాజిక, రాజకీయ, నైతిక, రసాత్మక, తాత్త్విక విలువలకి సమన్వయం సాధించి వాటి సమగ్రతని అనుభవంలోకి తెచ్చుకొని సమాజంలోని ప్రతివ్యక్తి పూర్ణమూర్తిమత్వం వికసింపచేసుకోవాలి. ప్రపంచసంస్కృతి పూర్ణత్వం పొందాలి. ఇదే మహామేధావి, సాహితీకళాకోవిదుడు డాక్టర్ జి. వి. కృష్ణరావు ఆవిష్కరించిన సత్, చిత్, ఆనందలక్షణ లక్షితమైన ఆదర్శస్వరూపం.

# మార్క్సిజం - తత్త్వ పరిశీలన

జి. వి. కృష్ణరావు

యథాచిత్రకరో రూపం యక్ష స్యాతిభయంకరమ్ ।
సమాలిఖ్య స్వయం భీతః సంసారే వ్యబుధ స్తథా॥

ఆలోక్య తా నశరణాన్ కరుణావశమానసః ।
సత్త్వానా ముపకారాయ బోధిచర్యాం సమాచరేత్॥

— ఆచార్య నాగార్జునుడు.

మానవుని అభ్యుదయ అధఃపతనాలకు మానవుడే కర్త అనుకొన్నప్పుడు విజ్ఞాన శాస్త్రానుప్రాణితమైన తత్త్వశాస్త్రానికి ప్రాముఖ్యం ఎంతైనా ఉంది. ఈ తత్త్వశాస్త్రం ముందడుగిడుతున్నప్పుడు మానవసమాజం కూడ ముందంజ వేస్తుంది. స్తంభించిపోయినప్పుడు సమాజ పురోగతి కూడ స్తంభించిపోతుంది. దీనినే యీనాటి మన భారతీయసమాజం వ్యక్తం చేస్తున్నది.

మన సమాజంలో నేడు ప్రధానంగా రెండు లక్షణాలు కనిపిస్తూ ఉన్నవి. ఒకటి ప్రగతిశీలం, ఇంకొకటి నిరోధకశీలం. ఈనాటి మన రాజ్యాంగం సామాజికసంస్కరణలు, పారిశ్రామికాభివృద్ధి, ఆర్థికప్రణాళికలు మొదలైనవి ప్రగతికోవలోనివి. వీనికి అడ్డుపడేవి నిరోధకశీలాలు. ప్రగతిశీలాలకు హేతువును నిష్పాక్షికంగా, నిర్లిప్తంగా చెప్పాలంటే పాశ్చాత్య శాస్త్రాలనే చెప్పాలి. ఎందుకంటే కామందక శుక్రనీతి సారాలకు, మన్వాదిస్మృతులకు, చాణక్యాది అర్థశాస్త్రాలకు, న్యాయాది దర్శనాలకు నేటి రాజ్యాంగాది సమస్యలు అచుంబిత విషయాలు. ఇలా అనటంవల్ల వీటికి విలువ లేదనీ, భారతీయసంస్కృతిని కించపరచటమేననీ భావించరాదు. గ్రీకుల శాస్త్రాలకూ, సంస్కృతికీ ఉన్న ప్రాముఖ్యమే వీటికీ ఉన్నది. ఈ ప్రాముఖ్యం చరిత్రాత్మకం.

రెండవదైన నిరోధకలక్షణానికి ఏనాడో స్తంభించిపోయిన మన తత్వశాస్త్రాలే నిదర్శన మని చెప్పవచ్చును. కారణం శంకరాదుల తత్త్వార్థాలకు భాష్యాలు, టీకలు వెలువడుతున్నవే తప్ప స్వతంత్ర విచారం కొనసాగటం లేదు. స్వతంత్రవిచారం లేకపోతే పోయింది – కనీసం నవ్యవిజ్ఞానశాస్త్రాలతో మన ప్రాచీన తాత్త్విక సిద్ధాంతాలకు వచ్చిన బాధలనైనా మనవారు గుర్తించటం లేదు. గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, జీవశాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, దేశకాలాలను గూర్చి, కార్యకారణభావాన్నిగూర్చి, భూతాన్ని (matter) గూర్చి, మనఃప్రవృత్తిని గూర్చి, చేతన పదార్థాన్ని గూర్చి ప్రయోగాత్మకంగా కొన్ని నూతన విషయాలను ప్రతిపాదిస్తున్నవి. వీటిని ఆమోదిస్తే మన దర్శనాలకు చోటు పురాతన విచిత్రవస్తు కోటిలో తప్ప యథార్థ వస్తుకోటిలో లభించదు. అలా ఆమోదించకపోతే, ఈ శాస్త్రాలు నిరూపిస్తున్న అర్థాలకు వ్యాఖ్యానం వేరుగా చెప్పుకోవాలి. అలా చెప్పుకొన్నప్పుడు మన దర్శనాలు ఏ లవలేశమైనా సంస్కారాన్ని అపేక్షించవా ?

ఏది ఎలా ఉన్నా ఆధునిక విజ్ఞానశాస్త్రాలతో నిప్పన్న మౌతున్న నూతన విషయాలను విస్మరించి ఈనాటి మన తత్వశాస్త్రజ్ఞులు స్తబ్దతను వర్తిస్తున్నారేమో నన్న శంక కలుగుతున్నది. నిజానికి ఆంధ్రరాష్ట్రంలోను. బెంగాలులోను తిరువాన్కూరు, కొచ్చిన్ రాష్ట్రంలోను అనల్పసంఖ్యాకులు వీరిని అభ్యుదయ నిరోధకులుగా పరిగణిస్తున్నారు. అంతేకాదు – "ప్రగతిశీలమైన లక్షణం పాశ్చాత్యశాస్త్రసంపర్కం వల్ల ఏర్పడుతున్నది. ఈ లక్షణం సమగ్రంగా గోచరించాలంటే ప్రగతికి అంతకూ సమగ్రసమన్వయం సమకూర్చి సమాజాన్ని పురోగమింప చేయగలిగిన తత్వశాస్త్రం అవసరం. ఇలాంటి ఆవశ్యకత పాశ్చాత్యమైన మార్క్సిజంతోనే తీరుతుంది."అని ఈ అనల్పసంఖ్యాకులు త్రికరణశుద్ధిగా నమ్మి యథాశక్తిని కృషిచేస్తున్నారు. మన రాష్ట్రంలో ఇటీవల జరిగిన ఎన్నికల ఫలితాలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ కృషికి ఇక్కడ ఎంత బలమున్నదో స్పష్టం కాకమానదు.

సామాజికాభ్యుదయం ముఖ్యమైనప్పుడు మార్క్సిజం బాగోగులను పరిశీలించాలి. మంచిదైతే దాని వ్యాప్తికి తోడ్పడాలి, చెడ్డదైతే ఆ చెడుగును వివరించి ఉత్తమ మార్గం సూచించాలి. కొంతమాత్రమే దానిలో మంచి ఉంటే ఆ మంచిని స్వీకరించి మరొక సమగ్ర తత్వశాస్త్రం ఏర్పరచుకోవాలి. ఇది అత్యంతావశ్యకం.

ఈనాడు తెలుగులో కేవలం రాజకీయదృష్టితోను, సాహిత్యదృష్టితోను, అస్పష్ట భారతీయసంస్కారదృష్టితోను మాత్రమే మార్క్సిజాన్ని విమర్శిస్తున్నారు. ఈ విమర్శ మార్క్సిజం

ఒక సమగ్ర తత్వశాస్త్ర మన్న సంగతిని విస్మరిస్తున్నది. ఈ విస్మృతి వల్ల మార్క్సిజాన్ని అపార్థం చేసుకోటం జరుగుతున్నది. దీనితో కలుగవలసినంత ప్రయోజనం కలగటం లేదు.

కాగా, మార్క్సిజాన్ని అర్థం చేసుకోవాలన్నా, విమర్శించాలన్నా దాన్ని ఒక తత్వ శాస్త్రంగా పరిగణించి పరిశీలించాలి. అప్పుడే అందరి బాగోగులు సమగ్రంగా బోధపడుతాయి.

మార్క్సిజం కూడా మన దర్శనాల వలెనే "దేనిని తెలిసికుంటే మరి తెలిసికోవలసినది ఉండదో దానినే ప్రతిపాదిస్తున్నది. ఆ పరమార్థమే "డైలక్టిక్" అంటున్నది. డైలక్టిక్ అన్న పదానికి గ్రీకు భాషలో సంవాద మని అర్థం. తత్త్వార్థవిచారం గ్రీకులు ప్రశ్నోత్తరరూపంలో సాగించారు. ముఖ్యంగా సోఫిస్టులు సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్, కాంట్ మొదలైన పాశ్చాత్య దార్శనికులు ఆ మార్గం త్రొక్కారు. మన ఉపనిషత్తులలో గూడ ఇది కనిపిస్తున్నది. అయితే, "డైలక్టిక్" అన్న పదాన్ని ప్రత్యేక శాస్త్రీయపదంగా ప్రయోగించి దానికి విశిష్టమైన అర్థం కల్పించినవాడు జర్మన్ తత్త్వవేత్త అయిన హెగెల్. ఇతడు వాడిన అర్థంలో డైలక్టిక్ అన్న పదానికి గతితర్క మనీ, ఇతని సిద్ధాంతాన్ని త్రికవాద మనీ చెప్పుకోవచ్చును.

గతితర్కాన్ని మార్క్స్ హెగెల్ నుంచి స్వీకరించి, మార్చి, అందులో తన సిద్ధాంతాన్ని పోతపోశాడు. "గతితర్కాన్ని హెగెల్ తలక్రిందులు చేస్తే దాన్ని సరిచేసి కాళ్ళ మీద నిలిపాను"అని అతడే స్వయంగా పేర్కొన్నాడు. మార్క్స్ గతితర్కాన్ని సరిగా దాని కాళ్ళ మీద నిలిపాడా లేదా అన్న విషయం అముఖ్యం కాదు. కాని అసలు మార్క్స్ ప్రతిపాదించిన గతి తర్క స్వభావం అర్థం చేసుకోవాలంటే, దాని మూలప్రవర్తకుడైన హెగెల్ సిద్ధాంతంలో దానికున్న అర్థం అవగాహన చేసుకోవాలి.

"తీగ కదిలిస్తే డొంకంతా కదులుతుంద" న్న సామెత మనకు ఉండనే ఉన్నది. డొంక కదలకుండా సాధ్యమైనంతవరకు తీగను కదిలించాలి. గతితర్క మనగానే కదలిక (motion) కు సంబంధించిన తర్క మని బోధపడుతుంది. కాని హెగెలీయ సిద్ధాంతంలో గతితర్క మంటే కేవల ప్రమాణశాస్త్రం (pure logic) కాదు. సాధారణంగా హెగెల్‌ను మహాతత్వవేత్తలలో ఒకనిగా పరిగణించటం పాశ్చాత్యప్రపంచం పరిపాటి. కాని నా దృష్టిలో మాత్రం అతడొక మహాకవి. డెకార్టీ, స్పినోజా, కాంట్‌ల వలె ప్రకృతిశాస్త్రాలను పురస్కరించుకొని కాక, చరిత్ర, సాహిత్యం, రాజకీయాలు, దర్శనం పురస్కరించుకొని అతడు తన దర్శనాన్ని గతితర్కం ద్వారా ప్రతిపాదించాడు. నిజంగా అతని దర్శనానికీ, గతితర్కానికీ ఉన్న సంబంధం విస్మయావహ మనే చెప్పాలి. గతితర్కం లేకుండా అతని దర్శనం లేదు.

అతని దర్శనం (metaphysics) లేక గతితర్కం లేదు. కాబట్టి గతితర్కం ఒకవిధంగా దర్శనమే.

హెగిల్ మతం ప్రకారం ఈ విశ్వమే బ్రహ్మం (the Idea) ఈ బ్రహ్మం అవయవి (organic whole). ఈ అవయవి దేశకాలాలలో ఉన్నది కాదు. అసలు దేశకాలాలు స్వతః యథార్థాలు కావు. విశ్వాంగధర్మాలుగా మాత్రమే అవి యథార్థాలు. విశ్వంలోని వస్తు కోటికీ, విశ్వానికీ అంగాంగి సంబంధమే ఉన్నది. అంటే ప్రాణికీ, దాని అంగాలకూ ఉన్న సంబంధమే ఉన్నది. అంగసమాహారం కంటే అంగి విశిష్టమైనట్లే. విశ్వంలోనే వస్తుసమాహారం కంటే విశ్వం విశిష్టమైనది. శరీరాతిరిక్తమైన అంగానికి విలువ, అర్థం లేనట్లే విశ్వాతిరిక్తమైన ఏ వస్తువుకూ విలువ, అర్థం లేదు. అది యథార్థమూ కాదు. కేవలం విశ్వాంగంగా మాత్రమే అది యథార్థం.

హేతువునకు అగమ్యమైనది ఏమీ లేదు. హేతుసూత్రాలే ప్రకృతిసూత్రాలు. అంతకు మించి అవ్యక్తంగా అజ్ఞేయంగా ప్రకృతికాని, మరొక వస్తువుకాని లేదు. ద్వంద్వాలకు ఐక్యం హెగిల్ సిద్ధాంతంలో అత్యంత ముఖ్యం. తెలుపునలుపులు వెలుగునీడలు, మంచిచెడ్డలు, శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, రాగద్వేషాలు, విషయివిషయాలు మొదలయిన ద్వంద్వాలకు అతడు ఐక్యం ప్రతిపాదిస్తాడు.

బ్రహ్మం ద్వంద్వైక్యగర్భితం కాబట్టి. ఈ అంతర్గతవైరుధ్యాన్ని పరిహరించుకొనటానికి పరిణమిస్తుంది. ఈ పరిణామం దైశికం కాదు, కాలికం కాదు. దేశకాలాలు స్వయం యథార్థాలు కాకపోవటమే ఇందుకు కారణం. ఈ పరిణామం అనుయోగి (thesis) ప్రతియోగి (anti thesis) సంయోగి (synthesis) అన్న త్రికం ద్వారా బ్రహ్మం పరిణమిస్తుంది. ఈ త్రికసిద్ధాంతం ప్రకారం సత్తు (being) అసత్తుగా (non-being) ఆ అసత్తు పరిణమత్తు (becoming) గా అవిచ్ఛిన్నమౌతుంది. ప్రతిషేధం (negation) అంతా అవచ్ఛేదమే. (determination). కేవలం సత్తు లేనిదే అవుతుంది. అంటే, అసత్తు అన్నమాట. కేవలం అసత్తు అంటే అటు సత్తుకు, ఇటు అసత్తుకు ఆస్పదమై ప్రతిషేధప్రతిషేధం కావాలి, అదే "పరిణమత్తు". బీజంలో అంకురం, ఫలాలు అనభివ్యక్తంగాను, ఫలవృక్షంలో బీజాంకురాలు వ్యక్తంగాను ఉన్నట్లే సత్తులో "అసత్పరిణమత్తులు" అనభివ్యక్తంగాను "పరిణమత్తులో" సదసత్తులు వ్యక్తంగాను ఉంటాయి.

బ్రహ్మం అంతర్గతవైరుధ్యపరిహరణకై సాగించే, పరిణతి వల్ల కలిగినదే ఈ ప్రకృతి ఉద్భిజ, జరాయుజ ప్రపంచం, చరిత్ర, సాహిత్యం, మతం, తత్త్వశాస్త్రం.

బ్రహ్మం ఒక్కటే నిత్యం, పూర్ణం. ఈ బ్రహ్మాన్ని గూర్చి చెప్పేదే సత్యం ప్రకృతి, మానవుడు పూర్ణమైన బ్రహ్మంలోని భాగాలు. అందువల్ల ఇది ఖండాలు. ఈ ఖండాలను పూర్ణాలుగా భావించి ప్రకృతిశాస్త్రాలు, సామాజికశాస్త్రాలు తమ తమ అర్థాలను ప్రతిపాదిస్తున్నవి కాబట్టి, ఇవి చెప్పే అర్థాలు అసత్యాలు. తత్త్వశాస్త్రం పూర్ణమైన బ్రహ్మాన్ని ప్రతిపాదిస్తున్నది కాబట్టి తత్త్వశాస్త్రమే పూర్ణసత్యం చెబుతుంది. "ప్రకృతిశాస్త్రాలు సామాజికశాస్త్రాలు తమ అర్థాలను బ్రహ్మాంశాలుగానే ప్రతిపాదించవచ్చును గదా! అప్పుడు ఆ అర్థాలు సత్యాలా అసత్యాలా? అన్న ప్రశ్న కలగవచ్చును. బ్రహ్మాంశాలుగా భావించి తమ అర్థాలను చెబుతున్నప్పుడు వాని అర్థాలు ఖండసత్యాలే కాని పూర్ణసత్యాలు కావు.

మొత్తము మీద హెగిల్ ప్రతిపాదించిన గతితర్కవాదంలో ఈ క్రింది దార్శనికార్థాలు అంతర్భూతమైవున్నాయి.

(1) దేశకాలాలు మిథ్యలు.

(2) ద్వంద్వాలకు ఐక్య మున్నది. భావమూ, యదార్థమూ ఒకటే.

(3) ప్రతిషేద మంతా అవచ్ఛేదమే.

(4) అనుయోగి, ప్రతి యోగి, సంయోగి అన్న 'త్రికం' ద్వారా పరిణామం జరుగుతుంది. ఈ పరిణామం అనివార్యం. పరిణామంలోని పూర్వాపూర్వదశల కంటె ఉత్తరోత్తర దశలు విధిగా అభ్యుదయక బలీయాలు.

(5) విశ్వం అవయవి. అవయవసమాహారం కంటె అవయవి విశిష్టమైనది. ఈ అవయవిజ్ఞానమే సత్యం. అవయవజ్ఞానం స్వతః అసత్యం.

(6) త్రికగతి కంటె అతిరిక్తమైన గతి సృష్టిపరిణామంలో లేదు కాబట్టి త్రికగతిని తెలిసికొని భజించటం ద్వారానే మానవుడు స్వాతంత్ర్యం పొందుతున్నాడు. అట్లు చేయని వాడు అస్వతంత్రుడు.

(7) ఇలాంటి భజనమే ధర్మం; ఇతరం అధర్మం.

(8) బ్రహ్మం హేతుస్వరూపం కాబట్టి, అంతర్గతవైరుధ్యం లేనిస్థితి పొందుతుంది.

(9) పరిణామం సత్తును, సత్తు పరిణామాన్ని అపేక్షిస్తూ చక్రికా బంధం కలిగి ఉంటాయి.

ఈ వాదాంశాలు ఎంతవఱకు నిలుస్తాయి? ఎంతవఱకు సత్యాలు వీటిని గూర్చి పరిశీలించక ముందు మార్క్సు సిద్ధాంతంలో గతితర్కాని కున్న అర్థం కూడ గ్రహించటం ముఖ్యం.

హెగిల్ మతం ప్రకారం జ్ఞానాన్ని బట్టి ఉనికి ఆధారపడుతున్నది. మార్క్సు దీనికి అంగీకరించడు. ఉనికి మీద జ్ఞానం ఆధారపడుతున్న దని అంటాడు. ఒక భావం కాని, విచారం కాని, సంవేదన కాని మనస్సులో బయలుదేరుతుంది. ఈ మనస్సు, శరీరం తాక లేదు. ఈ మనస్సు శరీరం భౌతికద్రవ్య వికారాలేకాని, భిన్నమైనవికావు. భౌతిక ద్రవ్యం ఉనికికి దేశకాలాలు ఉండాలి. ఇలా అనగానే దేశకాలాలు ప్రత్యేకద్రవ్యాలుగా భావించ నక్కరలేదు. అవి వస్తుధర్మాలు (forms) లేక వాని వృత్తులని హెగెల్సు స్పష్టంగా పేర్కొన్నాడు.

హెగిల్ ప్రతిపాదించిన గతి తర్కవాదం దేశకాలాలు మధ్య అంటే, మార్క్సీయ గతితర్కం అవి ప్రకృతిధర్మా లంటున్నది. మొదటిది జ్ఞానపరిణామం ప్రతిపాదిస్తుంటే, రెండవది ప్రకృతిపరిణామం ప్రతిపాదిస్తున్నది. మొదటిది పరిణామం సాంతమంటే, రెండ వది అనంత మంటున్నది. తన గతితర్కానికీ హెగిలీయ గతితర్కానికీ ఉన్న భేదాలను గూర్చి ప్రస్తావిస్తూ మార్క్సు ఇలా వ్రాశాడు:—

"నా 'గతితార్కికపద్ధతి' హెగిలీయ గతితార్కిక పద్ధతి కంటె కేవలం భిన్నమైనది మాత్రమే కాక, దానికి సాక్షత్తుగా విరుద్ధం. హెగిల్ మతంలో జ్ఞానపరిణతే (భావ మన్న పేరు పెట్టి, అతడు దీనిని స్వతంత్రకర్తను చేశాడు) యథార్థ ప్రపంచ స్రష్ట. అతని మంతలో యథార్థ ప్రపంచ మంటే భావం (idea) యొక్క బాహ్యాభివ్యక్తి మాత్రమే. నా దృష్టిలో భావ మంటే మానవుని మస్తకంలోనికి మార్చబడి అనూదితమైన భౌతికద్రవ్యమే.... హెగిల్ రచనలలో గతితర్కం తలక్రిందులుగా ఉంది. అయోమయత్వం లో మాటువడిన వివేక సారాన్ని ఆనాచ్ఛాదితం చేయాలంటే దానిని సరిగా మీదికి నిలబెట్టాలి.

మార్క్సు చెప్పిన అంశాలనే క్లైకనోవ్ క్లుప్తంగా ఇలా పేర్కొంటున్నాడు:-

1. మార్క్సీయ గతి తర్కవాదం ప్రకృతికి సంబంధించిన సిద్ధాతం. హెగిలీయ గతితర్కవాదం మెట్ట వేదాంతం (mitaphysics)
2. మార్క్సిజంలో గతే స్రష్ట. హెగిలీయ సిద్ధాంతంలో బ్రహ్మమే సృష్టికర్త.

3. మార్క్సిజంలో వస్తుపరిణామం, భావపరిణామాన్ని వివరిస్తున్నది. హెగిల్ సిద్ధాంతంలో భావాలు వస్తుపరిణామాన్ని వివరిస్తున్నవి.

హెగిల్ సిద్ధాంతంలో ప్రధానంగా తొమ్మిది దార్శనికార్థాలు అంతర్భూతమై వున్నవని చెప్పుకొన్నాము. ప్లెకనోవ్ చెప్పిన దానిని బట్టి మూడు అంశాలలో మార్క్స్ విరుద్ధ మార్గం త్రొక్కుతున్నట్లు స్పష్ట మౌతున్నది. మిగిలిన అంశాలలో మార్క్స్ చేసిన మార్పు లేమిటి? వాటిని కూడా సవరించి కాళ్ళ మీద నిలిపాడా? లేదు. వాటిని పరమసిద్ధాంతాలుగా స్వీకరించాడు. ఇలా చేయటం హెగిలీయ గతితర్కాన్ని తిన్నగా కాళ్ళ మీద నిలపట మౌతుందా? అయినా, చక్రధారకు తుది ఎక్కడ మొదలెక్కడ?

ఏది ఎలా ఉన్నా ఇది మనకు ముఖ్యసమస్య కాదు. మార్క్సీయ గతితర్క విశిష్టతను పరిశీలించటం ముఖ్యం.

"దేశకాలాలు యథార్థాలు. వస్తుత్వాన్ని బట్టి జ్ఞానం అవిచ్ఛిన్న మౌతున్నది". అన్న రెండంశాలు గతితర్కానికి చేర్చటంతో విచిత్రపరిస్థితి ఏర్పడుతున్నది. గతితర్కం ప్రకృతి, మానవసమాజము, భావము - వీని గతి, పరిణామం సామాన్యసూత్రాలను తెలిపే శాస్త్రం మాత్రమే" అని ఏంగెల్సు సూత్రప్రాయంగా ఒక చోట చెప్పాడు. దీనినిబట్టి మార్క్సీయ గతి తర్కం ఒక పక్షాన ప్రమాణశాస్త్రం (Pure logic) మరొక పక్షాన జ్ఞానస్వరూపకశాస్త్రం (Epistomology) వేరొక పక్షాన వస్తుత్వనిరూపకశాస్త్రం (ontology) అవుతున్న దన్న మాట.

ఇలా అనగానే తత్వశాస్త్రం తో పరిచయం లేని వారికి ఈ మూడు శాస్త్రాలు ఒకటే ననటంలో విడ్డూరం కనిపించక పోవచ్చును. ప్రమాణశాస్త్రం (Pure logic) కేవలం భావాలను గూర్చి మాత్రమే చెబుతుంది. అంటే ప్రతిపాదితార్థం ఇలా ఉన్నప్పుడు, నిష్పాదితార్థం ఇలా ఉంటుంది; హేతువు ఇలా ఉంటే నిగమనం ఇలా ఉంటుంది, అని చెబుతుంది. నిష్పన్నార్థాల ప్రామాణ్యాన్ని నిర్ణయిస్తుంది. అంతేగాని వస్తుత్వంతో ఈ శాస్త్రానికి సంబంధం లేదు. జ్ఞానస్వరూపాన్ని అంతకన్నా నిరూపించదు. కేవలం తత్త్వశాస్త్రానికి ఉపకరణంగా మాత్రమే ఇది వినియోగపడుతుంది. ప్రమాణశాస్త్రానికి వస్తుత్వం ముఖ్యం కాదు. అబాధి తత్వంముఖ్యం నాజేబులో నూరు రూపాయలు ఉండి ఇరువదిఅయిదు రూపాయలు ఖర్చు పెటితే డెబ్బె అయిదు రూపాయలు ఉంటా యని మాత్రమే ఈ శాస్త్రం చెబుతుంది. కానీ యథార్థంగా నా జేబులో నూరు రూపాయలు ఉన్నాయో లేవో చెప్పదు. నేను ఇరవై అయిదు

రూపాయలు ఖర్చు పెట్టానో లేదో అంతకన్నా చెప్పదు. గుర్రం కుమ్మింది అంటే, అది అబద్ధ మని తేల్చి వేస్తుంది. అలాగే గులాబిపువ్వు లన్నీ అందంగావున్నా యన్నప్పుడు ఆ జాతి పూలు ఏ వన్నెవైనా అందంగా ఉన్నాయని చెప్పటమే నని వాక్యగర్భితంగా ఉన్న ప్రమాణ శాస్త్రం విశదీకరిస్తుంది. అందువల్ల ప్రమాణశాస్త్రం పరమప్రమాణ మౌతున్నది.

జ్ఞానస్వరూపనిరూపక శాస్త్రం భావాలు ఎలా కలుగు తున్నదీ; జ్ఞానం ఎలా సిద్ధి స్తున్నదీ చెబుతూ జ్ఞానస్వరూపాన్ని వివరిస్తుంది. ఇక వస్తుత్వనిరూపకశాస్త్ర మంటేనో, సత్పదార్థత్త్వాన్ని తెలుపుతుంది.

ఇలా భిన్నంగా ఉన్న ఈ మూడు శాస్త్రాల (ప్రమాణశాస్త్రం, జ్ఞాన స్వరూపనిరూపక శాస్త్రం, వస్తుత్వనిరూపకశాస్త్రం) సంపుటే గతితర్క మంటే ఆశ్చర్యం కలగదా? ముఖ్యంగా గతితర్కవాదులు ప్రమాణశాస్త్ర మంటే వస్తుత్వ నిరూపకశాస్త్ర మని భ్రాంతి పడుతున్నారు. అసలు భౌతిక గతితర్క మన్నదే వంధ్యాపుత్రుడు, గగన కుసుమం, శశివిషాణం మొదలైన వాటివలె స్వయం బాధితం ఎందుకంటే తర్కం భావాలకు సంబంధించినది. భావాలు చైతన్యం లోనివి. భౌతికద్రవ్యం కేవలం అచేతనం. ఈ రెంటినీ కలపట మంటే అహరారంభంతో నిశాముఖాన్ని జోడించటమే.

"పేరులోన నేమి పెన్నిధి కద్దయా" అని అన్నాడుకదా వేమన. కాబట్టి పేర్లతో పట్టింపులు వదులుకోవాలి. అప్పుడు గతితర్కం ప్రమాణశాస్త్రంగా నిలబడుతుందా ? ఈ పరిశీలన ఆవశ్యకం.

ప్రమాణశాస్త్రంలో అత్యంత ప్రధానమైన సూత్రాలు మూడున్నాయి. (1) పక్షం పక్షమే. ఉదాహరణకు వాదములో గుర్రం అన్నప్పుడు అది గుర్రమే కావాలి. (2) పక్షం ప్రతిపక్షంకాదు. ఉదాహరణకు ఆవు అంటూ మనుకోండి అది ఆవు కానిది కారాదు (3) పక్ష ప్రతిపక్షాలలో ఒకటి మాత్రమే యథార్థ మవుతుంది కాని రెండూ యదార్థం కాజాలవు. ఉదాహరణకు రజ్జుసర్పాలను తీసుకుందాము. ఒక వస్తువు రజ్జువన్నా కావాలి లేదా సర్ప మన్నా కావాలి అంతేకాని ఒకే వస్తువు రజ్జువూ, సర్పమూ కాదు.

మూడవ సూత్రవిషయంలో కొంతమంది తార్కికులు ఇలా అంటున్నారు- "ప్రమాణ శాస్త్రానికి విషయమైన, వాక్యమైనా ఇలా అవుననో,కాదనోచెబుతుంది. అప్పుడు మొదటిరెండు

సూత్రాలూ ఉండనే ఉన్నవి కాబట్టి మూడవ సూత్రం వేరుగా పేర్కొనవలసిన నక్కర లేదు'. ఈ వాదన సమంజసమే, ఈ పక్షంలో కూడా మొదటి రెండు సూత్రాలు అనుల్లంఘనీయా లవుతున్నాయి.

అయితే గతితర్కం హెగిలీయమైనా, మార్క్సీయమైనా, పైన పేర్కొన్న రెండవ సూత్రాన్ని త్రోసిరాజంటూ ద్వంద్వాలకు ఐక్యం చెప్పకొంటున్నది. అంటే జాతివ్యక్తులకు, పారమ్య సాపేక్షతలకు, ధర్మాధర్మాలకు, చేతనా చేతనలకు, జంగమ స్థావరాలకు సత్యా సత్యాలకు ఐక్యం ప్రతిపాదిస్తున్నది. ఒకే వస్తువు ఒకే కాలంలో అటు మంచిదీ కావచ్చును, ఇటు చెడ్డదీ కావచ్చు నని గతితర్క మంటున్నది. దీనిని సమర్థిస్తూ ఒకరు ఈ క్రింది దృష్టాంతమిచ్చారు :—

''మనము ఒక డెమొక్రాటిక్ రిపబ్లిక్‌ను కోరినా మనుకోండి. ఈ రిపబ్లిక్ అన్ని విధాలుగా మంచిదనో లేక అన్నివిధాలుగా చెడ్డదనో చెప్పగలమా ? అలా చెప్పలేం. కారణం ? ఈ ప్రజాస్వామిక రిపబ్లిక్ భూస్వామ్యవిధానాన్ని నాశనం చేసేదాకా మంచిదే - కాబట్టి ఆ రిపబ్లిక్ కొఱకు పోరాడుతాము. అదే డెమొక్రాటిక్ పెట్టుబడిదారీవిధానాన్ని సమర్థించినప్పుడు చెడ్డ దౌతుంది. అప్పుడా రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా పోరాడుతాము. కాబట్టి ఒకటే డెమొక్రాటిక్ రిపబ్లిక్ మంచిదిగానూ, చెడ్డది గానూ ఔతుంది. (can be good and bad at the same time).

వీరు సరికొత్తగా వస్తుగుణదీపికను వ్రాస్తే చిరంతనుల గ్రంథభారాన్ని తగ్గించిన వారు అవుతారు. రోగులకూ త్వరగా మోక్షం లభిస్తుంది.

ఇలాంటివాటి నుండి తెలుసుకోవలసిన విషయాలు కొన్ని వున్నాయి. (1) దేశకాల పాత్రలు యథార్థాలా, అయథార్థలా ? అయథార్థాలన్న పక్షంలో (1) దేశకాలాలు భౌతిక ద్రవ్య ధర్మాలన్న ఏంగెల్సు వాక్యాన్ని ఎలా సమన్వయించుకోవాలి ? (ii) హెగిలీయ గతితర్కానికీ, మార్క్సీయ గతితర్కానికీ భేద మేమిటి, (iii) ఒకే ఏనుగు కొండతో పోల్చి చూచినప్పుడు చిన్నదీ, లేడితో పోల్చి చూచినప్పుడు పెద్దదీ అవుతున్నది. అంటే ఒకే ఏనుగు అటు చిన్నది, ఇటు పెద్దదీ అవుతున్నది, అన్న ఆధ్యాత్మికవాది ప్లేటోతో మార్క్సిస్టు లింత వఱకూ ఏకీభవించటం లేదా ? (2) దేశకాలాలు యథార్థాలన్న పక్షంలో (i) ద్వంద్వాలకు ఐక్యం ఎలా సిద్ధిస్తుంది? నీరు వేడిమి వల్లకాని, ఇవం (హిమం, శైత్యం) వల్ల కాని పూర్వ కాలంలోనో, ఉత్తరకాలములోనో ఆవిరిగానో, మంచుగడ్డగానో మారుతున్నది.

అంతేకాని ఒకేకాలంలో ఒకేదేశంలో అఖండ జలపదార్థం అటు ఆవిరిగా, ఇటు మంచుగడ్డగా ఉండటం లేదు. దేశకాలాలు మిధ్యఅన్నప్పుడే, హిమాదులకు ఐక్యం సిద్ధిస్తుంది. అంతేకాని, నీరు మించుగడ్డగా ఉన్నప్పుడు ఆవిరి సెగ లుండవు. ఆవిరి దశలో ఉన్నప్పుడు మంచుగడ్డ, ఇవము ఉండవు (ii) దేశ కాలాలు యథర్థాలైనప్పుడు జ్ఞాన మంతా వ్యావహారికమై, కార్య కారణ భావం సంభావ్యమై(probable) చారిత్రావశ్యకత, అనివార్యత అన్నవి అర్థరహితాలు కావటం లేదా ?

ఈ తాత్త్వికసమస్యలను ఆవల ఉంచి, ద్వంద్వాలకు ఐక్యం చెప్పేవారిని ఈ ప్రశ్న లడగవచ్చునేమో — మార్క్స్ అన్నవ్యక్తి పుట్టాడా? ద్వంద్వైక్యవాదులు అతడు పుట్టీ పుట్ట లేదని చెప్పవచ్చును. ఎందుకంటే అతను 1818లో పుట్టి 1883లో అస్తమించాడు. పోనీ, ప్రతి విషయంలోను పరమసత్యం, సాపేక్షసత్యం మిశితమై ఉంటాయి కదా! మార్క్సిజంలోని ఏ అంశాలు పరమసత్యాలు? ఏవి సాపేక్షసత్యాలు?

ఈ ప్రశ్నలు ఆగ్రహావేశాలకు ఇంధనా లవుతాయే కాని జిజ్ఞాసకు లక్షణాలు కావు. పోనీ, ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడు

> అన్నమైతే నేమిరా - మరి
>
> సున్నమైతే నేమిరా
>
> అందుచేత పాడు పొట్టకు
>
> అన్నమే వేతామురా!

అని అన్నప్పుడు అది అవహేళన కాదు, అపకాశవాదం కాదు, కేవలం శాస్త్రీయమైన సిద్ధాంతమే నని అర్థం చేసుకోవలసి ఉంటుందా?

దీనిని కూడా వదిలి నవగ్రహాల సంగతి వారిని అడగవచ్చును. అవి ఉండీ లేకున్నవా! మరి దయ్యాలు లేక ఉన్నవి కాబోలు.

వార్ధకంలో ద్రోహిగా పరిగణితుడైన ప్లెకనోవ్‌ను పురస్కరించుకొని ..మారని వస్తువుల విషయంలో వెనుకటి తర్కమే వర్తిస్తుంది. గతి, పరిణామం కలిగినవాటి వియంలో గతితర్కమే శరణ్య మౌతుంది. వింట సంధించి విడిచిన బాణాన్నే దృష్టాంతంగా తీసు కొందాము. వెనుకటి ప్రమాణశాస్త్రం ప్రకారం బాణం ఒక క్షణంలో ఒకచోట ఉండి మరో క్షణంలో మరొక చోట ఉంటుంది. ఆశాస్త్రం ప్రకారమే మొదటి క్షణంలో మొదటి చోట

ఉన్నది. రెండవ క్షణంలో రెండవచోట ఉన్నది. కాబట్టి కేవలస్థితి నుంచి గతి కలుగుతున్నది. ఇది ఎలా సంభవం? అందువల్ల జీనో చెప్పినట్లు గతి అయథార్థ మని ఒప్పుకోవలసివస్తుంది. ఇది హాస్యాస్పదం. ఈ సమస్యను పరిష్కరించాలంటే గతితర్కమే శరణ్యం. దీనిప్రకారం మొదటి క్షణంలో బాణం అక్కడ ఉన్నది, లేదు అని చెప్పాలి. అప్పుడు జీనో సమస్య పరిష్కృత మౌతుంది. లేకపోతే ఆ సమస్య అలాగే ఉండిపోతుంది." అని గతితర్కాన్ని సమర్థించవచ్చును.

నిజమే. జీనో శరగతి మిథ్య అంటే బెర్గ్సన్ శరం మిథ్య అన్నాడు. శంకరుడు ఇంకొకడుగు ముందుకు వేసి 'గజం మిథ్య పలాయనం మిథ్య' అన్నాడు కాని అబాధితంగా అనంతసంఖ్యలను (Infinite numbers) నిర్వచించి జార్జి కాంటర్ గతిసమస్యను, సంఘటన (event) ను నిర్వచించి ప్రొఫెసర్ వైట్‌హెడ్ విషయ సమస్యను పరిష్కరించారు. ఈనాడు కూడా ఈ సమస్యాపరిష్కారానికి గతితర్కం శరణ్య మనటంలో అర్థం లేదు.

ఇంతకంటె విచిత్రమైనది మరొకటి ఉంది. "గతి స్వతఃవిరుద్ధ" మైనదని ఏంగెల్సు పేర్కొన్నాడు. దానికి ప్లెకనోవ్ వంతపాడాడు. కాని గతి అన్నది దీనికి విరుద్ధం? గతిరహితమైన పరమసత్తు ఉంటే దానికి గతి విరుద్ధ మవుతుంది. అయితే గతిరహితమైన పరమసత్తు అచింత్యం. కాబట్టి పరమసత్తు అసత్తే అవుతుంది. గతి యథార్థమై, అది అసత్తుకు విరుద్ధమైనది అయితే, గతితార్కిక భౌతికవాదం ప్రకారం శూన్యం నుంచి ఈ జగత్తురావాలి. ఇది సంభవమా?

ఈ సందర్భంలో 'టెక్స్ బుక్ అఫ్ మార్క్సిస్టు ఫిలాసఫీ' అన్న గ్రంథంతో గొంతు కలిపి ఇలా అనవచ్చును. "సాపేక్షక పరమసత్యాల ఐక్యం అంగీకరించక నిరాకరించటమంటే అనివార్యంగా వీనిలో ఒక దానిని పరిహరించి రెండవ దానిని ఆమోదించడమే. సత్యం పరమ మంటే సిద్ధాంతాన్ని అంధవిశ్వాసంగా మార్చటమే. సత్యం కేవలం సాపేక్షక మంటే సిద్ధాంతం వాస్తవతాప్రతిబింబం కాదనీ, అది వాస్తవతను విప్లవాత్మకంగా మార్చటానికి శాస్త్రీయమైన ప్రాతిపదిక సమకూర్చ జాలదని చెప్పటమే".

ఇలాంటి వాదన సమర్థనీయంగా తోచదు. సత్యం పరమమని భావించేవారిది అంధవిశ్వాసమైతే, సాపేక్షక పరమ సత్యాల ఐక్యం పరమ మని భావించే వారి సిద్ధాంతం ఎలాంటి

దౌతుంది? పైగా పరిణామజ్జగత్తును, సాపేక్షసత్యాన్ని సంభావించేవారు అభీష్ట సామాజిక పరిణామసాధకులు ఎలాకాకపోతున్నారు.

కాగా, ఇంతవరకూ తేలిన పర్యవసానాన్ని బట్టి ఇలా చెప్పవచ్చును. (1) భౌతిక గతితర్కం స్వయంబాధితం. (2) ఇది ప్రమాణశాస్త్రానికీ, వస్తుత్వశాస్త్రానికీ ఉన్న భేదం గమనించక భ్రాంతికూపంలో పడుతున్నది. (3) పక్షం, ప్రతిపక్షం కాదన్న ప్రమాణశాస్త్ర సూత్రాన్ని ఉల్లంఘించి ఇది శాస్త్రత్వానికేదూర మవుతున్నది. (4) గతితర్కాన్ని ఏరూపంలో ఆమోదించినా, విచారప్రపంచం లోనికి అవ్యవస్థను ఆహ్వానించటమే. అంతేకాదు — పురుషార్థాని కాలదన్ని, ధర్మానికి ఉద్వాసనచెప్పి పశుబలానికి పట్టం గట్టి అవకాశవాదానికి వందిగీతాలు పాడటమే.

## జ్ఞానం స్వాతంత్ర్యం నిర్వచనాలు

గతితర్కం ప్రమాణశాస్త్రమే కాక జ్ఞాన సిద్ధాంత మని కూడా లెనిన్ వ్రాశాడు. అత్యంత వివాదాస్పదంగా కనిపించే ఈ సూత్రాని అతడెక్కడైనా వివరించి సమర్థించి ఉంటాడని ఆశించడం జిజ్ఞాసువులకు సహజం. అయితే హెగిల్ మీద వ్రాసిన టీకలోగాని, తన యితర రచనలో గాని ఆయన దాన్ని వివరించలేదు.

జ్ఞానస్వరూపవిషయంలో లోగడ పేర్కొన్న వాటికంటె మార్క్సిజానికీ, హెగిల్ సిద్ధాంతానికీ ప్రధానమైన ఇతర భేదాలు లేవు. ఎందుకంటే ఈ రెండు సిద్ధాంతాలకు ఈ క్రింది విషయాలు సమానం :—

(1) ప్రతిషేధ మంతా అవచ్ఛేదమే, (2) విశ్వం అవయవి. అవయవం కంటె అవయవి విశిష్టం. అవయవిజ్ఞానమే సత్యం. (3) అనుయోగి, ప్రతియోగి, సంయోగి అన్న 'త్రికం' ద్వారానే అనివార్యంగా ఉత్తరోత్తర అభ్యుదయకము బలీయమైన పరిణామం జరుగుతుంది. (4) త్రికగతి కంటె అతిరిక్తమైన గతి సృష్టి పరిణామంలో లేవు. ఈ గతిని తెలిసికొని భజించటం ద్వారానే మానవుడు స్వాతంత్ర్యం పొందుతున్నాడు. (5) త్రికగతిభజనమే ధర్మం.

ఈ విషయాలు ప్రామాణికాలే అయితే గతితర్కవాదం కూడా ప్రామాణిక మనవచ్చు. అందువల్ల వీని పరిశీలన ముఖ్యం.

ప్రతిషేధ మంతా అవచ్ఛేదమే నన్న సూత్రానికి ముందు అర్థం చెప్పుకోవాలి. దృష్టాంతంగా "ఇది ఆవు" అన్నవాక్యాన్ని తీసుకొందాము. "సమీపంలో ఉన్నది పొదుగు, గంగడోలు, చిన్నకొమ్ములు, కుచ్చుతోక, చీలిన గిట్టలు గల పశువు" అని ఈ వాక్యాన్ని అర్థం చేసుకొంటాము. ప్రకృతిసూత్రం దీనిని అంగీకరించదు. పైగా ఇది తప్పు అంటుంది. ఈ వాక్యానికి ఇలా అర్థం చెబుతుంది: — ఆ దూరమందు అసత్తు కానిది గేదె కాదు, దున్న కాదు, ఎద్దు కాదు, గుర్రం కాదు, గాడిద కాదు, ఏనుగు కాదు, విహంగం కాదు, క్రిమి కాదు, కీటకం కాదు, విశ్వంలోని సమస్త గవేతరవస్తువు కానిది.

ఈ సూత్రంతో రోలు పగిలితేనేమి కాని, అద్దె మాత్రం చక్కగ లభిస్తున్నది. విశ్వానికి ఐక్యం, వస్తుజగత్తులకు అంగాంగిభావం సిద్ధిస్తున్నవి. త్రికగతి విజృంభణ అప్రతిహత మౌతున్నది. కాని పార్వతి పెండ్లి, రఘు వంశ వర్ణన చెప్పిన కాళిదాసును మహాకవి అనటం కేవలం తెలివి తక్కువ. అతడు విశ్వాన్నంతా వర్ణించలేదు, అప్పుడది జ్ఞానం ఎలా అవుతుంది? సత్య మెలా అవుతుంది? దానికి స్వయం భాసమానత్వం ఎలా సిద్ధిస్తుంది? ఆ స్వయంభాసమానత లేక ఆకృతులను కావ్యత్వం ఎలా వరిస్తుంది?

ఈ సూత్రమే యథార్థమైతే ఏ ఒక శబ్దానికైనా తత్సంకేతి తార్థధర్మాలు చెప్పాలన్నా భాషాప్రపంచగత సర్వశబ్దాల కున్న అర్థాలన్ని ముందుగానే తెలిసి ఉండాలి. ఇది అసంభవం కాబట్టి ఈ పక్షంలో శబ్దానికి అర్థమే లేక పోవలసివస్తుంది. కాని, శబ్దం అర్థవంత మనే విజ్ఞులు భావిస్తున్నారు. లోక వ్యవహారం కూడా దీనిని పురస్కరించుకొనే జరుగుతున్నది. "క్రియాకారి అయిన ప్రతి సిద్ధాంతం సత్యం కాదు. అసత్యాలైన పెక్కు సిద్ధాంతాలు సుదీర్ఘ కాలం క్రియాకారులు అవుతున్నాయి. అవి సంతృప్తికరంగా పనిచేస్తున్నప్పటికీ సత్యాలు కావు" అని వాదించవచ్చును. ఇలాంటి వాదనకు అభివాదపురస్సరంగా ఊసరిల్లటం కంటె ఈ సందర్భంలో గత్యంతరం లేదు.

ప్రతిషేధ మంతా అవచ్ఛేదమే నన్న సిద్ధాంతంతో విశ్వానికి అవయవిత్వం, అందలి వస్తువులకు అవయవత్వం సిద్ధిస్తున్నవి. దీనితో అవయవం కంటే అవయవి విశిష్టమైనదనే అవయవి కంటె అతిరిక్తమైన అవయవం అయథార్థమనీ విస్పష్ట మవుతున్నవి. అంటే (బ్రహ్మాన్ని లేక విశ్వాన్ని) బోధించేదే మాత్రమే యథార్థజ్ఞాన మన్నమాట. ఈ పక్షంలో సర్వజ్ఞునిది తప్ప మానవమాత్రులది జ్ఞానం కాజాలదు. గణితాది శాస్త్రాలు కూడా అవయవి అయిన విశ్వం యొక్క సమగ్రస్వరూపం కాక విశ్వం లోని ఆయా అంశాలను గూర్చి

మాత్రమే చెబుతున్నవి. అందువల్ల అవి చెబుతున్న అర్థాలు కేవలం అసత్యాలు. ఒకవేళ విశ్వాంగాలుగా గుర్తించి తదనుగుణంగా అవి తమ అర్థాలను ప్రతిపాదించినా అవి ఖండ సత్యాలే. విశ్వంలోని సమస్తవస్తువులు మారుతున్నప్పటికీ హెగిల్, మార్క్సులు ప్రతిపాదించిన సిద్ధాంతాలకు భంగం లేదు. ఎందుకంటే అవి అవయవిని గూర్చి ప్రతిపాదిస్తున్నవి. ఈ విషయాన్నే పదార్థలు (categories) నిత్యాలన్న హెగిలియోక్తి సూచిస్తున్నది. ఈ అర్థాన్ని మనసులో ఉంచుకోనే శతాధికవత్సరాలు గడిచినా, మార్క్సిజంలోని ఏ అంశాన్ని వర్జించటానికి వీలులేదని మార్క్సుభక్తుల పవిత్రవిశ్వాసం. 'వాస్తవసత్యాన్ని పరిత్యజించకుండా, బూర్జువా విప్లవ నిరోధక పరిష్వంగంలో పడకుండా మార్క్సు సిద్ధాంతంలోని ఏ అనల్పభాగాన్ని కూడా పరిహరించలేవు. అది అవిభాజ్యమైన ఉక్కు పిండమన్నట్లు ఉంటుంది'' అని భాష్యకారుడు వ్రాశాడు.

ఈ సందర్భంలో ఒక సందేహం కలుగవచ్చును. శాస్త్రాలు ప్రతిపాదించే అర్థాలు సత్యాలు కానప్పుడు గతితర్క సిద్ధాంతీకరణకు ప్రకృతి శాస్త్రాలను సామాజిక శాస్త్రాలను ఏంగెల్సు ఎందుకు ఆశ్రయించవలసి వచ్చింది? దీనిని బట్టి జ్ఞానం వ్యావహారిక మని స్పష్టం కావటం లేదా? నిజమే. అతడే అన్నాడు:— "కొన్ని సామాజిక, రాజకీయ వ్యవస్థలు ఒక ప్రత్యేక యుగంలో, ఒక ప్రత్యేక జాతిలో వుంటున్నవి. ఈ వ్యవస్థలు అనిత్యాలు. వీని సంబంధాల వల్ల, ఫలితాలవల్ల ప్రత్యక్షజ్ఞానం కలుగుతున్నది. కాబట్టి జ్ఞానం ప్రధానంగా సాపేక్షం సామాజిక, రాజకీయ క్షేత్రంలో అంతిమమూ అచ్యుతమూ అయిన సత్యాలను అన్వేషించేవాడెవడైనా మామూలు ధర్మపన్నాలు చెప్పవలసినదే తప్ప వేరే కనుగొనగలిగింది ఏమీఉండదు కాకపోతే. మానవుడు సామాన్యంగా శ్రమపడి తప్ప బ్రతుకలేడు. నెపోలియన్ 1821 మే 5వ తేదీన మరణించాడు అని ఇలాంటి శోచనీయార్థాలను కనుగొనవలసిందే"

ఇలా వ్రాసిన చేతితోనే అతడు మరొక రచనలో ఇలా వ్రాశాడు:— ''గతితార్కిక తత్వశాస్త్రం ప్రకారం ఏదీ అంతిమమూ, పరమమూ పవిత్రమూ కాదు. ప్రతి వస్తువుకూ ప్రతివస్తువులోనూ ఉన్న తాత్కాలిక లక్షణాన్ని అది వెల్లడిస్తుంది. అవ్యాహత పరిణామ విధానం తప్ప. క్రింది నుండి పైకి కొనసాగుతున్న అనంతారోహణక్రియ తప్ప మరొకటి దానిముందు నిలువజాలదు. ఈ గతితార్కికతత్వం కూడ ఆలోచిస్తున్న మెదడులో ప్రతిబింబిస్తున్న పరిణామ విధానం కంటె ఏ మాత్రం భిన్నమైనది కాదు. దీని (గతితర్కం) విప్లవాత్మక లక్షణం పరమం—ఈ పరమార్థం ఒక్కదానినే గతితార్కికతత్వశాస్త్రం ఆమోదిస్తున్నది.

జ్ఞానమంతా సాపేక్ష మంటూ పై ప్రకరణంలోను, గతితార్కిక తత్వశాస్త్ర మంతా పరమం అని రెండవ ప్రకరణంలోను పేర్కొనటం జరిగింది. ఈ రెంటికీ సమన్వయ మేమిటి? గతితార్కిక తత్వశాస్త్రార్థం జ్ఞానం కాదా! కాక గతితార్కిక శాస్త్రార్థం తప్ప మిగిలిన దంతా సాపేక్షజ్ఞానమా? ఈ రెండవ అర్థాన్నే రెండవ ప్రకరణలోని వాక్యం సమర్థి స్తున్నది. కాబట్టి ఏంగెల్సును ఇలాగే అర్థం చేసికోవలసి ఉంటుంది. ఈ పక్షంలో జ్ఞానం పారమార్థికమా (a priori)? కాక వ్యావహారికమా (posteriori)? కాక ఉభయమూనా ? మొదటి పక్షమే అయితే త్రికగతి ప్రసారానికి ప్రకృతిశాస్త్రాలతో గాని, సామాజిక శాస్త్రా లతోగాని నిమిత్తమే లేదు. అప్పుడు చంకలోని బిడ్డకోసం ఊరంతా గాలించట మౌతుంది. రెండవ పక్షంలో త్రికార్చనకు ఉద్వాసన మేర్పడుతుంది. అంటే గగనప్రసూనసౌరభాన్ని వైనవైనాలు పెట్టి వర్ణించట మౌతుంది. ఇక మూడవ పక్షమే మార్క్సీయ సిద్ధాంతం. ఈ పక్షంలో ప్రమాణశాస్త్రాన్ని ఉల్లంఘించట మౌతుం దని లోగడ చెప్పుకొన్నాము.

ఇక త్రికగతిని పరిశీలించవలసి ఉంది. అనుయోగి, ప్రతియోగి, సంయోగి అన్నవి త్రిక మనీ ఈ త్రికధార ద్వారా బ్రహ్మం లేక విశ్వం అంతర్గతవైరుధ్యపరిహారణార్థం పరిణా మం పొంది పరమంగా వైరుధ్యరహితమైన స్థితికి చేరుకొంటుందనీ, హెగిల్ అనుమతీకరిం చాడు. ఈ అనుమతీకరణం అశాస్త్రీయ మని అతని శిష్యుడు క్రోచే కూడా తీవ్రంగా విమర్శించాడు. ఈ వాదాన్ని ఉల్లేఖించి క్లేశం కలిగించటం వల్ల ప్రయోజనం లేదు. క్రోచే ఒక్కడే కాదు, మరెందరో ఈ త్రికధారపూర్వకపరిణామాన్ని పూర్వపక్షం చేశారు. పూర్వ పక్షాల అనువాదాలను వదిలి అందరికీ అందుబాటులో ఉన్న ఒక విమర్శనాన్ని ఉటంకించటం మేలు.

"ఒక వస్తువునకు ఒక ప్రత్యేక గుణసముదాయం వుంది, మరొక వస్తువునకు దేనికి ఆ గుణసముదాయం లేనప్పుడు ఆ వస్తువు ఫలాని ఫలాని గుణాలు గల వస్తు వని నిర్వచించ వచ్చును. ఈ గుణాల ఉనికిని బట్టి ఆవస్తుసంబంధి ధర్మాలతో ఏ ఒక ధర్మమూ, ప్రమాణ శాస్త్రానుమేయం కాదు. ఇక వస్తువును ఇతర వస్తువులన్నింటినుండి వేరుచేయ కలిగిన జ్ఞానం ఉంటే, ఆ వస్తుధర్మా లన్నింటినీ ప్రమాణశాస్త్రం చేత సాధించవచ్చు నని హెగిల్ భావించాడు. ఇదే పొరపాటు. ఈ ప్రమాదం నుంచే అతని సిద్ధాంత ఉత్తుంగసౌధం మిన్నంటుతూ లేచింది. నీ తర్కం ఎంత ఘోరంగా ఉంటే, ఆ తర్కఫలితాలు అంత కుతూహలప్రదంగా వుంటవన్న ప్రధానసత్యానికి ఈ సిద్ధాంతం దృష్టాంతంగా ఉంది".

అశాస్త్రీయం ఊహాకల్పితం అయిన త్రికగతిని మార్క్సు కొలది మార్పులతో స్వీకరించాడు. లోగడ చెప్పుకొన్నట్లు విజ్ఞానస్వరూపమైన బ్రహ్మం వైరుధ్యపరిహారణార్థం పరిణమిస్తూ ఉన్నదని హెగిల్ అంటే, చైతన్యరహితమైన భౌతికద్రవ్యం అంతర్గతవైరుధ్యం వలన పరిణమిస్తున్న దని మార్క్సు అంటున్నాడు. బ్రహ్మ పరిణామానికి అంతం ఉన్నదని హెగిల్ అంటే అలాంటి దేమీ లేదని మార్క్సు అంటాడు. (గతితర్కాంతర్భూత దార్శనికార్థాన్ని బట్టి చెప్పవలసి వస్తే, హెగిల్ చెప్పినట్లు పూర్ణత పొందిన పిమ్మట పరిణామం ఆగిపోవలసినదే తప్ప, అనంతంగా సాగటానికి వీలులేదు. ఈ విషయంలో మార్క్సు పొరపడ్డా డనవలసి వస్తుంది. దీని వివరణ ముందు వస్తుంది).

త్రికాన్ని ఆమోదించినప్పుడు పరిణామం ఆవశ్యక మౌతుంది. ఈ పరిణామంలో పూర్వపూర్వదశల కంటె ఉత్తరోత్తర దశలు అభ్యుదయక బలీయా లవుతాయి. అంతేకాదు. ఈ విశ్వ మంతా త్రికధారాసిద్ధమే. త్రికధారకు వెలుపల ఏమీ లేదు. త్రికధార లోపల అస్పష్టమూ లేదు.

వ్యావహారికదృష్టితో చూచినప్పుడు హెగిలీయ బ్రహ్మనికీ, మార్క్సీయ చరిత్రకు ఎంత దుర్గతి పట్టిందా అన్న ఆశ్చర్యం కలుగక మానదు. ఈ జర్మన్ మేధావులు చేయించే త్రికధారాత్మకమైన కసరత్తు చేయలేక అవి రెండూ చచ్చిపోతూ వుండాలి. మార్క్సీయచరిత్ర కమ్యూనిస్టు సామాజికవ్యవస్థ నెలకొన్న తరువాతనైనా శాపావసానం ఏర్పడుతుందా అంటే అప్పటి సంగతి అప్పటి మావాళ్ళు ఆలోచిస్తారు లెమ్మంటాడు. బ్రహ్మనికీ చరిత్రకూ ఇంత దుర్గతి పడితే ఇక జీవనబుద్బుదాలైన వైయష్టిక మానవుల సంగతి ఏమున్నది ?

ఇలాంటి ఆలోచనతో మరొక తరంగం ప్రభవించవచ్చును. ఇంతకూ బ్రహ్మం హెగిల్ వద్ద, చరిత్ర మార్క్సు ఎద్ద మంత్రోపదేశం పుచ్చుకొన్నాయా ? లేకపోతే గ్రహనక్షత్రాలు అసంఖ్యాకంగా ఉండగా బ్రహ్మం మన భూగోళంలో ముఖ్యంగా మధ్యధరాప్రాంతంలో తన ఉత్తరదశలను వెల్లడించవలసిన అవసరం ఎలా ఏర్పడింది ? ఋషులకు భరతవర్షం వలె హెగిలీయ బ్రహ్మకు మధ్యధరాప్రాంతం, చరిత్రకు యూరపు పుణ్యభూమి కాబోలు !

ఇలాంటి ఆలోచనవల్ల ప్రయోజనం లేదు. శాస్త్రార్థాలను శాస్త్రదృష్టితోనే పరిశీలించాలి. అప్పుడే యథార్థతాయథార్థతలు గ్రహించటానికి అవకాశం ఏర్పడుతుంది.

గులాబిపూవు అందంగా వుంటుంది, అన్నప్పుడు నల్లగులాబి పువ్వైనా, తెల్లగులాబి పువ్వైనా అందంగా ఉండవలసి వస్తున్నట్లే పరిణామంలోని పూర్వదశను బట్టి ఉత్తరదశ

విధిగా వుండవలసి వస్తున్నదని అటు హెగిల్ ఇటు మార్క్స్ ప్రతిపాదిస్తున్నారు. దీనిని బట్టి జగద్వికాసంలో పూర్వ దశ కారణం, ఉత్తరదశ కార్యం అవుతాయి. త్రికగతి కంటె అసంగతి లేదు కాబట్టి కారణం విధిగా కార్యంగా పర్యవసిస్తుంది. లోకంలో బీజాదులవంటి కారణాలు పురుగులు మొదలైన వానిచే నష్టం కావటం వల్లనో, యోగ్యక్షేత్రాదులు లభింప కుండటం వల్లనో కార్యోత్పత్తి జరగక పోవచ్చును. కాని ఈ పరిణామం అలా కాదు. అని వార్యంగా జరిగితీరుతుంది. సాధారణవాయుపీడనంలో 100°C వేడిమి పొందిన నీరు ఎలా ఆవిరి రూపం పొందకుండా ఉండలేవో, బ్రహ్మం, చరిత్ర కూడా ఉత్తర దశను పొందకుండా ఉండలేవు. ఈ పరిణామం అనివార్యమే కాక ధర్మ్యమూ అవుతున్నది. ఈ విధంగా త్రికగతి తార్కికంగా ఆవశ్యకమే కాక, అనివార్యమూ, ధర్మ్యమూ అవుతూ, అటు విజ్ఞానప్రపంచాన్ని ఇటు కావ్యజగత్తును, ధర్మస్థితినీ ముడివేస్తున్నది.

ఈ త్రికసిద్ధాంతాన్ని అనుసరించి ఇప్పుడు జగత్తులో గోచరించే దంతా యథార్థమూ, ధర్మ్యమూను. దేశంలో అజ్ఞానం అధర్మం వున్నవనుకోవటం భ్రాంతి. ఇప్పటి స్థితి పూర్వ దశనుండి ఆవిర్భవించింది. అందువల్ల ఇది యథార్థం. కాబట్టి ధర్మ్యం. ఈనాడు ఆర్థికంగా సామాజికంగా, రాజకీయంగా వున్న ఎచ్చులొచ్చులు ఇలా వుండటమే ధర్మం. ఎందుకంటే ఈ ఎగుడు దిగుళ్ళు లేకుంటే ఇతోధికాభ్యుదయ మైన ఉత్తరదశ ఎలా వస్తుంది ? పాసిస్టు వ్యవస్థ ఏర్పడటం నాశనం కావటం అనేది బ్రహ్మ, చరిత్రల పరిణామంలోని అవాంతర దశలు కాబట్టి ఆవశ్యకాలే కాని ప్రజాస్వామ్యవాదులు భావిస్తున్నట్లు సృష్టిలోని వైపరీత్యాలు కావు.

ఉన్నవి యథార్థాలూ, ధర్మ్యాలు అయినప్పుడు వీనిని సమర్థించి రక్షించుకోవలసినదే కదా అన్న ప్రశ్న కలుగవచ్చును. కాని, ప్రకృతం ఉన్న స్థితిగతులు శాశ్వతాలు కావు. ఇవి మరొక రూపం సంతరించక తప్పదు. కాబట్టి రానున్న పరిణామదశను పురస్కరించుకొని ఉన్న స్థితిగతులు సమర్థనీయాలు, ప్రశంసనీయాలు, ధర్మ్యాలు అయితే వీనికోసం పాటు పడటం, కాక విరుద్ధంగా వుంటే కూలద్రోయటానికి ప్రయత్నించటం ధర్మం అవుతుంది. అలాంటిది అస్వాతంత్ర్యకూటపతనానికి హేతు వవుతుంది.

ఈ సందర్భంలో ఒక సందేహం కలుగవచ్చును. "ఇంతకుముందు వున్న స్థితిగతులు మారకతప్పదని పేర్కొనటం జరిగింది. విధిగా అవి మారుతున్నప్పుడు వ్యక్తులు ఆ మార్పు కోసం పాటుపడవలసిన పనేమున్నది? కాక వ్యక్తులు ఏర్పడినప్పుడే ఆ మార్పు వస్తుందన్న

పక్షంలో మార్పు అనివార్య మెలా అవుతున్నది ? మొదటి పక్షమే యథార్థమైతే, ధర్మా-ధర్మ్యాలకు స్వాతంత్ర్యాస్వాతంత్ర్యాలకు తావే లేదు. రెండవ పక్షమే యథార్థమైతే, పరిణామము యొక్క అనివార్యతకీ తావులేదు" అనవచ్చును.

ఇలాంటి ప్రశ్న వస్తుందనే ఊహించుకొని ప్లెకనోవ్ ఇలా సమాధానం చెప్పాడు:— వారు (పై సందేహం సూచించినవారు) హెగిల్ సిద్ధాంతాన్ని ఎరుగరు కాబట్టి ఏంగెల్సును అర్థం చేసికోలేరు. అతన్ని విమర్శిస్తూ వ్యాప్తికి (necessity) దోసిలి ఒగ్గుతున్నప్పుడు స్వాతంత్ర్యమే వుండజాలదని ఉద్ఘాటిస్తున్నారు. విషయి విషయాదుల ఐక్యం దుర్ఘటం కావించే ద్వైతీభావపూర్ణాలైన తాత్త్వికభావాలున్న వ్యక్తుల కిలాంటి దృక్పథం ఉండటం పూర్తిగా సమంజసమే.

ప్లెకనోవ్ మార్క్సిజాన్ని, హెగిల్ సిద్ధాంతాన్ని పురస్కరించుకొనే సమాధానం చెప్పాడు. కాని తాత్వికంగా పరిశీలిస్తే మాత్రం ఈ సమాధానం సాహసోపేతమే నని చెప్పాలి. ఎందుకంటే పారమార్థిక ప్రపంచ మనీ, భౌతిక ప్రపంచ మనీ రెండు ప్రపంచాలను ప్రతిపాదించారు. అద్వైతాన్ని అధిగమించి ఏకత్వం సాధించాలంటే హెగిల్ సిద్ధాంతమూ, దానిని చక్కదిద్దిన మార్క్సిజం తప్ప మరొక దృక్పథం ఉండటానికి వీలు లేదని వాచ్యంగా కాకపోయినా, సూచనప్రాయంగానైనా తెలుపుతున్నాడు. కాశ్మీర శైవాదుల వంటి ప్రాచీన తత్త్వశాస్త్రాలు, సృజనాత్మక పరిణామం వంటి ఆధునిక తత్త్వశాస్త్రాలు ఉన్నవి. అవి విశిష్ట మైనా కావా అన్న విషయం వేరు.

ఇంతకూ త్రికధారాపూర్వకమైన పరిణామం కంటె అతిరిక్తమైనది ఉండ వీలులేదు. కాబట్టి త్రికగతిని తిరిగి తదనుగుణంగా వర్తించటమే స్వాతంత్ర్యం, కారణతానవిచ్ఛిన్నంగా స్వాతంత్ర్యం ఉండదు. కారణతను వుల్లంఘించటానికి యత్నించటం అవివేకమే. కొండను ఢీకొనే పొట్టేలు బుద్ధిమాలినది. పరతంత్రమూ అయినట్లే. త్రికగతిని గుర్తించి అనుసరించని వాడు అవివేకి; అస్వతంత్రుడు అవుతున్నాడు. త్రికగతిజ్ఞానం లేనివారే నవనవోన్మేషత్వం, సృజనత్వం, స్వయంవరణత్వం మొదలైన లక్షణాలు గలదే స్వాతంత్ర్య మని భావించటం కద్దు. అలాంటి స్వాతంత్ర్యం కేవలం అజ్ఞాన కల్పితమే కాని యథార్థం కాదు. ఈ విషయాన్నే ఏంగెల్సు ఇలా చెబుతున్నాడు :—

"అర్థం చేసుకోనప్పుడు మాత్రమే వ్యాప్తి (necerssity) గుడ్డిది. ప్రకృతిసూత్రాలకు లోబడక వుండాలని కలలు గనటం స్వాతంత్ర్యం కాదు. ఈ సూత్రాలను తెలిసికొని

నిర్దిష్ట లక్ష్యసాధనకై వీనిని సక్రమంగా వినియోగించాలి. ఇలా వినియోగించటంలో ఏర్పడే అవకాశమే స్వాతంత్ర్యం....కాబట్టి సంకల్పస్వాతంత్ర్య మంటే యథార్థమైన ప్రమాతృ జ్ఞానంతో నిర్ణయాలు చేయగలగటమే."

ఇక ధర్మం విషయంలో సాధనసాధ్యభేదం గమక గమ్యభేదం లేదు. చరాచర ప్రాణి కోటిలోని మానవజాతితో బ్రహ్మము, చరిత్ర, ఉత్తమ దశ పొందుతున్నవి. రానున్న దశకు అనుగుణంగా ప్రవర్తించటమే ధర్మము కాని, సౌభ్రాత్రసౌమనస్యాలకు, శాంతిసత్యాలకు, దయాధర్మాలకు, సానుభూతి సహకారాలకు వేరుగా అర్థంకాని స్థానం కాని లేదు.

## గతితర్కం వాస్తవ పరిణామం

ఇంతవరకు గతితర్కం బోధించే వాదపద్ధతిని జ్ఞానస్వరూపాన్ని, జ్ఞానస్వరూపంతో నిష్పన్న మవుతున్న స్వాతంత్ర్య స్వరూపాన్ని, ధర్మతత్త్వాన్ని కొంత తెల్సుకొన్నాం. ఇక ప్రకృతి సమాజాల పరిణామాన్ని, సంస్కృతి విజ్ఞానాల వికాసాన్ని ఇది ఎంతవరకు వివరిస్తున్నదో పరిశీలించటం ముఖ్యం.

భౌతికశాస్త్రాలు, సామాజికశాస్త్రాలు గతితర్కవాదాన్నే సమర్థిస్తున్న వని ఏంగెల్సు నిరూపించటానికి యత్నించాడు. ఎవరెన్ని చెప్పినా భౌతికశాస్త్రాలు ప్రధానంగా కారణ కార్య భావ నిర్దేశకాలు. ఉదాహరణకు భౌతికశాస్త్రంలోని "బాయిల్సులా" నే తీసుకోవచ్చును. వేడిమి మారకముందు ఒకేవిధంగా వున్నప్పుడు పీడనం అధికమైనకొలది వాయుఘనపరిమాణం తగ్గుతుంది. పీడనం తగ్గినకొలది దాని ఘనపరిమాణం పెరుగుతుంది." అని ఈ సూత్రం చెబుతున్నది. అంటే ఈ కారణాలవల్ల ఈ కార్యం జరుగుతున్నదని చెబుతున్నది.

గతితార్కికసూత్రా లంటేనో, స్వరూపతః కాకపోయినా, విషయకంగా తార్కికాలే కాని కారణ కార్యభావ ప్రతిపాదకాలు కావు. గతితర్కం బోధించే వైరుధ్యం, ప్రతిషేధం, ప్రతిషేధప్రతిషేధం కారణతాద్యోతకాలు కావు. కేవలం తార్కికార్థద్యోతకాలు. అయితే ఈ సందర్భంలో "బాయిల్సులా" కు తరువాత వచ్చిన సవరణ గతితర్కసూత్రాలను సమర్థిస్తున్న వనవచ్చును. కాని, ఆ సవరణ "బాయిల్సులా" ను ప్రతిషేధించటం లేదు. కేవలం ఆ సూత్రంలో వున్న అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలను పరిహరిస్తూ వుంది. అలాగే న్యూటన్ ప్రతిపాదించిన సూత్రాలను సాపేక్షతావాదం సవరిస్తున్నదే కాని అవన్నీ అసలు తప్పులతడక లని పూర్తిగా కొట్టివేయటం లేదు. అతివ్యాప్తి,

అవ్యాప్తి దోషపరిహరణాన్నే ప్రతిషేధమన్న పక్షంలో మాటలకు నిర్దిష్టార్థా లున్నాయనవలసి వస్తుంది. అన్నట్లు శబ్దానికి అర్థమే అసాధ్య మని కదా త్రికగతి సిద్ధాంతం !

భౌతికశాస్త్రాలకంటె, జీవశాస్త్రంలో గతితర్కానికి కొంత అన్వయం ఉన్నట్లు కనబడుతుంది. ఈ శాస్త్రానికి ప్రమేయాలైన ప్రాణులు విశేషంగా చక్రికావృత్తి కలవి. అయితే ఉన్నతస్థాయిలో ఆ వృత్తి ఏర్పడుతుందన్న సూత్రం కొంతవరకు జీవపరిణామా నికి అన్వయిస్తున్నది. ప్రతిషేధ మన్న పదం కూడా ఈ శాస్త్రంలో కొంత సార్థకత పొందుతున్నది. జడపదార్థం ఆహార రూపంతో శరీరంలో చేరి అక్కడ చేతన పదార్థంగా మారుతున్నది. ద్వంద్వాల ఐక్యం నుంచి నూతన ఉత్పత్తి జరుగుతున్న దనటానికి పిండోత్పత్తి నిదర్శన మని చెప్పుకోవచ్చును. కాని పిండపరిమాణం శిశూదయం గతితార్కిక సూత్రాలలో దేనికి తేలికగా లొంగదు. స్త్రీపురుషకామనంలోను, జీవనోపాధి విషయంలోను సంఘర్షణ కనబడుతున్నప్పటికీ, జీవపరిణామంలో ద్వంద్వాల సంఘర్షణమే పరమ చోదక సూత్రమని విస్పష్టంగా తేలటం లేదు. ఏది ఎలా ఉన్నా గతితర్కానికి విస్తృతార్థం కల్పించుకొన్నప్పుడు జీవశాస్త్రసూత్రాలను స్థూలంగా సూచిస్తున్న దనిపిస్తుంది. మొత్తం మీద జీవశాస్త్రంతో పరిచయం లేక ప్రాణుల ప్రవర్తన ధర్మాలను ఎలా సూత్రీకరించాలో తెలియని తత్త్వశాస్త్రకారుడు చేసిన ప్రయత్నఫలితమా అన్నట్లు గతితర్కం గోచరిస్తుంది.

"ఫ్రెడరిక్ ఎడ్లర్, కారల్ కోర్ట్ మొదలైన కొంతమంది మార్క్సిస్టులు గతితర్కం మనస్తత్త్వశాస్త్రానికి మాత్రమే అన్వయిస్తుందని వాదించారు. వారి అభిప్రాయం యథార్థమైతే కావచ్చును. అయితే గతితర్కం మనస్తత్వశాస్త్రసూత్రాలకు కొన్నిటికి అనుగుణంగా ఉండి మార్క్సిజానికి ఆవశ్యకమైన మనస్తత్వశాస్త్రసిద్ధాంతం కొరతను తీరుస్తున్నప్పటికీ ఈ ప్రయోజనం అంతగా దీనివల్ల నెరవేరటం లేదు. ఇది కేవలం విస్పష్టమైన మనస్తత్వ శాస్త్రం కాదు. మనస్తత్వశాస్త్రమే అయితే శాస్త్రకారులు దీనిని విమర్శించి పరిష్కరించి ఉండేవారు."

మార్క్సియ గతితర్కం సామాజికపరిణామానికి వ్యవహారాలకు సమగ్రంగా అన్వ యిస్తుందని సాధారణంగా భావించటం కద్దు. అయితే మార్క్స్ ఎక్కువగా భూస్వామ్య విధానం పెట్టుబడిదారీ విధానం, సోషలిజం అన్న త్రికంలోనే ఆసక్తి తీసుకొన్నాడని రస్సెల్ పేర్కొన్నాడు. ఏది ఎలా ఉన్నా సామాజికవ్యవహారాలను వివరించవలసి వచ్చినప్పుడు మార్క్స్ ఎక్కువగా చారిత్రక భౌతికవాదదృక్పథం అనుసరించాడు. కాని గతితార్కిక

పద్ధతిని, పరిభాషను విశేషంగా పీడలేదు. గతితర్క-సూత్రాలనే బీరుపోకుండా సామాజిక వ్యవహారాలకు అన్వయించాలంటే, కొన్ని వాస్తవాలను విస్మరించి, కొన్ని చారిత్రక సంఘటలను విడిచి శ్రమ పడవలసి ఉంటుంది. ఇలా అనటంలో అతిశయోక్తి అంతగా లేదేమో.

ఈ పైవాక్యాల తాత్పర్యం తెలుసుకోవటం ముఖ్యం. దీనికిముందు మార్క్సిద్ధాంతం అనువదించుకోవాలి. ఉనికినిబట్టి భావాలు, లక్ష్యాలు, ఆదర్శాలు, తాత్త్వికార్థాలు, సాహిత్యాది లలితకళలు, చట్టాలు, ధర్మాలు, రాజకీయాలు మొదలైనవన్నీ నిర్ణీతాలు అవుతున్నాయి. ఇలా అత్యంత ముఖ్యమైన వస్తుత్వం (ఉనికి) కేవలం ద్వంద్వసంపుటి. ఈ సంపుటి మానవచరిత్ర ప్రారంభంనుంచీ ఉత్పత్తి విధానాన్నిబట్టి మారుతున్నది. ఉత్పత్తివిధానం అంతర్గతవైరుధ్యంవల్ల పరిణమిస్తున్నది.

సమాజనిర్మితికూడా పై సూత్రాలకు అనుగుణంగా ఉంటుంది. వ్యక్తులు సమాజానికి అంశాలు. ఈ రెంటికి సంబంధం జాతి వ్యక్తులకున్నసంబంధం వంటిదే. జాతి నిత్యం. వ్యక్తులు అనిత్యాలు. ఉత్పత్తి పికాసంలేని ద్వైతభావాన్ని పురస్కరించుకొని సమాజంలోకూడా ప్రధానంగా రెండు వర్గాలేర్పడుతాయి. అవాంతర వర్గాలు ఉండవని భావించ నక్కరలేదు. యిలాంటి అవాంతర వర్గాలున్నా చారిత్రకగతిసబట్టి ఇవి ప్రధానవర్గయుగళంలో అంతర్భూతమౌతాయి. లేదా, అపరిగణ్యాలు అవుతాయి. ఉత్పత్తిసాధనాలు స్వాధీనమందున్న వర్గమెప్పుడూ పాలక వర్గ మౌతుంది. ఇంతకు ముందు పేర్కొన్న భావాదికం ఈ పాలక వర్గానుగుణంగా దాని శ్రేయస్సుకు అనుకూలంగా ఉంటుంది. ధర్మస్వరూపం, కళాస్వరూపం శాస్త్రస్వరూపంకూడా పాలకవర్గీయమే అవుతుంది. విశ్వజనీనత, సాధారణత, సకలలోక కళ్యాణ దాయిత అన్నవి వీటి లక్షణా లనటం భ్రాంతి లేదా పరవంచన, కాదా ఆత్మ వంచన.

ఈ సూత్రాలను పురస్కరించుకొని సమాజపరిణామం అర్థం చేసుకోవలసి ఉంటుంది. సమాజం తొలిదశలో మానవుని జీవితం సాక్షాత్తుగా ప్రకృతి మీద ఆధారపడింది. అప్పుడు మృగాలు, కాయగసరులా దేవయాత్రకు వినియోగపడేవి. అప్పుడు సొంత ఆస్తి లేదు. ప్రాకృతిక వస్తువులను సమాజం ఉమ్మడిగా అనుభవిస్తూ ఉండేది. అయితే జీవితవిధానం నిలకడ కలది కాదు. నాడు సమాజం కేవలం ప్రకృతి అగ్రహానుగ్రహాలపై ఆధారపడవలసి

వచ్చేది. ఈ బాధను పరిహరించటానికి సేద్యం అవతరించింది. దీనివల్ల వృత్తి విభాగం ఆవశ్యకమైనది. ఈ దశలో ఉత్పత్తిసాధనమైన భూమి పూర్వ దశలోవలె సమాజము ఉమ్మడిసొత్తుకాదు. వ్యక్తుల సొత్తుగా మారింది. అంటే గతితర్కసూత్ర మయిన ప్రతిషేధ రూపాన్ని పొందింది.

ఇదే భూస్వామిక దశ. ఈ దశలో పాలకులు రాజులు. భూస్వాముల భావాదికం పాలకులకు అనుగుణంగా ఉంటుందన్న సూత్రం ఇక్కడ అన్వయించుకోవాలి. వృత్తి విభాగం జరిగినట్లే వాఙ్మయవిభాగం జరుగుతుంది. ఇంతవరకూ ఏకముఖంగా వున్న వాఙ్మయం శాస్త్ర మనీ, సాహిత్యమనీ విభాగం పొందుతుంది. తత్త్వశాస్త్రం, అర్థశాస్త్రం, ఆయుర్వేదం, జ్యోతిషం మున్నగు శాస్త్రవిభేదాలు పురాణాలు, ఇతిహాసాలు, దృశ్యశ్రావ్య కావ్యభేదాలు, గద్యపద్యరూపాలు ఏర్పడుతవి. "నా విష్ణుః పృథివీపతిః" "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" "దుర్బలస్య బలం రాజా" "రాజ్యాంతే నరకం ధ్రువమ్".

చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మవిభాగశః ।
తస్యకర్తార మపి మాం
విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥
కర్మణ్యేవాధికారస్తే
మా ఫలేషు కదాచన ।
మాకర్మ ఫలహేతుర్భూః
మా తే సంగో స్త్వకర్మణి ॥"

ఇత్యాదులు పరమసత్యాలుగా పరిగణింపబడుతాయి.

ఈదశ త్రికంలోని మొదటి క్షణం అంటే అనుయోగి అవుతుంది. ఈ దశలోనే పరిశ్రమలుకూడ క్రమక్రమంగా ప్రబలి ప్రతిరోధకంగా తారసిల్లే భూస్వామ్యవిధానాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. మానవ స్వాతంత్ర్యం (బూర్జువా ప్రజాస్వామ్య సిద్ధాంతం) పేరుతో విప్లవం బయలుదేరి పూర్వవ్యవస్థను కూలద్రోసి పారిశ్రామికవ్యవస్థ అధికారం చేపడుతుంది. ఈ దశలో ప్రధాన ఉత్పత్తిసాధనం యంత్రం. యంత్రాధిపతులు, యంత్రోత్పన్నవస్తువులకు

యజమానులైనవారు పాలకవర్గంగా తయారవుతారు. అంటే పెట్టుబడిదారులు అధికారం స్వాయత్తం చేసికొంటారు.

ఈదశలోకూడ భావాదికం పాలకుల కనుగుణంగా ఉంటుంది. వాణిజ్యప్రాముఖ్యంవల్ల ప్రపంచానికి సన్నిహిత సంబంధం ఏర్పడుతుంది. పారిశ్రామిక దేశాలు పాలకవర్గశ్రేయస్సు కోరి జాతీయవాదం లేవనెత్తుతాయి. యంత్రోత్పన్నవస్తువుల విక్రయంకోసం వలస రాజ్యాలను సంపాదిస్తవి. సాహిత్యంకూడా అమ్మకానికి వీలైన సరుకుగా తయారై రాజపోషణం నుంచి విముక్తి పొందుతుంది. గద్యం ప్రాధాన్యం వహిస్తుంది. రాజుల ప్రాముఖ్యం పోయి వ్యక్తుల ప్రాముఖ్యం ఎక్కువవుతుంది. వ్యక్తిత్వం కళలకు ప్రధానలక్షణమౌతుంది. పారిశ్రామికాభివృద్ధి నిమిత్తం ప్రకృతిశాస్త్రవికాసావశ్యకత కలుగుతుంది. దాని ఫలితంగా అవి విశేషంగా అభివృద్ధిచెందుతాయి. దానివల్ల దేవునిపైన మతంమీద విశ్వాసరాహిత్యం ముమ్మరమౌతుంది.

ప్రతిదీ ద్వంద్వసంపుటే కాబట్టి, పెట్టుబడిదారీవిధానంకూడ అంతర్వైరుద్ధ్యం కలది. లాభం కోసం పెట్టుబడిదారులు ఉత్పత్తిసాగిస్తారు. అందువల్ల వారు కార్మికులకు బ్రతకటానికి కావలసినంత మాత్రమే ఇస్తూ అదనపు విలువను అపహరిస్తారు. దీని ఫలితంగా ఒకప్రక్క బ్రహ్మాండమైన యంత్రగారాలు సిరిసంపదలు. వేరొక ప్రక్కన దారిద్ర్యం దుఃఖం పేరుకొని పోతాయి. దీనివల్ల ఒకప్రక్క పారిశ్రామికాధినేతలు, వేరొకప్రక్క శ్రామికులు తారసిల్లుతారు. ఇలా ఒండొంటికి పొత్తు కుదరటానికి వీలులేనివిరుద్ధం, పక్షద్వయం ఏర్పడుతుంది. ధనికవర్గం సంఖ్య క్రమంగాతగ్గి శ్రామికవర్గంసంఖ్య విపరీతంగా పెరుగుతుంది. ఆ సంఖ్యాతో పాటు అసంతృప్తి స్వవర్గీయచైతన్యం, ఐక్యమత్యం శ్రామికులలో పెంపొందుతాయని వారు ప్రభుత్వయంత్రం చేజిక్కించుకొంటే తప్ప ఆర్థిక విషమస్థితులు, సామ్రాజ్యయుద్ధాలు రాక తప్పదు.

ఈ ఆవశ్యకతను గ్రహించి విప్లవం సాగించి కార్మికవర్గం ప్రభుత్వయంత్రాన్ని స్వాధీనం చేసికొంటుంది. అప్పుడు ప్రభుత్వమే యంత్రాగారాలను పరిశ్రమలను తమ వశం చేసికొంటుంది. ఇంతకుమునుపు ఉన్న వర్గభేదాన్ని సమూలంగా పెకిలించటానికి కార్మిక నియతృత్వం పనిచేయక తప్పదు. వర్గాలు నిర్మూలితాలైనప్పుడు పీడకమైన రాజ్యాంగం అంతరిస్తుంది. అంటే శ్రామికనియతృత్వం అంతరిస్తుంది. "మానవజాతి ఆవశ్యకతారాజ్యం

నుంచి స్వాతంత్ర్యరాజ్యంలోకి లంఘిస్తుంది." అప్పుడు ప్రతివ్యక్తీ సంపూర్ణస్వాతంత్ర్యం అనుభవిస్తూ ఉంటాడు. పంకం నుంచి పద్మం పుట్టినట్లుగా, కారుమబ్బులలో మెరపు మెరిసినట్లుగా వ్యక్తి స్వాతంత్ర్యం లభిస్తుంది. నాటితో సిసలైన మానవ చరిత్ర ప్రారంభమవుతుంది.

ఇదే సంగ్రహంగా చెప్పాలంటే మార్క్సు ప్రతిపాదిస్తున్న సామాజిక పరిణామ వివరణం.

## వ్యక్తికి; సంఘానికి గల సంబంధం అంగాంగి భావమా ?

ఉత్పత్తి విధానం ఆర్థికస్థితిగతులు సామాజిక పరిణామాన్ని, భావాదికాన్ని నిర్ణయిస్తున్నవని మార్క్సు ప్రతిపాదిస్తున్నాడు. ఉత్పత్తివిధానంలోని అభివృద్ధికి ద్వంద్వాల సంఘర్షణకూ ఉన్న సంబంధం మేమిటో బోధపడటం లేదు. కాని ద్వంద్వాల సంఘర్షణ గతితర్కానికి హృదయమని లెనిన్ పేర్కొన్నాడు. అసలు ఈ పోరాటం లేక, మార్క్సిజం ప్రకారంగతే సిద్ధించదుకదా !

ఈ విషయాన్నిగూర్చి ఎడ్వర్డ్ మెహ్‌బెస్కీ సెయిత్ ఇలా వ్రాస్తున్నాడు ;

ఆర్థిక స్థితిలోని మార్పే మానవచరిత్రలోని ఇతర పరివర్తన లన్నిటికి, అంటే మత చరిత్రకు, రాజకీయచరిత్రకు, విజ్ఞానాదిచరిత్రలకు పరమకారణం. అయితే ఆర్థికస్థితిలో వస్తున్న ఈమార్పు దేనివల్ల కలుగుతున్నది ? మార్క్సు భిన్నభిన్న ప్రకరణాలలో భిన్న భిన్న సమాధానా లిచ్చాడు. ఉత్తరోత్తరం ఉద్భవిస్తూ వచ్చిన ఆర్థికసంబంధపద్ధతి ప్రతిదీ తార్కికవ్యాప్తిని పురస్కరించుకొని పూర్వాపూర్వపద్ధతిలో స్వతస్సిద్ధంగా ఉన్న వైరుధ్యాల నుంచి ఉద్భవిస్తున్నదని కొన్నిచోట్ల చెప్పాడు. ఉత్పత్తిపద్ధతిలో వచ్చిన మార్పులవల్ల ఈ మార్పులు వస్తున్నవని ఇతర స్థలాలలో పేర్కొన్నాడు. మొదటి వివరణ దేనిని వివరించటం లేదు. దీనిని అనుసరించటం అయోమయత్వాన్ని ఆశ్రయించటమే. ఒకదశతో అనభివ్యక్తంగా ఉన్న వైరుధ్యం ఆ దశను మార్చి మరొక దశను నెలకొల్పాలన్నప్పుడు అవి ఒకస్థితిలోనే సాధ్యం. ఆవైరుధ్యం, వైరుధ్యమని జ్ఞానవంతుడైన వ్యక్తిగ్రహించాలి. అతడు ఆవైరుధ్యం చేత ప్రేరితుడు కావాలి. అయితే ఆ వైరుధ్యం ఒకవిధమైన భౌతిక శక్తి అనీ, మనస్సు యొక్క ఆశ్రయం లేకుండానే లక్ష్యం ఏర్పరచుకోగల శక్తి దానికి ఉన్నట్లుగాను మార్క్సు

నొక్కిచెబుతున్నాడు. ఇలా చెప్పటం విదారరాహిత్యాన్ని మాటల మాటున దాచటమే అవుతుంది."

పైగా మార్క్స్ చెబుతున్నట్లు శాస్త్రార్థాలు కేవలం ఉత్పత్తిపద్ధతిని అనుసరిస్తున్నట్లైతే పరిశ్రమలు నిర్దేశిస్తున్న సమస్యలనుగూర్చి మాత్రమే విజ్ఞానశాస్త్రాలు తమ పరిశోధనలు సాగిస్తుండాలి. ఇలా జరుగుతున్నదా ? గణితాదిశాస్త్రాలు సద్యోవినియోగానికి రాని విషయాలెన్నో కనుగొన్నవి. ఇంకా కనుగొంటున్నవి. దృష్టాంతంగా ఈ శతాబ్దిలో పుట్టి, అత్యంత ప్రఖ్యాతిగాంచిన సాపేక్షతావాదాన్నే తీసుకొందాము. పారిశ్రామికరరంగంలో బయలుదేరిన ఏ సమస్యను పరిష్కరించటానికి ఈ సిద్ధాంతం పుట్టింది? అది అలా ఉండగా అందులో చాలా భాగం ఇంకా ప్రయోగపూర్వకంగా నిరూపితం కావలసివుంది. అలా నిరూపించటానికికూడ అద్యతనభావిలో సాధ్యపడదేమో !

ఉత్పత్తిపద్ధతే సర్వం నిర్ణయిస్తుం దన్న పక్షంలో క్రీస్తుశకం రెండవ శతాబ్దికి పూర్వమే హెగిలీయ సిద్ధాంతానికి సోదరంగా ఉన్న యోగాచారవాదం ఎలా బయలుదేరింది ? పెట్టుబడిదారీ విధానఫలితంగా కాంట్ పరతత్త్వవాదం హెగిలీయ త్రికవాదం బయలుదేరాయని ద్రావిడ ప్రాణాయామపద్ధతిన సాధించినా, యోగాచార, శూన్యవాదాలు క్రీస్తుశక రెండవశతాబ్దినాటికే ఉద్భవించటాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఎందుకంటె శూన్యవాదం కేవలం పై పరతత్త్వవాదంలోని లోటులను సవరిస్తున్నదానివలె వుంటూ, హెగిలీయ బ్రహ్మస్వరూపాన్నే కాక పరమార్థతత్త్వ మిట్టిదని చెప్పేవారి వాదనలనుకూడ చిత్తకల్పితాలని అంటే అయా దేశకాల, పాత్రలచే అవచ్ఛిన్నాలని చెబుతున్నది. ఈ వాదం మంచిచెడ్డలతో ఇప్పుడు నిమిత్తం లేదు. ఈ సందర్భంలో ముఖ్యవిషయం ఒక్కటే ఉంది. పాశ్చాత్య దార్శనిక చరిత్రలో ముందు కాంట్ పరతత్త్వవాదం, తరువాత హెగిలీయ త్రికవాదం వచ్చాయి భారతీయ దార్శనిక చరిత్రలో ముందు త్రికవాద సదృశమైన యోగాచారం, తరువాత కాంట్ పరతత్త్వవాదానికి సన్నిభమైన శూన్యవాదం వచ్చాయి. ఈ కాలికవ్యతిక్రమాన్ని ఈ ప్రాచీనతను, సర్వసమస్యాపరిష్కారి నంటున్న గతితర్కం వివరించదు. అసలు ఈ సమస్య ఉన్నదని కూడ గుర్తించదు.

ఉత్పత్తివిధానం సర్వం నిర్ణయిస్తుం దన్నవాదం శాస్త్రకారుల, మహాపురుషుల ప్రాముఖ్యాన్ని వివరించదు. పరిణామంలో వీరి స్థానాన్ని విస్మరిస్తున్నది. దృష్టాంతంగా గెలిలియోనే తీసికోవచ్చును. అతని పరిశోధనలతో విజ్ఞానశాస్త్రం పులకరించి పువ్వులు తొడగనారంభిం

చింది. అతడు పుట్టకుండా ఉంటే విజ్ఞానశాస్త్రప్రగతి మరొకవిధంగా ఉండేదేమో. ఈనాటి ఐన్‌స్టీన్ సంగతినే తీసికొందాము. ఏ ఉత్పత్తివిధానంతీరిన స్థితిగతులు ఆయన పుట్టువును సిద్ధాంతాన్ని వివరిస్తాయి? పెట్టుబడిదారీవిధానంలో వచ్చిన సమస్యలవల్ల ఆయన సిద్ధాంతం పుట్టిందా? కాక సోషలిస్టు ఆర్థికపురోగతికి ఆయన సిద్ధాంతం అవశ్యకమా? కాక చరిత్రపరిణామంలో అది అంత ముఖ్యం కాదా? ఈనాటి అణవశక్తితో మానవచరిత్రకు సంబంధమే లేదా ?

అంతవరకు దేనికి ? నిద్రాణంగ ఉన్న జగత్తును నూతనోత్తేజనం కలిగించి అధర్మానికి విప్లవాలతో తెంచి రాజు చెప్పిన మార్క్సు సంగతి ఏమిటి ? అతడు తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించకుండా ఉంటే, ఆ లోటును ఎవరు తీర్చగలిగేవారు? ఆతని పుట్టుకకు, సిద్ధాంతానికి నాటి ఉత్పత్తివిధానంకాని, శ్రామికుల స్థితిగతులు కాని సాక్షాత్కారా లనటాని వీలులేదు. పెట్టుబడిదారీ విధానం నాడు మూడుపూవులు ఆరుకాయలుగా ఉంది. నాటికి శ్రామివర్గం అధిక సంఖ్యాకవర్గం కాదు. ఇవి ఇలా ఉండగా ఆంగ్లశ్రామికవర్గం అంతకంతకు బూర్జువావర్గంగా తయారవుతున్నదని మార్క్సుకు 1858 అక్టోబరు 7వ తేదీన ఉత్తరం వ్రాస్తూ ఏంగెల్సే స్వయంగా పేర్కొన్నాడు.

మహాపురుషుల ప్రాముఖ్యాన్ని పరిశీలించకపోగా ఏంగెల్సు తను వ్రాసిన ఉత్తరంలో ఇలా త్రోసివేస్తున్నాడు. "ఒక ప్రత్యేకకాలంలో ఒక నిర్దిష్టదేశంలో ఒక ప్రత్యేక వ్యక్తి మాత్రమే అగ్రేసరుడుగా ఉండటం, మరొక వ్యక్తి ఆ పాత్ర నిర్వహింపకపోవటం కేవలం యాదృచ్ఛికం. మనం ఈ ప్రత్యేక వ్యక్తిని పరిహరిస్తే, అతనికి బదులు మరొక వ్యక్తి అవసర మవుతాడు. ఏదో ఒక రకమైన ప్రత్యామ్నాయం తుదికి ఏర్పడుతుంది. ఈ వాక్యాలు చదివినప్పుడు గీతలోని

> యదా యదా హి ధర్మస్య
> గ్లాని ర్భవతి భారత ।
> అభ్యుత్థాన మధర్మస్య
> తదా ఽ త్మానం సృజా మ్యహమ్ ॥

అన్న శ్లోకం జ్ఞప్తికి రాకతప్పదు.

సామాజిక పరిణామంలో భావాలు, లక్ష్యాలు మొదలైన వాటి పాత్ర ఏమిటి అన్నది

ముఖ్యసమస్య. అసలు మార్క్సిజం కేవలం ఉత్పత్తివిధానాన్ని పురస్కరించుకొని బయలు దేరిందని చెప్పటానికి వీలులేదని ఇదివరకే చెప్పుకొన్నాము. అయితే ఈ సిద్ధాంతం ఎలా వచ్చింది ? భగవంతుడు సాధుపరిత్రాణార్థం, మార్క్సును పుట్టించి అతనిచేత సోషలిజం ప్రతిపాదించాడా ? ఇలా అనేవారు లేకపోలేదు. కానీ, ఇలాంటి వాదం శాస్త్రవిరుద్ధం. పైగా ఇది విశ్వాసానికి విషయమే కాని విమర్శనకు విషయం కాదు.

ఇక సోషలిస్టు సిద్ధాంతావిర్భావానికి హేతు వేమి చెప్పుకోవాలి? ఈ ప్రశ్నకు భావ చరిత్రవల్ల మాత్రమే సమాధానం లభిస్తుంది. మార్క్సిజానికి ప్రాణతుల్యాలైన అంశాలు మూడున్నాయి. (1) గతితార్కిక భౌతికవాదం (2) అదనపు విలువ (3) వర్గ కలహం - శ్రామిక నియంతృత్వం. ఈ మూడింటిలో ఏది లోపించినా మార్క్సిజం పూర్ణస్వరూపం చెడక తప్పదు. మొదటి అంశంలోని గతితర్కానికి కర్త హెగిల్ అని లోగడనే పేర్కొనటం జరిగింది. భౌతికవాదానికి ఫ్రెంచి మేధావులు పునాదులు వేశారని చరిత్రజ్ఞులకు తెలిసిన విషయమే. వర్గ కలహం, వర్గ ఆర్థికస్థితి, వ్యత్యాసాలు మార్క్సుకు ముందున్న చరిత్రకారులు ఆర్థిక శాస్త్రవేత్తలు వివరించారు. ఇలాంటి భావబీజం నుంచి మార్క్సిజం వెలువడటం ఆశ్చర్యకరం కాదు. అసలు మార్క్స్ లండన్ నుంచి 1852 మార్చి 5వ తేదీన ఎయిడిమేయర్‌కు ఉత్తరం వ్రాస్తూ ఇలా చెప్పాడు :—

"నాకు ముందే ఎన్నడో బూర్జువా చరిత్రకారులు వర్గకలహ చారిత్రికాభివృద్ధిని, బూర్జువా ఆర్థికశాస్త్రవేత్త వర్గాల ఆర్థికనిర్మితిని వర్ణించారు. నేను కొత్తగా రుజువుచేసిన విషయాలు :— (1) వర్గాల ఉనికి ఉత్పత్తిపరిణామంలోని ప్రత్యేక చారిత్రక దశలతో బద్ధమై ఉంది. (2) వర్గకలహ శ్రామిక నియంతృత్వానికి అవశ్యం దారితీస్తుంది. వర్గనిర్మూలన జరిగి వర్గరహిత సమాజం ఏర్పడే సంధ్యావస్థలో ఈ శ్రామిక నియంతృత్వం నెల కొంటుంది".

భావప్రాధాన్యం విస్మరిస్తే రష్యా విప్లవం ఎలా వచ్చిందో వివరించటమే కష్టమౌతుంది. విప్లవాలు అనేవి కేవలం ఉత్పత్తివిధానంలోని స్థితిగతులనుబట్టి వచ్చేవే అయితే, సోషలిస్టు విప్లవం ఇంగ్లండులోనో, జర్మనీలోనో వచ్చి ఉండవలసింది. ఎందుకంటే పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధి చెందినవి ఆ రెండు దేశాలే. అక్కడ శ్రామికవర్గం కూడా అధిక సంఖ్యాకంగా ఉంది. దాని ఆర్థికస్థితి కూడా అందుకు అనుకూలమే. రష్యా అంటేనో,

నాటికి పారిశ్రామికంగా వెనుకబడి ప్రధానంగా వ్యాపసాయిక దేశంగానే ఉంది. అందువల్ల శ్రామికవర్గం అత్యల్ప సంఖ్యాకంగా ఉంది. అలాంటి దేశంలోనే మొట్టమొదటి సోషలిస్టు విప్లవం వస్తుందని మార్క్సు కాని ఆతని అనంతరం కూడ సజీవుడుగా ఉన్న ఏంగెల్సు కాని ఊహించలేదు. అయినా, అక్కడ సోషలిస్టు విప్లవం వచ్చింది. ఉత్పత్తివిధానాన్ని బట్టే అన్ని మార్పులు ఆధారపడి ఉంటాయంటే రష్యా విప్లవం అనిర్వచనీయ మౌతుంది. భావాలకు రెక్కలు, ప్రాణాలు ఉన్నవని ఒప్పుకొన్నప్పుడు రష్యా విప్లవసిద్ధి సహజమే అవుతుంది. కాకపోతే అక్కడ విప్లవం ఎలా నెగ్గింది అన్నదానికి కారణాలు మాత్రం ప్రత్యేకంగా చెప్పుకో వలసి వుంటుంది.

ఇలాగే ఐన్‌స్టీన్ సాపేక్షతాసిద్ధాంతం కూడ భావాల చరిత్ర మాత్రమే దాని ఆవిర్భా తిని వివరించ గలుగుతుంది. 19 వ శతాబ్ది చివరి దశలో భౌతికశాస్త్ర రంగాలలో విషమస్థితి ఏర్పడింది. దానిని పురస్కరించుకొని ఆ సిద్ధాంతం వెలువడింది. కాని ఆ సిద్ధాంతం అని వార్యంగా వచ్చితీరాలన్నది లేదని అదే వ్యక్తం చేస్తున్నది. కారణం ఈనాటివరకు కూడ దీనిని సాకల్యంగా అర్థం చేసికొన్నవారి సంఖ్య వేళ్ళపై లెక్కపెట్ట తగినంత కంటె అధికంగ లేదు. అర్థం చేసికోవటమే అంత దుష్కరమైనప్పుడు ఆ సిద్ధాంతాన్ని మరొకడు ప్రతిపాదించ గలుగుతా డనటం కూడ హాస్యాస్పదమే.

కాగా భావాలకూ, వ్యక్తులకూ ప్రాధాన్య మేర్పడుతున్నది. ఈ ప్రాధాన్యంతో చారిత్రక అనివార్యత పోయి చారిత్రక సంభావ్యత మాత్రమే యేర్పడుతున్నది.

ఈ పై వాక్యం కొంత వివరణం అపేక్షించ వచ్చును. మార్క్సిజంలో ఉత్పత్తి విధానానికి భావాలకు ఉన్న స్థాన మేమిటి ? మానవుడు తన చరిత్రను తానే సృష్టించు కొంటున్నా డని మార్క్సు చెప్పాడు. అతడే ఉత్పత్తివిధానాన్నిబట్టి భావాదికం ఉంటుందని అంటూ, ఉత్పత్తివిధానం పునాది అనీ, భావాదికం ఉపరితల నిర్మాణమనీ వివరించాడు. స్థూలంగా చూచినప్పుడు ఈ రెండూ పరస్పరబాధితాలుగా కనిపిస్తాయి. కాని ఫ్యూయబర్‌బాఖ్ పై మార్క్సు వ్రాసిన సిద్ధాంత సూత్రాలలోని ఆరవ దానిలో "వాస్తవానికి అది (మానవ తత్త్వం) సామాజిక సంబంధసామగ్రి" అన్న వాక్యం చూచిన తరువాత ఈ బాధ అంత రిస్తుంది. అయితే తరువాత వచ్చిన విమర్శనల వల్ల భావాల స్థానం కూడా గుర్తించవలసి వచ్చింది. "మార్క్సు, నేను మా రచనలలో (భావాదికానికి) తగినంతగా ప్రాముఖ్యం ఇవ్వ

లేదు. ఈ విషయంలో మేమంతా సమదోషులమే" అని ఏంగెల్సు ఒప్పుకొన్నాడు భావాలకు కూడ స్థాన మున్నదని అతడు 1894 జూన్ 25న వస్టార్కెన్‌బర్గుకు, 1893 జులై 14న మెహరింగ్‌కు, 1890 సెప్టెంబరు 21న జెబ్లాక్‌కు, ఆ సంవత్సరమే అక్టోబరు 27న కాన్‌రాడ్ స్మిత్‌కు వ్రాసిన లేఖల్లో పేర్కొన్నాడు. చివరి లేఖలో తప్ప మిగిలిన వాటన్నిటిలోను ఆర్థికప్రాధాన్యం తలసూపుతూనే ఉన్నది. చివరి దానిలో మాత్రం పూర్వతత్త్వాదికం నుంచి ఆర్థికావచ్చిన్నతలో నిమిత్తం లేకుండానే నేరుగా కొత్త తత్త్వాదికం రావచ్చునని ఒప్పుకొంటాడు. అది ఇష్టపూర్వకంగా కాదు. నిర్నిబంధంగా కాదు. అయితే ఈ తటపటాయింపులలోని అంతర్యమే విచారించవలసి ఉంది.

పరిణామంలో ఉత్పత్తివిధానంతోపాటు భావాదికానికి స్థాన మున్నదన్న పక్షంలో ఈ రెంటి సంబంధం తార్కికంగా ఐదు విధాలకంటె భిన్నంగా ఉండటానికి వీలులేదు. (1) భావం ముఖ్యం; ఉత్పత్తి విధానం అముఖ్యం. (2) భావం ముఖ్యం; ఉత్పత్తి విధానం పరిగణ్యం కాదు. (3) భావం ఉత్పత్తి విధానం తుల్యప్రాధాన్యాలు. (4) ఉత్పత్తి విధానం ముఖ్యం; భావం అముఖ్యం. (5) ఉత్పత్తి విధానం ముఖ్యం; భావం అపరిగణ్యం. గతితర్కానికి అనుకూలమైనవి రెండవది, అయిదవది మాత్రమే.

రెండవ దానిని ఆదరించట మంటే హెగిలీయ గతితర్కాన్ని స్వీకరించట మౌతుంది. ఐదవ దానిని అంగీకరించటమంటే భౌతిక గతితర్కాన్ని ఆమోదించట మౌతుంది. మిగిలిన మూడూ ఏ గతితర్కానికైనా విరుద్ధాలు. ఎందుకంటే త్రికం లేని ప్రతి అంగమూ ద్వంద్వ సంపుటి కాని, చతుష్పుటి కాదు. కాబట్టి గతితర్కాన్ని సంరక్షించుకోవాలంటే మార్క్సీయులు భావాదికం అపరిగణ్యంగానే భావించాలి. భావాదికం అపరిగణ్యమంటే సామాజిక పరిణామం వివరింపబడజాలదు. సామాజికపరిణామాన్ని వివరించాలంటే గతితర్కాన్ని పరిత్యజించాలి.

అంతేకాని మార్క్సు, ఏంగెల్సు వాక్యాలను వల్లించి నంతమాత్రాన ఉన్న బాధ పోదు. అందుకనే "ఎలుకతోలు దెచ్చి ఏడాది యుతికినా నలుపు నలుపేగాని తెలుపు గాదు" అన్న ఉక్తి వచ్చింది.

భౌతిక గతితర్కం ప్రతిపాదించే సామాజిక పరిణామంలో మరొక ముఖ్యాంశం వ్యక్తికీ, సమాజానికీ ఉన్న సంబంధం. ఇది కేవలం అంగాంగిభావమే నంటున్నది. ఈ ప్రతిపాదన క్రొత్తది కాదు. పురుష సూక్తం, ప్లేటో సిద్ధాంతం, హెగిల్ సిద్ధాంతం, ఫాసిస్టు

సిద్ధాంతం జాతీయవాదం మొదలైన ప్రజాస్వామ్య విరుద్ధవాదా లెన్నో దీనినే సమర్థిస్తున్నవి. ఈ అంగాంగిభావాన్ని చక్కగా అర్థం చేసుకోవాలంటే కార్యకారణభావం, అవినాభావం, గమక గమ్యభావం అర్థం చేసుకోవాలి.

ముందు కార్యకారణ భావం పరిశీలింతాము. జగత్తులో ఏది జరిగినా కారణం లేకుండా జరుగదు. ఈ కారణం తార్కికుల మతం ప్రకారం మూడు విధాలు :

(1) సమవాయి కారణం. ఘట మన్న కార్యానికి మృత్తిక సమవాయి కారణమౌతుంది.

(2) అసమవాయి కారణం. వస్త్ర మన్న కార్యానికి దారం అసమవాయి కారణం.

(3) నిమిత్త కారణం. చెంపపెట్టుతో దెబ్బ తగులుతున్నది. దెబ్బకు చెంపపెట్టు నిమిత్తకారణం. కార్యకారణ భావం. ఈ పేర్కొన్న సంబంధాలలో దేనినైనా ఒకదానిని సూచిస్తుంది.

అవినాభావసంబంధం కేవలం ఎడబాటులేని ఉనికి తెలుపుతుంది. ఇది ఉంటే అది ఉంటుందని సూచిస్తుంది. దృష్టాంతం ధూమాగ్ని సంబంధం. ఎక్కడెక్కడ ధూమం ఉంటుందో అక్కడక్కడ అగ్ని ఉండి తీరుతుంది. అగ్ని ఉన్నప్పుడు ధూమం విధిగా ఉండా లన్న నియమం లేదు. కాబట్టి ఇది ఆంతరిక సంబంధం కాదు.

గమకగమ్యభావ మంటే సాధనకూ; లక్ష్యానికీ ఉన్న సంబంధం. నది దాటుట లక్ష్య మైనప్పుడు దానికి వంతెన కాని, పడవ కాని సాధన మౌతుంది. అంటే నదీతరణం గమ్యమూ, వంతెన లేక పడవ గమకము. ఇతరభావాల కంటె దీనికి విలక్షణత చెప్పుకోవ లసి వచ్చినప్పుడు, ఇది కూడా అనాంతరికసంబంధమే.

ఇక అంగాంగిసంబంధ మంటే అంగాలకూ, ప్రాణికీ ఉన్న సంబంధం. ఏ అంగం దెబ్బ తిన్నా, లేక దీనిలో ఏమార్పు జరిగినా ప్రాణిలో మార్పు కనిపిస్తుంది. కాలిలో ముల్లు గుచ్చుకున్నప్పుడు ప్రాణి బాధపడుతుంది. చేతిని కోలుపోతే ప్రాణికి కూడా అంతమేర నష్టం కలుగుతుంది. పైగా అంగి నుంచి వేరైపోయిన అంగం కేవలం నిరర్థకం.

ఈ తుదిసంబంధమే వ్యక్తి, సమాజాలమధ్య ఉన్నదని మార్క్సిజం ప్రతిపాదిస్తున్నది. గతితర్కాన్ని ఆశ్రయించిన మార్క్సుకు ఇంతకంటే గత్యంతరం లేదు. కారణత్రికంతోని ప్రతి అంగమూ పరస్పర ద్వంద్వసంపుటి. ఈ సంపుటిలోని ద్వంద్వాల పరస్పర సంబంధం

అంతరికమే కాని, బాహ్యమైనిది కాదు. అందువల్ల త్రికాంగం విధిగా అనాంతరికసంబంధాలను అంటే అవినా భావసంబంధాన్ని గమ్య గమక సంబంధాన్ని, కార్యకారణభావంలోని నైమిత్తిక సంబంధాన్ని పరిహరించాలి. అప్పుడు అంగాంగిభావం లేదా నిమిత్తంతో సంబంధం లేని కార్యకారణభావం శరణ్య మౌతున్నది.

కాగా వ్యక్తికీ సమాజానికీ ఉన్న పరస్పర సంబంధం అంగాంగిసంబంధమే. ఇది యథార్థమా? యధార్థమైతే ప్రతి నిరుపేద పొందుతున్న కష్టాలు సమాజం గ్రహిస్తూ ఉండాలి. సుబ్బమ్మ వడ్లు దంపితే సమాజం చేతులు బొబ్బ లెత్తటం లేదు. నాకు జలుబు చేస్తే సమాజానికి తుమ్ములు రావటం లేదు. నాకు ఆనందం కలిగితే సమాజముఖం వికసించటం లేదు.

ఈ సందర్భంలో వర్ధమానులు ఇలా ఆక్షేపించవచ్చును.

''ఈ విధమగు వితండవాదనలోని కరుడుగట్టిన, అధమాధమ బూర్జువా మనస్తత్వం, పచ్చి స్వార్థపరత్వం మనకు సులభంగా గోచరిస్తుంది. వ్యక్తికీ, సమాజానికీ కచ్చితమైన అవినాభావస బంధం ఉంది. సమాజం లేకుండా వ్యక్తి లేడు. వ్యక్తుల్లేని సమాజాన్ని ఊహించటం అసంభవం : అవివేకం.

''అధిక లాభాల స్వార్థకాంక్షతో ఉత్పత్తి ఐన సరకు మార్కెట్‌లో అమ్మకం కావటం లేదనే కుంటి సాకును చూపించి రేషనలైజేషన్ ప్రవేశపెట్టుటకో, ఫ్యాక్టరీ మూసివేయుటకో ఒక పెట్టుబడిదారు నిర్ణయించుకున్నా డనుకోండి. ఈ పెట్టుబటిదారు నిర్ణయానికీ, వేలాది కార్మికుల జీవితభవిష్యత్తులకీ సంబంధం లేదా? లేదని అనటాకి కెవరికైనా దమ్ములున్నవా? పెట్టుబడిదారు మిల్లు మూసేస్తే అశేషకార్మికులు నిరుదోగ్యరాక్షసి వాతబడి, దారుణ దారిద్ర్యంలో శలభాల్లాగా మాడిపోరా?

"ఎల్లమ్మ దంపితే, సమాజానికి బొబ్బ లెత్తటం లేదనే శ్రీరంగ నీతులు నంగనాచి వేదాంతం ఎలాగుందంటే "నా కొంపకి నేను నిప్పెట్టుకుంటే లోకుల కేమన్నట్లు" వుంది. తన కొంపకి నిప్పెట్టుకుంటే తనకే గాక యిరుగుపొరుగు వారల కొంపలు గూడ తగలడిపోతవని, గుర్తించని మూఢుడు చేసే వాదనలాంటి వాదనే రావుగారు చేస్తున్నారు. కాబట్టి సమాజంలోని ప్రతి వ్యక్తి యొక్క జీవితానికి ఇరుగు పొరుగువ్యక్తుల జీవితాలతో అవినాభావమూ, అవిచ్ఛనమైన సంబంధం ఉంది.

కార్యకారణభావము, అవినాభావము, గమకగమ్యభావము, అంగాంగి భావము, త్రికాంగ

తత్త్వము, వివరించిన తరువాత ఈ ప్రతిపక్షానికి ఎంత అర్థముందో వేరే చెప్పనక్కరలేదు, కాని, అంగాంగిభావముతో మిగిలిన భావాలకు ఐక్యం చెప్పుకొంటూ మనవచ్చును. అప్పుడు ప్రతి పక్షికి చెప్పగలిగిన సమాధానం లేదు కాని, భాషను మాత్రం "తాడిచెట్టూ పెరిగింది, నువ్వూ పెరిగావు" అనవలిసి వస్తుంది.

కాగా, గతితర్కం ప్రకారం వ్యక్తికీ సమాజానికీ కార్యకారణభావం కంటె, అవినాభావం కంటె గమ్యగమకభావం కంటె విలక్షణమైన అంగాంగి భావం చెప్పుకోవాలి. మార్క్సు కూడ దీనినే చెప్పాడు. కాని దీనిని నిత్యానుభవం త్రోసిరాజంటున్నది. అసలు చారిత్రక సంఘటనలతోనే ఇది విరోధిస్తున్నది. నిజంగా మార్క్సు చెప్పినట్లు మానవసమాజం అంగి అయితే కేవలం ఒక రష్యాలోనే శ్రామికవిప్లవం రావటానికి వీలులేదు కాని, అక్కడ ఆ విప్లవం రానూ వచ్చింది. శ్రామిక నియంతృత్వం ఏర్పడి తన అధికారాన్ని అప్రతిహతంగా చెలాయించనూ చెలాయిస్తున్నది. మార్క్సు చెప్పినట్లు మానవసమాజం అంగి అయితే రష్యా విప్లవంతో ప్రపంచ మంతా సోషలిస్టు రాజ్యంగా మారిపోయి ఉండవలసింది. నిజానికి రష్యా విప్లవం బయలుదేరిన క్రొత్తలలో విప్లవాధినేతలు అలాగే భావించారు. కాని పొరుగు రాజ్యాలలో విప్లవవిజయసూచనలు కనిపించ నప్పుడు ప్రతిభావంతుడైన లెనిన్ ఏకదేశంలో సోషలిస్టు ప్రభుత్వ స్థాపన సాధ్యమే నని గ్రహించి పార్టీవిధానం తదనుగుణంగా దిద్ది తీర్చాడు. ఇప్పుడు సోవియట్ నాయకులు సహజీవనసూత్రాన్ని పైకయినా ఆమోదిస్తున్నారు. అంటే మానవసమాజం అంగి అన్న సూత్రాన్ని త్రోసివేస్తున్నా రన్నమాట. టెక్సు బుక్ ఆఫ్ మార్క్సిస్టు ఫిలాసఫీలో "రష్యా అభివృద్ధి ప్రధానంగా స్వకీయ అంతర్గత పరిస్థితుల మీదనే ఆధారపడి ఉంద" ని ప్రస్తావిస్తూ "ప్రపంచ మందంతటా వచ్చిన పెట్టుబడీదారీ విధానపు విషమస్థితి ప్రధానంగా రష్యాను బాధించలేదు" అని పేర్కొన్నది. ఇలా బాధ లేకపోవట మంటే మానవ సమాజానికి 'ప్రధానంగా' అంగిత్వం లేదన్నమాట. దీనిని బట్టి గతితర్కం 'ప్రధానంగా' మానవసమాజానికి వర్తించ దన్నమాట. వర్తిస్తుంది అన్న పక్షంలో రష్యాలోనిది శ్రామిక నియంతృత్వం కాదనీ చెప్పుకోవాలి. ఈ రెంటికంటె భిన్నమైన మార్గం ఉన్నదన్న పక్షంలో, అలాచెప్పేవారు తృతీయమార్గం తెలుపవలసి ఉంటుంది.

సామాజికపరిణామంలో గ్రహింపవలసిన విషయం మరొకటి ఉంది. మార్క్సు స్వకీయమైన "అదనపు విలువ" అన్న సిద్ధాంతాన్ని గతితర్కంలో జోడించి "పెట్టుబడి దారులు స్వలాభ పరాయణులై శ్రామికవర్గాన్ని దోచుకుంటారు. దీనివలన కొంతకాలానికి ఉత్పత్తి

సాధనాలు, యంత్రాగారాలు సిరిసంపదలూ కేవలం అత్యల్పసంఖ్యాకుల హస్తగతం అవుతాయి. దారిద్ర్యం దుర్భరపీడనం శ్రామికవర్గం వంతు అవుతాయి. తుదకు పెట్టుబడిదారుల వర్గం కంటె ఇతరమైన వర్గాలన్నీ శ్రామికవర్గమై అది పాలక యంత్రం స్వాధీనం చేసుకొంటుంది" అని అతడు ప్రతిపాదించాడు. శ్రామికనియంతృత్వం వర్గరహిత సమాజాన్ని నెల కొల్పుతుందనీ, తరువాత బలప్రయోగావశ్యకత ఉండకపోవటం వల్ల పాలకయంత్రం క్రమంగా నశిస్తుందని సిద్ధాంతీకరించాడు. ఆ తరువాత నుంచి సిసలైన మానవచరిత్ర ప్రారంభమౌతుందన్నాడు.

కాని, తరువాత జరిగిన చరిత్ర భిన్నంగా ఉంది. ఆత డూహించినట్లు మధ్యతరగతి నశించలేదు. జాయింట్ స్టాక్ కంపెనీల పెరుగుదల ఏర్పడింది. కార్మికసంఘాల అందోళన వల్లనేమి, మరే యితర కారణాల వల్లనైతేనేమి 19వ శతాబ్ద ఉత్తరార్ధంలో వలె కార్మికులు స్థితిగతులు ఆ తరువాత లేవు. కోరదగినదిగా కాకపోయినా కొంతవరకైనా మేలుగానే ఉన్న వనక తప్పదు. పైగా మార్క్సు కలలో కూడా ఊహించనట్లు పారిశ్రామికంగా వెనుకబడ్డ దేశాలలో అంటె రష్యా చైనాలలో కమ్యూనిస్టు పార్టీలు అధికారం చేపట్టాయి. ఇదివరకు సాయుధ విప్లవాలకు అవకాశం ఉండేది. నేడు అణ్వస్త్రాలు వచ్చాయి. ఈ యుగంలో అన్యాయపరిహారణకు యుద్ధమే సాధనం అనటంలో అర్థం లేదు. అసలు అలాంటి యుద్ధానికి దిగటమంటె మానవ నాగరికతాసంస్కృతుల విధ్వంసనానికి సన్నిద్ధపడటమే. వీనికి తోడు 19వ శతాబ్దిలో వలె పారిశ్రామికాభివృద్ధి కేంద్రీకరణం ద్వారానే సాధ్య మనటానికి వీలులేదు. కేవలం కొలది పరిశ్రమలు తప్ప తక్కినవి కేంద్రీకరించటానికి అవకాశాలు ఏర్పడ్డాయి. ఇంకా ఇది అధికం కావటానికి వీలున్నది. పరిశ్రమల వలెనే అధికారాన్ని కూడ వికేంద్రీకృతం కావాలన్న అందోళన సాగుతున్నది. ఈ పరిణామా లన్నిటినీ మార్క్సు సిద్ధాంతంలో సరిపెట్టుకొనటానికి సాధ్యపడదు.

## అంతర్వైరుధ్యం ద్వారానే అభివృద్ధి జరుగుతుందనటం సత్యదూరం

శ్రామికనియంతృత్వం ఏర్పడగానే సమాజంలోని ఏ ఒక వర్గం మరొక వర్గానికి దోచుకొనడం జరగదని మార్క్సు అంటాడు. అదనపు విలువ అపహృతం కానప్పుడే ఈ పని జరుగుతుందన్నమాట. పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడిదారులు ఈ అదనపు విలువను

భుక్తపరుచుకుంటారు. కాబట్టి కార్మికులు దోచుకోబడినవారవుతారు. సోషలిస్టు వ్యవస్థలో ఈ దోపిడి అంతరిస్తుందా? ఈ అదనపు విలువను కార్మికులకే దక్కనిస్తారా? దక్కనిచ్చే పక్షంలో అభివృద్ధి లేకపోవాలి. కారణం పారిశ్రామికాభివృద్ధి కొత్త పెట్టుబడులను అపేక్షిస్తుంది. అదనపు విలువ విభక్తమైతే కొత్త పెట్టుబడులు ఎక్కడనుంచి వస్తాయి? కాబట్టి అదనపు విలువను స్వీకరించటంలో తప్పులేదు. అది సద్వినియోగం పొందుతున్నప్పుడు దానిని దోపిడి అనటానికి వీలులేదు. దుర్వినియోగమయినప్పుడే అది దోపిడి అవుతుంది. కాగా పెట్టుబడిదారులు అదనపు విలువను సామాజిక క్షేమం కొఱకు వినియోగించక దుర్వినియోగం చేయటం వల్ల దోపిడిదారులవుతున్నారు. ఆ లెక్కలో శ్రామికనియంతలు మాత్రం ఆ అదనపు విలువను దుర్వినియోగం చెయ్యరు. చేయటానికి వీలులేదు అని రాయిగుద్ది చెప్పటానికి ఎలా వీలుపడుతుంది? అసలు అదనపు విలువ దుర్వినియోగమవుతుందో లేదో చెప్పవలసినది ఎవరు? ఈ ప్రశ్నలకు గతితర్కమిచ్చే సమాధానమేమిటి?

గతితర్కంలో అంతగా పరిచయం లేని వారు కొందరు ఈ సందర్భంలో ఇలా శంకిస్తున్నారు "కమ్యూనిస్టు సమాజం ఏర్పడిన తరువాత పాలక యంత్రం అంతరిస్తుందని మార్క్సు చెప్పాడు. రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వం సుస్థిరంగా నెలకొని 35 ఏండ్లకు పైగా కాలం గడిచింది. పాలకయంత్రం పూర్తిగా అంతరించకపోతే పోయింది కనీసం సన్నగిల్లుతున్న సూచన మచ్చుకైనా కానరావడం లేదు.

ఈ సందర్భంలో గతితర్క జన్మరహస్యాన్ని వెల్లడించే సమస్య ఒకటి ఉంది. కమ్యూనిస్టు సామాజికవ్యవస్థ యేర్పడిన సమాజాంతర్గతవైరుధ్యం అంతరిస్తుందని మార్క్సు సుస్పష్టంగా చెప్పాడు. అతడే అభ్యుదయానికి అంతర్గతవైరుధ్యం కారణమన్నాడు. వర్గవైరుధ్యం అంతరించినప్పుడు అభ్యుదయం లేక, సమాజం స్తంభించిపోదా?

ఈ ప్రశ్నకు ఒక వ్యుత్పన్నుడు ఇలా ప్రత్యుత్తరిస్తున్నాడు.

"ప్రపంచమంతటా కమ్యూనిస్టు సమాజం స్థాపించబడినప్పుడు, వర్గాలు అంతరించిపోయినప్పుడు పీడకులు పీడితుల వర్గరహిత సమాజంలో ఉండరు. ఇంతదాకా దోపిడి వర్గాలకి వ్యతిరేకంగా పోరాటం సాగించిన మానవుడు ఆ వర్గాలను నాశనం చేసిన పిదప ప్రకృతికీ, ప్రకృతిలో వచ్చే ప్రళయాలకీ, ప్రకృతి శక్తులకు వ్యతిరేకంగా నిరంతరమైన పోరాటం ప్రారంభిస్తాడు. కమ్యూనిస్టు సమాజంలో మానవునికి ప్రకృతిశక్తులకు మధ్య వైరుధ్యం

ఉంటుంది. ఆవిధంగా ఆ సమాజం పురోగమిస్తుంది".

ఆ వ్యుత్పన్నుడు సర్వదా శిరోధార్యమైన స్వకీయ వేదం ఏమి చెబుతున్నవో గ్రహించినట్లు లేదు, కాకగ్రహిస్తే విస్మృతి కటాహంలో ఎక్కడో సూచి లాగ పడివుంటుంది. ఎందుకంటె ''మార్క్స్ లెనిన్ ప్రోక్తమైన గతితర్కం సమాజానికి, ప్రకృతికి ఉన్న వైరుధ్యం త్రోసివేయదు కాని సామాజికాభివృద్ధికి అది ప్రధానం కాదు. అది అభ్యుదయనిర్ణాయక వైరుధ్యం కాదు." అని ఆ వేదం చెబుతున్నది.

ఈ పక్షంలో మరి దేనివల్ల సమాజాభివృద్ధి కొనసాగుతుంది? ఈ ప్రశ్నకు ఆ వేదంలోనే సమాధానాన్ని వెదక వలసి వుంది. "అవకాశవాదులు ఎన్ని చెబుతున్నా వర్గ నిర్మూలనానంతరం కూడా సామాజిక స్వయంగతికి ఆంతరిక వైరుధ్యాలు మూలమవుతాయి" అని ఒకచోట అది............................................................................................

........చెప్పినట్లుమానవ సమాజ చరిత్ర పూర్వరంగం సమాప్త మవుతుంది. ఈ భవిష్యచ్చరిత్ర పరిణతి గుణాన్ని బట్టి ఎలాంటి అనన్య దశలు పొందుతుందో మన కింకా తెలియదు. కాని కమ్యూనిజం ఏ విధంగాను ఎన్నడు నిర్జీవ, సంస్తంభిత సిద్ధాంతంకాదని మా ఉద్బోధిత విశ్వాసం."

ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క తెగకు ఒక్కొక్క విశ్వాసం ఉండవచ్చును. అలా విశ్వసించటానికి అధికారం ఉంది. దీనిని అతడు ప్రచారం చేసికోవచ్చును. ఆచరించటానికి ప్రయత్నించవచ్చును. కాని భావప్రచారానికి, కర్మాచరణకు కొన్ని నియమాలున్నాయి. భావప్రచారం సత్యాన్ని ఉల్లంఘించరాదు. కర్మాచరణం ధర్మాన్ని అతిక్రమించరాదు.

అంతర్వైరుధ్యం ద్వారానే అభ్యుదయసిద్ధి కలుగుతుందన్న ఉక్తి సత్యమార మనిపిస్తున్నది. ఎందుకంటె కమ్యూనిస్టు సామాజికవ్యవస్థ ఏర్పడినప్పుడు వర్గవైరుధ్యం నశిస్తుందని మార్కుని చెప్పాడు. అతని సూత్రం ప్రకారం సామాజికాభివృద్ధికి ఆంతరిక వైరుధ్యం విధిగా కావాలి. అయితే అతడు చెప్పినట్లు ప్రకృతి ఇంతవరకూ పొందిన ఉన్నతదశ కంటే మానవుడు భిన్నుడు కాడు. మనస్సు అన్నది భౌతికద్రవ్యం పొందిన వికారమైనట్లే మానవుడు కూడా ప్రకృతి పొందిన ఉత్తమ వికారం. ఫలవృక్షమునకు బీజంవలె ఉత్తరదశలో పూర్వదశ వ్యక్తంగా ఉంటుందని గతితర్కసిద్ధాంతం. వర్గకలహపూరిత మానవ చరిత్రలోని కలహంలో పై సూత్రం ప్రకారం ప్రకృతి అంతర్భూతమై

ఉంటుంది. అలాకాక, ప్రకృతిలో మానవుడు సాగించవలసిన పోరాటం వేరన్న పక్షంలో ద్వంద్వ సంపుటి మాత్రమే అయిన గతితర్కాన్ని పరిణామంతో అన్వయించటం దుశ్శక మౌతుంది. కాబట్టి వర్గకలహం జరుగుతుందన్నప్పుడు గర్భితంగా ప్రకృతితోటి పోరాటం సాగుతున్నదనే అర్థం చేసుకోవాలి.

కాగా కమ్యూనిస్టు సమాజంలో వర్గవైరుధ్యం నశించినప్పుడు మానవునకు ప్రకృతికి వైరుధ్యం ఏర్పడి అభివృద్ధి కొనసాగుతుంది అని వ్యుత్పన్నులు వ్యాఖ్యానిస్తున్నట్టు చెప్ప వీలు లేదు, కారణం త్రికగతి ఆంతరికవైరుధ్యం ద్వారానే కొనసాగుతుంది. వేరిమి తెచ్చిపెట్టి నప్పుడు ప్రకృతికి మానవునకూ మధ్యఉండే వైరుధ్యం బాహ్యమైనదే కాని ఆంతరికమైనది కాదు. బీజం అంకురమై ఆ అంకురం వృక్ష మౌతున్నది కదా. అలాగే ప్రకృతి సంద ర్భంలో కూడా ప్రకృతో, మానవుడో అభివృద్ధి పొందాలి కాని రెండూ, రెండు రాసులుగా ఉండి అభివృద్ధి పొందటానికి వీలులేదు. ఇదే గతితర్కం ప్రకారం సిద్ధించే వివరణం. అందువల్ల మానవసమాజమే వర్గకలహాతిరిక్తమైన ఆంతరికవైరుధ్యం ద్వారా అభివృద్ధి పొందుతుందన్న మార్క్సియ వేద భాషోక్తి యథార్థం. కాని యీ ఆంతరిక వైరుధ్య స్వభావం ఎలాంటిది అన్న విషయంలోని అది మౌనముద్ర వహిస్తున్నది.

నిజానికి ఉత్పత్తి విధానాన్ని పురస్కరించుకొని కొనసాగే వర్గవైరుధ్యం అంతరించిన తరువాత కూడా అభివృద్ధి కొనసాగాలంటే, సమాజంలో భావవైరుధ్యం బయలు దేరక తప్పదు. సమాజంలో బయలుదేరే ఈ భావవైరుధ్యం ఆంతరికమే కాని బాహ్యం కాదు. దీనికి రష్యా అధినేతలలోని భావవైరుధ్యమే నిదర్శనం. ఆంతరికమైన భావవైరుధ్యాన్ని పురస్కరించుకొని అభివృద్ధి కొనసాగే పక్షంలో హెగిలీయ గతితర్కం భౌతికగతితర్కాన్ని ఆవేశిస్తుంది. ఆ పక్షంలో హెగిల్ చెప్పినట్లుగా భావం ఎప్పుడూ అంతర్వైరుధ్యం పరిహ రింప ప్రయత్నిస్తుంది. అప్పుడు అత దన్నట్లే పూర్ణబ్రహ్మను ప్రతిపాదించి "కథ కంచికి వెళ్ళింది, మనం ఇంటికి వచ్చాము" అని చెప్పక తప్పదు. అంటే జర్మన్ ఫిలిస్టన్ చెప్పి నదే శరణ్య మౌతున్నది.

రోటిలో తలదూర్చి రోకటి పోటుకు వెరిస్తే ప్రయోజనమేమిటి ? సత్తులో ప్రారం భించినప్పుడు పూర్ణసత్తుతో ఆగక తప్పదు. ఆ గతి గతితర్క స్వభావంలోనే ఉన్నది. హెగిల్ ఇంతమేరా ఆలోచించే గతితర్కాన్ని ప్రతిపాదించి మహాకవి అయ్యాడు. ఆ

చిత్రణవై చిత్రిలో పడి మార్క్స్ కూడా మరొక కట్టుకథను ప్రారంభించి సగంలోనే విడిచి సత్యాన్ని సాధించా ననుకున్నాడు. అందుకనే కాబోలు ఒక తెలుగుకవి "చాలుంజాలు కవిత్వముల్ నడుపుచో సత్యమ్ము సాధింతురా"? అన్నాడు. ఇంతకూ నడిచే వారికే కదా ఎదురు దెబ్బలు !

ఇప్పుడు గతితర్కం కళాస్వరూపాన్ని, భేదాలను, విలువలను కళల పరిణామాన్ని ఎంతవరకు వివరించగలుగుతున్నదో పరిశీలించవలసి ఉంది. ఈ విషయంలో హెగిలీయ గతితర్కం ఎన్ని లోపాలు కలదిగా ఉన్నా మేలుగా కనబడుతున్నది. ఎందుకంటె ఇది కళాస్వరూపాదులను నిర్దిష్టంగా చెబుతున్నది. హెగిల్ సిద్ధాంతం ప్రకారం ఐంద్రియక బ్రహ్మాయే కళ. కృతి, అనుకృతి కాదు. ఇది స్వయంసంపూర్ణం. స్వయంభాసమానం. వస్తుస్వరూపాల (matter and form) ఆంతరిక వైరుధ్యంవల్ల కళాభేదాలు పరిణామాలు ఏర్పడుచున్నవి. తార్కికంగా మొదట వస్తుప్రాముఖ్యమున్న కళ ఏర్పడుతుంది. ఇందులో భావం లేక ఆత్మ దాదాపు మాటువడుతుందని చెప్పవచ్చును. ఇది ప్రతీక పూర్వక కళ (symbolie art) ఇందులో ప్రాధాన్యం వహించేది వాస్తుకళ. వస్తురూపాల తుల్య ప్రాధాన్యం కలది "క్లాసికల్ ఆర్టు" ఇందులో అగ్రేసరం శిల్పం. వస్తుస్వరూపాలలో స్వరూపప్రాధాన్యం కలది "రొమాంటిక్ ఆర్టు". దీనిలో అవశ్య పరిగణ్యాలు చిత్రలేఖన సంగీత సాహిత్యాలు. లలితకళ లన్నిటిలో సాహిత్యానికి హెగిల్ పట్టం కట్టాడు. ప్రకృతి సౌందర్యం, కళాసౌందర్యాని కంటె హీనమైన దని వ్యక్తం చేశాడు. వీటన్నిటి కంటె ముఖ్యమైనది మరొకటి ఉన్నది. కళ మతంగాను, ఆ మతం తత్త్వశాస్త్రంగాను మారిపో తుందని అత డన్నాడు. అంటే కళలు నామరూపాలు లేకుండాపోయి కేవలం తత్త్వశాస్త్రా ర్థాలు మాత్రమే మిగులుతవన్న మాట. దీనిని అనుభవం ఎంతవరకు సమర్థిస్తున్నది ?

మార్క్స్యమైన భౌతిక గతితర్కం ఈ విషయంలో ఏమంటున్నది ? లలితకళ ఏదైనా ఏ దశలో ఉన్నా, భావనాప్రధానం. కేవలవైరుధ్య మన్నది ఉంటుందన్న పక్షంలో భౌతికద్రవ్యానికి భావన అన్నది కేవలం విరుద్ధకోటిలోనిదే అవుతుంది. కాబట్టి భౌతిక గతి తర్క మన్నది స్వయంబాధిత మైనట్లే. భౌతిక లలితకళ కూడ స్వయంబాధితమే. పేరు సంగతి ఎట్లున్నా లలితకళా స్వరూపాన్ని ఈ భౌతిక గతితర్కం ఏమని నిర్వచిస్తున్నది ? స్వయంసంపూర్ణత్వం, స్వయంభాసమానత్వం, అనంతత్వం మొదలైనవాటికి స్థానమున్నదా? లేనిపక్షంలో శాస్త్రాదులనుంచి కళలను వేరుపరిచే ధర్మాలెవ్వి ? వివిధ లలితకళలలో కళా

11)

ద్దులనుండి పరశ్శంకంగా కృతులు వచ్చాయి; వస్తున్నాయి. వీని విలువలను నిర్ణయించే కొలతబద్ద ఏమిటి ?

లలితకళల పరిణామమైనా మార్క్స్నీయ గతితర్కం వివరించటం లేదనే భావించటానికి హేతువులు కనిపిస్తున్నవి. దృష్టాంతంగా మన తెలుగు సాహిత్య వికాసాన్నే తీసికొందాము. త్రికానికి అనుగుణంగా ఆంధ్రీకరణ యుగమనీ, ప్రబంధయుగమనీ, ఆధునిక యుగమనీ విభజించవచ్చును. మొదటి యుగంలో దేశికవిత, మార్గకవిత అన్న ఆంతరిక వైరుధ్యం వున్నదని కూడా అంగీకరించవచ్చును. ఆ వైరుధ్యంవల్లనే ప్రబంధయుగం అవతరించిందని వ్యాఖ్యానించవచ్చును. అయితే ప్రబంధయుగంలోని అంతర్వైరుధ్యం ఏమిటి ? ఆధునిక యుగావతరణకు ఆంతరికమైన వైరుధ్యం కంటె అనాంతరికమైన పాశ్చాత్యసంపర్కమే కారణంగా కనబడుతున్నది. ఇక్కడి మొదటి రెండు దశలలోను విశేషం నవ్యత అన్నది కావ్యభేదాలలో కాని, శిల్పంలో కాని లేకపోవటమే. ఇతిహాసాలు, పురాణాలు అంతకుముందు ఏనాటినుంచో సంస్కృతంలో ఉంటున్నాయి. మహాప్రబంధమన్నది ఏనాడో సంస్కృతంలో బయలుదేరింది. భామహుడు, దండి ఎప్పుడో దాని లక్షణాలను గూడ నిర్వచించారు. కాబట్టి మహాప్రబంధం కూడ కొత్తది కాదు. అధునికయుగంలోని నవల, కథానిక, రూపకం, ఏకాంకిక మున్నగునవి 19 వ శతాబ్దం మధ్యనాటికే వృద్ధి పొందివున్నాయి. కాగా ఇందులో కూడా తెలుగు సాహిత్యం విశేషంగా సాధించిన క్రొత్తదనం లేదు.

కాని గతితార్కిక పరిణామమే దాదాపు తెలుగులో సాహిత్యచరిత్రలో మృగ్యమవుతున్నది. కాకపోతే కొన్ని కొన్ని కావ్యభేదాలు, కొన్ని కొన్ని ఇతివృత్తాలు, కొన్ని కొన్ని యుగాలలో ఎలా విశేషప్రాచుర్యం పొందుతున్నవో వివరిస్తున్నది. పోతే ఒక సామాజికదశలో బయలుదేరిన కృతులు ఉత్తర సామాజికదశలో ఎలా ఆదృతాలవుతున్నవో చెప్పటం లేదు. ఈ విషయాన్ని మార్క్స్ కూడ "క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఎకానమీ" అన్న గ్రంథంలో ఒప్పుకొన్నాడు. మొత్తంమీద కళారంగంతో గతితర్కానికి ప్రసక్తి చాల తక్కువ అనే చెప్పవలసి వస్తుంది.

ఈ సందర్భంలో ఇలా అనవచ్చును :— "భౌతిక గతితర్కంలో భావాదికానికి స్వతంత్ర సత్తాలేదని తెలిసిన విషయమే. ఉత్పత్తి విధానాన్నిబట్టి భావాదికం ఉంటుందని భౌతిక గతితర్కం ప్రతిపాదిస్తున్నదని ఇంతకుముందు నిర్ధారించటం జరిగింది. కాబట్టి పైన

పేర్కొన్న వివరణ స్వవచనవ్యాఘాతమే".

ఈ ఆక్షేపణ సమంజసమై ఆంధ్ర సాహిత్యవికాస వివరణం పైన పేర్కొన్నది. హెగిల్ సిద్ధాంతానికి అనుగుణంగా ఉన్నది. కాబట్టి ఉత్పత్తివిధానాన్ని బట్టి సాహిత్య చరిత్రను వివరించవలసి వుంటుంది. అయితే ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రారంభంనుంచి ఆధునికయుగం సగం వరకూ పూర్తిగా భూస్వామిక ఆర్థికవిధానమే అమలులో ఉంది. అప్పుడు సాహిత్యపరిణామంలోని వైవిధ్యాన్ని ఎలా వివరించాలి? ఈ వైవిధ్యం కూడ పూర్వం ఉన్నదే కాని కొత్తగా వచ్చినది కాదు. కేవలం ఆర్థిక చరిత్రనుబట్టి దానిని వివరించటం దుష్కరం.

ఇది యిలా ఉండగా ప్రపంచచరిత్రలో ఏ దేశచరిత్ర విప్పినా విప్లవవ్యతిరేకశక్తులు సాధించిన ఘట్టాలు, శతాబ్దుల పర్యంతం అభివృద్ధి స్తంభించిపోయిన పట్టులు కనబడుతున్నవి. ముఖ్యంగా మన దేశంలో 8 వ శతాబ్దినుంచి మహమ్మదీయ యుగాంతం వరకు సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా విప్లవ వ్యతిరేకబలాలు జయం పొందినట్లు గోచరిస్తున్నదే కాని ఒకసారికూడా విశేషకాలం విప్లవబలాలు నెగ్గినట్లు కనబడదు. ఈ కాలంలో భారతీయ చరిత్ర దాదాపు స్తంభించిపోయిందనే చెప్పవచ్చును. (మతవాదులు ఈ వాక్యంతో ఏకీభవించక పోవచ్చును. వారి మతదృష్టి ఇక్కడ చర్చనీయం కాదు.) అలాగే చైనాలో కూడా స్తబ్ధత అన్నది సుదీర్ఘకాలం ఉండిపోయింది. కాని గతితర్కశాస్త్రం ప్రకారం పూర్వపూర్వదశలకంటె ఉత్తరోత్తర దశలు అభ్యుదయకబలీయాలు కావలసివున్నది. కాని పైని పేర్కొనిన స్థితిగతులన్నీ దీనికి విరుద్ధాలు. కాబట్టి గతితర్కం సామాజిక అధఃపతనాన్ని, స్తబ్ధతను వివరించటం లేదు.

పైగా జడజగద్వికాసాలకీ, సజీవమైన ఉద్భిజలోక సమున్మీలనానికి, సజీవవాసనయైన పశుప్రపంచ ప్రపంచనానికీ, సజ్ఞానమైన మానవసమాజ సమున్మేషణానికీ ఒకే త్రికధార కారణ మన్నప్పుడు, ఆ కారణ మెంత మహత్తర మైనదైనా, అనేకార్థాపాదక మైనదైనా అంధవిశ్వాసం కంటె అతిరిక్తమైనది కాదు. చారిత్రక సంఘటనలు, సామాజికపరిణతులు అనేక విధాలైన కారణాలవల్ల కలుగుతాయి. అలా కాదని గతితర్కాన్ని ఆశ్రయించటం శాస్త్రీయ మార్గానికి తిలోదకాలు వదలటమే. నేడు శాస్త్రగతిని నిరోధిస్తున్న వాటిలో గతితర్కం ఒకటి అంటే అంతగా అతిశయోక్తి లేదేమో!

ఇంతకూ తేలిన అంశాలు:— గతితర్కం ప్రమాణశాస్త్రం కాదు. అది జ్ఞానసిద్ధాంత

మంటే అంతకన్న అర్థంలేదు. కాక ప్రకృతి సమాజాలపరిణతిని అది వివరిస్తున్నదా అంటే, అప్పుడు అందులో అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు బహుళం. అందుకనే ఒక మాజీ కమ్యూనిస్టు గతితర్కార్థాన్ని ఒక్క వాక్యంతో తేల్చివేశాడు. "అది ఉద్బోధక మిధ్య. శాస్త్రంగా మాత్రం అది నిరర్థకం".

మార్క్సీయ గతితర్కం నిరర్థక మన్నంతమాత్రాన మార్క్సిజ మంతా నిరర్థక మని భావించరాదు. ఆ పక్షంలో ఈ వ్యాసంకూడ ఒక విధంగా నిరర్థకమే. కథానాయకుని వర్ణించి వర్ణించి ఒక కవి చివరి కతడు పుట్టినట్లే లేదు, గిట్టినట్లే లేదు అన్నాడట. హాస్యాని కైతే అది పరాకాష్ఠ. కాని ఇది బ్రతుకుతెరువుకు సంబంధించిన విషయం. హెగిలీయ గతితర్కప్రలుబ్ధుడై మార్క్సు ఎన్ని పొరపాట్లుపడినా అతని సిద్ధాంతంలో విశిష్టత ఉన్నది. ఈనాటి సమస్యలను సాకల్యంగా అర్థంచేసికొని పరిష్కరించాలంటే అతని వాదం చదువక తప్పదు. రస్సెల్ అన్నట్లు హెగీలీయ సిద్ధాంతసంపర్కంవల్ల సంప్రాప్తమైన అంశాలన్నీ అశాస్త్రీయాలు, సత్యదూరాలు కావచ్చును. కాని సామాజికపరిణామ ముఖ్యకారణాలలో ఆర్థికవిధానం ఒకటి కాదనటానికి వీలులేదు. తత్త్వాదికం కేవలం నిర్లిప్తంగా ఉండదనటం సత్యదూరం కాదు. ఇందుకు నేడు మనదేశంలో శిరోధార్యంగా విశేషప్రచారితంగా ఉంటున్న తత్త్వాదికం కంటె వేరు నిదర్శనం అక్కరలేదు. "సామాజిక అభ్యుదయానికి వివిధ విజ్ఞాన శాస్త్రవిషయ సమన్వయంతో గూడిన తత్త్వదృష్టి ఆవశ్యకం. దారిద్ర్యం, అన్యాయం ఉన్నంతవరకూ సమాజం శాంతి అనుభవించటం కల్ల. మానవచరిత్రను మానవుడే సృష్టించుకొంటున్నాడు" అన్న మార్క్సీయ సత్యాన్ని శాస్త్రీయంగా త్రోసివేయ టానికి వీలులేదు. సామాజికపరిణీతికి దైవానికి వదలక మానవుడే కృతసంకల్పంతో కొన సాగించాలని కూడా అతడే తొలిసారిగా తెలిపి, అందులకు యత్నించిన వ్యక్తి. అందువల్ల మార్క్సు సామాజిక అభ్యుదయ కాముకులకు స్మరణీయుడే అవుతున్నాడు.

"న సత్య మన్విష్యతి మృగ్యతే హి తత్ ।"

—ఆంధ్రప్రభ (దినపత్రిక) సౌజన్యంతో
(1955 మే 1, 8, 15, 22 ఆదివారాలు)

(నాటి ఆంధ్రప్రభ ప్రతులను భద్రంగా దాచి ప్రకృత ముద్రణకు దోహదంచేసిన సూర్యదేవర హనుమంతరావుగారికి కృతజ్ఞతలు)

# కావ్యజగత్తు – పరిశీలన

—కె. వి. రమణారెడ్డి

[కనుపూరు వెంకట రమణారెడ్డిగారు నెల్లూరుజిల్లా రేబాల గ్రామంలో 1928లో జన్మించారు. చరిత్రలో రాజనీతిశాస్త్రంలో M. A. పట్టం పొందారు. కావలి జవహర్ భారతిలో అధ్యాపకులు. విరసం కార్యదర్శి. ఎమర్జన్సీకాలంలో 21 మాసాలు జైలులో ఉన్నారు.

అడవి, భువనఘోష, అంగారవల్లరి, ఎర్రపిడికిలి, జైలుకోకిల (కావ్యాలు), కవికోకిల, గురజాడ, తెలుగుజాడ, మహోదయం, శరత్ బాబు (సాహిత్యవిమర్శలు), అన్నపూర్ణ (నాటకం), రాజీవం, ఎండమావులు, పద్మవ్యూహం, (నాటికలు), డిటెన్యూడైరీ - వీరి ముఖ్యరచనలు.]

*　　　　*　　　　*

"అపారేకావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః...." అని మొదలెట్టినా యీ వ్యాసాన్ని ?

ఉహూం. యిది నాకు సరిపడదు. చేదని కాదు, బాధనీ కాదు. కావ్యాలకు ప్రత్యేక సంసారస్థాయినిచ్చే భావమై ఖరితోనే పేచీ. అలాంటిది అసంభవం. అందుచేత అబద్ధం. అలంకారమే అయితే (ఫిగరేటివ్) ఫర్వా వుండక పోవచ్చుగాని, ప్రత్యక్షంసత్య మనుకుంటే (లిటరల్) ఫర్వా తప్పదు. అంచేత, జి. వి. కృష్ణరావుగారి "కావ్యజగత్తు" పేరుతోనే నాకు లోపలి పోరు.

కావ్యాలన్నీ కలిపి జగత్తా, లేక ఈ జగత్తులో కావ్యాల కొక గదా, అనేది నా మొదటిప్రశ్న. వాస్తవజగత్తుతో సంబంధం లేని కావ్య చిన్న మంటూ ఒకటి వుంటుందా. వుంటే అది కావ్యం కాగలుగుతుందా, అనేది నా రెండో ప్రశ్న. జగత్తు జడపదార్థమే అయితే నేమోగాని, జగత్తు జగత్తే అయేంతదాకా, కళ పరిణామశీలం గాక తప్పదు. కాబట్టి దీనికి సార్వకాలికతగానీ, సార్వజనీనతగానీ, ఉంటాయా అనేది నా మూడో ప్రశ్న. అంచేత, నా నాలుగో ప్రశ్న యేమిటంటే - కళను సూత్రాల పేరిటా పాడెకట్టు తాళ్ళతో కట్టెయ్యడం ఎంతవరకు సబబు? కళాధర్మా లుండవచ్చు, కళాప్రయోజకత్వం గురించి భిన్న దృక్పథా లుండవచ్చు. అయితే ఇవన్నీ కూడా నిర్దిష్టత దేశకాలాలనేగాని, నిరూపమైనవి కావు. కాగూడదు. అయినా నిలవ్వు.

సౌందర్యశాస్త్ర మనండి, కళాశాస్త్ర మనండి, మరొకటనండి — "ఈస్తటిక్స్" ఆయా స్థల, కాలాల సమాజవాస్తవం కడుపున పుట్టే బిడ్డే గాని, మేధావుల బుర్రల్లోంచి అభూతంగా మొలుచుకొచ్చే వూహాపోహల పిలక కాదు. ఈ చారిత్రక గతితర్క దృష్టి లేని వాడెవడైనా సరే, జనుషాంధుడు కాకపోతే పోయాడుగాని, భావాంధుడే. భావాలు బతుకు నుంచి పుట్టుకొస్తాయి. బింబ ప్రతిబింబ రూపంలో కాకపోవచ్చు. మెదడు అద్దం కాదు. లోకవృత్తాన్ని అర్థం చేసుకునే శక్తి దానికుంది గనకనే, మనిషి మృగకోటి నుంచి వేరుపడి ఎక్కి రాగలిగాడు. తిన్న పెసలు తిన్నట్టుగా విడిచే కోడి కాదు. చూసిందాన్ని అలాగే చూపే కోతీ కాదు మనిషి. ఇంద్రియాలు సేకరించి అందజేసే వాస్తవానుభవాల్ని నాడీ కేంద్రం సొంతపరచుకుని ప్రతిస్పందిస్తూ, ఈ స్పందనలను మళ్లీ నాడీమండలానికి భిన్న రూపాల్లో అందించే సంక్లిష్టమైన పదార్థం ఈ మెదడు. ఇందులో ఎన్ని అరలో ఎన్ని గదులో! దీనిలో వ్యాపించే చైతన్యం వాస్తవాధీనం. అయినా, ఫ్రాయిడ్ చూప నక్కర్లే కుండానే, చైతన్యం ఏకవిధంగా వుండదు. సహజాతాలు మృగజీవితం నుంచి సంక్రమించి మనశ్చైతన్యం లోతట్టున పడివుండి, సమయాన్నీ సందర్భాన్నీ బట్టి తలలు నిక్కబెట్టుకుని ప్రబలంగానే బయల్పడటంకద్దు. దీన్ని 'సుప్తచేతన' లేదా 'అపచేతన' అంటున్నారు. ఇది వైయక్తికమై వుండడం అరుదు. మనుషులంతా మృగసంతతే గనక మూలంలో దీనికి సమిష్టిలక్షణం వుండవచ్చుగాని, వ్యక్తి చేష్టలలో వైయక్తికరూపంతోనే ఇది బయల్పడు తుంది. చైతన్యంకూడా సమిష్టిలో, పుట్టి వ్యష్టిలో పుష్టిపొంది బయల్పడేదే గాని, సమిష్టిగా కూడా పర్యవసించేది. ప్రయోజనం రీత్యా, చైతన్యం కలిగించినంత ఉపకారం సుప్త చైతన్యం కలిగించదు, కలిగించలేదు కూడా. మొత్తం మానవజాతి వానరత్వం నుంచి బయల్పడి నరత్వం పొందే క్రమంలో, చైతన్యానిదే పై చేయి.

కళలు యిలాంటి చైతన్యసీమలోనే పెరిగినా, సుప్తచేతన తాలూకు తలలూ ఊహలూ వైరివాంఛలూ వుద్రేకాలూ, వగైరాల మూలాన, తీవ్రతనేగాక జంతుధర్మబంధుత్వం కారణంగా ఇతరులలోనూ తమ ప్రతిస్పందనలను కలిగించగల సత్తానూ సంతరించుకోవడం ఆశ్చర్యంకాదు. అశాస్త్రీయమూ కాదు. అయితే, స్పందనగానీ ప్రతిస్పందనగానీ ఇతోధిక సామాజిక ఆచరణకే తప్ప, వ్యక్తి ఆనందాని కొక్కదానికే కాదు. సమాజజీవి గనక మనిషి సొంత సుఖదుఃఖాలకూ, తనకూ మనకూ తెలీనంతగానే సమిష్టిగుణం వుంటుంది. అవి ఒక్కడితో ఆగిపోక పక్కవాళ్ల దాకా సాగి సోకుతాయి (యిన్ ఫెక్షన్). "అనుభూతి" వాదులూ. "అందం-ఆనందం"గాళ్లూ గమనించందల్లా యీసూక్ష్మాన్నే. కాబట్టి కళలకు "శుద్ధత" నాపాదించేవాళ్ళెవళ్లైనా, అబద్ధాన్నే ఆరోపిస్తున్నారు. "కళ కళకోసమే" నన్నమాటకి కూడా ఒక నిశ్చితమైన సామాజిక నేపథ్యం వుందనే వాస్తవాన్ని చూడలేక, దివాంధప్రాయులౌతున్నారు. ప్రయోజనం లేక, కళ తన వునికినే నిలబెట్టుకోలేదనడం వితండవాదం కాదు. సదరు ప్రయోజనం వైయక్తిక మనిపించినా, పర్యవసాన దృష్ట్యా, సామాజికమే.

గ (జి)వను వేం(వి) కృష్ణరావు "రేడికల్ ప్రచురణ నెం. 6"గా తెనాలి నుంచి ప్రకటించిన "కావ్యజగత్తు" తన కళాశాస్త్ర ప్రస్థానంలో తొలి అడుగే. తొలి అడుగైనంత మాత్రాన్నే తప్పటడుగు కావడం విధి అనుకోవచ్చుగాని, తప్పటడుగులూ తొక్కుపలుకులూ బోసినవ్వులూ చిలిపిచేష్టలూ పసిపిల్లల విషయంలో పెద్దవాళ్ళకు ఆనందాన్నిస్తాయి.

"మార్క్సిస్టు" "రాయిస్టు" అవుతున్న క్రమంలోగాక అయిపోయాకనే, యీ 82 పేజీల పుస్తకం ప్రకటించారు. దేశవాళీ కమ్యూనిస్టు లెవరూ అప్పటికింత శ్రద్ధాసక్తులతో అధ్యయనంచేసి కళాశాస్త్రం గురించి పట్టించుకున్నారో లేదో తేల్చి చూపేందుకు గ్రంథ రూపంలో దాఖలాల్లేవు. పత్రికావ్యాసా లుంటే ఉండవచ్చు. ఈ సందర్భంలో ముందు తుమ్మల వెంకటరామయ్యను పేర్కొనాలి. ఇందులో విశేషమూ ఉంది. కృష్ణరావు, వెంకటరామయ్య యిరుగు, పొరుగువూళ్ళ కుర్రాళ్లుగా కొల్లూరు స్కూల్లో సహాధ్యాయులే గాక త్వరలో స్నేహితులు కావడమూ గాక, జంట కవు లయ్యారు....చాలా కొద్ది కాలమే కావచ్చు. కృష్ణరావు కాలేజి చదువులు ముందు త్రిపురనేని రామస్వామిచౌదరి ప్రభావానికీ, తర్వాత త్రిపురనేని గోపిచంద్ సాన్నిహిత్యానికీ దారి తీస్తే, వెంకటరామయ్య హిందీ చదువు కాశీలో మరోదారి పట్టించాయి. మొదట్లో యిద్దరూ కమ్యూనిస్టులే గాని, కృష్ణరావేమో రాయిస్టు కాగా, వెంకటరామయ్య "మార్క్సిస్టు" అయ్యారు. రాజకీయ విభేదా లెప్పుడూ రాజకీయ

విభేదాలుగానే వుండిపోవు. ప్రారంభంలో వృత్తాలు కలిసిరాసినా, తదనంతరకాలంలో కృష్ణ రావులాగా వెంకటరామయ్య వృత్తాల వద్ద నిలిచిపోక, ఆచరణశీలిగా ప్రయోజనవాదిగా గేయ రచనకు దిగారు. మార్పు రాకుండా వుంటే, కృష్ణరావూ అలా దిగివచ్చేవారు. ఈ "దిగి" రావడం గురించి 1939లో సిద్ధాంతమే చేశారు కూడా .... "విప్లవతత్వాన్ని గ్రహించిన నవ కవులు క్రింది వర్గానికి పనికివచ్చేటట్టు వ్రాయాలి. పై వర్గంలోని బూర్జువా కవులు "కళ అధః పతనం" చెందుతున్నదని విచారపడినా, తెగతిట్టడానికి సిద్ధమయినా శ్రామికవర్గానికి అర్థ మయ్యేటట్లు వారి సమస్యలు తీసుకొని వ్రాయాలి". ('ప్రజామిత్ర' 1938 సెప్టెంబరు 4 "చంద్రం వ్యాసావళి"లో వుదాహృతం, పు. 80) అవతరించడం అధిరోహించడానికి చుక్కెదురు. కళ విషయంలో దిగడం చాలా కష్టం, ఎక్కడం నష్టం .... యీ దృక్పథంలో. అయినా కృష్ణరావు ఆచరణలో క్రమంగా అధిరోహణనే లక్ష్యం చేసుకుని, 1941 డిసెంబరు మాసం "ఆంధ్రప్రభ"లో సాహిత్యం గురించి రాసిన వ్యాసాలలోని భావాలను పెంచి "కావ్యజగత్తు"గా చేసేనాటికల్లా,తమ మాటలు తామే దిగమింగినట్టు,'ఎన్టిస్టు'(?) దృక్పథం అవలంబించి యిలా రాశాడు. "వర్గసంబంధాలను మన దేశంలో పరిశీలించిచూస్తే కార్మికుల బలం చాలా తక్కువగా వుంది. అసలు ఏ విప్లవం రావాలన్నా రాజకీయచైతన్య ముండాలి. ఇలాంటి చైతన్యం మధ్యతరగతిలోనే వుంది. వుంటానికి అవకాశ ముంది. పరిశ్రమలు బాగా అభివృద్ధి కాలేదు. ఉన్న కొలదిమంది కార్మికులకు విద్యాగంధం లేదు." ('చంద్రం వ్యాసావళి' పు. 80). మద్దుకూరి చంద్రశేఖరరావుగారికి యిది వట్టి ప్లేటు ఫిరాయింపుగా కనిపించిం దీ మార్పు. రాజకీయపరమైన మార్పునే యిందులో చూశారు కామ్రేడ్ చంద్రం.

"సోషలిస్టుదృష్టి"తో గాక "కేవలం ప్రజాస్వామిక విప్లవదృష్టి"గా వుంటే తప్ప, మధ్యతరగతివారికోసం రాస్తే తప్ప, సాహిత్యానికి ఆదరణా. పోషణా వుండవని కృష్ణరావు అన్నారంటేనూ, రాజకీయపరంగానే కదా ? సోషలిస్టు విప్లవానికి కింద మెట్టుగా ప్రజా స్వామిక విప్లవాన్ని రాయిస్టులు భావించడం. "రాయిజం" వూసరవెల్లితన మనిపించవచ్చు గాని, అది మధ్యతరగతి విప్లవం అన్నప్పుడు మాత్రం, సోషలిజానికి ముందుగా పెట్టుబడి దారీ సమాజిక విప్లవాన్ని కోరుకున్నా రనుకోవాలి. అదే అపరాధం కాదు. అపరాధమైతే, ఈతరహా విప్లవానికి గల ముందు తెన్ను (పర్స్పెక్టివ్) విషయంలోనే. మధ్యతరగతి అనండి, బూర్జువావర్గ మనండి. తనంత తానుగా యీ ప్రజాస్వామిక విప్లవాన్ని గట్టెక్కించ జాలని పరిస్థితి 1917 తర్వాత ప్రపంచ వ్యాప్తి వాస్తవమైంది. కార్మికవర్గం తక్కువగా

వున్నదంటె పెట్టుబడిదారీవర్గమూ అంతే సన్న హూటేగదా! మరి, మన దేశంలాంటి దేశాల్లో ముందుగా జరగవలసిన విప్లవం, పెట్టుబడిదారీ అభివృద్ధిని సాధించడానికే అనుకున్నా, ఈ తరహా సామాజికసంబంధాల పెరుగుదలకు ఆటంకంగావున్న భూస్వామిక ఆస్తి సంబంధాలే. కాబట్టి, జరగవలసిందల్లా ముందుగా వ్యావసాయిక విప్లవం. అంటే, భూస్వామిక ఆస్తి సంబంధాల నిర్మూలనం అని అర్థం. అది ఆనాటికి కృష్ణరావు కెలా తలకెక్కలేదో, కామ్రేడ్ చంద్రానికీ అవగాహన కాలేదు. దేశవాళీ కమ్యూనిస్టులకు నేటికీ చిలకపలులేకాబట్టి ఆశ్చర్యమూలేదు. ఈ "మధ్యతరగతి" ఒక వర్గమా ? ఇందులో ఎన్ని భావాలు? ఎన్నెన్ని అంతస్తులు? అవి రాయిస్టులకూ అంతు జిక్కలేదు. వ్యావసాయిక విప్లవం రైతు కూలీలకూ సంబంధించిన రాజకీయమే అయినా, కృష్ణరావు మాటల్లో వారికి, "విద్యాగంధము" తక్కువే గనక, మధ్యతరగతివారి దృక్పథాన్ని అవలంబిస్తూ స్వవర్గభావాభినేశ పరిమితుల నతిక్రమించి "దిగి"వచ్చి రాయాలి తప్ప "మధ్యతరగతివారికోసం" వ్రాయడం అక్రమం, పైగా అనాలోచితం. కుటుంబరావువంటి ఆలోచనాపరులే మరి పది యిరవయ్యేళ్ళదాకా యిలాగే వాదిస్తూవచ్చారు. కృష్ణరావును ప్రభావితం చేసినవారిలో కుటుంబరావు ఒకరని మరవగూడదు.

"విద్యాగంధం" అట్టడుగు జనానికి అందాలంటే, సర్ చార్లెస్ వుడ్ తన 1854 'డిస్పాచ్'లోనే, 'పెర్కొలేషన్' గురించి ప్రస్తావించాడు. పై తరగతి నుంచి కింది తరగతులవారికి విద్యావిజ్ఞానాలు వడగట్టినట్టుగా దిగిపోవాలి; అలా పోవాలంటే, మధ్యతరగతికి ముందుగా ఈ గంధాన్ని అందాలి. మెకాలే పేరిట వెలువడ్డ విద్యాసిద్ధాంతం కూడా యీ ఆరటిబోదె వేసిన మరో పిలకే. ఎన్నడో 1920 లలో 'డి. కాలనైజేషన్' సిద్ధాంత రాద్ధాంతానికి దిగిన యం. యన్. రాయ్ కోమింటర్న్ కాలంలో లెనిన్ చేత మొఖం వాయా చెప్పులు పడ్డాయి. బ్రిటిష్ వలసాధిపతులు భారతదేశంలో తమ స్వప్రయోజనదృష్టితోనే పరిశ్రమలు పెంపొందింప జేస్తున్నారు గనక, దేశం పరిశ్రమాభ్యుదయం సాధిస్తున్నప్పుడు 'జాతీయ'వాదుల కర్తవ్యం దీన్ని ప్రోత్సహించడమే నంటూ వలసాధిపతులకూ, దేశీయ మూలధనాధిపతులకూ ఆర్థికబాంధవ్యం సమర్థించాడు. లోగడ, కాంగ్రెసు ఉద్యమ మంతా పెట్టుబడిదారీ పుట్టేనని, దానితో కార్మికవర్గానికి తీరని తగవే నన్న రాయ్, తన సిద్ధాంతాన్ని ఎప్పటి కప్పుడు మార్చుకుంటూ, లేదా దిద్దుకుంటూ, అందునా ఒక తప్పును అంతకంటె పెద్ద తప్పుతో చెడదిద్దుకుంటూ, చిట్టచివరికి — ఎట్టకేలకు — రెండో ప్రపంచయుద్ధకాలంలో, 'జాతీయ'వాదాన్నీ, దాని క్విట్టిండియా పోరాటాన్నీ కాదని, దేవవాళీ కమ్యూనిస్టులు తమ

సామ్రాజ్యవాదయుద్ధ' సిద్ధాంతాన్ని 1942 లో 'ప్రజాయుద్ధ'సిద్ధాంతంగా తెగటార్చముందే, బ్రిటిష్‌వారి యుద్ధాన్ని వెనకటికి గురజాడలా, 'ధర్మయుద్ధం' అనుకున్నాడు. రా యిస్టులూ, 'దేశవాళీ కమ్యూనిస్టులూ — దొందూ దొందే — కనీసం యీ విషయంలో.

"డిమిట్రోఫ్ థీసిస్" ననుసరిస్తూ ఫాసిస్టు వ్యతిరేక విశాల ఐక్యసంఘటన నిర్మాణానికి రచయితలను 'ప్రగతిశీల్' (ఇక్కడ 'అభ్యుదయ రచయితల సంఘం') రచయితల సంఘంగా కూడగట్టుకునేందుకు లక్నోలో (1936) ప్రేమ్‌చంద్‌ను అడ్డం పెట్టుకుని అధ్యక్షుణ్ణిగా నిలబెట్టి, సీమ నుంచి తిరిగివచ్చిన సజ్జాద్ జహీర్, అల్తాఫ్ హుసేన్, హిరెన్ ముఖర్జీ వగైరాలతోబాటు మన (అప్పటికి రాయిస్టుగా మారని) అబ్బూరి పూనుకున్నారు. ఆ తర్వాత పదేళ్ళకు (1943) తాపీ ధర్మారావును అడ్డం పెట్టుకుని, కమ్యూనిష్టుపార్టీ మనుషులే కార్యవర్గంలో హెచ్చుగా, యిదే తెనాలిలో అ.ర.సం. ప్రారంభసమావేశం జరిపారు. అప్పటికే యెడపెడలైన రాయిస్టులూ కమ్యూనిస్టులూ రచనారంగంలోనైనా ఒక వేదిక మీదికి రాలేకపోయారంటే, ఫాసిస్టు వ్యతిరేక ఐక్యసంఘటనకు ఆదిలోనే హంసపాదెలా పడిందో చెప్పక్కర్లేదు. ఆ పిమ్మట వచ్చిందే యీ 'కావ్యజగత్తు'. మరి కామ్రేడ్స్ తుమ్మల, చంద్రం విరుచుకు పడ్డారంటే పడరూ మరి ?

భాషలోనూ ప్రొలిటేరియన్ విప్లవం రావాలన్నా రని గోపీచంద్ రాస్తే, కిందివర్గానికి పనికి వచ్చేలా విప్లవతత్వంతో నవకవులు రాయాలని జి. వి. కృష్ణరావు రాశారు. దానితో కామ్రేడ్ చంద్రానికి పేచీ లేదు. అప్పటికి (1938) రాయిస్టులు తామూ మార్క్సిస్టుల మనుకుంటూ వచ్చారట. కాంగ్రెసును విప్లవపార్టీ అనేవారట. కాంగ్రెసులో దూరి కమిటీలు పట్టుకుని వాటిని సోవియట్లుగా మార్చి అధికారం సంపాదించా లనుకునేవారట. పెట్టుబడిదారులు సామ్రాజ్యవాదాలలో కలిసిపోయారనీ, అందుచేత వారికి పోటీగా కాంగ్రెసుని స్వాధీన పరచుకుంటే విప్లవం సూటిగా వచ్చేస్తుందని, రాయ్ రామ్‌ఘర్ కాంగ్రెసులో అధ్యక్షస్థానానికే పోటీ వేశారట. (చంద్రం వ్యాసావళి, పు. 81)

ఈ రగడ నటుంచి, 'కావ్యజగత్తు' చూస్తే, రాయిస్టుల మార్క్సిజం ఎలా పర్యవసించిందో తెలుస్తుంది. సాహిత్యరంగంలో సోషలిస్టు విప్లవం రావాలని "వెఱ్ఱికేకలు" వేసింది తామే నన్నమాట మరిచి, మధ్య తరగతికి చెందిన ప్రజాస్వామిక విప్లవదృష్టితో మధ్యతరగతి రచయితలు కార్మికుల జీవితాన్ని చిత్రించవచ్చు ననడం, కామ్రేడ్ చంద్రానికి అసంగత మనిపించింది. సోషలిస్టుదృష్టితో చిత్రించవచ్చుననీ, చిత్రించాలని అర్థం.

"ప్రజాస్వామిక" విప్లవనేతృత్వం బూర్జువా వర్గానిది కాదు గాని, కార్మికవర్గానిదీ కాదన్నందుకే చంద్రం బాధ. రైతాంగం ప్రస్తావనే యిద్దరిలోనూ కనిపించకపోవడం వింత. వ్యావసాయిక దేశం ఆర్థిక ప్రగతిని సాధించడానికి రైతాంగం, వ్యవసాయ కార్మికులు, మధ్య తరగతిలో పీడిత విభాగం కలిసి, ఐక్యసంఘటన కట్టి, సోషలిస్టు విప్లవ దీర్ఘకాలిక లక్ష్యంతో, విప్లవం జరపాలనే చూపు యిద్దరి కళ్ళలోనూ మొలవక పోవటమే చిత్రం. రైతాంగం నుంచి వచ్చి, పెటీ బూర్జువా వర్గానికి చెందిన "మార్క్సిస్టులు" యిలా ఎన్ని వంకర్లైనా తిరగ్గలరు. అలా తిరిగే రప్పట్లో. కృష్ణరావు మాత్రం అప్పటికే 'ఎన్‌టిస్టు' (?) దృక్పథం చేబట్టి, పాండిత్యాన్ని శిరోభూషణంగా గాక శిరోభావంగా మార్చే క్రమంలో 'అధిరోహణ' అనబడే క్షీణతకు గురయ్యారు.

....నే కవినోయీ ! అల పిచ్చిరైతు నని తుస్కారింపగా బోకుమా !

అంటూ అంకితపద్యాలలో తనకు కవిగా స్వాధిక్యత గలిగించుకుంటూనే, తాను పుట్టి పెరిగిన "పిచ్చిరైతు" ల పాదంనుంచి తానే దూర మౌతున్నారు. అలపాటి రవీంద్రనాథ చౌదరి (కృతిభర్త) యేమోగాని, తాను మాత్రం "రసప్రలుబ్ధ"తకు ఎగబాకడం మొదలైంది. నార్ల (వెంకటేశ్వరరావు) లేఖలో. కృష్ణరావు "పాండితి" ప్రస్తావన వస్తుంది. రావడంలో తప్పేముంది గాని, రచయిత పరిణతి యే తెన్నుపట్టిందో యిది సూచిస్తుంది. రేడికల్ డెమోక్రటిక్ పార్టీ భావాలుండడం లోసుగేమీ కాదు, మెరుగేకావచ్చు గాక.

"నా సిద్ధాంతం క్రొత్తవీ కాదు; ప్రాతవీ కాదు. ఇలా అనటంవల్ల ప్రాతక్రొత్తల కలయిక అని చెప్పటానికి అంతకన్నా వీలులేదు. ఎందుకంటే భరతాది లాక్షణికులు చెబుతూ వచ్చిన రసవాదాన్నే స్వీకరించి అది భౌతికసిద్ధాంతాన్ని అన్వయించాను. ఈ రెండు సిద్ధాంతాలూ ప్రాతవే...." (ఒకమాట: కృష్ణరావు)

'క్రొ', 'ప్రా' లలో గల రేఫ సాధు రేఫే కావచ్చుగాక, యిది భాషాభేషజ మని గిడుగు నిరసించిన దాన్ని స్వీకరించి, 'పా' 'కొ' అని రేఫను దిగవిడిచి (వాడుకలో జనమే దిగ విడిచారు గనక) గురజాడ చేసి చూపిన "మేలుకలయిక" లో "మేలు" ను తీసేసి ఆయన వ్యావహారిక శైలిని కనీసం యిక్కడైనా తుంగలో దొక్కారని కృష్ణరావు గురించి రెండు మాటలు చెప్పడం, ఆయనను దెప్పడానికి మాత్రం కాదు, ఆయన 'సమన్వయ' వాదాన్ని నిర్దేశించడానికే, అందుకే కాబోలు, కురుగంటి సీతారామ 'భట్టాచార్యులవారు' తమ 'సవ్యాంధ్ర

సాహిత్యవీధులు' (పు. 709కో కృష్ణరావు గురించి అనరాని మాటేదీ పల్లెత్తి అనకుండా, "కావ్యజగత్తు" లో కృష్ణరావు సూత్రాల్ని గ్రథించాడు" అని ఆమోదంతో అని పూర కున్నారు. బ్రహ్మణేతర పుద్యమం, గ్రామీణ మధ్యస్థ (Middle) కులాల్లో కాస్త చదువు సంధ్య లబ్బించే లిబ్బిగా భావించి, బ్రాహ్మణ సంప్రదాయాన్నే బ్రాహ్మణులకంటెమిన్నగా అనుకరించాలనే తత్వాన్ని చేబట్టిన సామాజిక విశేషాన్ని యం. యన్. శ్రీనివాస్‌వంటి సమాజ శాస్త్రవేత్తలు 'సంస్కృతీ కరణం' అన్నారు (సాంస్కృటైజేషన్). మన కృష్ణరావులో ఇతి క్రమంగా ముదిరి ముదిరి వంగని విరగని చేవగా మారి ఆదర్శశిఖరా లెక్కించి, చివరికి "ఆదిభౌతిక" తత్వాన్ని తలకెక్కించింది, గుండెకు పట్టించింది, చేతికి పనిబెట్టింది. యువ కృష్ణరావును వృద్ధ కృష్ణరావు పీటీ కొట్టించి, మన్ను కరిపించడంలో, అట్టడుగు జనాని కందనే అందని ఎత్తుల కెదిగించి పూర్తిగా దూరం చేయించాడు. భారం మోయించాడు.

సమన్వయవాద దృష్టితో సాగిన 'కావ్యజగత్తు' రచన, ఆధునిక యుగంలో 1860 మొదలు 1930 దాకా కుక్కగొడుగుల్లా వచ్చిన సింబాలిజం, ఇంప్రెషనిజం, పోస్ట్, ఇంప్రె షనిజం, ఎక్స్‌ప్రెషనిజం, సర్రియలిజం. 'డాడిజం' (Sic) వగైరా వాదాల నన్నిటినీ కట్టగట్టి "కలుపు మొక్కలు" (పు. 5) అని ఖండించింది. ఇది చాలా 'నెగటివ్' వైఖరి ఎందుచేతనంటే, 19వ శతాబ్ది ఉత్తరార్ధం చివరిభాగంలో, పశ్చిమ దేశాలలో పెట్టుబడిదారి విధానం ముదిరి సామ్రాజ్యవాదంగా మారుతున్న చారిత్రకదశలో, బూర్జువావర్గం తన మొదటి అభ్యుదయాంశను కోల్పోయి పురోగమనానికి ప్రతిబంధకంగా తయారయ్యాక, కళా సాంస్కృతిక రంగాలలో వికట వ్యక్తివాదం రోజురోజుకీ బలపడిన మాట నిజమే గాని, ఈ "నవ్య" కళాధోరణులలో కొన్ని సమకాలిక సామాజిక జీవన క్షీణతను నిరసించేవి. డాడాయిజంలోకూడా సర్రియలిజంలోకూడా, చాలా చాలా స్వల్పంగానైనా యీ ధోరణులు లీలగానైనా కనిపిస్తాయి. వీటిని మరింత సావధానంగా పరిశీలించాలిగాని కొట్టి పారేసే పద్ధతి శాస్త్రీయమైనది కాదు. నిజానికి, కృష్ణరావుగానీ దేశవాళీ కమ్యూనిస్టులుగానీ అప్ప టికి మార్క్సిజాన్నీ, కళాసాంస్కృతిక రంగారంగాలలో వాని గతితార్కిక వైఖరినీ అధ్య యన పూర్వకంగా గ్రహించలేదు. 'రివిజనిస్టు' అయినా లూకాజ్ (Lucas) ఫిషర్ (Fistcher) యీ పని చేశారు. కృష్ణరావు అప్పటికి చదువుకున్నదల్లా క్రిస్టోఫర్ కాడ్వె ల్‌నే. కాడ్వెల్ ప్రతిభాశాలి అయినంతగా, సిద్ధమైన మార్క్సిస్టు కళాశాస్త్రాన్ని రాబట్టలేక పోయాడని సుప్రసిద్ధ మార్క్సిస్టులప్పుడూ యిప్పుడూ విమర్శిస్తున్న దానిలో నిజం బొత్తిగా లోపించలేదు. కాడ్వెల్‌ను మొదటిసారి తెలుగువారికి పరిచయం చేసినందుకు కృష్ణరావును

అభినందించాలి తప్ప, ఫ్రాయిడ్‌నూ మార్క్స్‌నూ కలగాపులగంచేసి "సబ్‌కాన్షస్", "ఈగో" "ఈడ్" వగైరా పదార్థాలను మార్క్సిజంమీద మోపి, రెండింటినీ రంగరించడంలో మాత్రం కాడ్వెల్ కృతార్థుడైనంతగా కూడా కృష్ణరావు కాలేదు. దీనికి కారణం, ఆయన కాడ్వెల్ దిగుమతి సరుకు. అయినా కాడ్వెల్‌ను పూర్తిగానూ అనుసరించలేదు. మీదు మిక్కిలి కాడ్వెల్ కృష్ణరావులా మార్క్సిస్టు వ్యతిరేకి కాదు. కృష్ణరావుది 1944 నాటికి పేరుకే మార్క్సిజం.

సోవియట్ రాజ్యం "వట్టి శూద్రరాజ్యం" అనేవాళ్ళను "అల్పజ్ఞుల"ని తెగడవచ్చు. (పు. 83), "పేదరికం పోతేసే సాహిత్యపు పేదరికం పోతుంది" (అదే) అననూవచ్చు గాని, తేల్చిన విషయం: ఆంధ్ర సాహిత్యానికి విశ్వసాహిత్యంలో స్థానం లభించాలంటే— "సాహిత్యం ప్రజాస్వామిక విప్లవదోహదాన్ని కల్పిస్తూ 'మధ్యతరగతి'కోసం వ్రాయబడాలి" ఇది అశాస్త్రీయమైన నిర్ధారణ. నేటి స్థితిలో సాదాజనానికి 'విద్యాగంధం' లేకుంటే, దాన్ని కల్పించి వారిస్థాయిని పెంచి సాహిత్యాన్ని అందించడానికి రచయిత ప్రయత్నపూర్వకంగా తన సమున్నతస్థానం నుంచి "దిగి"పోవాలి. పాండిత్యభావం అడ్డంకి అయాకే వదుల్చుకుని, జానపదరూపాలతో ప్రజాస్వామిక విప్లవ సందేశాన్ని పొదిగి, లక్ష్యనిర్దేశం చెయ్యడంలో తృప్తిపడక తానూ జనంలోకి పోయి, బుద్ధిజీవులకూ కష్టజీవులకూ మధ్య ఏర్పడి వున్న గండిని పూడ్చాలి గాని పెంచగూడదు. క్రియలో కృష్ణరావు చేసింది యీ చివరిదే. కార్మికుల జీవితాన్ని చిత్రించవచ్చునట గాని, ఆ దృష్టి సోషలిస్టుదృష్టిగా గాక, ప్రజా స్వామిక విప్లవదృష్టిగా వుండాలట (పు 82). ఇది సబబే అని పైకి అనిపిస్తుంది గాని, ప్రజాస్వామిక విప్లవదశలో కూడా సుదూరమైనా సోషలిస్టు లక్షణం వుండితీరాలి. లేకుంటే వాసికి అంతిమ లక్ష్యశుద్ధి వుండదు సిద్ధి ఎలాగూ వుండదు. అప్పుడది దారీ తెన్నూలేని అధ్వాన్నమే కాగలదని కృష్ణరావు గ్రహించలేదు. అక్షరజ్ఞానం లేనివారికి సాహిత్యమే వద్దనటం, వాళ్ళ గొంగళీ ఎక్కడుందో అక్కడ ఉంచడం. ఫలితం, ప్రజాద్రోహం. సాహిత్యం అప్పుడు నిరర్థక మౌతుంది. ప్రజలకోసం రాసేదే అసలైన సాహిత్యం. మధ్య తరగతి పాఠకులు వినోదాన్నీ, వుల్లాసాన్నీ, అందచందాల్నీ కోరేంతగా సామాజిక సత్ప్ర యోజనాన్ని కోరరదని అనుభవం. అప్పటికే కృష్ణరావు లాంటి విజ్ఞులకు కలిగివుండాలి. చలం, కొవ్వలి, జంపన, ధనికొండ వగైరాల రచనలకు గిరాకీ గిట్టుబాటూ కలగడానికి, అవి ఆ తరగతి పాఠకుల అభిరుచులకూ అభిమానాలకూ మెట్టుమెట్టుగా దించి, చివరికి నేల బారు చేసినందువల్లనే.

భాష, కళ, సాహిత్యం — యివన్నీ సామాజిక జీవితం నుంచి వచ్చి, వాటితో పెన బడినవేనన్న సదవగాహన (పు. 5-7 లు) కృష్ణరావుకి వుంది. సమాజం పురోగమన శీలం. ఈ గమనాన్నీ, పరిణామాల్నీ వివరించగలిగింది "చారిత్రిక భౌతిక సిద్ధాంత మొక్కటే" అని అన్నాడు. భౌతిక సిద్ధాంతాలను యాంత్రికంగా (మెకానికల్) అన్వ యించరాదని హెచ్చరించారు (పు. 8). మంచిదేగాని, రెండో ప్రకరణమంతా, కావ్య జగత్తుని తీసి కొండమీది కోతిలా చేసి, సంప్రదాయం తాళ్ళతో కట్టేశారు. అంతేగాని, సంప్రదాయం ఏకశిల (మొనోలిత్) కాదనీ, ప్రతి జాతీయసంప్రదాయంలోనూ ప్రజాహితకర మైన ధోరణులూ వున్నాయని, మార్క్సిస్టులు పెంపొందింప జెయ్యవలసిందల్లా శ్లోకాలకు శ్లోకాలను వల్లించి పండితసంప్రదాయ ఆకర్షణలకి లోబడడం గాక, దీనికి భిన్నమై అనాద రణకు లోనైకూడా శతాబ్దాలుగా కొనసాగుతున్న ప్రజాసంస్కృతి ధోరణులను వేర్పరచడమే నన్న లెనినిస్టు అవగాహనకోసం కృష్ణరావు రచనను గాలించడం వ్యర్థం. శబ్దం సైతం సమాజసిద్ధ మన్న కృష్ణరావే, శబ్దపరిణామాలను గమనించకపోవడం, గమనించినా చలా మణికి లేకపోవడం అనుచితం. ప్రబంధసాహిత్యంలోని శబ్దాల గారడీని భూస్వామ్యవిహిత మైన ఆడంబరంతో అనుసంధానించి పరిశీలించకపోవడం, గతితార్కికపద్ధతికే అపచారం— చారిత్రిక భౌతిక వాదానికి సరేసరి. "మారకం"లేని శబ్దాల గురించి ప్రస్తావిస్తూనే, "కవి యైనవాడు సామాజికశబ్దాలలో ఆలోచించాలి" అంటూనే (పు. 15). తన 'అంకితం' పద్యాలలో వాడిన శబ్దాల విషయంలో మాత్రం స్వయంకృతాపరాధం చేసుకొన్నారు.

సామాజికజగత్తు మారనిదికాదు. దానితోబాటు, శబ్దాలే గాక యితివృత్తం, శైలి, అన్నీ మారాలి. కాస్త ఆలస్యం కావచ్చు. ముందు పునాది మారినా, ఆ మార్పుని సామా జికజీవన వుపరితలంలోని కళాసంస్కృతులు స్వీకరించాలంటే, చాలాకాలమే పట్టవచ్చు. కాని కృష్ణరావు సిద్ధాంతమేమో యేటికీ, ఆచరణ కోటికీ లాగుతుంటే, తాను కళాశాస్త్రకాందిశీకు డౌతున్నాడు.

జగత్తులోని ప్రత్యక్షాంశలూ చేతనాలూ కళాసాహిత్యాలలో కవికీ, కళాకారుడికీ సంబంధించిన చైతన్యం మూలాన ప్రస్ఫుట మౌతాయి. వాస్తవమేగాని—ఫ్రాయిడ్ లేకున్నా మనిషిలో అవచేతన వుంది గనక అలౌకిక మనిపించే అంశాలుకూడా ఇందులోని కెక్కుతాయి. ఉన్నది ఉన్నట్లుగా దిగితే సొగసేమిటి? లేనిది ఉన్నట్లుగానూ దిగకూడదు. ఉన్నదాని వెనక దాగివుంటే అంశలవల్ల తీవ్రతా, గాఢతా, ఉద్విగ్నతా, భావుకతా వచ్చి

కలసి వట్టివాస్తవాన్ని ఆకర్షవంతం చేస్తాయి. ఆదిమ మానవ జీవితంలో ఆవాహనలూ మంత్రతంత్రాలూ యిప్పుడు లేకున్నా, వాటి అవశేషాలు నిలిచి, కళకు అందచందాలు సమకూరుస్తుంది. కళ ప్రతిబింబం కాదు—నీడకాదు—చిత్రపటం. కాబట్టి మరీ ఆకాశానికి నిచ్చెనలు వెయ్యక, దివి నుంచి అసలే భువికి దిగి రాననక, వాస్తవాన్ని భావనలో కలిపి చూపినప్పుడు, కళ ప్రత్యక్ష మౌతుంది. కోరికలనేకాదు, కలలకూ కాళ్లుంటాయి. ఊహలు వట్టిగరుత్పతులై వుండవు—"ఏగూడేని లేని పులుగురాయడు" కృష్ణశాస్త్రికి నిజంగా కనిపించదు. కావ్యజగత్తు అలౌకితం కాదని కృష్ణరావు తేల్చడం సమంజసం (పు. 21). ఆదిమయుగాల 'మేజిక్' అంశ వుంటేనే కళ కళ కాగలుగుతున్నదని ఫిషర్ అన్నాడు. ఆనందం ఒక్కటే కళారహస్య మని కృష్ణరావు అంటున్నారు (పు. 22). కళలో ఉండేది ఆనందదాయకశక్తి ఒక్కటేకాదు, విజ్ఞానదాయకశక్తి కూడా వుండితీరాలి. తొలి మానవుని పనిముట్లనుంచీ నేటి సాధకోపకరణాల వరకూ అందం, ఆనందంలో దీటుగా వుపయోగిత అవసరం. జోలపాట ఒకటి, మేల్కొలుపు మరొకటి అయినప్పుడు, ఈ రెంటిలో ఎంపిక చేసుకోవలసివస్తే రేండోదాన్ని ఎంపిక చేసుకోవడం వివేకం. వివేకిగాని మనిషి కేవల జగభరతుడే. వివేచనాశక్తి మానవుడి చూడామణి. అదే కరదీపిక. అదే ఆయుధం. దానితోనే తాను బహిరంతర ప్రకృతులను వశం చేసుకోవాలి. అలా వశం చేసుకున్నప్పుడే తనకు వాటి బంధవిమోచన. నిర్బంధం నుంచి బయల్పటడమే స్వేచ్ఛ. దీనికి ప్రకృతి ధర్మాల పరిజ్ఞానం, వాటిపై విజయావశ్యకత గురించి అవగాహనం-యివే మనిషికి తన మనుష్యత్వాన్ని సమకూరుస్తా యని, అప్పటినుంచే మనిషి స్వతంత్రుడు కాగలడని, యధార్థమైన మానవచరిత్రకు అవే నాంది అనీ, అంతదాకా సాగిన మానవేతిహాసం సమస్తం. దాని పూర్వరంగం (ప్రి-హిస్టరీ) అనే మార్క్సిస్టు దృక్పధాన్ని కృష్ణరావు గుర్తించారుగాని వివరించలేకపోయారు. పైగా, హైందవ మతతత్వభావనతో దీనికి ముడివేసి, తన 'అధిభౌతిక' అభినివేశానికి ప్రాతిపదిక వేసుకునేక్రమంలో, భౌతికవాదానికి క్రమంగా స్వస్తి చెప్పారు. ఆలంకారికుల సిద్ధాంతాలకూ ఆయా నిర్దిష్టచారిత్రకదశలలో సామాజిక వ్యవస్థా రూపభేదాలకూ సమన్వయం పొసగించలేక, ఈశ్వరభావంతో కూడుకున్న రససిద్ధాంతాన్ని ఆనందవాదాన్నీ చేబట్టారు. సాహిత్యవిమర్శను మత తత్వప్రకర్షకు లోబరిచా రనవచ్చు. చివరకి "వాసనల"దాకా వెళ్ళారు. ఇవి కర్మ-పునర్జన్మలకు దారితీయక తప్పదు. అలాగే జన్మరాహిత్యస్థితి గురించి ప్రతికీ.

కావ్యజగత్తుకు నిర్లిప్తతకు ప్రధావమా? నిమగ్నతప్రధానమా? ఆనందానికైనా అంతేనా?

మన స్తత్వవేత్తల మాటలను ఉటంకించినంతమాత్రాన యీ ప్రశ్నలకు సమాధానం రాలేదు. ఆనందానికీ సుఖానికీ భేదం వూహిస్తే తప్ప, ఆ రెండూ కూడా వ్యక్తిరీత్యాపైనా సమాజ నిష్ఠాలే. సిర్లిప్తత పూర్తిగా నెగటివ్. బౌద్ధుల "నిర్వాణం" యిలాంటి శూన్యమే. ప్రాణపూర్ణమైన జగత్తులో మనిషి ఇష్టావాప్తిద్వారా సౌఖ్యాన్ని, చిత్తశాంతిద్వారా ఆనందాన్నీ పొందవచ్చు. పొందుతాడు. నిష్కామం, 'తృష్ణా'రాహిత్యం....మనుషులకు కాదు. మనుష్యత్వాన్ని దాటిపోగోరే సంయములకూ, యోగులకూ, మోక్షకాములకూ, వైకుంఠం, కైలాసం, సత్యలోకం—యిలాంటివన్నీ భౌతిక వాస్తవ విముఖత నుంచి వూహల బలాన పుట్టుకొచ్చే కోరికలే. తల్లకిందుల మానవప్రపంచమే దేవలోకం. అశక్తుడైన మనిషి కల్పించుకున్న సర్వశక్తిసముపేతుడే దైవం. ఈ ఆధ్యాత్మికతను కాదంటూనే, మొదట దాని పరిభాషనూ తర్వాత దాని సారాంశాన్నీ స్వీకరించి, కృష్ణరావుగారి 'కావ్యజగత్తు' నుంచి నిష్క్రమిస్తూ వెళ్ళివెళ్ళి, అసలు జగత్తునే తృణీకరించే—ఈసడించే—నిరాకరించే-ఆదర్శశిఖరానికి ఎదిగాడు. అంటే, సుసంబద్ధమైనదాన్ని విడిచి అబద్ధాన్ని వరించాడు. అది కృష్ణరావుగారి వ్యక్తిగతమైన 'ట్రాజెడీ' కాదు. ఆయన ఆమోదించిన 'రేడికల్ హ్యూమనిజం'. మనిషిని ఆదర్శాల ముద్దగా చెయ్యబూనీ, "హ్యూమన్ కామెడీ" కావలసినదాన్నే అసాధ్యప్రమాణాలద్వారా హ్యూమన్ ట్రాజెడీగా మార్చిందనాలి.

ఉత్తమకావ్యం "వేదనాసంవిధానంలో మార్పు తెచ్చేది (Psychic values ను మార్చేవి)" అని ముమ్మటుణ్ణి పట్టుకుని తేల్చబూనడం వృథా బుద్ధిశ్రమ. మంచి కావ్యం మనస్సుకు పట్టి ఆలోచనాసరళిని ప్రభావితం చెయ్యవచ్చు. అదొక్కటే ఆ పని చెయ్యలేదు. చేసినా, సమగ్రంగా చెయ్యలేదు. యావత్ సమాజంలోని అత్యున్నత పరిణామం మూలాన చాలా చాలా మార్పుల అంతిమ పర్యవసానంగా ఏర్పడగల బుద్ధిపరిణత కంతటికీ, వట్టి సాహిత్యాన్ని దక్షురాల్ని చెయ్యడం, అంగాంగిసంయోగితను చెబ్బతీయడమే. సంస్కారం మాటలతోనే రాదు. ప్రవక్త వచ్చారు, చెప్పారు, పోయారు. ఇప్పుడు నాయకులు. అప్పుడూ ఇప్పుడూ కళాకారులు. అయినా మానవజాతి నేటికీ నవయవ్వనదశను మీరిపోలేదు. జంతుధర్మాన్ని పూర్తిగా తొలగించుకోలేదు. సహజాతాలను అదుపులోకి తెచ్చుకోలేదు. దానికి సుదీర్ఘమైన చారిత్రక గతిక్రమం అవసరమౌతుంది. పూర్ణాంకానికీ, భిన్నాంకానికీ గల భేదాన్ని గ్రహిస్తే, యీ 'సూక్ష్మంలో మోక్షం' వ్యవహారం కృష్ణరావు గారికి అబ్బివుండేది కాదేమో ?

కళకూ తత్వానికీ మధ్య, రాజకీయానికీ సాహిత్యానికీ మధ్య పాక్షిక దృక్పథానికీ సమగ్ర దృక్పథానికీ మధ్య, అభిమాన దురభిమానాలకూ స్థిమితానికీ మధ్య – భౌతికానికీ ఆధిభౌతికానికీ మధ్య – మనిషికి దేముడికీ మధ్య – నిశ్చితంగా తేల్చుకోలేక, ఈ చెయ్యి యిటూ ఆ చెయ్యి అటూ చాపి, ఎన్నో వైరుధ్యాలతో చేసిన కృష్ణరావు రచన "కావ్యజగత్తు", తప్పటడుగే కాదు, తప్పు అడుగుగా పర్యవసానంలో తేలింది.



ఎడమ నుంచి కుడికి హితశ్రీ, జి. వి. కె. జనస్వామి, సుబ్రహ్మణ్యశాస్త్రి, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

# G. V. KRISHNA RAO

By S. R. M. KONDAMUDI

"Man has become a mechanical doll. He is now a creature of circumstances. Animalism possesses him. This situation is unbearable, it ought to change. I am against all kinds of shackles and compartmentalisation", says Dr. G. V. Krishna Rao, the famous author of "Keelu Bommalu", unequivocally. He sees with a penetrating eye and writes with a chiselled pen. He has to his credit four novels, a volume of playlets, a collection of short stories, translations of Plato and Kant in Telugu and a critical survey of Nagarjuna's Vigrahavyavarthamu.

Born in November 1914 at Kuchipudi in an argicultural family, Krishna Rao studied for graduation at Andhra Christian College, Guntur and took his M.A. degree from the Banaras Hindu University. Madras University awarded him Ph. D. for his monumental work on Kalapoornodayam, an epic-poem by Pingali Surana. His first book was published when he was still in his teens. Journalism was his first love and for about a decade he experimented in all kinds of writing–crassical, romantic, progressive exhibitionstic, political and philosophical. He settled down as lecturer in Telugu at the V. S. R. College Tenali, but resigned in protest and joined All India Radio later as producer. For a brief period he also worked as the principal of the Sanskrit College, Since his retiremeut he mostly stays at home compelled by a physical ailment, though his mind is as fertile as ever.

"I have not given my best as yet. Experience mellows me. scholarship perfects me and classicism leads me on; I have now a

ucid picture of our past and a clear picture of our future. The present bridges the gulf of seperation. I wish to portray this continuity", he commented during the interview.

"Keelu Bommalu," his maiden work, is essentially a little world. It traces the life of its rustic charecters through a varied secquence of incidents and moods. It became one of the outstanding novels because of its unity of effect. It should be remembered that Krishna Rao was a journalist for some time and hence his critical opinions about our rural settings, are scattered all over fictional writing. Although, because of his professional instability he had no time to formulate a systametic theory of the unity of effect, his opinions are sufficiently articulated. His statement that unity of effect is necessary in a novel' constituted and innovation.

He successfully likened a work of art to life. The concept of unity of effect receive its final crystalization in his incomplete last novel "Papi Kondalu",. It portrays the orthodox middle class life and society. "Keelu Bommalu", depicts the colossal weight of old tradition, high bound casteism and the lie-hard dogma of religious conformism. 'Papi Kondalu", portrays Telugu life wite the ferocious poverty squalor and backwardness, sin and ignorance, snobbery and prejudice, urging for a larger outlook more tolerance and more sacrifice. The Telugu life that he depicts in his novels is that of peasants, the high castes and the suppressed ones. He is Preemchand and Mulk Raj Anand combined into one in Telugu fiction.

"Chitra Radham" is an expression for the high moral purpose of a naturalist. In 'Raga Rekhalu' he suggests that natural truth is better than didactisism. He sets the question, but does not solve it. His essential charecteristic seems to be an all-embracing compassion, He constantly endeavours to express and rationalise his personal convictions in the media of artistic delineation of charecter and incident. He is curious, humble, rationalistic, humane and true to life and it is natural therefore to say, "When cones such another?"



కె. వెంకట్రామరెడ్డి, జి. సత్యనారాయణగార్లతో, పి. నారె, జి. వి. కె.



తుమ్మల వెంకట్రామయ్యతో జి. వి. కె.

# కృష్ణరావుగారి కథాసాహిత్యం

— డా॥ వి. వి. యల్. నరసింహారావు

[ డా॥ నరసింహారావుగారు 1930 లో జన్మించారు. కవి, పండితులు విమర్శకులు. వీరు ఎన్నో కథలు, నాటికలు, నవలలు, వ్రాశారు. ఆనందభిక్షువు (పద్యకావ్యం), వసుచరిత్ర తత్త్వం (విమర్శ), రాగబంధాలు (నవల) వీరి రచనలలో కొన్ని.

"నన్నయ కవిత్వము - అక్షర రమ్యత" అనే అంశంపై పరిశోధన సలిపి డాక్టరేట్ పట్టాన్ని ఆర్జించారు.

ప్రస్తుతం వీరు మాచెర్ల గవర్నమెంట్ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా ఉంటున్నారు. ]

* * * * *

సాహితీజగత్తులో తెనుగునాట పదికాలాలపాటు నిలిచివుండగల మనోహరమైన రచనలు చేసిన మహామేధావుల్లో డాక్టర్ జి.వి. కృష్ణరావుగారు గణనీయులు. శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగార్ల వంటి ఒకరిద్దరు తప్ప అంతటి ప్రజ్ఞాశాలులు అరుదుగా గాని కనిపించరు. శ్రీ వేలూరి, శ్రీ విశ్వనాథ వంటి వారిలో వైదిక వాఙ్మయప్రజ్ఞ ఒకపాలు అధికంగా కనిపిస్తే శ్రీ కృష్ణరావుగారిలో తత్త్వశాస్త్ర ప్రజ్ఞ మరొకపాలు అధికంగా కనిపించవచ్చు. తత్త్వశాస్త్రమంటే కేవలం ప్రాచ్యదర్శనాలే కాక ప్రతీచీదర్శనాలు కూడా అవగాహన చేసుకొని వాటిని తెలుగువారికి పరిచయం చెయ్యటానికి కృషిచేసిన ప్రజ్ఞ కృష్ణరావుగారిది.

సాహిత్యప్రక్రియల్లో కూడా ఏ ఒకటో రెండో స్పృశించి అంతలో తృప్తిపడి పూరుకోకుండా అనేక ప్రక్రియలు చేపట్టి వాటిలో అమూల్యమైన రచనలు సాగించినవారు ఆధునికాంధ్ర రచయితల్లో పలువురు కనిపించరు. ఉన్న కొద్దిమందిలో కృష్ణరావుగారు తమ స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు. శివరాత్రి, యుగసంధ్య వంటి పద్యకావ్యాలు; ప్రతిమ, బొమ్మ ఏడ్చింది వంటి నాటకాలు; సునీథ, భిక్షాపాత్ర వంటి నాటికలు; కావ్యజగత్తు, కళాపూర్ణోదయ పరిశోధన (Studies of Kalapurnodaya) వంటి సాహిత్య విమర్శలు; కీలుబొమ్మలు, రాగరేఖలు వంటి నవలలు; ప్లేటో ఆదర్శరాజ్యం, విగ్రహవ్యావర్తని వంటి తత్త్వశాస్త్ర రచనలు; చైత్రరథం, ఉదబిందువులు వంటి కథాసంపుటులు (ఇందులో కథలు కాని రచనలూ ఉన్నాయి). ఆయన బహుముఖప్రజ్ఞకు ప్రబల నిదర్శనాలు.

అనేక ప్రక్రియల్లో రచనలు సాగించటం వల్ల ఒకోసారి ఒక ఇబ్బందికూడా లేకపోలేదు. అన్ని ప్రక్రియల్లోనూ రచయిత ప్రజ్ఞ సమంగా భాసించినా ఆ యా కాలాల్లో ఆ యా ప్రక్రియల కుండే ప్రశస్తినిబట్టి రచయితకు కొన్నింటిలోనే బహుళప్రశస్తి రావటం కద్దు. కావ్యరచన, కావ్యవిమర్శ, తత్త్వశాస్త్ర రచన మొదలైన వాటిలో కృష్ణరావుగారికి వచ్చినంత ప్రశస్తి కథారచనకు కూడా వచ్చిందా అన్నది ఒక ప్రశ్న. దీనికి కారణం ఆయన కథారచన చేసేనాటికి దేశంలో కథాసాహిత్యం మీద నేడున్నంత మోజు లేకపోవడం కావచ్చు. అంతేకాని ఆయన కథల్లో సమగ్రత్వం లేకపోవటం కాని, రచనాశిల్పం కొరవడటంగాని కానేకాదు.

ముద్రితమై లభ్యమైన కృష్ణరావుగారి గ్రంథాల్లో చైత్రరథంలో ఏడు కథలు, 'ఉదబిందువు'ల్లో అయిదు కథలు ఉన్నాయి. 'చైత్రరథం' మూడో ముద్రణం ఫిబ్రవరి 1963లో జరిగింది. 'ఉదబిందువులు' ఒకే ముద్రణం మార్చి 1964 లో జరిగింది.

చైత్రరథంలో ఉన్న కథలు — (1) కర్మభూమి (2) అనిర్వచనీయఖ్యాతి (3) రామరాజ్యం (4) సేచ్ఛాప్రణయ (5) బొమ్మరిల్లు (6) అమాయకుడు (7) షష్టిపూర్తి.

ఉదబిందువుల్లో ఉన్నవి — (1) ఉదబిందువులు (2) చేసుకున్న కర్మ (3) మాయ (4) వేదాంతి (5) అతడంటే — అనే కథలు.

వ్యవహారసౌకర్యం కోసం వీటన్నింటినీ కథలని చెప్పినా కథల్లోని సంఘటనల విస్తృతిని బట్టీ, కాలపరిమితిని బట్టీ వీటిలో కొన్ని కథానికలుగానూ, కొన్ని కథలుగానూ

కనిపిస్తాయి. 'చైత్రరథం' తృతీయ ముద్రణంలో ప్రచురించబడిన 'జఘనసుందరి' అనే రచన ఈ దృష్టితో పెద్ద కథగానో నవలికగానో పేర్కొనదగినది.

'చైత్రరథం'లోని కథల్లో చాలావరకు 1939–42 నడిమి కాలంలో వ్రాయబడినవే. ఈ కారణంచేత భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందున్న రాజకీయాదివాతావరణం వీటిలో పతిబింబించే అవకాశం కలిగింది.

'ఉదబిందువు'ల్లోని 'ఉదబిందువు'లనే కథ తప్ప తక్కినవన్నీ దాదాపు 1947 లో వ్రాయబడినవే. ఉదబిందువులనే కథ మాత్రం 1963 లో వ్రాయబడింది.

ఈ దృష్టితో స్థూలంగా చూస్తే కృష్ణరావుగారి కాథాసాహిత్య రచన అంతా దాదాపు నేటికి పావుశతాబ్దానికి పూర్వం జరిగిందని స్పష్టం. నాటికీ, నేటికీ దేశకాలాది పరిస్థితుల్లో వచ్చిన మార్పులు దృష్టిలో వుంచుకొని కృష్ణరావుగారి కథల్ని పరిశీలించటం కంటే నాటి పరిస్థితుల్లో స్వీకరించబడిన ఆ కథావస్తువుల్ని చిత్రించటంలో రచయిత పాటించిన కళామర్యాదనీ, సాధించిన సాహిత్యసిద్ధినీ పరిశీలించటం ఎక్కువ ప్రయోజనకరం.

నేటికాలపు సాహిత్యపు విలువల్నీ, కళామర్యాదల్నీ దృష్టిలో వుంచుకొని కథారచనలను విమర్శించేవారు. కథారచనా ప్రక్రియ కేవలం వైదేశిక మైనదనీ, నేటి మన నాగరక జీవితమంతా పాశ్చాత్యులు ప్రసాదించిన భిక్ష అయినట్లే చిన్నకథ, నవల వంటి ప్రక్రియలు కూడా వారి భిక్షయే అని సిద్ధాంతీకరించటమూ కద్దు; కావచ్చు, కాని కథారచనా ప్రక్రియ వైదేశిక మని అంటే అదిమాత్రం అనాలోచితమైన వాదమే అవుతుంది. ఈ విషయంలో కృష్ణరావుగారికి కూడా నిశ్చితమైన అభిప్రాయా లున్నాయి.

వాస్తవానికి 'బృహత్కథ' వంటి రచనలు భారతీయులకు కోకొల్లలుగా వున్నాయి. ఈ కథల్లో చిన్నవీ ఉన్నాయి. పెద్దవీ ఉన్నాయి. కనుక కథారచనకు బీజం పరులనుంచీ ఎరువు తెచ్చుకోవలసిన దుఃస్థితి మనకు లేదు. కాకపోతే దోహదచిత్రణాల్లో పాశ్చాత్యరచనల ప్రభావం మనమీద ప్రసరిస్తే అది కళామర్యాదలో ఒక విశేషంగా గుర్తించవలసిందే కాని ప్రక్రియ సర్వం వైదేశిక మని భ్రాంతి పడనక్కర్లేదు. కృష్ణరావుగారి 'జఘనసుంద'రే వున్నది. దీనికి బీజం 'బృహత్కథ'; దోహదం 'థామస్‌మాన్'వల్ల; చిత్రణ దృక్పథాలు మాత్రం రచయితవి. ఈమాట రచయితే స్పష్టం చేసివున్నారు. ఇట్లా స్పష్టీకరించటం ఆయన నిజాయితీకి, కళాభిజ్ఞతకూ, కృతజ్ఞతా శీలానికీ నిదర్శనం.

'జఘనసుందరి' నవలికాస్థాయి కెదిగిన పెద్ద కథ అన్నాను. తక్కినవాటిలో కొన్ని కథలూ, చిన్నకథలు కూడా ఉన్నాయి. ఈ మాట కేవలం పుటలసంఖ్యనుబట్టి చెప్పదగింది కాదు. పుటలసంఖ్యయే చూస్తే 'జఘనసుందరి' సుమారు నూరు పుటల వరకూ పెరిగింది. తక్కినవన్నీ పాతిక పుటల లోపువే. పుట లెక్కవైతే పెద్దకథ అనీ పుటలు తక్కువై చిన్నకథ అనీ అనటం తెలివైన మాట కాదు. వంద పుటలుండి ఒక కథ చిన్నకథ కావచ్చు. నాలుగు పుటలే వుండి ఒక కథ పెద్ద కథ కావచ్చు.

చిన్నకథల్లో చిత్రించబడే పాత్రల్ని మనం పరిమిత సమయంలో పరిమిత సంఘటనల్లో మాత్రమే చూడగలం. పాత్రయొక్క బృహజ్జీవితాన్ని కాకుండా, జీవితాన్ని కథలో చిత్రించ దలుచుకున్న ఒకేఒక కోణంనుంచీ చూస్తాం. మన మనస్సుమీద రచయిత ఆ ఒక్క దృక్పథాన్ని మాత్రమే ముద్రించటానికి ప్రయత్నిస్తున్నా డన్నమాట. ఈ దృష్టితో చూచినపుడే Anna Karenina చిత్రించిన Levin ఆధ్యాత్మిక జీవితచరిత్ర వంటివి చిన్నకథ పరిధిలో ఒదగనివై పోతున్నవి. కాని Mauppassant యొక్క అద్భుత రచనల్లో ఒకటైన 'La Parure' దీర్ఘకాలంలో జరిగిన విషాదసంఘటల్ని చిత్రించేదైనా ఏకైక భావచిత్రణ (single motive) లక్ష్యంగా సాగిపోవటం వల్ల దాన్ని చిన్నకథ అని అనకుండా ఉండలేము. కనుక చిన్నకథలో కథాగమనం, కథాప్రయోజనం పఠిత మనస్సు మీద ఏకైక భావచిత్రణ చేయగలిగేదిగా వుండటం సముచితం. అంతకంటే దాని లక్ష్యం విస్తృతమైనకొద్దీ అది పెద్దకథో, నవలో అయికూర్చునే ప్రమాద ముంటుంది. కథలోని వర్ణనలు, సంభాషణలు పాత్రల కదలికలు అన్నీ ఉద్దిష్టమైన ఏకైకభావచిత్రణకు ఉన్ముఖంగా జరిగిపోవటంలో చిన్నకథ కృతకృత్యమౌతుంది. రచయిత కథకు పెట్టే శీర్షికలోనే ఆ ఏకైకభావ మేమిటో సూచితమౌతూ ఉంటుంది (రచయిత సిద్ధహస్తుడైనప్పుడు).

కృష్ణరావుగారి 'ఉదబిందువులు' కథ వున్నది. మగడు పోయినతరువాత సుభద్రమ్మ తన పెద్దకొడుకు రామయ్యనూ చిన్నకొడుకు లక్ష్మణరావునూ ఎంతో బాధ్యతతో, ప్రేమతో, నేర్పుతో చూస్తూ వచ్చింది. చదువులేని పెద్దకొడుకు ఉమ్మడి పొలం పండించి బస్తీలో ఉద్యోగంచేసే తమ్ముడికి అతని ఆదాయం వాటా ముద్రశుద్ధిగా పంపిస్తున్నాడు. అన్న చిత్తశుద్ధిని గుర్తించని తమ్ముడు, అన్నకు ఒక పొరపాటు మాట వ్రాశాడు. దానితో అన్న మనసు శాశ్వతంగా విరిగిపోయింది. ఈ యిద్దరి కొడుకులమధ్యా నలిగి సుభద్రమ్మ ఎన్నో బాధలు పడవలసివచ్చింది. చివరకు చరమదశలో నెత్తిన ఇన్ని నీళ్ళు — (అవే ఉద

బిందువులు) — చల్లే దిక్కు కూడా లేకుండా కన్ను ముయ్యవలసి వస్తుందేమో అన్నట్టు రచయిత కథాచిత్రణ చేశారు. కథ దీర్ఘకాలంలో జరిగిందే అయినా ఈ 'ఉదబిందువు'లనే భావం ధ్వనిగా భాసిస్తుంది. కాని కథలో సుభద్రమ్మ కొడుకులు — కోడళ్ళు — మనమళ్ళు మొదలైన పాత్రలమీద వెలుగులు చిమ్మే వివిధ సంఘటనల సంఖ్యాబలంవల్ల భార్యాభర్తల ఉద్యోగాలకోసం బస్తీల కెగబడి పల్లెలోని పొలాలు వదలిపెట్టటంవల్ల, వచ్చే చిక్కులు మొదలైన ఇతర సమస్యల చిత్రణవల్ల — 'ఉదబిందువు' కథానికాపరిధి దాటి కథాస్థాయి కెపెగిపోయింది.

కృష్ణరావుగారి కథల్లో తెనుగుదేశపు పల్లెపట్టుల్లోని కర్షకజీవితాన్ని చిత్రించేవి మూడు నాలుగున్నాయి. వీటిలో 'రామరాజ్యం', 'చేసుకున్న కర్మ' అనేవి ఒకదాని ప్రక్కన ఒకటి వుంచి చూడవలసినవి. రెంటిలోనూ 'అసాములు — జీతగాళ్ళ వ్యవస్థ' చిత్రించబడింది. రెండు కథల్లోని జీతగాళ్ళ పేరూ రాఘవులే. అయితే, 'రామరాజ్యం'లో బుర్రయ్య దగ్గర పనిచేసే చిన్న రాఘవులుకూ చేసుకున్న కర్మలో వెంకయ్య దగ్గర పనిచేసే పడుచు రాఘవులకూ వయస్సుల్లో తేడా వున్నా తమ ఆసాముల పట్ల గల భక్తితాత్పర్యాల్లోను, ప్రవృత్తుల్లోనూ భేదం లేదు. ఉన్న భేదమంతా వారి అసాముల్లోనే ఉన్నది. చిట్టిరాఘవులు బుర్రయ్య పొలంలో చిన్న పేడకడి కూడా ఆసామి అనుమతి లేకుండా ఇతరుల్ని తాకనిచ్చే స్వభావం కలవాడు కాకపోయినా ఆతనికి అసామి శాపనార్థాలు పశువులకన్న హీనంగా అనుభవించాల్సి వచ్చింది. అటువంటి ఆసాములున్న రాజ్యం 'రామరాజ్య' మని వ్యంగ్యం. చిట్టిరాఘవులు అభిమానానికి పాత్రురాలైన రత్తి మెరుపుతీగలాంటి పిల్ల — పేడ పోగుచేసుకునే పిల్ల. అది తనకు చేసిన సాయానికి కృతజ్ఞతగా దాని నెత్తిన పేడ తట్టపెట్టి పంపినందుక్కూడా ఆసామివల్ల రాఘవులకు చావుదెబ్బలు తప్పలేదు. రామరాజ్య వైభవంలో ఇదీ ఒక భాగమే.

వెంకయ్య దగ్గర పనిచేసే పడుచు రాఘవులు బాధ వేరు. ఆసామి - జీతగాడు ఇద్దరూ మంచివాళ్ళే. వాళ్ళు చేసుకున్న కర్మే చెడ్డది. అప్పులపాలై చితికిపోయిన ఆసామి, అతణ్ణి వదలిపెట్టలేని జీతగాడూ ఇద్దరూ దయానీయులే. ఆసామి మంచివాడై కూడా జీతగాడి బ్రతుకు బాగుపడ్డది లేదు.

'రామరాజ్యం'లో కంటే 'చేసుకున్న కర్మ'లో కాలం మార్పువల్ల రైతుకుటుంబాల్లో వచ్చిన ఆర్థిక దుఃస్థితి — దానివల్ల వారి నాశ్రయించుకుని బ్రతికే జీతగాళ్ళ దుఃస్థితి హృద

యాన్ని కదిలించే రీతిగా చిత్రించబడినాయి.

ప్రాసంగికంగా నాటి కాంగ్రెసు వాదుల అవకాశవాదం కూడా విమర్శించబడింది. 'రామరాజ్యం'లో రాఘవులు పశువుల్ని కట్టుగొయ్యలుంచి తప్పిస్తే కొన్ని చావిట్లోకి, కొన్ని గడ్డిమోపు దగ్గరకూ చేరుకున్నాయి. "అచ్చగా అవి కాంగ్రెసు మచ్చే. జైళ్ళలోనుంచి నెడితే పదవుల్లోకి, పదవుల్లోనుంచి నెడితే జైళ్ళలోకి తిరుగుతున్నట్లే పశువులు కూడా ప్రారంభించా" యట. ఉపమానపరికరాల్లో ఒదిగించి రచయిత నాటి కాంగ్రెసుపెద్దల్లో అవకాశవాదుల మీద విసిరిన విసుర్లివి.

నాడు గాంధీగారి పిలుపులందుకొని జైళ్ళకు పోయినవాళ్ళలో కొందరు అభాగినులు కూడా ఉన్నారు. వారిలో సాంఘిక దురన్యాయాలకు గురై, గతి మాలి, కాంగ్రెసు ఉద్యమంలో దూకినవాళ్ళూ వున్నారు. పెళ్ళినాటి కట్నం ముట్టలేదని మగడు వదలిపెట్టిన దురదృష్టవంతురాలు ఉష. కన్నవాళ్ళకు కూడా చెప్పకుండా కాంగ్రెసులో చేరి జైలుకు వెళ్ళి విడుదలై పుట్టింటికి తిరిగివచ్చింది. జైలుకు వెళ్ళి వచ్చినందుకు ఉష — తనకు ఘన సన్మానం జరుగుతుందని మురిసిపోతూ వచ్చింది. సమ్మానం ఘనంగానే జరిగింది. సమ్మానం చేసినవాళ్ళు కూడా ఎవరో కాదు. కని పెంచినవాళ్లే. తండ్రి చెడదిట్టాడు: అన్న మక్కెలు విరగబొడిచి కట్టెను ఊరిప్రక్క కాలవలో వదిలేశాడు. పాపం! ఉష జైలుకు వెళ్ళివచ్చినందుకు తనకు "అనిర్వచనీయ ఖ్యాతి" వస్తుందనుకుంటే జరిగిన సన్మానమిది. ఈ కథ పేరు "అనిర్వచనీయ ఖ్యాతి".

కథలో ప్రసక్తాను ప్రసక్తంగా పెట్టుబడివర్గాన్ని ప్రభుత్వోద్యోగులు ఎట్లా లాలిస్తున్నారో కూడా సూచించబడింది. ఉష తెనాలి ప్లాట్‌ఫారం మీద దిగింది. "ప్లాట్‌ఫారం మీద నల్లడోములతో అర్థనిమీలితాలైయున్న విద్యుద్దీపాలు పెట్టుబడి వర్గాన్ని ప్రభుత్వ ఉద్యోగులు లాలిస్తున్నట్లుగా చీకటిని లాలిస్తున్నాయి" అని వర్ణన. ఇది వర్ణన లాగే వున్నా నిగూఢంగా నాటి సాంఘికవ్యవస్థకు కూడా అద్దంపట్టి చూపే అలంకారికశైలి.

కథాకాలపరిమితి దృష్ట్యా, సంఘటనదృష్ట్యా, ఏకైక భావచిత్రణ దృష్ట్యా ఇది ఇది అచ్చమైన కథానిక. ఉష జైలునుంచి ఇంటికి వచ్చిన రాత్రిలోనే ఆమె జీవితం ముగిసిపోవటం కూడా జరుగుతుంది.

ఈ దృష్టితో చూస్తే 'స్వేచ్ఛాప్రణయి' 'బొమ్మరిల్లు' అనేవి కూడా అచ్చపు కథానికలే.

'స్వేచ్ఛాప్రణయి' 'Free Love So.ieties' మీద చంద్రకోలపెట్టి చరిచి కొట్టే రచన. సంఘంలో ఎవడిభార్య అయినా, ఎవతె భర్తతో నైనా స్వేచ్ఛగా ప్రణయం సాగించవచ్చు నని వాదించేవాడు తీరా తన భార్య ఎవడితోనైనా కాస్తంత చనువుగా వుంటే ఎట్లా 'రియాక్ట్' అవుతాడో గడుసుగా సూచిస్తుందీ కథానిక.

'బొమ్మరిల్లు' కథానిక ప్రత్యేకమైన సంభాషణ శిల్పంతో సాగిపోతుంది. కథానికంతా తల్లీకొడుకుల మధ్య జరిగిన సంభాషణే. రచయిత కథన దృష్టితో వ్రాసే సంధాన వాక్యా లుండవన్నమాట. చిన్నారి బాలుడు తల్లితో మాట్లాడే మాటల్లో-ఆర్థికవ్యవస్థలోనూ, సాంఘిక వ్యవస్థలోనూ ఉండే అసమానతలు తొలగాలనే అమాయకమైన ఆసక్తి సహజంగా వెలువడుతుంది. బళ్లో చదువుకునే పిల్లల్లో ఒకరికి పెద్ద పలక ఇంకొకరికి చిన్న పలక ఉండనక్కర్లేదన్నట్లే సమాజంలో కూడా కలిమిలేముల తారతమ్యం ఉండనవసరం లేదనే సామ్యవాదం ఆ చిన్నారిబాలుడి నోట తర్కసహంగా వెలువడుతుంటే ఆ తల్లి ఆశ్చర్యానికి మేర లేదు. అసలు "డబ్బు అనేదాన్ని లేకుండా చేస్తే అంతా పని చెయ్యాలిగా!' అని వాదంటుంటే "ఆఁహాఁ" అని తల్లి బుగ్గలు నొక్కుకుంటున్నట్లు కనిపిస్తుంది. సామ్యవాద సుందరమైన నవసమాజపు బంగారు ఊహలే బాలకుడు కట్టుకొన్న 'బొమ్మరిల్లు'. కథ పేరు ఈ విధంగా సార్థకం.

కృష్ణరావుగారి కథ లన్నిటిలోనూ కళాధర్మాలు సడలని సాంఘిక ప్రయోజనాలు లీలగా స్ఫురిస్తాయి. ఈ స్ఫూర్తివల్లనే అవి మేలి రచనలుగా భాసిస్తాయి. "అమాయకు" డనే కథ ఉన్నది. అమాయకుడులా కనిపించే మాధవరావు తండ్రి చనిపోగా మేనమామ చీనయ్య పెంపులో పెరగవలసి వచ్చింది. చీనయ్యకు-మేనల్లుణ్ణి లాలించినట్లే లాలించి అతని ఆస్తి కాస్తా హరించాలనే దుర్బుద్ధి పుట్టింది. మేనల్లుడు క్రమంగా లౌక్యం తెలుసుకొని మామకు చక్కగా బుద్ధి చెప్పి, తాను అమాయకుడు కాడని నిరూపించుకున్నాడు. రక్తబాంధవం మరచి అయినవాళ్ళకు కూడా అపకారం తలపెట్టే వంచకుల గుట్టుమట్లు బైటపెట్టే కథ యిది.

ఉదరనిమిత్తం బహూకృత వేషం. ఇటువంటి వేషధారుల్లో బూటకపు వైద్యులు (Quacks) కూడా కొందరున్నారు. కల్లబొల్లి కబుర్లతో కూరగాయి వైద్యంతో అమాయకులైన ఆడపిల్లల జీవితాలు బలిగొనే ఒక డాక్టరు వృత్తిలోని కీలకం ఇట్టే పసిపట్టిన మేధావి గోపాల్. ఒక అమ్మాయి కళ్ళకేదో జబ్బు చేస్తే అసలు రోగం తెలుసుకోక ఏ నిషాలోనో

వుండి ఆమె రెండుకళ్లూ చేతులారా పోగొట్టి లోకాపవాద భీతితో ఆమెను పెళ్ళి చేసికొని ఔదార్యం ప్రదర్శించిన డాక్టరు గుట్టు తెలిసికొన్నవాడు గోపాల్. అందుకే ''అతడంటే'' నాకు అంత గౌరవం. కథ పేరు ''అతడంటే'' అని పెట్టటం కూడా రచయిత గోపాల్ ప్రతిభను సూచించటానికే.

ఈ కథలో రచయిత తానూ ఒక పాత్రగా వుండి కథను ఉత్తమ పురుష ఏకవచనంలో చెప్పటం జరిగింది. ఇలా చెప్పటంలో ఒక ప్రత్యేకత లేకపోలేదు. రచయిత కథలో తానొక పాత్ర కాకుండా ప్రథమ పురుషలో చెప్పే కథలో కంటే ఇందులో వాస్తవికతా స్ఫూర్తి కలిగించటానికి సౌకర్యం ఎక్కువ. ప్రథమ పురుషలో చెప్పే కథలో రచయిత ఒక్కోసారి నేనున్నానని హఠాత్తుగా ముందుకువచ్చి ఉత్తమ పురుషలో ప్రారంభించి పాఠకుణ్ణి హెచ్చరించటమూ కద్దు. దీనివల్ల కొంత రసభంగమయ్యే ప్రమాదంకూడా లేకపోలేదు. ఈ ప్రమాదం క్రిందటి తరంలో వంగభాషనుండి అనూదితమైన కొన్ని తెనుగు నవలల్లోనూ కనిపిస్తుంది. ''రామరాజ్యం'' కథలో అంతవరకూ చాటునవున్న రచయిత కథాంతంలో పాఠకుల్ని హెచ్చరించి ''మీ కెక్కడన్నా రాఘవులు కనిపిస్తే ఈ ఒక్క ముక్క మాత్రం అతని చెవిని వేయండి'' అని చెప్పడం జరిగింది. ఇటువంటి హెచ్చరిక 'జఘనసుందరి' లోనూ కనిపిస్తుంది. ఈనాటి కది కొంత వింతగా వుండవచ్చునేమో కాని కృష్ణరావుగారు ఆ రచనలు చేస్తున్ననాటి కది వింత కాకపోవచ్చు.

కథంతా పూర్తిగా ఉత్తమ పురుషలో వుంటే ఎంతో వాస్తవికంగా వుంటుంది. 'మాయ' అనే కథ అట్లాగే వుంటుంది.

ఈ కథలో 'మాయ' అంటే శంకరుల అద్వైతంలోని మాయ కాదు. వేదాంతిలా కనిపించే సరసయ్య అనే వడ్డీవ్యాపారి మాటల్లోనూ, చేతల్లోనూ వున్న మాయ. ''ఆయన డబ్బు మహత్యమేమో కాని కొంపలు నిలువునా కూలిపోతున్నా అప్పులవాళ్లు మాత్రం అణాలు పైసలతో సహా కట్టిపోయేవాళ్లు. బాకీదార్లను ఆయన ఎన్నడూ ఒత్తిడి పెట్టినట్లుకూడా కనిపించడు; కొడుక్కి విద్యారణ్యులని పేరుపెట్టుకున్న పెద్దమనిషి. విద్యారణ్యులకు కొడుకు పుట్టాడు; తొమ్మిది నెలలు వచ్చేసరికి గుమ్మటంలా ఎదిగి వచ్చాడు. ఆ పసివాడు పారుకాడుతూ పోయి ముప్పాతిక గజం ఎత్తున గట్టు గల బావిలో పడి చచ్చిపోయాడని ప్రతీతి. పారాడే పసివాడు ముప్పాతిక ఎత్తున్న బొడ్డుబావిలో పడటం 'మాయ' అంటాడు నరిసయ్య. బంగారు మొలతాడు, పులిగోరు, చేతి మురుగులు అట్లాగే వున్నాయి కనుక దొంగలు చేసిన

పని అనటానికి వీలులేదు. మరి నరసయ్యవంటి మహాజ్ఞానికి శత్రువు లెవరుంటారు? పోనీ, తన వడ్డీ వ్యాపారపు మహత్యం వల్ల నిలువునా హతమార్చిన ఏ బాకీదారుని పగ వల్లనో పసి వాడు బావిలో పడి వుంటాడా ? ఆ మాట నరసయ్య బయటకు ఒప్పుకోడు. తన కటిక కసాయి వడ్డీవ్యాపారానికి ముత్యంవంటి మనమడు బలి అయిపోయినా ఏమీ జరగనట్లు - ఆ మర్నాడే అత్త చచ్చి ఆపదలో వున్న ఒక బాకీదారుడి దగ్గర అత్యవసరంగా అణాలు పైసలు వసూలు చేశాడు నరసయ్య. మిన్ను విరిగి మీదపడ్డా నరసయ్యలాంటి వడ్డీవ్యాపారుల ఘనప్రవృత్తిలో వున్న అనిర్వచనీయమైన 'మాయ' లక్షణం అంతే ! ఇటువంటి వాళ్ళ కంటే కాబూలీవాలాలు కొన్ని వేలరెట్లు మంచివాళ్ళ కారా ?

ఈ నరసయ్య లాంటివాడే మరో 'వేదాంతి' వున్నాడు. ఆయన పేరు వెంకన్న. వేదాంతి వెంకన్నగారు కొడుకు సుబ్బరాయలకు పిలక పెట్టించి ఇంగ్లీషు చదువుల జోలికి పోనియ్యక పదిలంగా శాస్త్రిలవారి దగ్గరే పంచకావ్యాలు ప్రారంభింపజేశాడు. దగ్గు జ్వరంతో చిక్కి శల్యమైపోతున్న భార్యకు ఆచార్యులవారి మాత్రలు తప్ప కొత్త డాక్టరు దగ్గర గట్టివైద్యం చేయించాలన్న బుద్ధి వెంకన్న గారికి పుట్టలేదు. కొడుకు ఆ ప్రస్తావన తెచ్చి తల్లికి గట్టివైద్య నడిపించా లన్నప్పుడుకూడా తండ్రి "ఒరే సుబ్బులూ, డాక్టర్లు దేవుళ్ళటరా! ఎవరి కర్మ ఎవరు మారుస్తారు? అసలు పూర్వసంచితం అనేది ఒకటే ఉంటుందం టావా ?" అని మెట్టవేదాంతం వల్లించాడే కాని కొత్తవైద్యం గూర్చి కొంచెమైనా ఆలోచించనే లేదు. కర్మ బలీయం కావటంవల్లనే కాబోలు భార్య పతిసేవలు వదిలిపెట్టి పోయిందట ! కొన్నాళ్ళకు వెంకన్నగారికే వీపుమీద ఒక గడ్డ తేలి జంగందేవర విభూతివల్ల గాని, పట్టీల వల్ల గాని బాధ నివారణ అవుతుందన్న ఆశ ఉడిగిపోగా అప్పుడు మాత్రం కొత్త డాక్టరుగారి గట్టివైద్యం కావలసి వచ్చింది. తన ప్రాణం దాకా వస్తే కాని వాచా వేదాంతులకు ఇతరుల ప్రాణాల విలువ తెలియదని వ్యంగ్యం.

ఈ జాతి వేదాంతుల్ని గూర్చి, వీళ్ళు చేసే మిథ్యావాదం గూర్చి, వీళ్ళు వల్లించే కర్మ మహిమల్ని గూర్చి రచయితకు వల్లమాలిన ఒళ్ళు మంట. ఈ కర్మభూమిలో వేదాంతులుగా వీళ్ళే చెల్లుబడి అవుతున్నారు. అసలు ఆస్తికులంటే నాస్తికులకు పరిహాసమై పోయింది కూడా వీళ్ళవల్లనే. ఈ పరిహాసదృష్టే "కర్మభూమి" అనే కథలో కొత్తరూపం దాల్చి ఆస్తికనాస్తికులు వింత ఆకారాలతో అవతరించారు.

కర్మభూమికి ప్రతీకగా సాలీళ్ళ బూజు పట్టిన చీకటిగుహ ఒకటి సృష్టించ

బడింది. సాలీళ్ళంటే ఎవరో కాదు. మన కర్మయోగులే! బూజుపట్టిన చీకటి గుహ అంటే? ఆ కర్మయోగుల తపశ్శాల. వారికి వంతపాటపాడే అనుయాయిలో! దోమలు చీమలు మొదలైన అల్పజీవులు. శ్రుతిస్మృతి వాదాలకు వ్యతిరేకంగా రొదచేసే కప్పలు కందిరీగల్లాంటి నాస్తికు లున్నారు. వాళ్ళకు శిక్షాస్మృతిగా తేళ్ళు మండ్రగబ్బల కొండీల వేటు లున్నాయి. "తంతువాయమహర్షికి జై, డౌన్ విత్ ది ఎథీస్ట్స్!" అనుకొంటూ తేళ్లు కొండీలెత్తి పాసిస్టు నమస్కారాలు చేశాయి. కర్మం చాలక ఏ చీమన్నా తపశ్శాల వదలి బైట తిరుగుతున్నట్లు కనిపించిందా తేలురాజు శ్రుతిస్మృతి వాక్యానుసారంగా శిక్షిస్తూ వుండే"దట. కందిరీగల గుంపులు, చూస్తూ వుండగానే కర్మభూమిలో ఈ మూలనుంచీ ఆ మూలకు తిరుగుతూ ఝుంకారాలు ప్రారంభించాయి.

ఆస్తికనాస్తికులకు యుద్ధం వచ్చినట్లే! ఇంకా పిపీలికా విలేఖరిగారి కేబుల్‌తో పనేముంది! .... రచయితకు ఆస్తికులమీద ఎంత కసి వున్నదో ఈ కథ స్పష్టం చేస్తుంది. కసి అంటే బూజుపట్టిన ఆస్తిక్యం మీద కసి! ఈ విధమైన కథలకు "బ్యాగ్రౌండ్" కేవలం వాచావేదాంతుల మెట్ట వేదాంతధోరణులు, వాటిమీద వచ్చిన తిరుగుబాట్లు మాత్రమే కావు. రచయిత దృష్టిలో నాటికి శ్రుతిస్మృతులను గూర్చి ఏర్పడ్డ భావాలు, కర్మయోగుల నమ్మకాల మీద కలిగిన అనుమానాలు కూడా కారణమే ననిపిస్తుంది. 1914 లో జన్మించిన కృష్ణరావుగారు 1933 నాటికే గోపీచంద్‌గారితో కలిసి కవిరాజు రామస్వామిచౌదరిగారి సూతాశ్రమంలో ప్రవేశించటం, వారి హేతువాద ప్రభావం కృష్ణరావుగారి మీద బలంగా ప్రసరించటం కూడా ఇందుకు కారణ మనిపించకపోదు.

కర్మభూమిగా ప్రతిష్ఠనందిన భారతభూమిలో కేవలసామ్యవాదం ఆచరణకు రావటం కష్టమే. ఒకవేళ వచ్చినా అది మార్క్సిజం అవధుల్లో సాంఘిక రాజకీయ సమస్యల్ని పూర్తిగా పరిష్కారం చెయ్యగలగటమూ అనుమానాస్పదమే. జీవితంలో సమగ్రత సాధించటానికి మార్క్సిజం అసమగ్రమౌతోం దన్న భావం యం. యన్. రాయ్ సిద్ధాంతాల వల్ల స్పష్టమైంది.

"సత్యాగ్రహాలతోనే మనం స్వాతంత్ర్యం సాధించా మనుకుంటే అందులో తెల్ల వాడి ఔదార్యం పాలెంత?" అని ప్రశ్నించేవారు నేటికీ లేకపోలేదు. నేటికాలంలో సత్యా గ్రహాల ధోరణి చూస్తే "అవి ఘెరావోలకు ఏరకంగా తీసిపోతున్నాయి?" అనే అనుమానం కూడా కలుగుతుంది. షష్టిపూర్తిఅనే కథలో శేషయ్యకు షష్టిపూర్తయి చావటానికి కావలసిన

కారణాలు బోలెడు కనపడుతున్నా బ్రతుకుమీద తీపి చావక "పోనీ.... సత్యాగ్రంచేసి జైలుకు పోతేనో!" అనే ఊహ కలిగి వెంటనే అతనికి మరో సందేహం కలిగింది. "సత్యాగ్రహం బాగానే ఉంది. కాని రాయ్ చెప్పినట్లు దేశాని కది ప్రయోజనకారి కాదేమో! సత్యాగ్రహఫలితంగా ఫాసిజం వస్తే! మరీ దుర్భరం." అంటాడు శేషయ్య ఈ దుర్భర మైన స్థితి ఏమిటో నేటికాలంలో జరుగుతున్న సత్యాగ్రహాలు, వాటి ఫలితంగా దేశంలో వృద్ధి పొందుతున్న ఫాసిస్టుధోరణులు స్పష్టంచేస్తూనే ఉన్నాయి.

ఈ దృష్టితో కృష్ణరావుగారు ఆనాడు వ్రాసిన కథలు చదివితే అవి తాత్కాలిక మైన ఆవేశంతో ఏ వారపత్రికకో గిలికిపారేసినవి గాక కళామర్యాదకు దూరంగాని సాంఘిక రాజకీయ ప్రయోజనాలు సాధించేవిగా ఉండి, సుదూరం ప్రసరించే వ్యంగ్యవాసనతో భాసిస్తున్నట్లు గోచరిస్తాయి.

కృష్ణరావుగారి కథనశిల్పానికీ, ప్రౌఢభావనకూ, మనస్తత్త్వశాస్త్ర వివేచనకూ గీటురాయిగా నిలిచే పెద్దకథ (నవలిక అన్నా ఇబ్బంది లేదు) "జఘనసుందరి". దీనికి బీజం "బృహత్కథ"లో వున్నా, దోహదం "థామస్‌మాన్" వల్ల జరిగినా రచయిత దృక్పథ చిత్రణాలు మాత్రం పరమరమణీయంగా వున్నాయి.

జఘన సుందరి కథ చాల చిత్రమైంది. అసలు కథ కాపేరు పెట్టటంలోనే వుంది వైచిత్రి. కేవలం భౌతికసౌందర్యం ప్రోవుపడ్డ ఒక సుందరాంగి కథ అది. దైహికమైన భోగవాంఛ ఉత్కటంగా గల ఆ సుందరి కృష్ణశర్మకు ఇల్లాలైంది. అర్భకమైన శర్మదేహం ఆమె ప్రగాఢవాంఛను తీర్చగలిగిందిగా ఆమెకు తోచలేదు. శర్మకు ఆప్తమిత్రుడైన నందు డనే యువకు డున్నాడు. కాయకష్టం చేసి సంతతదృఢగాత్రుడై యున్న ఆ జఘన్యజుడు జఘనసుందరి గుండెలో గూడుకట్టుకున్నాడు. "ఆ నందుని దృఢగాత్రం ఈ కృష్ణశర్మ కుంటే ఎంత బాగుండునో" అనే భావం ఆమె మనస్సులోని సుప్తచేతనలో అంతర్లీనమై యున్నది. శర్మ దాన్ని సూక్ష్మబుద్ధితో పసిగట్టాడు. ఒకనాడు సుందరీనందుల్ని బండిలో ఎక్కించుకొని పోతూ త్రోవలో దిగి శర్మ అయిపు లేకుండా వెళ్ళాడు. అతన్ని అన్వేషిస్తూ నందుడూ వెళ్ళాడు. అతడూ ఎంతకూ తిరిగిరాలేదు. వాళ్ళిద్దర్నీ అన్వేషిస్తూ సుందరి కూడా వెళ్ళింది. పాడుబడ్డ ఒక కాళికాలయంలో వాళ్ళిద్దరి తలలూ తెగిపడి మొండాలకు దూరంగా ఉన్నాయి. నడుమ ఒకేఒక కత్తి వున్నది. ఆ ఘోరం చూడలేక తానూ చావుకు సిద్ధమై సుందరి ఉరిపోసుకోబోయింది. కాళి ప్రత్యక్షమై ఆమెను వారించి

"పదిలంగా మొండాలకు తలలతికించు" అన్నది. సుందరి అతికించింది. నందశర్మలు లేచారు. కాని ఒక ప్రమాదం జరిగింది. నందుని తలకు శర్మ మొండెం, శర్మతలకు నందుని మొండెం కనిపిస్తున్నాయి.

కథారచయిత ఇక్కడ మనతత్త్వశాస్త్రవివేచనకు అవకాశం కలిగిస్తున్నారు. నిజానికి సుందరి కావాలని తలలు మార్చలేదు. ఆమెకు తెలియకుండానే ఆమె సుప్తచేతనలో నిక్షిప్తమై బలీయంగా వున్న లైంగిక వాంఛ ఒకటి ఆమెచేత ఆ చీకటిలో తలలు మార్పించి వుంటుంది. బాగానే వుంది. అంతరాంతరాల్లో తాను కోరుకొంటున్న నందదేహంతో కూడిన శర్మ తనకు సిద్ధించాడు. తలల మార్పిడి సుందరీనందశర్మలు ముగ్గురికే సమ్మతమైనా ఇక్కడ కొన్ని ధర్మసందేహాలు ప్రారంభమైనాయి. ఇంతకూ ఇప్పుడు సుందరి ఎవరిభార్య కావాలి ?.... ఆ దాపులో తపస్సు చేసు కుంటున్న దమనమహర్షి దగ్గరకు ముగ్గురూ సలహా కోసం వెళ్ళారు. అంతటి దమనమహర్షికి జఘనసుందరిని చూచేసరికి కించిత్తు చిత్తం చలించింది ! తదనుగుణంగా దైహికమైన వికారమూ కలిగి వుంటుం దాయనకు. అయితే వివస్త్రుడైయున్న ఆ మహర్షి దట్టంగా ఒంటికి గంగమృత్తిక పట్టించుకొని ఉండటంవల్ల ఆయన అంగవికృతి చూచేవాళ్ళకు కనపడలేదట !.... కర్మభూమి లోని కొందరు మహర్షుల మీద రచయిత మళ్ళీ ఒకవిసురు విసురుతున్నా రన్నమాట ! అదీగాక ఎంతటి ఇంద్రియవిజయం సాధించిన తపస్వికైనా సుందరీసామీప్యం ఎంత ప్రమాదకారియో రచయిత యిక్కడ గడుసుగా సూచిస్తున్నట్లైంది. ఇంతకూ దమనమహర్షి తీర్పు ఏమిటి ? సుందరి ఎవరికి దక్కాలి ? సుందరి, వివాహతంతులో కరగ్రహణం చేసింది శర్మదేహంతో కాని నందదేహంతో కాదే ? మరి ఆమె, శర్మదేహం గలిగి నందశిరస్సు గల వ్యక్తికే భార్య కావాలా ? నందశిరస్సు ఆనందంతో కదలాడింది. కాని అంగాల్లో ఉత్తమాంగ మన్న పేరు శిరస్సుకే దక్కుతున్నది. పైగా ఒక వ్యక్తిని ఫలానా అని పోల్చుకోవటానికి శిరస్సే ఆధారం కాని మొండెం కాదుగదా ! ఈ కారణం వల్ల సుందరి— నందదేహం గలిగి శర్మశిరస్సు గల వ్యక్తికే దక్కవలసి వున్నది. మహర్షి తీర్పు కూడా ఇదే. ఇక్కడ వైదికమైన కరగ్రహణధర్మం దెబ్బతిన్నది. సంతోషంతో శర్మ తలపంకించటం నందుడికి బాధ కలిగించింది. కాని ఏంచేస్తాడు ? ఆ అడవిలోనే ఎక్కడో తలదాచుకున్నాడు. సుందరి శర్మతో కదిలి వచ్చేసింది.

ఇంతతో ఈ కథ ముగిసివుంటే హాయిగా దీన్నొక కథానిక అనవచ్చు. కథా

సంఘటనల కాలపరిమితి కూడా ఒకనాటి కంటే మిగలలేదు. కనుక కాలైక్యం (Unity of time) ఉన్నది. కాని కథ యింతతో ముగియలేదు కొంత చిలవలు పలవలుగా పెరిగింది. పెరగవలసిన ఆవశ్యకం కూడా వున్నది. కనుక కథ పెద్దకథ స్థాయి కెదిగిపోయింది.

అప్పటికే సుందరి గర్భవతి. గర్భంలో కదులుతున్న శిశువు శర్మదేహంవల్ల ఏర్పడ్డదే కదా! కనుక గర్భస్థశిశువు శర్మదేహం గల వ్యక్తికే చెందాలేమో! ఈ భావం కూడా సుందరి మనోగోళంలో సుప్తంగా అణగి వుండవచ్చు.

ఇప్పుడామె తన చిరకాలవాంఛితమైన నందదేహం గల శర్మతో సుఖాలనుభవించ మొదలుపెట్టింది. కాని ఆ సుఖాలు కూడా ఆమె నట్టే కాలం అలరించలేదు. అసలామె మనస్సు అతిచపల మైంది. కాళికాలయంలో దేవి కూడా ఆ అభిప్రాయాన్నే వెల్లడించింది. నీవు "నిజంగా కోతివి" అని దేవి ప్రళయగర్జన చేసింది కదా!

బుద్ధిని బట్టీ, వృత్తిధర్మాన్ని బట్టీ దేహము యొక్క వృద్ధిక్షీణతలు బలాబలాలు, స్థూలసూక్ష్మతలు ఉంటా యనేది మరో విశేషం. శర్మబుద్ధిలోని భావనము బట్టీ, వృత్తి యొక్క లక్షణాన్ని బట్టీ సుదృఢమైన అతని నందదేహం క్రమక్రమంగా సన్నబడి చివరకు చువ్వలా తయారైంది. "మరి నందశిరస్సు గల వర్మదేహానికి అక్కడ ఇప్పుడెటువంటి మార్పు వచ్చి వుంటుందో?—" సుందరిమనస్సులో ఇటువంటు జిజ్ఞాసకు అవకాశ మేర్పడ్డది. అవకాశ మేర్పడటమే కాదు; ఆ చపలచిత్త ఉన్నట్లుండి శర్మ లేని సమయం చూచి, ఇల్లు వదలి, కొడుకుతో సహా నందుడి దగ్గరకు వచ్చేసింది. కొడుకును కూడా తీసుకురావటంలో ఒక విశేషం లేకపోలేదు. ఆ కొడుకు తనయందు శర్మదేహం వల్ల పుట్టినవాడు. అంటే శర్మదేహానికే వాడు ఔరసపుత్త్రుడు. మరి ఆ శర్మదేహ మిప్పుడు నందశిరస్సుతో సంధించబడివున్నది కదా! కనుక "తన కొడుకు నందుడికే దక్కాలి" అన్న భావన ఆమెలో కలిగి వుంటుంది. ఆ దృష్టతోనే ఆమె కొడుకుతో సహా నందుడిదగ్గరకు వచ్చేసింది. ఇది ఇట్లా జరుగుతుందని గ్రహించే శర్మ నేరుగా నందుడున్న తావుకు వచ్చి సుందరీ నందుల్ని చతుకిల్ని చేశాడు. అప్పటి పరిస్థితుల్లో సుందరికి నందశర్మ లిరువురూ భర్తలు కావటం అసంభవం; ఏ ఒక్కరో భర్త కావటం కూడా అంతే అసంభవం కనుక ఆ ముగ్గురికీ మరణమే శరణ్యమైంది. కొడుకును లోకుల దయాభిక్షకు వదలి సుందరి నందశర్మలతో సహగమనం చేసింది. ఆ సహగమనం కూడా ప్రజల సమక్షంలో ఋషుల

సమక్షంలో శాస్త్రోక్తంగా జరిగిందట! అదేమి శాస్త్రమో! ఆ దమనమహర్షి ఇంద్రియదమన శక్తి ఎటువంటిదో ఆ శాస్త్రవిధి కూడా అటువంటిదే కాబోలు! అవి కర్మభూమి ప్రసాదించిన శాస్త్రాలు! వాటి నడులుజరిపే మహర్షులు ఎంతగొప్పవారో!.... కథాంతంలో ఈ అవహేళన ధ్వనిస్తుంది. అంతేకాదు. ప్రజల మౌఢ్యం కూడా అవహేళనకు గురౌతుంది. నందశర్మలతో సహగమనం చేసిన సుందరి దేవతై వెలసిందట! ఆ దేవత కొక ఆలయం! ఆ ఆలయంలో మహోత్సవాలు! కర్మభూమిలో వీటికి కొదు వేముంది ?

వైదికాచారాలు మీద ప్రజల మౌఢ్యం మీద ఈ ఎత్తిపొడుపులు అట్లా వుంచితే కథలో సుందరి మనస్తత్వ చిత్రణలో రచయిత చూపిన అసాధారణ ప్రజ్ఞ పతితను మన స్తత్వ శాస్త్రవివేచనకు పురికొల్పుతుంది. అసలు సుందరికి తొలుదొల్త నందునిమీద ఆసక్తి కలగటానికి ఒక హేతువును సూచించారు రచయిత. పెండ్లి కాకముందు ఒక రోజున సుందరి వ్రతం చేస్తూ ఉయ్యాల ఊగవలసివస్తే ఆకాశాన్ని తన్నేటంత ఎత్తుకి ఆమెను ఇనుపదుక్కల్లాంటి తన చేతుల్తో బలమైన ఊపులు వేసినవాడు నందుడే. ఆ ఊపులకు భయపడి సుందరి కసితో అతని ముక్కు పగిలేటట్లు కాలితో తన్నింది. అతని ముక్కు నుండి బొటబొటా రక్తం కారుతుంటే ఆమెకు అతనిమీద జాలి దానితోపాటు చిత్ర మైన సిగ్గు మొదలైనాయి. ఆనాటి రాత్రినుంచీ ఆమెకు కలలలో అతడు కనబడి ఆమె ఒళ్ళంతా దుడ్డుకర్రతో కొట్టినట్లూ కాళ్ళతో కసిబిసిగా తొక్కినట్లూ ఉండేది. అయినా ఆమెకు బాధ కలగకపోగా వింతగా నవ్వు వచ్చేది. అటువంటి కలలో ఆమె తన చేతుల్ని రెండు తొడలసందున బిగించుకొని పడుకుంటే ఆమెకు అవ్యక్తమై, అనిర్వచనీయమైన సౌఖ్యం కలిగేదట!

ఫ్రాయిడ్‌వంటి మనస్తత్వ శాస్త్రకర్తలు విశదీకరించిన స్వప్నశిల్పరహస్యాలు ఇక్కడ గడుసుగా పొదిగారు రచయిత.

స్వప్నస్వరూప స్వభావాల్ని గూర్చి తొలదొల్త శాస్త్రీయంగా వివరించిన గౌరవం సిగ్మండ్ ఫ్రాయిడ్‌దే. ఆ తరవాతనే యంగ్-ఎడ్లర్ మొదలైనవారు మరికొన్ని విశేషాలు వివరించాడు. ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం మనస్సుకు మూడవస్థలు. 1) Conscious State, 2) Preconscious State, 3) Unconscious State. మనిషి నిద్ర పోతున్నప్పుడు మనస్సుకూడా నిద్రపోతుంది. మనస్సంటే ఇక్కడ Conscious State

లో ఉండ మనస్సన్నమాట. మనిషి మేలుకొని వుండేటప్పుడు Unconscious mind లో ఉండే అతృప్తవాంఛలు Conscious mind చేత అణచివేయబడి స్వప్నావస్థలో సందుచూచుకొని స్వేచ్ఛా విహారానికి బయలు దేరతాయి. సన్నిహిత భూతకాలంలో జరిగిన సంఘటనల నాధారం చేసుకొని అతృప్తవాంఛలు వింతవింత రూపాలతో కలలలో సాక్షాత్కరిస్తాయి. ఈ అంశాలు కృష్ణరావుగారు "స్వప్నశిల్పము-ధ్వని" అనే వ్యాసంలో వివరించాడు)

ప్రస్తుత కథలో సుందరికి క్రీతసందర్భంలో నందుని మీద ఏర్పడ్డ ఆదరాభిమానాలు, సిగ్గూ మొదలైన శృంగారభావాదికం ఆధారంగా కలలో ఆమె దేహం అతని తాడన పీడనాదులకు గురియై పొందిన అనుహ్యామైన సౌఖ్యం ఒక స్వాప్నిక అనుభూతి. ఈ అనుభూతి విశేషమే "జఘనసుందరి" కథాసూత్రం చిలవలు పలవలుగా సాగిపోవటానికి దారి చూపింది. లైంగికమైన దేహధర్మానికి లొంగి మనస్సుపొందే చిత్రవిచిత్రమైన వివరాలు సుందరి పాత్రలో అద్భుతంగా చిత్రించబడినాయి. పాత్రచిత్రణలోనూ మనోధర్మవిశ్లేషణ లోనూ తదనుకూలంగా సన్నివేశకల్పనలోనూ రచయిత మేధశక్తి పరాయణం ముట్టింది.

అయితే ఇక్కడ ఒకప్రశ్న తారసిల్లుతున్నది. కథలో వాస్తవికతాదృష్టి మాట ఏమిటి? మొండాలతో తల లతుక్కోవటం సహజమా? దీన్ని ఎలా సమర్థిస్తాము? దేవిమహిమ అని పక్కకు తప్పుకుపోవడమేనా? లేక సుందరి మనస్సులో దాగివున్న కోరికే కాళీకటాక్షంగా చిత్రించబడిందని సమాధానపడదామా? పడవచ్చు. రచనాశిల్పానికి వాస్తవికతాస్ఫూర్తి ఒక్కటే గీటురాయి కాదుగదా!

ఏది ఎలాగున్నా 'జఘనసుందరి' అద్భుత రచనాశిల్పంలో సాగిన అతిలోక రమణీయ కథ. ప్రౌఢభావనతో సాగిన 'బృహత్కథ'.

కథలో భాషాశైలుల ప్రసక్తి వస్తే రచయితకు వాటిమీద ఉన్న అధికారం అనల్పం అనిపిస్తుంది. అట్లాగని వాటిని ఆయ నెక్కడా దుర్వినియోగం చెయ్యలేదు.

శృంగార సన్నివేశాల్లో కూడా ఎంతో సంయమంతో అశ్లీలతాదోషం సోకకుండా రచన సాగింది. శర్మ చేయి సుందరి కుచగ్రావం మీది కెగబడిందని చెప్పటానికి "ఫణాఫలకం భూధరాన్ని నలిమివెయ్యాలని చూచింది" అని అలంకారిక శైలి ఆశ్రయింపబడింది.

ఒక్క 'జఘనసుందరి' అనే కాదు. తక్కిన కథల్లోనూ ఆయా వాతావరణాలకు

అనుగుణమైన శైలి కనిపిస్తుంది. ముఖ్యంగా గ్రామవాతావరణం, రైతుజీవితం మొదలైన వాటికి సంబంధించిన కథల్లో వాడబడిన పదాలు కొన్ని ఆ జీవితం చవిచూచినవాళ్ళకి బాగా అవగత మౌతాయి. "పడిగొడ్డు, చేదుగొడ్డు, నదరకట్టం, రోజా, తరిగల ఆవు, జిమ్మందాడి" మొదలైన పదాలు కుప్పతిప్పలు. సన్నివేశానికి సముచితమైన భాషాశైలులుండడం అందమైన ఆత్మకు అనుగుణమైన అవయవాలు సమకూడినట్లే కదా !

నిజానికి ఏ రచనలోనైనా 'రచయిత ఇక్కడ ఇంత మంచి భాష ప్రయోగించా'డనే ప్రత్యేకభావన పఠితకు కలగకూడదు. అట్లా కలిగితే అక్కడ భాషాశైలులు రసభావపరిధి నతిక్రమించి అతిమాత్రంగా ప్రవర్తించాయన్నమాట. పదజాలం 'మేమున్నా' మన్నట్లు సైంధవ శిరస్సులా పైకి కనపడటం కంటే రసాభివ్యక్తిలో అవి అంతర్లీనం కావటం ఉత్తమ శైలికి గీటురాయి. ఈ రచనాధర్మం కృష్ణరావుగారి సృజనాత్మక రచన లన్నింటిలోనూ గోచరిస్తుంది.

కృష్ణరావుగారి దృష్టి ననుసరించి ప్రపంచకథారచయితల్లో టాల్‌స్టాయ్, డాస్టవాస్కీ, చెకోవ్, టాగూరు, వేలూరి శివరామశాస్త్రి వంటివారు గణనీయులు. తన కథల్లో కూడా వారి కథనశిల్పపు మెలకువలు కొన్ని ఆయన పాదుకోకపోలేదు. మౌలికంగా కథాబీజం మాత్రం భారతీయ మైనదాన్నే ఆయన గ్రహించారు. తెనుగుదేశపు గ్రామజీవితాన్ని చిత్రించటంలో ప్రత్యేకశ్రద్ధ చూపారు. అచ్చపు తెనుగు కథారచయితగా ఆయన మనకు సాక్షాత్కరిస్తారు. మంచి కథనశిల్పిగా మనకు చిరకాలం గుర్తుంటారు.

# ఆదర్శవ్యక్తి

— డా॥ వి. దక్షిణామూర్తి

[డా॥ దక్షిణామూర్తిగారు 1939 లో కృష్ణాజిల్లా గుంటుపల్లి గ్రామంలో జన్మించారు. 1965 లో యమ్. డి. డిగ్రీ ప్రథమ అవకాశంలో తీసుకున్నారు. 1965 నుంచి 69 వరకు గుంటూరు వైద్య కళాశాలలో అసిస్టెంట్ ప్రొఫెసర్‌గా, 70 నుంచి 73 వరకు విజయవాడ ప్రభుత్వ ఆసుపత్రిలో అసిస్టెంట్ సర్జన్‌గా పని చేశారు. ఆ తరవాత తెనాలిలో ప్రైవేటు ప్రాక్టీసు పెట్టి "మానవసేవ" చేస్తున్నారు. "సహృదయు"లని పేరు తెచ్చుకొన్నారు.

అమెరికాలోని 'ఇంటర్నేషనల్ కాలేజి ఆఫ్ ఏంజియాలజీ' వారి ఫెలోషిప్ నందుకొన్న బహుకొద్దిమందిలో వీరొకరు. "గుండె జబ్బుల"పై వీరు వ్రాసిన బృహద్వ్యాసానికి 'ఆల్ ఇండియా మెడికల్ కౌన్సిల్'వారి అవార్డును మొన్న ఈ మధ్యనే గెలుచుకొన్నారు.

సాంస్కృతిక, సాహిత్య, కళారంగాలు వీరి ఆసక్తిని చూరగొన్నాయి.

డా॥ జి. వి. కృష్ణరావుగారి చరమదశలో వైద్యచికిత్స చేసింది వీరే.]

*　　*　　*

తెలుగుసాహితీ ఉద్యానవనంలో వివిధ సాహిత్య ప్రక్రియా కుసుమాలను వికసింప చేసిన డా॥ జి. వి. కృష్ణరావుగారి వ్యక్తిత్వం విశిష్టమైనది — ఈ తరంవారికి ఆదర్శప్రాయ మైనది.

1968 లో మొదటిసారిగా విజయవాడ ఆకాశవాణిలో వారిని కలిసే అదృష్టం కలిగింది. అప్పుడు నేను గుంటూరులో అసిస్టెంట్ ఫిజిషియన్‌గా ఉంటూన్న రోజులలో 'డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం' మీద ఒక తెలుగు వ్యాసం వ్రాసి రేడియోవారికి పంపాను. ప్రసంగం రికార్డు చేసేరోజున నేను అపరిచితుడైనా, ఆప్యాయంగా పలుకరించి "డాక్టరైనా తెలుగులో వ్యాసం బాగానే వ్రాశారు. కాని మీరు వ్యాసాన్ని చదువకూడదు. మీ ముందు, శ్రోతలు ఉన్నట్లుగా భావించి వారితో మాట్లాడుతున్నట్లుగా ప్రసంగించాలి" అన్నారు. వ్యాసాన్ని గబగబా చదువుకుపోతున్న నాకు వారి సూచనలు చాలా ఉపకరించినాయి. వారి తెల్లని దుస్తులు, సౌమ్యసంభాషణము, ముఖవర్చస్సు, విడమరిచి తెలియచేప్పే తీరు చూడగానే మేధావంతు లని వెంటనే ఎవరికైనా స్ఫురిస్తుంది. 5 సంవత్సరాల తరువాత తెనాలిలో వారికి వైద్యచికిత్స నేనే చేయవలసి వస్తుందని అప్పట్లో అనుకోలేదు.

1973 లో ప్రభుత్వ సర్వీసునుండి రాజీనామాచేసి నేను, ఆకాశవాణి నుండి రిటైరై వారు తెనాలిలో స్థిరపడినాము. అంతకుముందే వారికి ఉండిన Emphysema మరియు Chronic Bronchitis వ్యాధి క్రమేణా తీవ్రమై దాదాపు 5 సంవత్సరములు చాలా బాధపడినారు. ఆయనకు చికిత్సచేసిన వైద్యులలో ఒకనిగా తరచు వారింటికి వెళ్ళినప్పుడు వారి ఉత్తమ వ్యక్తిత్వాన్ని, ఉదాత్తతను గమనించేవాడిని. వ్యాధితో ఎంతో బాధపడుతూ కూడ చాల నిగ్రహంగానూ, ధైర్యంగానూ ఉండేవారు. 'పాపికొండలు' నవలను ఎలాగైనా పూర్తి చేయండని మిత్రులు అడిగితే, ఎలాగో అలా పూర్తి చేయటం వారికి యిష్టం ఉండేది కాదు. సునిశితమైన మేధాశక్తి, సమకాలీన సాంఘిక, సాహిత్య, రాజకీయరంగములపట్ల సదవగాహన, అవినీతి, అక్రమములపట్ల అసహనం, చెడును, అసమర్థతను నిర్భయంగా విమర్శించడం మొదలైన ఎన్నో ఉత్తమగుణాలు మూర్తీభవించిన ప్రజ్ఞాశాలి డా॥ కృష్ణరావు గారు.

ఆకాశవాణిలో ఎంతో మంచి ఉపన్యాసములను, ముందుతరాలకు ఉపయోగపడే ప్రసంగములను రికార్డుచేయడం జరిగింది; అవి భద్రంగా ఉన్నాయో లేవో నని ఆందోళన వ్యక్త

పరిచేవారు. ఏ రంగంలోనైన సత్ప్రవర్తనకు, నిజాయితీకి ప్రాముఖ్యం ఇవ్వాలనికి ఉద్ఘా జించేవారు. తనను ప్రశంసించడం వారికి ఏమాత్రం గిట్టేది కాదు. ఎంతో ఉత్తమ ప్రమాణములు కలిగిన గ్రంథమైతే తప్ప, వారి ప్రశంసలు పొందటం అంత తేలిక కాదు. అలోపతి ఔషధాలమీద గౌరవమున్నా, వాటి ఉపయోగాలతో పాటు, దుష్ఫలితాలను గూర్చి ఆందోళనను వ్యక్తపరిచేవారు. శాస్త్రీయదృక్పథంతో చికిత్స వివరాలు తెలిపితే అంగీక రించేవారు.

సాహితీమూర్తిగా డా॥ కృష్ణరావుగారి ప్రతిభనుగూర్చి అనేకమంది పెద్దలు సవివరంగా వ్రాస్తున్నారు. వారి రచనలన్నీ నేను చదవలేకపోయినా, వారి వ్యాసాలను చదివే అవకాశం కలిగింది. సర్వజ్ఞ సింగభూపాలుడు, కళాపూర్ణోదయం, కథాసంవిధాన వైచిత్రి, హృదయో ల్లాసం, వేమన, ఛందశ్శిల్ప సమీక్ష, చిన్నయ్య సూత్రాలు, ప్రాసలు అనుప్రాసలు మున్నగు వారి వ్యాసాలు వారి నిష్పాక్షిక పరిశీలనాపటిమను, భాషపై వారికిగల అధికారమును, సత్యా సత్య విశ్లేషణాశక్తిని వెల్లడిస్తున్నాయి. విజయవిలాస కావ్యముపై పూర్వుల వ్యాఖ్యానముల కన్నను, శ్రీ తాపీ వారి హృదయోల్లాస వ్యాఖ్య మిన్న యని సోదాహరణముగా వివరించుతూ తాపీ వారి వ్యాఖ్యానములో అచటచట కనిపించు కొద్ది లొసగులను కూడా బహిర్గతము చేయుటలో వారు వెనుకాడలేదు. డా॥ కృష్ణరావుగారి నిశిత నిష్పాక్షిక పరిశీలనకు ఉదా హరణగా మాత్రమే ఈ విషయము పేర్కొంటున్నాను.

పెద్దయెత్తున వారిని గౌరవింపవలెనని మిత్రలందరము కొంతకాలము ప్రయత్నించి తుదకు మిత్రులు శ్రీ జి. సత్యనారాయణ, శ్రీ వెంకటేశ్వర రెడ్డి, శ్రీ హితశ్రీ, పెద్దలు శ్రీ వెలువోలు శీతారామయ్యగార్లు మొదలైనవారి నిర్వాహణలో డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి అధ్యక్షతన డా॥ కృష్ణరావుగారిని సముచిత రీతిని సమ్మానించుకొను భాగ్యము తెనాలి పౌరు లకు దక్కినది. వారి ప్రజ్ఞావిశేషములను ప్రభుత్వము గాని, విశ్వవిద్యాలయమువారు గాని పూర్తిగా గుర్తింపకున్నను, తెలుగు సాహితీగగనంలో ధృవతారగా డా॥ జి. వి. కృష్ణరావు గారు వెలుగొందగలరు. తెలుగు సారస్వతానికే వన్నె తెచ్చిన వారి 'కీలుబొమ్మలు', 'పాపి కొండలు' వంటి నవలలు, ప్రతిమ, ఆదర్శశిఖరాలు, బొమ్మ ఏడ్చింది వంటి నాటకములు, కావ్యజగత్తు, చైత్రరథం, నవతోరణం వంటి గ్రంథాలు భావితరాల సాహితీ పిపాసువులకు అమూల్య సంపదగా భాసించగల వనుటలో అతిశయోక్తి లేదు. ఉదాత్త వ్యక్తిత్వం కలిగిన సాహితీమూర్తి డా॥ కృష్ణరావుగారి సాహిత్య సమాలోచనా గ్రంథం తెలుగు సాహిత్యాభిమాను లందరికి ఉపయుక్తం కాగలదని ఆశిస్తున్నాను.

# శూన్యవాదం

—ఏటుకూరు బలరామమూర్తి

[బలరామూర్తిగారు 1918లో జన్మించారు. సోషియాలజీలో M.A. పట్టం పుచ్చుకొన్నారు. 1952 నుంచి 1970 వరకు విశాలాంధ్ర దినపత్రిక సంపాదకులుగా వ్యవహరించారు. 1949-52 జైలు జీవితం.

వీరి "భారతీయ తత్త్వశాస్త్రం" సుప్రసిద్ధం. "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర", "మనచరిత్ర" ఇతర రచనలు. వీటిలో "ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర" రష్యన్ భాషలోకి అనువదించబడింది.]

* * * * *

తత్వశాస్త్రంలో రెండు మౌలిక సమస్య లున్నాయి. మూలవస్తువు పదార్థమా, భావమా? అది స్థాణువా, జంగమమా?

సృష్టికి మూలాధారమైన వస్తువు పదార్థము అన్నవారు భౌతికవాదులు. భావము అన్నవారు భావవాదులు. మూలవస్తువు నిరాకార, నిర్గుణచలనరహిత స్థాణువు అన్నవారు జడవాదులు. పుట్టుక, పెరుగుట నశింపులతో కూడిన జంగమము అన్నవారు గతివాదులు. స్థాణువేస్థితి జడవాదులే స్థితివాదులు.

భావవాదం భౌతికవాదం తాత్వికదృక్పథాలు. జడవాదం, గతివాదం పరిశీలనా పద్ధతులు. భావవాదులలో జడవాదు లున్నారు. శంకరాద్వైతులు వారిలో ప్రథమగణ్యులు. గతివాదులూ ఉన్నారు.

ఉపనిషత్తులలోని జగద్వాదులు అట్టివారు. జగత్ అంటే నిత్యమూ కదిలేది.

ఇవి కేవలము మేధోప్రధానమైన తాత్త్వికసమస్యలు కావు. ఆ యా కాలాలలో ఈ ధోరణుల కన్నిటికీ సామాజిక ప్రతిస్పందన ఉంటూనే వచ్చింది. బోధకులు ఉద్దేశించిన ఫలితాలు కొన్ని, శ్రోతలకు స్ఫురించిన అంతరార్థాలు, అంతర్ధ్వనులు మరికొన్ని.

సృష్టికంతా మూలం భావం — (being)— అని ఉపనిషత్తులలోని ప్రధాన బోధన. నిర్గుణమైన ఏకైక పరబ్రహ్మం నుండి చరాచరాత్మక సృష్టి యావత్తు విశ్వరూపంలో వికసించింది. నిర్గుణమైనది సగుణసృష్టికి హేతువు కాగలదా ? ఇందుకు ఉపనిషత్కారుల సమాధానము—అదొక లీల. ఎవరి లీల ? నిర్గుణబ్రహ్మకు లీల ఉండగలదా ? సగుణాత్మక మైన పురుషునికే గదా లీల— భ్రాంతిలాంటివి సంభవం ? దాంతో నిర్గుణబ్రహ్మ సగుణ బ్రహ్మ అయినాడు.

ఇందుకు విరుద్ధంగా బుద్ధుడు ఇలా అన్నాడు. "ఆది అలా ఉంది కనుక, ఇది ఇలా ఉంది. ఆది లేకపోతే ఇది లేదు. అదీ, ఇదీ, కార్యకారణబంధితము. అకారణంగా ఏదీ జరుగదు. కార్యము ఏర్పడిన మీదట కారణము నశిస్తుంది. కార్యము తిరిగి కారణ మౌతుంది. మరొక కార్యం ఏర్పడుతుంది. తుది మొదలు లేని అనంత క్రమం ఇది."

"మూలవస్తువు స్థితి కాదు. గతి (becoming) పుట్టుక, పెరుగుదల, నశింపుల సంపుటి గతి. ఇందులో ప్రతిదశ క్షణికం. మానవ మేధస్సు ఊహించనైనా లేనంతటి స్వల్పకాలం. క్షణికం అనగా శూన్యం కాదు. పృథక్కీకరణలో ఒక స్వల్పాతిస్వల్ప ప్రమాణం. ఐనా వాస్తవం"

"ఒకే వస్తువు నుండి, అందునా నిర్గుణాత్మకమైన స్థితి నుండి విశ్వవికసనం జరిగిం దనటం హేతువిరుద్ధం. అనేక కారణాల సమాహారం నుండి కార్యం ఉద్భవిస్తుంది. కారణ సముదాయం ఫలితమే సముత్పాదం".

దీనినే ప్రతీత్యసముత్పాద మని కారణ సముదాయసూత్ర మని బౌద్ధనికాయాలు పేర్కొంటున్నాయి.

ఆనాటి కీ సూత్రం చెప్పింది. గౌతమబుద్ధుడే చార్వాకుడు చెప్పలేదు. వారిలో హెచ్చుమంది నియతివాదులు (Determinists) జిన మహావీరుడు చెప్పలేదు. అతడు

పుద్గల మన్నాడు. పదార్థమౌలికతను గుర్తించాడు. కాని గతిప్రాధాన్యము చెప్పలేదు.

కనుకనే అదిబౌద్ధం. భారతీయ తాత్వికచింతన లోని ఏకైకగతివాదం. ఆత్మను, దేవుని, వేదాలను నిరాకరించినందున నాస్తికవాదం కూడా పదార్థం, భావం రెండూ పరాస్పరాశ్రయాలు. "ఏది మౌలిక మనే ప్రశ్న ఉదయించదు" అని చెప్పినందున భౌతికవాద మనలేము. భావవాదమూ అనరాదు. ఆ విషయంలో అస్పష్టత ఉండనే ఉంది.

ఆదిబౌద్ధం అనే మాటను ఇక్కడ నొక్కి చెప్పాలి. బుద్ధుడు సంచారప్రచారకుడు. తోచినవన్నీ 40 యేండ్లపాటు బోధల రూపంలో చెప్పకుంటూ పోయాడు. శిష్యులు అవన్నీ మనోగతం చేసుకున్నారు. ఏటిని గ్రంథస్తం చేయటానికి ప్రథమ సంగీతి బుద్ధుడు మరణించిన తర్వాత 43 ఏండ్లకు క్రీ. పూ. 500 లో జరిగింది. బుద్ధుని కాలం క్రీ. పూ. 623 – 543.

రాజగృహంలో జరిగిన ఈ ప్రథమసంగీతిలో వినయపిటకం, సుత్తపిటకం మాత్రమే గ్రంథస్తమయ్యాయి. భిక్షువుల దైనందిన నియమనిష్ఠల క్రోడీకరణ వినయం. బుద్ధుడు. స్వయంగా చెప్పిన కథలు, బోధలు, సూక్తుల క్రోడీకరణ సూత్రపిటకం. త్రిపిటకాలలో మూడవదిగా నేడు చెప్పబడుతున్న అభిధర్మపిటకం అప్పటి కేర్పడలేదు.

అప్పటికే బౌద్ధంలో విభేదాలు తలెత్తాయి. భిక్షువుల నియమనిష్ఠలు జీవన విధానం— నాటి ప్రధానచర్చనీయాంశాలు. ప్రథమసంగీతి బుద్ధుని రథసారధి ఛన్నుని బౌద్ధసంఘం నుండి బహిష్కరించింది. అంతేవాసి ఆనందుని మందలించింది. మంగలి ఉపాలి మాత్రమే వినయపిటకాన్ని విశ్వాసపాత్రంగా పునశ్చరణ చేయగలిగాడట.

క్రీ. పూ. 400 లో వైశాలిలో ద్వితీయసంగీతి జరిగింది. అల్పసంఖ్యాకులైన థేరవాదులు అధిక సంఖ్యాకులైన మహాసాంఘికులను బహిష్కరించారు. థేరవాదులు నైష్ఠికులు మహాసాంఘికులు లౌకికప్రవృత్తిపై మొగ్గు జూపినవారు.

అశోకుని కాలంలో మూడవ సంగీతి జరిగింది. అప్పటికి (క్రీ. పూ. 250) పదకొండు బౌద్ధశాఖలు తలెత్తాయి. వీరిలో ఒకశాఖ వాత్సుపుత్రీయ. అనాత్మవాద ప్రధానమైన బౌద్ధంలో వీరు "ఆత్మ" పదాన్ని ప్రవేశపెట్టారు. ఈ పదకొండు శాఖలను థేరవాదులు బహిష్కరించారు.

బహిష్కృతులు ఒకరూ ఇద్దరూ కాదు. అరవై వేలమంది. వీరు నలందా విశ్వ విద్యాలయం చేరారు. సర్వాస్తివాదులుగా పేరు పొందారు.

కార్యం సృష్టియైన తర్వాత కారణం నశిస్తుంది. అది బౌద్ధం. కాదు, కారణం శాశ్వతంగా ఉంటుంది. కార్యమూ ఉంటుంది అని వాదించినవారు సర్వాస్తివాదులైనారు.

బుద్ధుడు అంతవరకు మహాబోధకుడు సర్వాస్తివాదులు బుద్ధునికి శాశ్వతత్వం, దేవత్వం ఆరోపించారు. బోధిసత్వులు ఏర్పడ్డారు. దేవుడు లేడని చెప్పిన బుద్ధుడు దేవుడిని చేసాగో శాశ్వతపదార్థం లేదని చెప్పిన బౌద్ధంలో శాశ్వతపదార్థం ఏర్పడ్డది. కొందరు దానిని బాహాటంగా ఆత్మ అన్నారు. ఆ పదం బౌద్ధానికి వ్యతిరేకం. కనుక అదే అర్థాన్ని స్ఫురింపజేసే కొత్త పదాలు ఏర్పడసాగాయి.

మూడవ సంగీతిలో అభిధమ్మపిటకం రూపొందింది. బుద్ధుని సూత్రాలలోని తాత్వికాంశాల సాధారణీకరణ అభిధమ్మం. ఇది మూడో పిటకం. అప్పటినుండే త్రిపిటకాలు అనే మాట ఏర్పడ్డది. ఈ సాధారణీకరణతో ఆదిబౌద్ధానికి విరుద్ధమైన అనేకభావాలు ప్రవేశించాయి. మతరీత్యా హీనయానం వెనుకడుగువేసి మహాయానం ఏర్పడ్డది.

నాలుగో సంగీతి క్రీ. త. 100 లో జరిగింది. గత మూడు సంగీతులలో థేరవాదులచే బహిష్కృతులైన బ్బాదులు నాలుగో సంగీతిలో అధికారపీఠం ఆక్రమించారు. థేరవాదులు పదభ్రష్టులైనారు.

ఇలా పదభ్రష్టులైనవారు మతరీత్యా హీనయానులు, తాత్వికంగా సౌత్రాంతికులు. బుద్ధుని సూత్రాలే వీరికి ప్రమాణం. అందులో గతివాదం, వాస్తవికత, భౌతికవాదఛాయలు హెచ్చు. అభిధమ్మపిటకం లో అవన్నీ నశించాయి. అభిదమ్మం వ్యాఖ్యానం. అభిధమ్మ పిటకమే మాకు ప్రమాణం అన్నవారు వైభాషికులు. వీరికి మూలం కంటె విభాస అనగా వ్యాఖ్యానం ప్రమాణం. కనుక వీరు వైభాషికులు.

మూలబౌద్ధం రూపురేఖలు అన్నిటా నశించాయి. నాలుగో సంగీతినాటికి మాధ్యమిక వాదం అనే మాట వినిపించలేదు. కొద్దికాలం తర్వాత అశ్వఘోషుడు మొదటిసారి ఈ పదం వాడాడు.

ఈ మాటను పెంచి పెద్దచేసి తాత్విక ధోరణిగా ప్రతిష్ఠ కల్పించినవాడు నాగార్జునాచార్యులు. మాధ్యమికవాదానికి పర్యాయపదం శూన్యవాదం. క్రీ. శ. 200లో యజ్ఞశ్రీ శాంతకర్ణికి సమకాలికుడు నాగార్జునాచార్యులు.

బుద్ధుని తర్వాత 700 సం॥కు జన్మించినవాడు నాగార్జునుడు. మతరీత్యా బౌద్ధం అప్పటికే వైదికమతంలోని మౌఢ్యాలన్నిటినీ స్వీకరించింది. బౌద్ధంలోని తాత్వికప్రత్యేకతను రూపుమార్చి వైదిక తత్వశాస్త్రానికి సన్నిహితం చేయడం మిగిలివుంది. నాగార్జునుడు ఆపని చేశాడు. ఆదిబౌద్ధం దృష్ట్యా ఇది పతనం. తాత్వికపరిణామం దృష్ట్యా ప్రతీపగమనం. నాగార్జునాచార్యుని దృష్టిలో మాత్రం తాత్వికపరిశీలనకు పరాకాష్ఠ.

ప్రతిదీ కార్యకారణజనితం. కారణంలేనిదే కార్యం లేదు. పుట్టుక, పెరుగుదల, నశింపు లేని వస్తువే లేదు. మొదలు, తుది అనే ప్రశ్నలే వేయరాదు. ఆద్యంతరహితసృష్టికి మొదలేది, తుది ఏది ? ప్రతీత్యసముత్పాదసారాంశ మిది.

నాగార్జునాచార్యులు ఈ ప్రశ్ననే వేశారు. స్థూలదృష్టిలో కూడదన్న ప్రశ్నను (Macro view) సూక్ష్మదృష్టిలో (Micro view) వేశారు. ప్రతిదీ పరస్పరాధారితం. మౌలికంగా మరొకదానిపై ఆధారపడకుండా ఏ వస్తువుకూ, ఘటనకూ దృగ్విషయానికి అస్తిత్వమే లేదు. కనుక అది నిస్స్వభావం. అదే శూన్యం.

స్థూలంగా చూస్తే ఈ వాదనలో దోషమున్నట్లు తోచదు. ప్రతీత్యసముత్పాదానికి పర్యాయపదంగా శూన్యం అనే మాట వాడాడు. ఇందులో దోష మేమని అనిపించవచ్చు. కాని అందులోనే దోషమున్నది.

గతివాదం ఒక ఆలోచనాపద్ధతి, పరిశీలనాక్రమం (methodology). ఏ వస్తును విడివిడిగా, చలనరహితంగా, బాహ్యపరిస్థితుల నుండి వేరుచేసి పరిశీలించవద్దు అని గతివాదం నిషేధిస్తుంది....ఎందువలన? అలా చూడడానికి ప్రయత్నించడంలోనే లోపం వున్నది. గతికంటే, మౌలికమూ, ప్రాథమికమూ ఐన స్థితి అనే అంతర్ధ్వని అందులో ఉన్నది కనుక.

ఆధునిక విజ్ఞానశాస్త్రం దృష్ట్యా చూస్తేగాని ఈ సమస్య లోతుపాతులు బోధపడవు.

సృష్టికి మూలం 'పదార్థం' అని భౌతికవాదతత్వవేత్తలు అన్నారు. జైనులు పుద్గలం అన్నారు. గ్రీకు తత్వవేత్తలు నీరు, నిప్పు వాయు వని ఏవేవో అన్నారు.

ఆ చర్చ కొన్ని శతాబ్దాలు సాగి ఆగిపోయింది. ఆగిపోకతప్పదు. ఆ సమస్య ఆనాటి తత్వవేత్తల పరిధికి అతీతమైనది. శాస్త్రవేత్తలు మాత్రమే మరి కొంత ముందడుగు వేయగలరు.

18, 19 శతాబ్దాలలో భౌతిక రసాయనిక శాస్త్రాలు వృద్ధి చెందాయి. పరిశీలన, ప్రయోగం, వివేచన ఫలితంగా పదార్థానికి మూలరూపం అణువనీ, పిమ్మట పరమాణువనీ, శాస్త్రజ్ఞులు అన్నారు. పరమాణువు అవిభాజ్యం. (Atom is indivisible) అని ఊరుకున్నారు, పరమజ్ఞానం సాధించా మనుకున్నారు.

కొద్దిరోజులలోనే పరమాణువు విభిజ్యం అని నిరూపణయైనది. కాని విభాగాలు ఎలక్ట్రాను, ప్రోటాను, న్యూట్రానులు అన్నారు. అణువిద్యుత్ సంఘాతాలరూపంలో ఇవి నిత్యం చలనశీలంగా ఉంటా యన్నారు. అవిభాజ్యత కాదు. విభాజ్యత; స్థితి కాదు. గతి. మౌలికం అని శాస్త్రజ్ఞానం నిరూపిస్తున్నది.

కాలము, దేశము (Time and space) స్థిర దృగ్విషయాలనీ, ఈ అనంతాకాశంలో పరిభ్రమిస్తూ ఉంటాయని న్యూటన్ కాలపు భావన. ఐన్‌స్టీన్ ఒక అడుగు ముందుకు సాగి, దేశకాలాలు కూడా సాపేక్షకాలే తప్ప నిరపేక్షక దృగ్విషయాలు కావని తేల్చేడు. (Motion is the mode of existence of matter). చలనం పదార్థంయొక్క రూపం. చలనరూపంలో తప్ప పదార్థం ఉండజాలదు. పదార్థరహిత చలనమూలేదు. చలనం అంటే యాంత్రికచలనం మాత్రమే కాదు. భౌతిక, రసాయనిక, జైవిక, మానసిక పరిణామాలన్నీ చలనరూపాలే.

ప్రాచీనకాలంలో ఇలాంటి విజ్ఞానశాస్త్రాభివృద్ధి లేదు. బుద్ధుని కాలంనాటికి మరీ స్వల్పం. అయినప్పటికీ కేవలం తాత్విక, సాంఘిక మతపరమైన ఆలోచన చేసి నానావిధానాలైన మథనకు జిజ్ఞాసకు లోనై (దానినే తపస్సు అన్నారు) బుద్ధుడు తాత్వికరూపంలో ప్రాథమికమైన గతివాదాన్ని బోధించాడు. శూన్యవాదాన్ని నిరూపించడానికి నాగార్జునాచార్యులు చేసిన వాదాన్ని చూడండి.

"నేను నడుస్తున్నాను" అనే మాటలో నేను 'గంత' నడుచువాడు.

నడుస్తున్నాను— అనేది గమనం, గతిచేరుకునే ప్రదేశం గమ్యమానం.

ఈ క్రమాన్ని శతధా విశ్లేషించి అత్యల్ప తృటికాలాన్ని ఊహించుకుందాం. అప్పుడు తర్కం ఇలా సాగుతుంది :

"దేవదత్తుడు గమిస్తున్నాడు, నడుస్తున్నాడు." అతని నడక ఎప్పుడు ప్రారంభమైంది ? గతమునందా ? ఆగతమునందా ? గతమునందు అనలేము. ఏల ? భూత వర్త

మానములకు విరోధము గనుక. ఆగతమునందు అనరాదు. భవిష్యత్తు వర్తమానములకు విరోధము కదా ... గమ్యమానం (నడక) లోనా ? గతాగతరహితమైన గమ్యమాన ముండ జాలదు గదా! కనుక గతి లేదు.

అలాగే స్థితి లేదు. దేశం లేదు. మనం ఉన్నవనుకున్న వేవీ లేవు. కాని ఇవి అన్నీ కంటికి కనిపిస్తున్నవి కదా! ఈ కనిపించుట సంవృతిసత్యం.

పారమార్థిక సత్యం కాదు. వ్యావహారిక సత్యం, సాపేక్షక సత్యం మాత్రమే. అఖండసత్యం కాదు. అఖండసత్యం శూన్యం.

గతానికి — వర్తమానానికి, వర్తమానానికి — భవిష్యత్తుకు, విరుద్ధమని నాగార్జునుడు ఎందుకు ఊహించాలి? అసలీ మాట ఎవరు చెప్పారు?

గతము, వర్తమానము, భవిష్యత్తు — అవినాభావమైన ప్రవాహ సదృశ్యమైన దృగ్విషయ మని ఆదిబౌద్ధంలోని మూలసూత్రం. అదే ప్రతీత్య సముత్పాదం. ఒకటి నశించి, రెండవది పుట్టడం నిరంతరం జరుగుతుంది. నశింపు విరోధమైతే పుట్టుక కొనసాగింపు. ఎంత అత్యల్ప త్రుటికాలంలోనైనా ఈ పరస్పర సంపుటి ఉండనే ఉన్నది. ఇందులో ఒక అంశాన్ని స్వీకరించి మరొక అంశాన్ని నిరాకరించడం ఆదిబౌద్ధానికి అపచారం, తర్కానికి విరుద్ధం. నాగార్జునునికి పూర్వుడైన (క్రీ. శ. 100) నాగసేనుడు, మీనాందార్ రాజు ఆస్థానంలో ఇదే అంశాన్ని ఇలా తర్కించాడు.

"ఓ రాజా, నీవు చిన్నప్పుడు శిశువుగా ఉండేవాడవు. ఇప్పుడు పెద్దవాడవైనావు. ఆనాటి శిశువు, ఈనాటి నీవు ఒకరా, ఇద్దరా ?"

అందుకు రాజుకు సమాధానం తోచలేదు.

నాగసేనుడు సమాధానం చెప్పాడు. "ఆనాటి శిశువు లేనిదే నీవు ఎలా వచ్చావు? కనుక ఇద్దరకూ సామ్య మున్నది. కాని వయస్సులో, బలంలో, తేజస్సులో, శక్తిసామర్థ్యాలలో అన్నిటా నీవు శిశువుకంటే చాలా ఉన్నతుడవు. కనుక వ్యత్యాస మున్నది. సామ్యాన్ని వ్యత్యాసాన్ని కలుపుతూ పరిణామ మనే బంధనం, కార్యకారణ సంబంధం ఉంది. ఇదే వాస్తవం. ఇదే ప్రతీత్యసముత్పాదం. దీనిని మొత్తంగా క్రమంగా చూడాలి".

నాగసేనుడు, మాధ్యమికుడు కాదు. సౌత్రాంతికుడు. కనుక ప్రతీత్యసముత్పాద

సూత్రాన్ని అమలిన రూపంలో చెప్పగలిగాడు. ఆ తరువాత ఒక శతాబ్దికి అదే ప్రశ్నను నాగార్జునుడు వేసుకొని పరిణామం శూన్యం అనే స్థితికి వచ్చాడు.

ఆదిబౌద్ధం వాస్తవికతపై ఆధారపడ్డది.

మాధ్యమికం జడతర్కంపై ఆధారపడ్డది.

గతి మౌలికమూ అంటే సామాజిక ప్రగతి వాస్తవం ఔతుంది. గతి శూన్యం అంటే ప్రగతి భ్రాంతి మాత్రమే. నాగార్జున శూన్యవాదం భ్రాంతి వాదానికి సామాజిక స్తబ్దతకు దోవ తీసింది.

నశింపుకు, పుట్టుకకు విరోధం ఊహించటమే నాగార్జునుని ప్రధాన దోషం. ఈ దోషాన్ని ఆయన ఉపనిషత్తులనుండి స్వీకరించాడు. బౌద్ధానికి అంటుగట్టాడు. నాగార్జునుడు మొదట, వైదిక పండితుడై, ఆ తర్వాత బౌద్ధు డయ్యాడని అంటారు.

బుద్ధుని కాలంలోనే పెక్కుమంది వైదికపండితులు, బ్రహ్మణ మేధావులు, ఉపనిషత్తులలోని జడతత్వం జీర్ణించుకున్నవారు పెద్ద సంఖ్యలో బౌద్ధంలో చేరారు. మహాకశ్యపుడు, సారిపుత్ర, మొగ్గలాన లాంటి వారందరూ అట్టివారే.

బౌద్ధంలోని గతితర్కం బలహీనమైనది. ప్రాథమిక మైనది. దానిని అంటిపెట్టుకోడం ప్రయత్నసాధ్యం. కరుణ, మానవత, వర్ణవ్యవస్థ నిరసన వంటివి ప్రబలమైనవి. కనుకనే ప్రథమ, ద్వితీయ, తృతీయ సంగీతులు జరిగేనాటికి గతితర్కం వెనుకడుగు వేసి ప్రాచీనమైన ఇడతర్కం ఆ చోటును ఆక్రమించుకుంది. మానవతాభావం మాత్రం కొనసాగుతూనే వుంది.

జడతర్క మంటే ఏమిటి? శాశ్వత స్థిరసత్యానికై అన్వేషణ. యాజ్ఞ్యవల్క్యముని కి, గార్గికి జనకమహారాజు ఆస్థానంలో జరిగిన చర్చలో మూలవస్తువు ఏది అనే తర్కం మొదలైంది.

పోయి పోయి యాజ్ఞ్యవల్క్యుడు ఆత్మ అన్నాడు. ఆ పిమ్మట బ్రహ్మ అన్నాడు. ఆ పిమ్మట ఏమి అని గార్గి అడిగింది. ఆ ప్రశ్న వేసిందే కాని అందుకు సమాధానం గార్గికి తెలియదు. యాజ్ఞ్యవల్క్యునికి తెలియదు. ఆనాటి తాత్వికస్థాయికి మించిన ప్రశ్న. దాంతో యాజ్ఞ్యవల్క్యునికి కోపం వచ్చి శపించాడు. గార్గి నిరుత్తుర ఐంది.

ఇదే ప్రశ్న బుద్ధునికీ వచ్చింది. అందుకు అతడు ఇలా అన్నాడు. "మూలవస్తువేది అనేది తేలని చర్చ. నాకు తెలిసింది నేను చెప్పాను. భవిష్యత్తులో ఎవరైనా ఇంకేమైనా చెబుతారేమో! ధర్మం అపారమైనది. ప్రస్తుతానికి ఇంతే. తేలని సమస్యలతో తలలు బద్దలు చేసుకోవడం ఎందుకు?"

బుద్ధుని తాత్వికవినయం ఇందులో కనిపిస్తుంది. బుద్ధుని తర్వాత వచ్చిన పూర్వ, ఉత్తర మీమాంసాకారులకు ఈ వినయం లేదు. ఏదో సమాధానం చెప్పడానికి ఏ వేవో కల్పనలు చేశారు.

శాశ్వత స్థిరవస్తువుకై అన్వేషణ, "searching in a dark Noon, for a black hat which is not there" లాంటిది.

యూరప్‌లో కాంట్ అను తత్వవేత్త మూలవస్తువు అజ్ఞేయం అని సమాధానం ఇచ్చాడు. మూలవస్తువు తర్కానికి అందేది కాదు. ఆ పరావిద్య ద్వారా పరోక్షానుభూతి ద్వారా గ్రహించవలసిన సత్యం అని శంకరుడు అన్నాడు. నాగార్జునుడు శంకరుని వాదాని కవసరమైన ప్రాతిపదికను శూన్యవాదం ద్వారా ఏర్పరచాడు.

ఈ ప్రశ్నకు సమాధానం ఉందా? ఉన్నది. తెలియని వస్తువు ఎప్పుడూ ఉంటుంది. తెలియజాలని వస్తువు మాత్రంలేదు. unknown వున్నది. unknowable లేదు. జ్ఞాన సంపాదన నిరంతరకృషి. సాపేక్షజ్ఞానం నిరంతర అఖండ జ్ఞానదిశగా పురోగమిస్తుంది.

అఖండజ్ఞాన మంటూ పూర్వనిర్ణీత వస్తువేదీ లేదు. అలా వుందనడం హెగెల్ వాదనలోని పొరపాటు. విశ్వవిజ్ఞాన అనంతత్వానికి పర్యాయపదం - అఖండజ్ఞానం. సమాజం ఆ స్థితికి ఎప్పటికీ చేరుకోలేదు. "పూర్ణస్యపూర్ణమాదాయపూర్ణమేవా వ శిష్యతే" అను ఉపనిషద్వాక్యంలో అనంతత్వ స్ఫురిస్తుంది. మానవునితోపాటు అతనికంటె ముందు వేగంగా, ప్రకృతి, విశ్వం పరిణామం చెందుతున్నాయి. ఈ మహాప్రస్థానంలో అంతిమ బిందువు అంటూ లేదు. నిరంతరయాత్ర, జ్ఞానాన్వేషణ మాత్రమే ఉన్నాయి.

తెలియని వస్తువును unknowable అని కాంట్ "శూన్యం" అని నాగార్జునుడు, "అనిర్వచనీయపరబ్రహ్మ" అని శంకరుడు అనడం, వాస్తవజ్ఞానాన్ని నిరాకరించడమే తెలియనిది కొంత వున్నది. గనుక తెలిసిందంతా మిథ్య, క్షణికం, అసత్యం, అవిద్య అనడంలోనే భావవాదతాత్వికుల ప్రధాన బలహీనత.

శూన్యవాదం ప్రతిపాదించిన నాగార్జునుడు రెండు సత్యాలను చెప్పక తప్పలేదు. వాస్తవజగత్తుకు ఏదో వ్యాఖ్యానం ఇవ్వాలి కదా. కనుకనే 'సంవృతిసత్యం' అనే మాట ఏర్పడ్డది. దీనినే శంకరుడు 'వ్యావహారికసత్యం' అన్నాడు.

సత్యం రెండు విధాలు అని ఉపనిషత్కారులు చెప్పలేదు. శంకరుడు మినహా మిగతా వైదికదర్శనకారు లెవ్వరూ చెప్పలేదు. పూర్వమీమాంస, న్యాయ, వైశేషిక, సాంఖ్యాలు.... ఇలాంటి విభజనకు చెప్పకపోగా, ఈ విభజన తప్పు అని ఖండించాయి. ఆ మేరకు అవి (epistomological) జ్ఞానసంపాదనాతర్కానికి సంబంధించి వాస్తవికదృష్టి ప్రదర్శించాయి. అతీంద్రియశక్తులలో అపారవిశ్వాసం గల యోగశాస్త్రంలో మాత్రమే ఈ ద్వంద్వ సత్యభావన ప్రవేశించింది.

బౌద్ధంలో నాగార్జునుడు, వైదికంలో శంకరుడు ఈ ద్వంద్వసత్యభావం ప్రవేశపెట్ట డానికి ఏమైనా కారణమున్నదా? ఉన్నది. ఆ కారణం తాత్వికమైనది కాదు. మత పర మైనది.

నాగార్జునుని కాలానికి మహాయానం విశ్వరూపం ధరించింది. వజ్రయానఛాయలు మొదలైనాయి.

బోధిసత్వుడు, పునర్జన్మ, స్వర్గ-నరకాలు, బుద్ధుని అసంఖ్యాకమైన జాతకగాధలు బుద్ధుని విగ్రహాలు, శరీరావశేషాలచుట్టూ నిర్మితమైన స్థూపాలు, చైత్యాలు....ఇలా ఒక మత వ్యవస్థ రూపొందింది. మూఢాచారాలు, మూఢ విశ్వాసాలు బౌద్ధంలో ప్రవేశించాయి. 'బౌద్ధం' ప్రజామతంగా రూపొందిన దనడానికి ఇదంతా తార్కాణం అని బౌద్ధతాత్వికులు సరిపెట్టుకోసాగారు. దేవుడు లేడు, ఆత్మ లేదు, అని చెప్పిన బౌద్ధం ఇలా రూపాంతరం చెందడంతో నాగార్జునుడు లాంటి తాత్వికులకు ఒక పెద్ద వైరుధ్యం కనిపించింది.

"దుఃఖం, దుఃఖ కారణం.
దుఃఖనివారణ మార్గం"

అని మొదలైన బౌద్ధం ఎక్కడినుండి ఎక్కడికి వచ్చింది? ఈ వైరుధ్యానికి పరి ష్కారంగానే నాగార్జునుడు ఇదంతా సంవృతిసత్యం అని చెప్పి సమాధానపడి, అసలు సత్యం శూన్యం అని తనకు తాను సంతృప్తి చెందాడు. శంకరాచార్యునికి ఇదే సమస్య ఎదురైంది. నిర్గుణ పరబ్రహ్మోపాసకుడైన శంకరుడు కనపడ్డచెట్టుకు, పుట్టకు, రాతికి, రప్పకు స్తోత్రా లెలా రాశాడు ?

ఈ ఉభయులూ కేవలం తత్వవేత్తలు కారు. మత ప్రచారకులు. వారి మతానికి, తత్వ శాస్త్రానికీ వైరుధ్య ముంది. ఒకవైపున సర్వమూధాచార సమర్థన, మరొకవైపుని ఇదంతా సంవృతి లేక వ్యావహారిక సత్యం, పరమార్థం, శూన్యం లేక నిర్గుణపరబ్రహ్మం అని తమ తాత్విక అంతరాత్మకు సమాధానం.

యూరపియన్ తత్వవేత్తలలో బిషప్ బెర్కిలీకి ఈ సంకటం ఏర్పడ్డది. ఆయన భావవాద తాత్వికుడు మాత్రమే కాక క్రైస్తవ మత ప్రచారకుడు. కనుక ఆయన రెండు సత్యాలను గురించి ప్రస్తావించాడు. మిగతా యూరపియన్ భావవాద తాత్వికుల కీ భావం కలుగలేదు.

మతవ్యవస్థ, తాత్విక చింతనను కలుషితం చేసిన ఉదంతాలకు శూన్యవాద, మాయా వాదాలు తార్కాణం. ఉపనిషత్తులలోని భావవాదానికి నాగార్జున, శంకరుల భావవాదానికీ వ్యత్యాసం ఇక్కడే కనిపిస్తుంది.

వైదిక కర్మకాండపట్ల నిరసనతో, పాక్షికత నుండి అఖండత్వానికి, ప్రత్యేకత నుండి సాధారణత్వానికి ప్రయాణంచేసే క్రమంలో ఉపనిషత్ భావవాదం ఏర్పడ్డది. తాత్విక పరిణామక్రమంలో ఇదొక ముందడుగు. ఉపనిషత్తులు చదువుతూ వుంటే ఎన్నో భావాలు, ఊహాలు స్పష్టాస్పష్టంగా స్ఫురిస్తాయి. భావవాదపరిధిలో తాత్విక చింతన ఎంతవరకూ ముందుకు సాగే వీలుందో అంతవరకూ ఉపనిషత్తులలో ముందుకు సాగింది.

శూన్యవాదం, మాయావాదాల పరిస్థితి వేరు. హేతువాదం, వాస్తవికతావాదం అత్యున్నతస్థాయి నందుకొని అనేక కారణాలవల్ల తమ స్థితి నిలుపుకోలేక పతనం చెందిన కాలంలో శూన్యవాదం, మాయావాదం, భావవాదాన్ని పునరుద్ధరించాయి. వీనిలో అప్పష్టభావావేశం లేదు. తార్కికపదగుంభన మాత్రం ఉంది. హృదయాన్ని స్పందింపచేసే ఒక్కఅంశమూ లేదు. మేధస్సును చికాకు పరిచే వాదనలు అనేకం వున్నాయి.

యూరప్‌లోనూ ఇదే పరిస్థితి. ప్లేటో, అరిస్టాటిల్‌ల భావవాదంలో భావావేశం ఉంది. 16, 17 శతాబ్దాల భావవాదంలో మతాభినివేశం చోటు చేసుకొని తర్కప్రాగల్భ్యం మాత్రం మిగిలింది. బానిస సమాజ విచ్ఛిత్తిదశలో ఉద్భవించిన భావవాదం మొదటిది. భూస్వామ్య సమాజశృంఖాలు బిగుస్తున్న కాలంలో తల ఎత్తిన భావవాదం రెండవది.

శూన్యవాదం బౌద్ధంలో ప్రవేశపెట్టిన మార్పును ప్రముఖ రష్యన్ తత్త్వవేత్త షర్‌బట్‌స్కీ ఇలా వివరించారు.

"An atheistic soul denying philosophy teaching a path of personal deliverance in an absolute extinction of life is superceded by a religion highly devotional ceremonial and claiming salvation not in annihilation but eternal life. History of religion scarcely witnessed such a brake between the New and the Old with in the pale of what nevertheless continues to claim descent from the same religious founder.''

(BUDHIST LOGIC)

''దేవుని, ఆత్మను నిరాకరించి సంపూర్ణ అత్మ వినాశనంలో వ్యక్తిమోక్షాన్ని దర్శించిన తత్వశాస్త్రం స్థానంలో మహాజటిలమైన కర్మకాండతో కూడిన మతంచోటు చేసుకొంది. ఆత్మ వినాశనంలో కాక, ఆత్మ శాశ్వతత్వంలో మోక్షాన్ని ఊహించింది. ఒకే మతబోధకుని పేరుతో చలామణి అవుతూ పాత కొత్తల మధ్య ఇంతటి వ్యత్యాసం కలిగిన రెండు శాఖలు ఏర్పడం ప్రపంచమత చరిత్రలోనే అపూర్వం." (బౌద్ధతర్కం). బుద్ధుని దృష్టిలో నిర్వాణం అనే భావం ఆత్మవినాశకం; నేను అనే అహంత భస్మీపటలమై కార్యకారణ సంబంధ మనే మహాప్రవాహంలో లీనం కావడం. ఆ పిమ్మట మిగిలేది ఏమీ లేదు - శూన్యం మాత్రమే. చార్వాకులు ఇదే అన్నారు.

నాగార్జునాచార్యులు శూన్యం అనే మాటను ఆదిబౌద్ధం నుండి స్వీకరించారు. దానికి కొత్త అర్థమిచ్చి సత్యద్వయ భావనకు రూపకల్పన చేశాడు.

ఏదీ మిగలకపోతే నిరంతరాయత అవిచ్ఛిన్నత ఎక్కడ? ఇందుకు చార్వాకులు సమాధానం చెప్పలేదు. బుద్ధుడు చెప్పాడు. వ్యక్తి నశిస్తాడు. సమష్టి కొనసాగుతుంది. అహంత నశిస్తుంది. తథత కొనసాగుతుంది. ఇది చాలా ఆధునికమైన సామాజికదృష్టి శాస్త్రీయమైనది కూడా. సర్వవైనాశిక నిర్వాణభావం, మహాయానకాలం నాటికి శాశ్వతత్వ నిర్వాణభావంగా రూపొందడం బౌద్ధంలోని రూపాంతరానికి తార్కాణం.

జ్ఞానసంపాదనా తర్కంలో ఆచరణకు ప్రాధాన్యమిచ్చిన వారు ఒక్క నైయాయిక్‌లు మాత్రమే.

ఆచరణ జ్ఞానానికి గీటురాయి. ఒక మనిషి ఒక చోటినుండి మరొకచోటుకి నడుస్తున్నాడు. కళ్ళతో మనము చూస్తున్నాము. ఇది వాస్తవం. నడక లేదు, నడుచువాడు లేదు

అదే నాగార్జునుని తర్కం వాస్తవికతను నిరాకరించి ఊహాప్రపంచంలో తేలి ఆడటం. తర్కం మాటలగారడీ కారాదు. ఎప్పటి కప్పుడు వాస్తవికతలో పోల్చుకొని నిలదొక్కుకోవాలి. "సహోపలంబ నియమం" అని నైయాయికులు చెప్పినది ఇదే.

అప్పుడప్పుడు మన ఇంద్రియాలు మోసపుచ్చుతాయి కదా! అవును.... అదే భ్రాంతి. భ్రాంతిని తొలగించుకోవడానికి ఆచరణ గీటురాయి. మృగతృష్ణను చూచి జలాశయం అనుకుంటాము. కనుక ఇంద్రియజ్ఞానం నమ్మతగింది కాదు, అని శంకరుని వాదన. నీరున్నదీ లేనిదీ పరీక్షించేందుకు రసనేంద్రియం ఉన్నది కదా అని నైయాయికుల సమాధానం. ఇంద్రియజ్ఞానం తార్కికజ్ఞానంగా రూపొందడానికి ఆచరణ, ఆలోచన వారధి. ఆ వారధిపై ముందుకు సాగవలె నని నైయాయికులు అంటారు. కాని, వెనక్కు పోతానని శంకరులు అంటారు.

నాగార్జునుడు అంతదూరం వెళ్ళలేదు కాని, ప్రతీత్యసముత్పాదానికి శూన్యం అనే పర్యాయపదం చేర్చడం ద్వారా ఈ మేధోతిరోగమనానికి ప్రాతిపదిక వేశాడు.

ఇంతచెప్పినా మాధ్యమికవాదబౌద్ధం, వైదికఅద్వైతం కంటే మెరుగే. ఆ మెరుగు తాత్వికరంగంలో కాదు. సామాజికరంగంలో.

అవసానదశలో సైతం బౌద్ధం వర్ణవ్యవస్థను సమర్థించలేదు. అందుకు వ్యతిరేకంగా పోరాటం జరపకపోవచ్చు. మహాయాన, వజ్రయాన దశలలో సైతం సాంఘిక సమతాభావానికే కట్టుబడివుంది. జైనం వర్ణవ్యవస్థతో రాజీ పడ్డది. జైనబ్రాహ్మణులు చాలామంది వున్నారు. ఆరాధ్యశైవులవలే .... కాని బౌద్ధబ్రహ్మణు లెవరూ లేరు.

యజ్ఞశ్రీ శాతకర్ణికి నాగార్జునాచార్యులు వ్రాసిన సుహృల్లేఖ లౌకికరాజ్యాంగవ్యవస్థకు పునాది. నిరంకుశ రాచరికవ్యవస్థకు అవసరమైన రాజనీతిని బోధించింది — కౌటిల్యుని అర్థశాస్త్రం. రాజు అందరినీ అనుమానిస్తూ ఒకరిమీద ఒకరిని రెచ్చగొడుతూ మాత్రమే బ్రతకగలడు — అని కౌటిల్యునిసిద్ధాంతం. అలా కాదు ప్రజలందరిని జాతి, మత, కులవివక్షతలకు అతీతమైన సమదృష్టితో చూడడమే రాజ్యాంగభద్రతకు దృఢమైన పునాది యని సుహృల్లేఖ బోధిస్తున్నది. శాతవాహనరాజులు ఉదారపరిపాలకులు. నాగార్జునాచార్యుని బోధనలను పూర్తిగా కాకపోయినా కొంతవరకు పాటించినవారు.

నాగార్జునుడు స్థాపించిన విశ్వవిద్యాలయంలో దేశదేశాల విద్యార్థినీ విద్యార్థులకు ఎట్టి వివక్షతలేకుండా ప్రవేశం కల్పించడంలోనే అతని విశ్వమానవసమతాదృష్టి కనిపిస్తున్నది. వైదిక విద్యాకేంద్రాలలో "నీ జాతి ఏమి ?" అనేది మొదటి ప్రశ్న. బౌద్ధంలో ఆ ప్రశ్నేలేదు.

ఉరిశిక్షను రద్దుచేయాలని నాగార్జునుడు చేసిన సూచన అతని మానవతకు చిహ్నం.

వేదప్రామాణ్యం అంగీకరించనివారంతా నాస్తికులనే దూషణకు గురైనారు. నాగార్జునుడు అందుకు మినహాయింపు కాడు. ఈ దూషణకు సమాధానంగా నాగార్జునుడు ఈ క్రింది నిర్వచనం ఇచ్చాడు.

"కర్మకు ఫలిత మున్నది అనువాడు ఆస్తికుడు. లేదనువాడు నాస్తికుడు."

కార్యకారణ సూత్రప్రాశస్త్యాన్ని పై సమాధానం ద్వారా నాగార్జునుడు నిరూపించాడు. మాయావాదులే నిజమైన నాస్తికులు అన్నాడు. మంచిదే. అయితే అందుకు సన్నిహితంగా వుండే శూన్యవాదాన్ని తానే ప్రతిపాదించాడు కదా! బహుశా శూన్యవాదభావం ఆయనలో అప్పటికి పరిపక్వం కాలేదేమో! లేక వాదనకొరకు పైమాట అన్నారేమో!

నాగార్జునుని రచనల నన్నిటినీ వరుసక్రమంలో అధ్యయనంచేస్తేనే ఈ సమస్యకు సమాధానం వస్తుంది. అది ఇప్పట్లో జరిగే పని కాదు.

క్రీ.శే. జి. వి. కృష్ణరావుగారు తమ గ్రంథం 'విగ్రహవ్యావర్తిని' ద్వారా ఈ సర్వ విషయాలను తెలుగువారికి అందించారు. మూలాన్ని అనువదించడమే కాక 130 పేజీల ప్రస్తావన వ్రాశారు. అది ఒక ప్రత్యేకగ్రంథం. ఈ ప్రస్తావన లేకపోతే మూలానువాదం అర్థం కాదు. నాగార్జునాచార్యుని బోధనలను ఇంతగా ప్రచారంలో పెట్టిన కృష్ణరావుగారు తెలుగు సాహిత్యానికే కాక తాత్వికచింతనకే ఎంతో సేవచేశారు. వారి యితర సాహిత్యకృషి అంతా ఒకఎత్తు....ఈ ఒక్క గ్రంథం ఒక ఎత్తు.

శూన్యవాదంపట్ల కృష్ణరావుగారికి అభిమానం హెచ్చు. 'అదే అత్యున్నత సిద్ధాంతంగా వారు భావిస్తున్నారా'? అనిపిస్తుంది. అట్టి అభిమానమే ఈ గ్రంథరచనకు ప్రోత్సహించి ఉండవచ్చు. కాంట్‌తో నాగార్జునుని పోల్చారు. ఐన్‌స్టీన్ సాపేక్షక సిద్ధాంతచ్ఛాయలు శూన్యవాదంలో వున్నవని వీరి అభిప్రాయం.

ఈ పోలికలు తాత్వికంగా సరైనవి కాకపోవచ్చు. శూన్యవాదం మాయావాదానికి మాతృక అని కృష్ణరావుగారు ఆమోదించకనూ పోవచ్చు. తాత్వికచర్చలలో ఇట్టి మత భేదాలు ఎప్పుడూ వుంటాయి.

'విగ్రహవ్యావర్తిని' రచన ద్వారా నా మిత్రులు కీ. శే. కృష్ణరావుగారు ఒక బంగారు గనిని త్రవ్వారు. ఇంకా ఎన్నో ఇలాంటి తాత్వికమైన త్రవ్వకాలు జరగవలసివుంది. ఈ కృషి శతధా ప్రశంసనీయం.

[కీ. శే. కృష్ణరావుగారు నేను 1936 - 37 సం॥లో గుంటూరులో ఆంధ్ర క్రైస్తవ కళాశాల విద్యార్థులం. వారు నాకంటే ఒక తరగతి పైనవుండేవారు. ఆనాడు మాది దూరపరిచయం మాత్రమే. చాలాకాలనికి విజయవాడ ఆకాశవాణిలో వారు ప్రవేశించిన మీదట పాతమిత్రులం సన్నిహిత లయ్యాము. వారి స్మృతికి ఇది నా వ్యాసతర్పణం.]

# కావ్యజగత్తునుంచి - జగత్కావ్యం వైపు

— 'జ్యేష్ఠ'

['జ్యేష్ఠ'గా ప్రసిద్ధులైన ఐ.సి.హెచ్.వి. బసవరాజుగారు 1939 లో జన్మించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కళాశాలలో రీడరు, శ్రీకృష్ణుడు, శంకరాచార్య, మార్క్స్, మహర్షి మహేష్ యోగు లను అభిమానిస్తారు. "ట్రాన్సెన్‌డెంటల్ మెడిటేషన్" ద్వారా నవ సమాజనిర్మాణం వీరి జీవితలక్ష్యం.]

*　　　　*

నవల, నాటకం, కథ, కావ్యం...అన్ని సాహిత్య ప్రక్రియలలోనూ తన ప్రతిభనూ సృజనాశక్తినీ ప్రదర్శించిన శ్రీ జి.వి.కె. (డాక్టర్ జి. వి. కృష్ణరావు) సాహిత్యవిమర్శలో క్రొత్తబాట ఏర్పరినారు. కావ్యశిల్పంలో శ్రీ పిన్నకోట మాధవరావు చెప్పినట్లు "కావ్యకల్పన యందు కవికి కావ్యశరీర వివిధాంగనిర్మాణశిల్పజ్ఞాన మెంత యవసరమో విమర్శకునకు కూడా అంతియే యవసరమనియు, కావ్యములో కవి యాత్మీయత ప్రదర్శించుటకు గల సదవ కాశము విమర్శకునకు ఉండదనియు, అందుచే కవికి గల భావుకత్వమును మించిన భావు కత్వము, సంయమనము విమర్శకునకు, కావలయునని భావించవలయును." ఈ ప్రకారం చూస్తే తెలుగు సాహిత్యవిమర్శకులు చాలామంది చేసేది విమర్శ కాదనీ, వాళ్ళ సొంత అభి ప్రాయాల ప్రకటన మాత్రమే ననీ తేలుతుంది. భావుకత్వం, మేధాశక్తి, లోకజ్ఞానం, పాండిత్యం సమపాళ్ళలో ఉన్నవాడే మంచి విమర్శకుడు. అలాంటి సద్విమర్శకులు కొద్ది మందిలో డాక్టర్ జి. వి. కృష్ణరావు ప్రథమశ్రేణికి చెందినవారు.

శ్రీ జి. వి. కె. రచించిన మొదటిగ్రంథం "కావ్యజగత్తు" అప్పటికే రాడికల్‌హ్యూమ నిస్టు ఆయన. రచయిత దాన్ని మార్క్సిస్టు దృక్పథం అని ఎందుకన్నారో తెలీదు కాని, సగటు మార్క్సిస్టులకు ఉండే భారతీయ సంప్రదాయం అంటే మడీ, ఆచారం ఇందులో మచ్చుకైనా లేకపోవడం మనకు ముచ్చట గొల్పుతుంది. ఈ 83 పేజీల పుస్తకంలో మార్క్సిజాన్ని ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని, ప్రాచీన అలంకార శాస్త్రాలనీ సమన్వయం చేసి కొత్తసాహిత్యసిద్ధాంతాన్ని ప్రతిపాదించటమే రచయిత లక్ష్యం. పూజా పునస్కారాలు లేక బూజుపట్టిన ప్రాచీనుల సిద్ధాంతాలు: పుట్టడమే దోషభూయిష్ఠంగా పుట్టినవి. మార్క్స్, ఫ్రాయిడ్ వాదాలు! పాతవాటిని బూజు దులిపి వాడుకోడం, కొత్తవాటికి పుటాలు పెట్టి శుద్ధి చేసి సాధుత్వాన్ని కలిగించడం నిజమైన ప్రతిభ ఉన్నవాళ్ళు చేసే పని. ఎంతో సూక్ష్మ దృష్టి, భావసంయమం ఉంటే తప్ప ఈ యత్నం విజయం కాదు. అందుకే "కావ్యజగత్తు"కు తెలుగుసాహిత్యంలో అపూర్వస్థానం.

కావ్యజగత్తు చదువుతుంటే, శ్రీశ్రీ కవిత్వం నించి వచ్చే "థ్రిల్" లాంటిది వస్తుంది. కాదా మరి? సద్విమర్శకుడు కవులను మించిన కవి. అలాంటి విమర్శకుడు శ్రీ జి.వి.కె. వివిధ ప్రాచీన, ఆధునిక కళాసిద్ధాంతాలనూ, వాదాలనూ ఆయన క్లుప్తంగా చర్చిస్తారు; సమాజానికీ కళకీ భాష ద్వారా ఏర్పడిన అవినాభావసంబంధాన్ని చిత్రిస్తారు; కళలలో కవిత్వానికి గల ప్రత్యేకస్థానాన్ని, విశిష్టలక్షణాన్ని వివరిస్తారు; కావ్యశిల్పానికీ, స్వప్నశిల్పానికీ గల భేదాభేదాలను గమనిస్తారు. చివరకు మార్క్స్ చారిత్రక భౌతికవాదాన్ని సమాజ సాహిత్యపరిణామాలకి మూల సూత్రముగా స్వీకరించి దాని కోసం విలువైన కొన్ని పేజీలు రచించారు. తెలుగులో "కావ్యజగత్తు"లాంటి పుస్తకం న భూతో న భవిష్యతి.

కావ్యజగత్తు నార్లవారి మాటల్లో "–వ్రాసింది 82 పేజీలే అయినప్పటికీ ఒక జగత్తును దానిలో యిమడ్చగలిగారు. మీ పుస్తకం యెంత సంగ్రహంగా ఉందో అంత సమగ్రంగా ఉంది. మీరు వ్రాసిన ఒక్కొక్క వాదనం సూత్రం వలె ఉన్నదంటే ముఖస్తుతి చేస్తున్నానని అనుకోబోకండి". అలాగే శ్రీ కొడవటిగంటి కుటుంబరావు "కావ్యజగత్తు" అపూర్వమైన పద్ధతిలో సాహితీజిజ్ఞాసువు లందర్నీ వేధించే ప్రశ్నలకు సవ్యమైన సమాధానం ఇస్తుందంటూ "ఈ దృష్టి సాహిత్య వాతావరణంలో విస్తరించిన నాడు మనం సవ్యమైన సాహిత్యం సులువుగా సృష్టిస్తాం" అని ఆశించారు. కాని ఆయన ఆశించినలాంటి సాహిత్యం ఇంత వరకూ ప్రజలకు లభించనే లేదు.

"విశేషంగా పొగడదగినది" అంటూ 'కావ్యజగత్తు'ను గురించి శ్రీ అబ్బూరి రామకృష్ణ రావు అన్న మాటలు గమనార్హం...."విశ్వసాహిత్య దృష్టిలో చెప్పుకో దగ్గ మహాకవిగాని, కావ్యం గాని నేటివరకూ అవతరించలేదు. దీనికి ప్రబలమైనకారణం లోకవృత్తానికీ, మన సాహిత్యానికీ కలిగిన విరోధం–" ఆ తర్వాత శ్రీశ్రీ "మహాప్రస్థానం" ఒక్కటి వచ్చిందికాని శ్రీ అబ్బూరి 1942లో ఇచ్చిన తీర్పు ఇప్పటికి 1980కీ నిజమయ్యే ఉంది. నేటి రచయితల అధ్యయనంలో లోపం లేదు; కాని, నిజమైన సాహిత్య, సృష్టికి ప్రాణంలాంటిది మరేదో ఉండాలనీ, అది ఉండటం లేదనీ తెలుతోంది. అదేమిటో శ్రీ జి. వి. కె. వివరించారని ఈ వ్యాసం చివరకు తెలుస్తుంది.

'సరియైన సామాజిక దృక్పథం ఉండాల్సిందే. దాని కాధారం మార్క్సిజం కావచ్చు, వార్తాపత్రికలు కావచ్చు. మార్క్సిజం క్షుణ్ణంగా చదివి దాన్ని జీవితానికీ, కళకీ అన్వయిస్తే మంచి సాహిత్యం వస్తుందనడం హాస్యాస్పదం. మార్క్సిజం గత నూరేళ్ళకు పైగా సమాజంలో వ్యాపించి ఉంది. కాని తెలుగులోనే కాదు; ఏ భాషలోనూ మార్క్సిస్టులు మహాకావ్యాలు, నవలలు ఇంతవరకు రాయలేదు. మార్క్సిజానికి, కళకూ చుక్కెదురు. కళకు లక్ష్యం ఆనందం అని అలంకార శాస్త్రం అంటే, కాదు; రాజకీయ ప్రయోజనం అంటుంది మార్క్సిస్టు సిద్ధాంతం. ఈ రెండు వాదాలకీ పొత్తెక్కడ ? రైలు పట్టాలు ఎక్కడో దూరంగా కలుస్తున్నట్లు కనిపిస్తాయే, అలాగే రాజకీయలక్ష్యాలు, కళాలక్ష్యాలు కలుస్తాయనే భ్రమ క్రిస్టఫర్ కాడ్వెల్‌కీ, కావ్యజగత్తు రచయితకి కూడా ఉండేది. కాని. నీతి వేరు, రాజనీతి వేరు: కళలో వచ్చే ఆనందం వేరు. భౌతికసుఖం వేరు. ఇది కామన్ సెన్స్.

'కావ్యజగత్తు'లో ఎన్నో సుగుణాలతోబాటు లోపాలు గూడ ఉన్నాయి. దాన్ని ప్రామాణికగ్రంథం అనడం శ్రీ జి. వి. కె. ని అవమానించడమే. అందులోని తన అభి ప్రాయాలన్నిటినీ ఆయనే తర్వాత వదులుకున్నారు. రెండోలోపం (అంతర్గతం). పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు. స్థలాభావంవల్ల మూడు ఉదాహరణలు మాత్రం ఇస్తున్నాను.

1. "నేను కేవలం కళకోసమే వ్రాశానన్న ఆస్కార్‌వైల్డ్ యొక్క పిక్చర్ ఆఫ్ డొరియన్‌గ్రే కూడ జీవితంలోంచి బయలుదేరిందే. ఆ పుస్తకంలోనిది ప్రత్యేకప్రపంచం కాదు. దానిలో ప్రాపంచిక జీవితం, శ్రేయస్సు ఉన్నాయి. ప్రాపంచికానుభూతి గలిగిన

పాఠకుడే ఆ పుస్తకాన్ని చదివి ఆనందించగలుగుతున్నాడు. కాబట్టి యీ వాదన నిలువదు" (2, 3 పేజీలు).

ఆస్కార్‌వైల్డ్‌ది చారిత్రక భౌతికవాదం కాదు, కాని అతని రచనవల్ల ఆనందం, శ్రేయస్సు లభిస్తున్నాయని శ్రీ జి. వి. కె. అంగీకరిస్తున్నాడు. చారిత్రక భౌతికవాదం సాహిత్యసృష్టికి అనవసరం అని తేలిపోయింది కదా!

2. "బోడితలకూ మోకాలికీ ముడిపెట్టినట్టుగా, ఈసాహిత్యసిద్ధాంతం (సర్రిలియజం) ఫ్రాయిడ్ సిద్ధాంతానికీ, మార్క్సిజానికీ లంకె వేసింది .... .... యీ సిద్ధాంతాలు కలుపు మొక్కలు పెంచడానికి వచ్చినవే కాని, పూర్వ కావ్యాలను కాని, ఇప్పటి కావ్యస్వరూపాన్ని కాని, ముందు రాబోయే కావ్యస్వరూపాన్ని కాని అర్థం చేసుకొని ఆనందించటానికి తోడ్పటం లేదు" (పే. 4, 5).

" .... ఫ్రాయిడ్, ఇతని శిష్యులైన జంగ్, ఎడ్లర్ సిద్ధాంతాలు చాలా సమస్యల్ని పరిష్కరిస్తున్నాయి" (పే. 17).

ఆ తర్వాత చాలా పేజీలు ఫ్రాయిడ్‌తో నిండి ఉంటాయి. 'మార్క్సిస్టు దృక్పథం'లో ఫ్రాయిడ్‌కి కూడా స్థానం ఏర్పడింది!

3. "కవిభావన దైవప్రేరణవల్ల లోకాన్ని అతిక్రమించి పోతుందని చాలామంది అభిప్రాయం .... ఇలాంటి అభిప్రాయం. ఆధునిక శాస్త్రులు కష్టపడి పరిశోధించి కనుగొన్న సత్యాలను గుర్తించలేదని తెలుపుతుంది" (పే. 17).

పింగళి సూరన కావ్యసిద్ధాంతం (విశిష్టాద్వైతం ప్రకారం) కవిభావన దైవప్రేరణవలన లోకాన్ని అతిక్రమించి పోతుందనే; ఆమాటకొస్తే దైవమే తన భక్తుడైన కవిద్వారా పలుకుతాడని. కళాపూర్ణోదయం మీద శ్రీ జి. వి. కె. వ్రాసిన Ph.D. థీసిస్ చివరి వాక్యాలు ఇవి. "Apart from these three minor faults Kalapurnodayam is superb and Unique. In conception and presentation, in plot and character delienation, and in breadth and depth, it is marvellows and occupies a high place in the best literary works of the world". సాహిత్యానికి సార్వకాలీనత, సార్వజనీనత వున్నాయని తేలిపోయాక, చారిత్రక భౌతికవాదం పరిమిత సిద్ధాంత మని వేరే

చెప్పనక్కర్లేదు. పింగళి సూరన అపురూప మహాకావ్యంలో మూడు చిన్న లోపాలున్నా యంటారు శ్రీ జి. వి. కె. చారిత్రక భౌతికవాదాన్ని పూర్ణసత్యదర్శనంగా భావించినవాళ్ళ కవిత్వంలో అయితే ఒక్క లోపమే ఉంటుంది. కవిత్వం వ్రాయబూనటం. మార్క్సిస్టు మహామేధావి క్రిష్టఫర్ కాడ్వెల్ మార్క్సిజం స్వీకరించగానే కవిత్వం నశించడం కొందరు కవులతో చూశా నంటాడు. ఆర్థిక అవసరాలకి ఈశ్వరత్వం ఆపాదిస్తుంది మార్క్సిజం; అదొక నేలబారు సిద్ధాంతం. అంటే జీవితంలో కొన్ని విషయాలకే వర్తిస్తుంది; పూర్తిగా నిష్ప్రయోజనం కాదు.

భారతీయదర్శనాలు మార్క్సిజంలా కాకుండా సృష్టిలోని అన్ని శక్తుల్నీ దర్శించినవి. వాటిని స్థూలం, సూక్ష్మం అని విభజించి, "స్థూల భౌతికాచరణ, సామాజికాచరణ, సూక్ష్మ భౌతికాచరణ, ధ్యానం" అన్నాయి. స్థూలం కంటే సూక్ష్మంలో శక్తి, చైతన్యం ఎక్కువ కనుక, సూక్ష్మంలో మోక్షం అన్నాయి. సిద్ధాంతం చాలదు; ఆచరణ ఉండాలి. ఆచరణనే యోగసాధన అన్నారు. యోగసాధన ద్వారానే మనిషికి పూర్ణవికాసం వస్తుంది.

All life is Yoga అంటారు శ్రీ అరవిందులు. భావం, మాట, పని. ఈ మూడింటికీ సామరస్యం సాధించాలనే ప్రతి మానవుడి ఆరాటమూను. చిత్తశుద్ధితో ఏం చేసినా యోగమే. శ్రీ జి.వి.కె. మార్క్సిజంలో అంతేకాకుండా ఇతర దర్శనాల అధ్యయనం చాలా తీవ్రంగా చేశారు. తత్ఫలితంగా మార్క్సిజం, రాడికల్ హ్యూమనిజంలలో ఉండే పరిమితులు తెలిశాయి. ఆ వెంటనే ఆయన జీవితంలోకి వచ్చింది కళాపూర్ణోదయం రెండర్థాలతో. (కళాపూర్ణోదయంపై ఆయన Ph. D. థీసిస్ వ్రాశారు; ఆయన కళా స్వరూప జ్ఞానమూ పూర్తిగా ఉదయించింది.) అదొక మహోదయం. గొంగళిపురుగు సీతాకోక చిలకై విహరించినట్లు శ్రీ జి. వి. కె. భావన అద్భుతంగా వికసించింది.

శ్రీ జి. వి. కె. కళాపూర్ణోదయ విమర్శ ప్రపంచ సాహిత్యంలోనే ఒక అపురూపం. అదే కాలంలో ఆయన ఆచార్య నాగార్జుని 'విగ్రహ వ్యావర్తని' అనే అద్వైతగ్రంథాన్ని అధ్యయనం చేయడం, అనువదించడం, పరమ ప్రమాణంగా స్వీకరించడం జరిగాయి. 'విగ్రహ వ్యావర్తని' (అనువాదం, వ్యాఖ్యానం) వేదాంత తత్వవేత్త పండిత గోపదేవ్‌కి అంకితమై, మరొక తత్వవేత్త శ్రీ వేలూరి శివరామశాస్త్రి హర్షాన్నీ, ప్రశంసనూ పొందింది. పుట్టుకతోనే జిజ్ఞాసువు శ్రీ జి. వి. కె. మార్క్సిజం ఆయన అన్వేషణలో ఒక మైలురాయి; ఒక మెట్టు; చాలా అవసరమైన ఘట్టం. దాని ప్రభావమే ఆయన అద్వైత వేదాంతానికి ఒక నిండుదనం

ఇచ్చింది; వేదాంతుల మూఢ నమ్మకాల బారినుంచి ఆయనను కాపాడింది.

ఈ తాత్త్వికచర్చ ఎందుకంటే, ప్రతి సాహిత్యవిమర్శలోనూ విమర్శకుని జీవిత దృక్పథం ఉంటుంది. 'కావ్యజగత్తు' లో శ్రీ జి. వి. కె. అన్నట్లు ఆలంకారికుల వివిధ కళాసిద్ధాంతాల వెనుకనూ వాళ్ళ వాళ్ళ తాత్త్వికసిద్ధాంతాలు (న్యాయం, మీమాంస, శివాద్వైతం వగైరాలు) వున్నాయి. మార్క్సిజం తృప్తికరమైన అలంకారశాస్త్రానికి హేతువు కాజాలదు. ఈ సత్యాన్ని అంత చిన్న వయస్సులోనే 'కావ్యజగత్తు' నాటికే గుర్తించిన ప్రతిభాశాలి శ్రీ జి. వి. కె. మార్క్సిజంలో ఫ్రాయిడ్ మతం, ప్రాచీనాలంకారికుల సిద్ధాంతాన్నీ ఇమడ్చాలని విఫలప్రయత్నంచేశారు.

కాని మార్క్సిజం ఏది భౌతికమో ఏది అభౌతికమో తెలియని భౌతికవాదం. దానికి అసహనం ఎక్కువ ఇతర సిద్ధాంతాలని దగ్గరకు రానీయదు. కాని అద్వైతం దానికి సరిగ్గావ్యతిరేకం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అంటుంది. నారింజపండు తొక్క ఎప్పుడూ తీయగా ఉండదు; కాని నారింజపండు అన్నప్పుడు తొక్కతో సహానే భావిస్తాం. లోపల తియ్యగా ఉంటుంది. కనుక నారింజపండు తీయన అంటాం. స్థూలదృష్టి పండులో రసాన్ని చూడదు; తొక్కనే చూస్తుంది. అలాగే జీవితమూను మార్క్సిజం జీవితానికి స్థూల అవగాహన వేదాంతం స్థూలం, సూక్ష్మం, కారణం అని మూడు శరీరాలను గుర్తిస్తుంది. మనిషిలో శరీరానికీ మనస్సుకీ ఉన్న అవినాభావసంబంధాన్ని, వ్యక్తికి సమష్టికీ ఉన్న ఏకతను దర్శించారు ఋషులు. జీవితం సత్యం, శివం, సుందరం అన్నారు.

నాట్యశాస్త్రానికి మూలం ఎవ్వరు? నటరాజైన ఈశ్వరుడు. కళ జీవితం అంతటా ఉంది; కాని అంతర్గతంగా ఉంది. పైపైన చూస్తే 'చేదు విషం జీవఫలం', లోతుగా చూస్తే 'కవితామయమేనోయ్ అన్నీ.' మళ్ళీ మాట్లాడితే 'కాదేదీ కవిత కనర్హం'. ఈ మధుర రహస్యాన్ని ప్రాచీన ఆలంకారికులు, మహాకవి శ్రీ శ్రీ తోబాటు నిజమైన కవులూ, శ్రీ జి. వి. కె. గుర్తించి, అనుభవించి, పరవశించారు. జి.వి.కె. సహజభావుకత అద్వైత జ్ఞానంలో సంపూర్ణవికాసంపొందింది. కళాపూర్ణోదయ కావ్యంలోని అన్ని అందాలనూ మన కందించడమేకాక, ఇతర విమర్శకులు గమనించని మరో గొప్ప విషయాన్ని ప్రకటించింది.

'కళాపూర్ణోదయ విమర్శ' ప్రాశస్త్యాన్ని మాటల్లో చిత్రించే శక్తినాకు లేదని విన్నవిస్తున్నాను. "కళాపూర్ణోదయ కావ్యతత్త్వమును చెప్పబూనుట సముద్రమున కేతము పట్టుట." అని డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు అన్నట్లే శ్రీ జి. వి. కె. థీసిస్ గురించి నేనూ అంటాను. సుబ్రహ్మణ్యగారి మాటల్లో "అట్టి మార్గమున (ప్రాచ్య, పాశ్చాత్య సిద్ధాంత సమన్వయదృష్టితో) నడిచి డా॥ జి.వి. కృష్ణరావు గారు కళాపూర్ణోదయ కావ్యప్రాశస్త్యమును నిరూపించు గొప్ప గ్రంథము రచించినారు. అది 'Studies in Kalapurnodayam'. అందు వారు పింగళిసూరన విశిష్టాద్వైతసిద్ధాంతము ననుసరించి సమగ్రకావ్య కళావిష్కార సిద్ధాంతమును తను కావ్యమున ప్రవచించె నని ప్రతిపాదించినారు. పూర్వ విమర్శలకు సమాధానము లిచ్చినారు. ఇక్కడ పూర్వవిమర్శకులు శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, సర్ సి.ఆర్. రెడ్డి ప్రభృతులు. వారి విమర్శలకు శ్రీ జి.వి.కె. ఇచ్చిన సమాధానాలు చదువుతుంటే వీరావేశం వస్తుంది. నిజానికి కళాపూర్ణోదయానికి మొట్టమొదటగా రావలసిన గుర్తింపు తెచ్చినవారు రెడ్డిగారే కాని ఆయనకు కొన్ని ఘట్టాల్లో సంప్రదాయవ్యతిరేకవాసనలు గట్టిగా పట్టుపట్టడం చేత 'సహృదయత' అక్కడక్కడ తెర వెనుకనే ఉండిపోయి హేతువాదం, శాస్త్రీయదృక్పథం అనవసరంగా కలగజేసుకున్నాయి. మణిహార వృత్తాంతం నిండా యాదృచ్ఛికమైన మలుపులుండడం ఆయనకు నచ్చలేదు. అలాగే పింగళి సూరన అద్వైతి అనీ, కృతిభర్తను మెప్పించడానికి కక్కుర్తితో వైష్ణవం (విశిష్టాద్వైతం) నటించాడనీ గేలి చేశారు; అంతతేలికగా ప్లేటు ఫిరాయించే లక్షణం ఉన్నవాడు మహాకవి ఎలా అవుతాడో అనే ఆలోచనే రాలేదాయనకి. అలాగే ఆరో ఆశ్వాసం 192 వ పద్యం తర్వాత కావ్యం అనవసరంగా పొడిగింపబడిందన్నారు శ్రీ రెడ్డి. సౌందర్యం, ఔచిత్యం, ఆవశ్యకత లోపించా యన్నారు. శ్రీ జి. వి. కె. ఈ నిందలను ఖండించి, చివరిభాగంలో కావ్యసౌందర్యంలో ఏమీ లోపించ లేదనీ ఆ మాటకొస్తే కావ్యాన్ని ఆరవ ఆశ్వాసంలో ఆపేస్తే పాఠకులకు ఎలా చికాకు, అసంతృప్తి కలిగేదో, కథ అర్థాంతరంగా ఉండిపోయేదో వివరించారు.

థీసిస్‌లోని పై విషయాలు ఒక యెత్తు; కావ్యంలోని అలంకారశాస్త్రాన్ని గుర్తించి ప్రదర్శించడం మరో యెత్తు. శ్రీ జి. వి. కె. కనుగొన్న రహస్యం ఇది: కళాపూర్ణోదయం మామూలు సహృదయతతో చదివితే ఒక అపూర్వ సంవిధానం కల్గిన (మొదటి) తెలుగు కల్పిత కథాకావ్యం; సూక్ష్మంగా చూస్తే విశిష్టాద్వైతసిద్ధాంత పరంగా రచించిన అలంకార శాస్త్రం. అంటే కళ అనేది ఎక్కడ ఎలా అంకురించి, ఎలా పూర్తిగా వికసిస్తుందో అనే

వివరణ ఈ కావ్యం అంతటా ఉంది. రెండర్థాల కావ్యానికి రెండర్థాలతో, రెండు రెండర్థాల కావ్యాల్ని సూరన రాశాడని, రాఘవ పాండవీయంలో రామాయణ, భారత కథలు కలిసి నడుస్తాయి. కళాపూర్ణోదయంలో కళాపూర్ణుడు అనే ధీరోదాత్త నాయకుని చరిత్రతోబాటు, 'కళ' అనే జీవితపరమార్థపు పుట్టుపూర్వోత్తరాల చరిత్ర కూడా ఉంది.

సూరన విశిష్టాద్వైతి. విశిష్టాద్వైతం ప్రకారం పరబ్రహ్మ శరీరమే ఈ చరాచర జగత్తు. జీవులందరూ పురుషోత్తముని వివిధ అంగాలు. జీవుడు పాక్షికపరిపూర్ణత. జీవాత్మ దేహానికి ఎలాగో, పరమాత్మ, జీవాత్మకి అలాగ. భక్తి, ఆత్మ సమర్పణం ద్వారా జీవుడు దేవుని దీవెనలు పొందితేనే కళాసృష్ట కాగలడు. శ్రీశ్రీ చెప్పినట్లు 'నీ ప్రాబల్యంలో చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో, నిశ్చల సమాధిలో' మాత్రమే, కవికి జగత్కావ్యంలోని కవిత్వం దర్శనమిస్తుంది. సృష్టి భగవంతుడు విరచించిన మహాకావ్యం; కవి సృష్టి (కావ్యం) ఆ సృష్టికి ప్రతిబింబం.

'కళాపూర్ణోదయం'లో కళాపూర్ణుడు అనే నాయకుని కథ బ్రహ్మ, సరస్వతికి చెప్పినట్లుంది. ఎప్పుడు చెప్పాడాయన ? ప్రణయకలహం సందర్భంగా. సరస్వతీ చతుర్ముఖులు ఒక మణి స్తంభంలో దగ్గరగా ప్రతిబింబించబడినప్పుడు. మణిస్తంభం అంటే దివ్యదృష్టి, కావ్యంలో మణిస్తంభుడు. సుముఖాసత్తి మణిస్తంభుడి భార్య; ఆ పేరుకి మరో అర్థం దగ్గర చేరడం (ఉపాసన) అని. ఈ దంపతులు కళాపూర్ణుడి తల్లిదండ్రులు.

కళాపూర్ణోదయంలో కళావిలసన 'చరిత్ర' ఉంది అనే రహస్యాన్ని గుర్తించిన శ్రీ జి. వి. కె. మొత్తం కావ్యాన్ని ఆ దృష్టితో వర్ణించడం చాలా హృద్యంగా ఉంటుంది. కళ దివినుంచి భువికి వస్తుంది; కాని భూమిమీదే జీవిస్తుంది. కళాపూర్ణుడి జన్మకు బీజం సత్యలోకంలో; ఎదుగుదల గంధర్వలోకంలో;జీవనం, విజయం భూలోకంలో. 'కళాపూర్ణుడు' అనేక రాజ్యాలను జయిస్తాడు. అలాగే కళ మనిషిలోని అధమత్వాన్ని నేలబారుదృష్టిని జయిస్తుంది. 'కళాపూర్ణోదయం'లో కథ, ఉపకథలు, పాత్రల పేర్లు, స్థలాల పేర్లు, పాత్రల తత్వం — ప్రతి అంశం ఏ విధంగా కళయొక్క పూర్ణోదయాన్ని చిత్రిస్తుందో ప్రతిభావంతంగా వివరిస్తారు శ్రీ జి. వి. కె.

'కళాపూర్ణోదయ విమర్శ' శ్రీ జి. వి. కె. ను ప్రపంచసాహిత్య విమర్శకులలో అగ్ర

శ్రేణికి తీసుకెళ్ళింది. ఆ తర్వాత ఆయన రచించిన 'నవ్యతోరణం' వ్యాసాలలోని పరిపూర్ణత సహృదయులకు పారవశ్యం కలిగిస్తుంది. వ్యాసంలో వస్తువు వ్యాకరణం కావచ్చు, పేరిగాడు కావచ్చు, ఛందశ్శిల్పం కావచ్చు, వేమన కావచ్చు, హృదయోల్లాసం కావచ్చు, సర్వజ్ఞ సింగభూపాలుడు కావచ్చు, కాని, ప్రతి వ్యాసంలోనూ శ్రీ జి. వి. కె. సమగ్ర విజ్ఞానం, సహృదయత, హృద్యమైన శైలి సాక్షాత్కరిస్తాయి.

జీవితం రెండర్థాల కావ్యం అయినట్లే, పురుషులందు పుణ్యపురుషు లున్నట్లే విమర్శకులలో రెండు రకాలు: విమర్శకులు, శ్రీ జి. వి. కె. వంటి విమర్శకులు.

మహానుభావుడు శ్రీ జి. వి. కె.

# "బొమ్మ ఏడ్చింది" – విలువల పరిశీలన

–అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

[రెడ్డిగారు 1933 లో జన్మించారు. ఫిలాసఫీలో ఎమ్.ఎ. పట్టం పుచ్చుకొన్నారు. తెనాలి వి. యస్. ఆర్. అండ్ యన్. వి. ఆర్. కళాశాలలో అధ్యాపకులుగా పని చేస్తున్నారు.

'సిగ్మండ్ ఫ్రాయిడ్' (జీవితం-సిద్ధాంతం).

'స్వప్న సందేశం' (స్వప్న మనోవిజ్ఞానం)

తాత్త్విక దృష్టిలో 'సంస్కృతి-నాగరికత' లు వీరి రచనలు.

'అందరికీ ఆవశ్యకమైన భౌతికవిజ్ఞానం' ప్రభుత్వ బహుమతి పొందిన ఉత్తమ అనువాద గ్రంథం.

ఈ వ్యాసం కృష్ణరావుగారి ప్రేరణపై ఆ రోజుల్లోనే 'బొమ్మ ఏడ్చింది' కోసం వ్రాయబడింది.

*　　　*　　　*　　　*　　　*

ఈ వ్యాసంలో నాటకంలోని నాటకీయత, రామణీయకతలను, నాటకవిలువలను రస నిష్పన్నతలను పర్యాలోచన చేయబోవటం లేదు. ఆ పని రసజ్ఞులైన, సంస్కారహృదయులైన విమర్శకులకు, పాఠకులకు సామాజికులకు వదలివేయబడింది. అయితే, ఈ నాటకం మతానికి, విలువలకు సంబంధించిన కొన్ని మౌలిక దార్శనిక విషయాలను స్పృశిస్తుంది కనుక

వీటిని అర్థం చేసుకోవడానికి పాఠకునికి ఒక విధమైన నేపథ్య అవగాహన అవసరము. అందుకే నా యీ ప్రయత్నము.

బ్రహ్మహత్య, గోహత్యలు మాత్రమే ఎందుకు నిషిద్ధాలు? నరమాంసభక్షణ చేయరాదు. ఎందుకని ? తల్లిపొందు కూడదు, కారణం ? సతీసహగమనం, పాటించడంలో ఔచిత్యమేమిటి ?—ఇలాంటి అనేక ప్రశ్నలకు హేతుపూర్వకంగా సమాధానం చెప్పలేము. కాని వీటికి దోహదం కొలదిగానో గొప్పగానో మతంనుంచి లభిస్తుందని చెప్పకతప్పదు. ఇటువంటివాటికి మతం ఎంతవరకు బాధ్యత వహిస్తుంది అనే విషయాన్ని అర్థం చేసుకోవడానికి "విలువ"లంటే ఏమిటో "మతం"అంటే ఏమిటో, ఈ రెండింటి మధ్య సంబంధమేమిటో, నీతికి, మతానికి, ప్రభుతకు, మతానికి గల సంబంధాలను అర్థం చేసుకోవలసి ఉంది. ఆ తరువాత ఈ చర్చ "బొమ్మఏడ్చింది"తో విలువల పరిశీలనకు అన్వయింపబడుతుంది. ఈ ప్రశ్న లన్నిటికి విడివిడిగా వివరంగా సమాధానం చెప్పడాన్ని గ్రంథవిస్తరభీతి నిషేధిస్తుంది. అందువలన "మిశ్రమన్యాయం" పాటింపబడుతుంది. విలువలకు కాని, మతానికి కాని, నీతికి గాని మూలం సంస్కృతి. ఇవి అన్నీ, సంస్కృతిలోని అంశాలే. సంస్కృతి మానవుని ప్రాథమిక జీవితావసరాల నుంచి పుట్టి, మానవునికి ప్రకృతి నుంచి రక్షణ కల్పించింది. సంస్కృతి అంటే? మానవుణ్ణి పాశవిక, ప్రాకృతిక స్థితి నుంచి వేరు చేసిన జ్ఞానం, జాతివిధానాలు, క్రియాశీలతల సమాహారము. ఆ యా సంస్కృతులను బట్టి ఆయా మతాలు విలువలు మారుతూ ఉంటాయి. అంతమాత్రంచేత సార్వత్రికమైన, సార్వజనీనమైన విలువలు లేవనికాదు. అలాగని వాటిని 'కేవలా'లని చెప్పలేము.

మానవుని వివిధజీవితరంగాలలో వివిధమైన విలువలు ఉన్నాయి. ఆర్థిక, రాజకీయ, నైతిక విలువలు, మత, సౌందర్య, సాహిత్యసంబంధులైన విలువ లున్నాయి. ఇన్ని రంగాలలో వివిధంగా ఉపయోగింపబడుతున్న ఈ 'విలువ'అనే పదానికి అర్థం ఏమిటి ? విలువను నిర్వచించడంలో దార్శనికుల మధ్య ఏకాభిప్రాయం లేదు. మనం చేసే నిర్ణయాలు రెండు రకాలు (1) విలువ నిర్ణయాలు (Value judgments) (2) విషయ నిర్ణయాలు (Factual judgements). విషయ నిర్ణయాలు సామాన్యంగా వస్తువర్ణనకు సంబంధించి ఉంటాయి. అంటే మద్రాసు నుంచి విజయవాడకు కొలిచే దూరం, వస్తువును తూచి బరువు, చెప్పడం లాంటివి. రుగ్మతకు లోనైన బంధువుని పలకరించి రావాలా, ఈ బొమ్మ అందమైందా? అనే నిర్ణయాలు విలువనిర్ణయాలు. అయితే విలువనిర్ణయాలు చాలావరకు విషయాల

మీద ఆధారపడతాయన్న సంగతి మరువరాదు. స్వయంవరంలో భర్తను ఎన్నుకొన డానికి వధువుకు వరులను గురించిన అనేక విషయాలు (గుణగణాలు, శౌర్యసాహసాలు, రూపవిలాసాలు తెలియాలి. శూన్యంలో విలువనిర్ణయం జరగదు.

'విలువ'అంటే ఒకరకంగా 'నచ్చడం, మెచ్చడం' అని చెప్పవచ్చు. ఇటువంటి నిర్వచనం వల్ల ప్రయోజనం లేదు. ఎందుకంటే దానిని ఋజువు చేయలేము, నిరాకరించ లేము. త్రోసివేయాలన్నా అంగీకరించాలన్నా ఏదో ఒక ప్రాతిపదిక కావాలి. ఈ దృష్టితో ఆర్. బి. పెరీ అనే ఒక అమెరికన్ దార్శనికుడు "ఆసక్తి (Interest) కరమైన ఏ వస్తువు కైన విలువ (Value) ఉన్నది"అన్నాడు. స్వాతంత్ర్యం మీది మనమందరం చూపించే "ఆసక్తి"యే దానికున్న 'విలువ'. ఇక్కడ మళ్లీ ఆసక్తి (Interest) అంటే ఏమిటి?" అనే ప్రశ్న ఉత్పన్న మవుతుంది. మళ్లీ అతడే దానిని ఇలా నిర్వచించాడు. "ఫలితాల ప్రత్యాశతో నియతమైన సంఘటనశ్రేణియే ఆసక్తి". ఒకవిషయం ఆసక్తికరం ఎప్పు డవుతుం దంటే, దానిమీది "ఆశ"మనలో దాని సిద్ధి, లేదా ఆసిద్ధి కోసం కొన్ని చేయవలసిన కర్మలను నిష్పన్నం చేయగలగాలి. ఈవిధంగా, స్వాతంత్ర్యపరిరక్షణార్థం, లేదా సంపాదనకోసం, తదనుగుణమైన కొన్ని పనులను చేసినప్పుడు, స్వాతంత్ర్యాన్ని ప్రసాదించే లేదా త్రోసివేసే కొన్ని సంఘటనలను ఎన్నుకొన్నప్పుడు "స్వాతంత్ర్యం' ఆసక్తికరమైన విషయ మవుతుంది. ఆసక్తి ఇక్కడ అవధానాని (Attention)కి, కుతూహలాని (Curiosity)కి సమానార్థకం కాదు. ఒక విషయానికి అనుకూలధోరణి (Approach)ని లేక వ్యతిరేక ధోరణిని సూచించే అర్థంలో ఆసక్తిని ఉపయోగిస్తాము. ఇది "అపేక్ష" "కాంక్ష", "అభిరుచి", "సంగం"లకు దగ్గరగా ఉంటుంది. కనుక ఇక్కడ ఆసక్తిని ఇష్టానిష్టతలు, ఆశాభయాలు, వాంఛ-పరిత్యాగాలు వీటియొక్క జాతి వాచకంగా ఉపయోగిస్తాము.

ఆడమ్ స్మిత్, మిల్‌లు 'ఔపయోగిక విలువ' 'వినిమయ విలువ' లను ఉపయోగించినా, వివిధసమాజాలను శాసించిన 'విశ్వాసాలు' కొన్ని విలువలను లేదా పరమ విలువలను (Ultimate values) ఆధారం చేసుకొన్నా యని భావించబడింది. మానవసంసారంలో కొన్ని విషయాలను కేంద్రంగా చేసుకొని ఆసక్తులు ఎలా ఏర్పడేవి, అవి ఎలా మిశ్రమ మయ్యేది, అవి ఎలా పెరిగి తరిగేది "విలువసిద్ధాంతం" వివరిస్తుంది. సార్వజనీనమైన మానవమహోద్యమాలనో, మహాకార్యాలనో, వ్యవస్థలనో పరిశీలిస్తే ఈ విషయం అర్థ మవుతుంది. మానవజీవితాన్ని నీతి, అంతరాత్మ, రాజకీయం, చట్టం, అర్థం, కళ, తత్వం,

విద్య, మతం యొక్క విలువల ద్వారా అర్థం చేసుకొంటాము. ముఖ్యమైన ఈ రంగాల విలువల సమాహారం, మొత్తం నాగరకత లేగా సంస్కృతి అవుతుంది. ఈ సంస్కృతి మానవసంసారానికి (existence) అర్థాన్నిస్తుంది.

కొందరు విలువను సంవేదనల, వాంఛల అభివ్యక్తీకరణ మంటే కొందరు ఉద్వేగం, అభిప్రాయం అన్నారు. "నచ్చినది, మెచ్చినది అంగీకరించినది, గౌరవించినది, ఇష్టపడినది, సంతోషించినది ఏదైన విలువే" అని బ్రైట్‌మన్ అంటే, "రెండు మార్గాలలో ఒకటి మంచిదని, రెండవది కాదని నిర్ణయించుకోవడానికి అవసరమైన ప్రాతిపదిక," అని డొరొతిలీ అంది. 'విలువ' అనిర్వచనీయ మని చెబుతూ, సత్యం, శివం, సుందరాలు అవ్యవహిత (immediate) ప్రత్యక్షానుభవా లంటాడు జి. ఇ. మూర్. తెల్లని వస్తువులను వదలి "తెలుపు"ను ఎలా అర్థం చేసుకోలేమో, అలాగే మంచి పనులను వదలి "మంచి"ని నిర్వచించలేము.

విలువను మనం సృజిస్తామా, కనుగొంటామా? అంటే విలువలు మనః కల్పితాలా లేక మనోబాహ్యాలా, లేక అసలు వాస్తవం ఈ రెండింటి మధ్య ఉన్నదా? ఇవి విలువ స్వభావానికి సంబంధించిన ప్రశ్నలు.

ఆత్మగతవాదులు విలువలు మనః కల్పితా లంటారు. ఇవి ఇష్టానిష్ట ఉద్వేగాలను తెలియజేస్తా యంటారు. జార్జి శాంతాయన "గుణజ్ఞతకు దూరంగా విలువలు లేవు" అన్నాడు ఆస్వాదనకు చైతన్యం, ఉద్వేగం అవసరము. విలువలు మానవునిలోని అహేతక ప్రవృత్తి (irrational nature) నుంచి అవ్యవహితంగా దుముకుతాయన్నారు కొందరు. అందాన్ని గురించి, మంచితనాన్ని గురించిన అభిప్రాయాలు యుగయుగానికి, వ్యక్తివ్యక్తికీ. సమాజానికి సమాజానికీ మారుతున్నాయి కనుక విలువలు ఆత్మగతాలు (Subjective) కావాలంటారు. పాత్ర బరువును గురించి, (చేతిలో ఎత్తి చూచి) పలువురు పలు అభిప్రాయాలు విలువరించినంతమాత్రాన, దాని బరువు ఆత్మగతం అవుతుందా! ఇది పూర్తిగా యథార్థం కాకపోయినా విలువలు కొంతవరకైన పరిశీలకుని మీద ఆధారపడక తప్పదు.

విలువలు బాహ్యప్రపంచంలో ఉంటాయని, చేయవలసిందల్లా వాటిని వెతికి పట్టుకోవడమే నని వస్తుగతవాదులు (objectivist) అంటారు. నేను ఒక ప్రదేశాన్ని

సుందరతరమన్నా నంటే, సౌందర్యం నేను అనడంలో లేదు. ఆ ప్రదేశం ఆకృతి, రంగు అమరికలలో ఆ సౌందర్యం ఉంది. నా నిర్ణయానికి వెలుపల ఆ అంద ముంది. దీని అర్థం సత్యం, శివం, సుందరాలు, గవ్వ, చెట్టు, పుట్టలాగ కాలాకాశాలలో ఉన్నాయని కాదు. ఇక్కడ తాత్పర్యం అవి మానవుని ఇష్టానిష్టాలకంటె, అపేక్షలకంటె స్వతంత్ర ప్రతిపత్తి ని కలిగి ఉన్నాయి. రసజ్ఞులంతా కళాఖండాన్ని కళాఖండ మనే ఏకాభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. మంచిచెడుగుల విలువలన్నీ అనుభవాధారాలంటాడు లెవిస్. అయితే మధ్యేవాదులు ఆత్మ - వస్తు (Subject - object) మధ్య సంబంధాన్ని ఆధారం చేసుకొని, విలువలు మనడానికి ఆత్మగత, వస్తుగతవిషయాలు రెండూ అవసరమే అంటారు వీరు. "మనస్సు లేక విలువలు లేవు, విషయాలు (వస్తువు) లేక విలువలు లేవు" అంటారు. ఇది అందరూ ఒప్పుకోవలసిన సత్యము. అందం ఆత్మగతమా వస్తుగతమా ! అంటే చెప్పలేము. ఆ వస్తువును దర్శించే ఆత్మకు సంతోషాన్ని కలిగించడంలో దానికున్న సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది. అంటే అందంవస్తుధర్మం కాక 'సంబంధధర్మం' అవుతుంది అంటాడుడ్యూకాసె (Ducasse) యస్.సి. పెపర్ "సందర్భవాదాన్ని (Contextralism) ప్రతిపాదిస్తాడు. ఇందులో మూడు విషయాలుంటాయి. మొదటిది, అకర్తృక (Impersonal) మైనది. అనుకూల పరిస్థితులలో, దర్శించడానికి వీలుగ, అక్కడ ఒక వస్తువు (కళాఖండం) ఉండాలి. రెండవది, ఆసక్తి ఉండి, ఇష్టపూర్తిగ చూచే సంస్కారవంతుడైన జీవి ఉండాలి. ఈ జీవి దానిని చూచినప్పుడు జ్ఞానం ఏర్పడుతుంది. మూడవది ఈ జ్ఞానం అతని అనుభవంతో, ఆసక్తితో సుసంపన్నమై, గాఢ మవుతుంది. అప్పుడ తనిలో ప్రతీకలు, కల్పన, భావాలు రంగంలోకి దూకుతాయి. ఫలితం సౌందర్యానుభవము. మొత్తం యీ పడుగుపేకల 'విరచన ఉపచయమే' అందము.

విలువల నిర్వచన మెంత కష్టమో వాటిలో ఎక్కువ తక్కువలను చెప్పటం గూడ అంతే కష్టము. మరి జీవితవ్యాపారం కొన్ని విలువలను మాత్రమే ఆధారం చేసుకొని సాగుతుంది ? 'ఏ విలువలు కోరదగినవి, ఏవి వర్జనీయాలు,' అనేది నిర్ణయించడ మెలా ? విలువల సంఖ్యను గురించిగాని, వాటి ప్రాముఖ్యాన్ని గురించిగాని ఏకాభిప్రాయం లేదు. అయితే అందరూ స్థూలంగా అంగీకరించిన కొన్ని సూత్రాలున్నాయి. మత సంబంధమైన నైతిక, సౌందర్య, భౌతిక, శాస్త్రీయ, ఆర్థిక విలువలను ఆధారం చేసుకొని జీవితం కొనసాగుతుంది. జీవితావసరాలను ఆధారం చేసుకొని విలువల ప్రాముఖ్యాన్ని ఇలా నిర్ణయించవచ్చు : ఆత్మరక్షణ, ఆరోగ్యము, అత్యధిక ఇంద్రియ సుఖము, ఆకాంక్ష, సాంఘికస్థాయి,

అధికారం, పనితనం (వస్తువుల తయారీ వానిని ఉపయోగించడం); వివిధ రకాల ప్రేమ, (లైంగిక, మాతృసదృశ ప్రేమలు, స్నేహం, సామాజిక, ఆదర్శప్రేమలు); జ్ఞానం; క్రీడ; కళ; మతము .... .... వీటిని పార్కర్ ముఖ్యమైన హితాలుగ పరిగణించాడు. వీటి స్వాభావికతపై ఆధారపడి విధినిషేధాలు ఏర్పడతాయి.

ఏది ఏమైన అటు పాశ్చాత్యులలోగాని, ఇటు ప్రాగ్దేశాలలోగాని నాటినుంచి నేటి వరకు సత్యం, శివం, సుందరం (Truth, Goodness, Beauty) అనే మూడు విలువ లను దార్శనికులు ఋషులు తలమానికాలుగా ఎంచారు. అంటే ఇవి మరొక దానిని ఆశ్రయిం చవు. స్వయంసమృద్ధాలు (Self sufficient) ఈ మూడింటిలో ఒకదానిని నాయక మణిని చేయాలని చూశారు గాని, అనేకులు ఈ ప్రయత్నాన్ని నిరసించారు. కొంతమంది ఈ మూడు విలువలకు ఆనందాన్ని (Happiness) చేర్చాలని ప్రయత్నించారు. వీటిని 'మతవిలువ'కు గౌణాంగం (Minor premise) గా చూపించ ప్రయత్నించారు.

అంతరస్థ విలువలు బాహ్యవిలువల కంటె ఆదరణీయాలని చాలమంది ఒప్పు కొంటారు. అంతరస్థ విలువలంటే స్వభావసిద్ధమైనవి. వాటిని, మరొక దానికోసం గాక, వాటి కోసమే గ్రహిస్తాము (మంచిని మంచికోసమే గ్రహిస్తాము. మరొక లాభం ఉండదు). బాహ్య విలువలు మరొకదానికి ఉపకరణమైనందున వాటిని ఆదరిస్తాము. (గ్రంథాన్ని అది ఇచ్చే జ్ఞానం కోసం ఆదరిస్తాము. కళాఖండానికి రెండు విలువలు ఉంటాయి. మనం జీవితంలో అంతర్గతమైన వాటినే అన్వేషిస్తాము. తతిమ్మావి ఆ లక్ష్య సాధనకు ఉపకరణా లవుతాయి.

సృజనాత్మక (ఉత్పాదక) మైన వాటిని, సాపేక్షంగా శాశ్వతమైన వాటిని ఎంచు కొంటాము. ఉపయోగించిన కొలది వస్తువుల ఆర్థికవిలువ తగ్గుతుంది, కాని స్నేహం విలువ పెరుగుతుంది. పంచుకొంటె ధనం తరుగుతుంది. ఆధ్యాత్మిక, మానసిక విలువలు పంచుకున్నకొలది పెరుగుతాయి. మానవుని అనుభవంలో సామాజిక, భౌతిక, సౌందర్య, మత సంబంధమైన విలువలకంటె శాశ్వతతృప్తి నిస్తాయని తేలింది.

సృష్టిలో కెల్ల మానవు డొక్కడే విచిత్రమైన జంతువు. అతనికి ఇతర జీవులకు లేని వివేచనాశక్తి ఉంది. అంతేకాక, అసంతృప్తి, విసుగు అనేవి అతని సొంతాలు. ఉన్నదానితో తృప్తి చెందడమనేది లేదు. తన ఉనికే తనకొక సమస్య. దానిని నుంచి విముక్తుడవ్వాలని అతని ఆరాటము. దీనిని పరిష్కరించడానికి అతడు నిత్యం యత్ని

స్తుంటాడు. తనను తాను ఎరగడం, తన సమస్యలను గుర్తించడం, వివేచన, ఊహ, నవ్వడం, స్వప్నం-ఇవి మనిషిని జంతుస్థితినుంచి పెకలించి ప్రకృతికి, పాశవికతకు అతనిని దూరం చేశాయి. దానితో మానవునికి కష్టాలు ప్రారంభ మయ్యాయి. వీటికి మతం పరిష్కార మనుకొన్నాడు.

కళ, శాస్త్రం, తత్వాలతో పాటు మతం మానవుని దృష్టిని ఆకట్టుకొంది. వాస్తవానికి మతం వాటిని మించి మానవుని ప్రభావితం చేసింది. ప్రపంచంలో ఉన్న మతాలను ఒక్కసారి తుడిచిపెట్టి, తిరిగి బ్రతకమని మనిషిని కోరితే, అతనిలోని మతప్రేరకాలు వెంటనే తమ పని ప్రారంభిస్తాయి. అంటే అలాంటప్పుడు, మానవుడు తమ అత్యంత విలువైన దానిగా పరిగణించిన దానికోసం అతని అంతరాంతరాగంలో నుంచి పుట్టుకొచ్చే ఉత్కంఠం మతం అవుతుంది, వ్యగ్రత అవుతుంది.

ఆదర్శాలను ఎన్నుకోవడంలో మనిషికి స్వేచ్ఛ ఉంది కాని అసలు ఆదర్శం లేకుండ జీవించే స్వేచ్ఛ లేదు. ఇదే మతానికి వర్తిస్తుంది. మతం లేక మానవుడు లేడు. అతడు జంతువులను, చెట్లను, పుట్లను, రాతి, బంగారుబొమ్మలను, కనిపించే లేదా కనిపించని దేవతలను, తన జాతిని, నాయకుని, వర్గాన్ని, పార్టీని, ధనాన్ని లేదా విజయాన్ని, ప్రేమను, వినాశాన్ని – దేనినైన పూజించవచ్చు. దేనినో ఒకదానిని పూజించడం ఆరాధించడం అనేది మానవ సంహారానికి సంబంధించిన అంతర్గత ఆవశ్యకత.

జిజీవిష అన్నిటికంటె విలువైనది. జీవితాన్ని పరిపూర్ణం గావించు కోవడం కోసం, దాని త్రుష్ణకోసం అతడు పడే తపన మతము. మనిషి నాగరకుడైన, అనాగరకుడైన, ప్రాచీనుడైన, అర్వాచీనుడైన "దేనినో ఒకదానిని' మిగతా వాటికంటె 'భిన్న'గా పరిగణిస్తాడు; పరిసరంపై తన "అదృష్టం" ఆధారపడి ఉందని గుర్తిస్తాడు. ఈ పరిగణన గుర్తింపులను ఆశావహమైన ఒక విశ్వాసంతో నింపు కొంటాడు. ఈ విశ్వాసమే మతము. వాస్తవానికి నేడు మతాన్ని "ఏదో ఒక అంతిమ విలువని లక్షణంగా చేసుకొని మనిషి పడే తపన" అని మేధావులు నిర్వచిస్తున్నారు.

మత విశ్వాసం ప్రబలడానికి కారణం మానవుడు తన పరిమితత్వాన్ని, అల్పత్వాన్ని గుర్తించి అమితత్వం కోసం, అనల్పమైన దానికోసం అర్రులు సాచడము. ఈ మితత్వాన్ని, అల్పతాన్ని అతడు రెండు మూలాల నుంచి గుర్తిస్తాడు. ఒకటి ప్రకృతి, రెండవది సంస్కృతి.

మానవుడు ప్రకృతిని జయించా డనడం కాని, జయిస్తాడనడం కాని కల్ల. మానవుడు చేసేదంతా ప్రకృతితోడి తన సంబంధాన్ని మార్చుకోవడమే తప్ప దానిని జయించడం లేదు. బయట వేడిగా ఉంటే చల్లని గదిలోకి ప్రవేశిస్తున్నామే తప్ప బయటి వేడిని శీతలంగా మార్చడం లేదు. అంటే వేడికిఉన్న వేడి లక్షణాన్ని తీసివేయడం లేదు. అయితే, విజ్ఞానం పెరిగేకొలది మానవుడు ఎక్కువ దూరం చూడగలుగుతాడు. ఎక్కువ దూరం చూడడంలో ఎక్కువ సమస్యలు కనిపిస్తాయి. ఈ విధంగా సమస్యలు పెరుగుతాయే తప్ప తరగవు. ప్రకృతిలో 'అజితభాగం' ఎక్కువగా కనిపిస్తుంది. అదే 'కర్మ' 'విధి' గా రూపొందుతుంది; మానవుని "అదృష్టచక్రాన్ని' దొర్లిస్తుంది. మానవుని అల్పత్వం, పరిమితి అతని కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి.

మానవుని దుర్బలతను ఎత్తిచూపే రెండవ మూలం సంస్కృతి. ప్రకృతినుంచి మానవుని రక్షించడానికి సంస్కృ ఆవిర్భవించినా అది అతనికి కష్టాలనే తెచ్చిపెట్టింది. ప్రతి సంస్కృతికి నిర్బంధ శ్రమ, సహజాతతుష్టి పరిత్యాగం (Renunciation of instinctual Satisfaction) పునాదిరాళ్లు. ఈ రెండు మనిషికి దుస్సహాలే. ఈ దుస్సహాన్ని సంస్కృతి నాయకుని ద్వారా, రాజుద్వారా, వ్యవస్థద్వారా సుసహం చేస్తుంది. దీనివల్ల మనిషి శాశ్వతంగా వ్యాకులచిత్తు డవుతాడు.

ఇలా వ్యాకులచిత్తుడైన మానవుడు సంస్కృతి యందలి అసమగ్రత వల్ల జనించిన ప్రమాదాల నుంచి ఎదుర్కోవడం నేర్చుకొన్నాడు గాని, ప్రకృతిలోని ఆ "అజిత" భాగం నుంచి, ఆ "కర్మ" నుంచి, "విధి" నుంచి రక్షించుకోవడం, అశక్యమైంది. దీని నుంచి రక్షణను సంస్కృతిలో దర్శించాడు. ఆ కర్మకు, విధికి మనకు లాగ కోపతాపాలుంటే, దయాకారుణ్యాలుంటే, మోహావేశాలుంటే ఎంత బాగుండును ! మన పెద్దలను, నాయకులను ప్రసన్నులను చేసుకొన్నట్లే వాటినిగూడ బ్రతిమాలి, భంగపడి పూజించి, ప్రలోభపెట్టి ప్రభావితాలను చేస్తే అనుగ్రహాన్ని పొందవచ్చునని నమ్మాడు. ఈ విధంగా మనోదౌర్బల్యాన్ని ప్రకృతికి ప్రక్షేపించి అవ్యవహిత ఉపశమనాన్ని పొందాడు.

ఇందులో కొత్త ఏమీ లేదు. ఇది బిడ్డ, తండ్రి సంబంధం తప్ప అన్యం కాదు. బిడ్డకు తండ్రి అంటే భయమే అయినా, విధేయత చూపడం వల్ల, తండ్రినుంచి అదే సమయంలో అభయం గూడ లభిస్తుంది. ఇదే సన్నివేశాన్ని ప్రకృతికి అన్వయించి తండ్రి లక్ష

ణాలను (అధికారం, శక్తిమత్వం) దానికి ఆపాదించి దేవతలుగా మారుస్తాడు. దేవుడు అధికృతపిత (Exalted Father).

కొంతకాలం పిదప ప్రకృతి నియతమని గ్రహించడంతో అది మానవ (దైవ) లక్షణాలను కోల్పోయింది. కాని, మానవుని బలహీనత అలాగే మిగిలిపోయింది. దానితో పాటే తండ్రి, తండ్రి లక్షణాలున్న దేవుడు అలాగే దిగుమతయ్యాడు. ఈ దేవుడు చేయవలసిన పని క్రూరవిధితో (మరణంతో) సమాధానపడేట్టు చేయడం, సమాజంలో జరిగే అన్యాయాలకు ఎప్పటికైన నష్టపరిహారాన్ని చెల్లించడము. కాని ఈ దేవతలు న్యాయం చేకూర్చలేకపోయారు. ప్రపంచంలో జరిగే భీభత్సాలను అరికట్టలేక పోయారు. అందుకని దేవతల మితత్వాన్ని గుర్తించిన మేధావులు అస్పష్టమైన మరొక "అదృష్టా"న్ని సృష్టించారు. దేవతలంతా గూడ ఈ అదృష్టానికి తల ఒగ్గవలసిందే. సంస్కృతి నియమాలు దివ్యదత్తాలై, మానవపరిధిని దాటి ప్రకృతికి విశ్వానికి అనుపర్తింపసాగాయి. ఈ విధంగా వదకట్టబడిన రుచి, రంగు, వాసన కోల్పోయిన దేవుడు తన ప్రేతాత్మను మాత్రమే మిగిల్చాడు. దార్శనికులు ఆ రుచి, రంగు లేని "దైవభావన" (Concept of god) ను స్వచ్ఛమైన దైవభావన (Purer idea of god) అన్నారు. ఇటువంటి దైవభావనను, ఏ అతీతశక్తితోనో, పారమార్థిక విలువతోనో, కేవలసత్యం తోనో, ఆదర్శంతోనో, పారలౌకిక శక్తితోనో ప్రతిక్షేపించవచ్చు, వాస్తవానికి నేడు మతాన్ని, 'ఏదో ఒక అంతిమ విలువ (Ultimate value) గా లక్ష్యంగా చేసుకొని, దానికోసం మనిషిపడే తపన' అని నిర్వచిస్తున్నారు.

అందుకని మతసమస్యలన్నీ విలువలకు సంబంధించిన సమస్యలే. విశ్వాసం, ఆచరణ మతానికి ముఖ్యాలు. పారమార్థిక విలువ, అంతిమ విలువ మీది అపేక్షతో, దాని సాధించడంలో, పరిరక్షించడంలో, అనుభవించడంలో మతం ఉంది. ఈ అర్థంలో కమ్యూనిజం గూడ మతమే. దాని అంతిమ విలువ "శ్రామికవిజయం". దానిని సాధించడం పరిరక్షిండడం, అనుభవించడంలో కమ్యూనిజం ఉంది. ఈ అంతిమ విలువ మతానికి మతానికి మారుతుంటుంది. బౌద్ధులకు అంతిమ విలువ "నిర్వాణమైతే" మరొకరికి 'స్వర్గమై'తే వేరొకరికి 'కైవల్యం'అయితే, ఇంకొకరికి 'జీవన్ముక్తి'. జపాన్ బౌద్ధులకు 'జెన్' అయితే ఇంకొందరికి పరిశుద్ధదేశం (Pure land) అయింది. మనం బుద్ధితో కనుగొనలేని, బాహ్యసత్యాన్ని గురించిన కొన్ని నిశ్చితాభిప్రాయాల (dogmas)ను విశ్వసించమని, వాటికి విలువ నిమ్మని మతం చెబుతుంది.

మతం ఆచరణాత్మకము. అందువలన దాని సమస్యలు ఆచరణకు సంబంధించినవే. అంతిమ విలువను సాధించడానికి మనం జరిపే కర్మకాండ అంతా గూడ మతమే. మతం వ్యక్తిగతము. నిర్వచనం ప్రకారం అది వ్యవస్థాత్మకం కాదు. మతంలో పూజ అవశ్యాంగము. పూజ చుట్టూ ఆవిర్భంచే అర్చకవ్యవస్థ యాదృచ్ఛికము. ఈ భూమి మీద ఒకే వ్యక్తి ఉన్నప్పటికి అతడు'కర్మ'మీద దృష్టి సాదించినంతవరకు అతడు ధార్మికుడే అవుతాడు. కాని, మనిషి సంఘజీవి కనుక ఆమేరకు మతం కూడ సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. తదనుగుణమైన అర్చకవ్యవస్థ ఏర్పడుతుంది. కాని ఆచరణలో అంతిమవిలువ మృగ్యమైపోయి దాని స్థానాన్ని మతాచార్యుడు, పురోహితుడు, మతగ్రంథం, దేవాలయం, మతవ్యవస్థ, కర్మకాండ ఆక్రమిస్తాయి. వ్యక్తి అంతిమ విలువను కాక వీటినీ పూజించాలి. కుటుంబం, రాజ్యం, తెగల స్థానాన్ని మతవ్యవస్థ ఆక్రమిస్తుంది.

"మతవిషయాలను ఎందుకు విశ్వసించాలి?" అనే ప్రశ్నకు అర్చకవ్యవస్థ మూడు దుర్గాలను నిర్మించింది. వాస్తవంలో ఇవే దాని బలమూ, బలహీతనలు గూడ. మొదటిది, మతవిషయాల సత్యతను గురించి, అధికారాన్ని గురించి అసలు ఎవరూ ప్రశ్నించరాదు. రెండవది, వాటిని మన పూర్వులు ఎంతగానో విశ్వసించారు; ఒప్పుకొన్నారు. ఇప్పుడు, ప్రశ్నించడానికి నీవెవరవు? మూడవది, మన పూర్వీకులు మనకు అందించిన ఎన్నో నిదర్శనా లున్నాయి. వీటిలో మొదటి రక్షణదుర్గానికి ఎంతమంది బలి అయిపోయింది చరిత్ర చెబుతుంది.

మతం అంతిమ విలువను పరివేష్టిస్తుంది కనుక, అంతిమ విలువ సాపేక్షం కనుక, అదే ఆరాధ్యమని ఎలా చెప్పగల మని ఎవరైన విమర్శించవచ్చు. అసలు మతం మానవుని ఆశంసన చరిత్ర. మానవుడు తన శక్తుయుక్తు లన్నింటినికూడదీసుకొని వ్యక్తీకరించిన అంతిమ విలువ ఆ ఆశంసనను ప్రతిబింబిస్తుంది. అది ముక్తిమార్గాన్నే కాక, దేనిని పరిరక్షించుకోవాలో గూడ చెబుతుంది. విశ్వాసి అంతిమ విలువల కోసం ప్రార్థిస్తాడు. మతభావన స్వర్గాన్ని సృజిస్తుంది. ఈ స్వర్గంలో అతడు ఇష్టార్థసిద్ధి (wish fullfilment) పొందుతాడు. అందుకనే ఫ్రాయిడ్ మతభావనలు, కలలలాగే, తీరని కొర్కెలను తీర్చేభ్రాంతి (ilusion) అన్నాడు. కనుక ఒక మతంయొక్క అంతిమవిలువ ఆదరణీయమా కాదా అనే విషయాన్ని నైతికప్రమాణంతో పరిశీలించాలి. అందుకని నిజమైన మతం, గుణాగుణాలను; మంచి చెడులను తేల్చి చెప్పాలి. నీతిని నిరూపించే మతం మతం కాదు.

మతం అధినైతిక మన్న మాట వాస్తవమే; నీతి 'అర్థాల'ను 'ఆసక్తుల'ను 'అభిరుచుల'ను వ్యవస్థీకరిస్తుందే కాని, అవి ఏ "అర్థా"లో, ఏ స్థాయికి చెందినవో, వాటిని మనం ఎంత గాఢంగా, ఏమేరకు పాటించాలో చెప్పదు. మతం ఆ పని చేస్తుంది. మానవప్రగతిని ఆదర్శంగా చేసుకొన్న మొత్తం సంస్కృతిలాగా, అత్యున్నత విలువను మతం ప్రతిష్ఠిస్తుంది. అలా చేయడంలో అది, అంతర్గతసమయోజకతకు తగు జ్ఞానసంబంధమైన సౌందర్యసంబంధమైన విలువలకు, ఆదర్శజీవితానికి మకుటాయమానాలైన ప్రేమసంతోషాలకు ప్రాముఖ్యాన్నిస్తుంది. అన్నిటి కంటె ఉత్తమవిలువ అందరి'అర్థాల'సమయోజకత.

మతాలను ఆస్తికనాస్తికాలుగ కాక, అధికారిక మానవతా ప్రచోదక మతాలుగ విభజిస్తే, పై చెప్పిన లక్షణాలలో ఎక్కువ భాగం అధికారిక మతానికి చెందుతాయి. అధికారికమతం అంటే తన అదృష్టాన్ని ఏదో అదృశ్యశక్తి నడుపుతుందని, ఆ శక్తికి తాను విధేయుడనై ఉండాలని, అలా ఉంటే ఆదేవత కరుణిస్తుందని భావించడము. మతం అధికారికం గావడానికి కారణం ఆ శక్తికి మానివునిపై ఆధిపత్యం చెలాయించే హక్కు ఉన్నదని పూజ, విధేయతలకు అది పాత్రమని భావించగము. మానవుడు, తన బలహీనత నుంచి విముక్తిపొందే మార్గం ఒక అధిదేవతకో, శక్తికో, అధికారికో వశంకావడము. అంతేకాక మానవప్రతిమ అయిన దేవునికి, మానవుడు తన శక్తు లన్నింటిని ప్రక్షేపణం ద్వారా దానం చేస్తాడు. అప్పుడు దేవుడు విపరీతంగా పెరిగిపోతాడు. మానవుడు బలహీను డవుతాడు. బలహీనతలో ఏకాకి అయిన మానవుడు ఆ శక్తుల కోసం దేవుని ఆశ్రయిస్తాడు. దేవుని పై విశ్వాసం ఆత్మవిశ్వాసాన్ని, తోటి మానవుని మీది నమ్మకాన్ని సన్నగిలచేస్తుంది.

తనకంటె బాహిరమైనదానితో సాయుజ్యం చెందాలనే అంతర్గత తపన మానవునికి ఉంటుంది. ఇతరులతో సంబంధం పెట్టుకోలేకపోతే మానవుడు పిచ్చివాడవుతాడు. అందుకని మానవుడు తనకు వెలుపల మార్పులేని కొన్ని ఆకృతులను సృజించుకొని, వాటితో సంబంధం పెట్టుకొని ప్రేమించటం మొదలుపెట్టాడు (మానవునిలో మార్పులు అసంబద్ధతలు ఉంటాయి గదా!) ఈ విధంగా మానవుని ప్రేమ అవసరాన్ని సాయుజ్యావసరాన్ని తీర్చే ప్రతీక దేవుడు అంటే ఎవరైన అర్థం చేసుకోవచ్చు. మానవునిలో అటువంటి తీవ్ర అవసర మున్నంత మాత్రాన, దీనికి సాదృశ్యంగా అవతల దేవుడున్నాడని అర్థం కాదు. అది మానవుని తీవ్ర ప్రేమావశ్యకతను అతని ప్రేమసామర్థ్యాన్ని మాత్రమే వ్యక్తం చేస్తుంది.

దీనికి భిన్నంగా మానవతామతం, మానవుని, అతని శక్తిని కేంద్రంగా చేసుకొంది. తనను తాను ఎరగడానికి, తోటి వానితో, ఈ విశ్వంతో సంబంధాన్ని అర్థం చేసుకోవడానికి

అతడు ధీశక్తిని పెంచుకోవాలి. తన శక్తియుక్తుల స్తిమితత్వానికి సంబంధించిన సత్యాన్ని అతడు గుర్తించాలి. ఇతరులను, ఈ విశ్వాన్ని ప్రేమించడంలో, ఇతరజీవులతో తాదాత్మ్యం చెందడంలో అతడు సామర్థ్యాన్ని పెంచుకోవాలి. ఈ మతలక్ష్యం అతీతశక్తులను పొందడం కాదు, ఆత్మ యథార్థీకరణము. దీనిలో గుణమంటే విధేయత కాదు. విశ్వాసానికి ప్రాతిపదిక తన ఆలోచనానుభూతులే కాని ఆప్తవాక్యం కాదు. ప్రాచీనబౌద్ధం టావోయిజమ్, జీసస్, సోక్రటీజ్‌ల మతాలు మానవతామతాలు.

బుద్ధుడు మానవసంసారంలోని సత్యాన్ని గుర్తిస్తాడు. అతడు దానిని ఏ అధిదేవతతో కాక, వివేచన (బుద్ధి) తో పరికిస్తాడు, ఎవరికివారే తమ బుద్ధిని ఉపయోగించి, ఎవరి అనుభవంద్వారా వారే సత్యాన్ని గ్రహించా లంటాడు. ఏ మేరకు బుద్ధి వికసిస్తుందో ఆమేరకు మనోవికారాదుల నుండి బయటపడి సత్యగ్రహణం చేస్తాడు. నిర్వాణ మంటే ఈ రకంగా పూర్తిగా వికసించిన మనోభూమికే కాని వశంకరణం (లొంగుబాటు) కాదు.

అయితే, ఈమధ్య భౌతికసంపదతో మత్తెక్కిన మానవాళికి 'మనిషి' లక్ష్యం కాకుండా పోయాడు. సైద్ధాంతిక అన్వేషణలో గురి తప్పింది. బుద్ధి ద్వారా సత్యాన్ని పొందలేమని, బాహ్యంనుంచి అంతరంలోకి ప్రవేశించి విషయసారాన్ని గ్రహించలేమని భావించారు. ఎందుకంటే మానవునికి బుద్ధిమీద విశ్వాసం నశించింది. దాని శక్తి పరిమితమని భావించాడు. అది మన భావాల, నడతల ప్రామాణికతను, నిర్ధారించలేదని భావించాడు. అంతర్బుద్ధి (Intution) మీద ఆధారపడా లనుకున్నాడు. కాని, అంతర్బుద్ధి, విశేషాల (Particulars)ను మాత్రమే ఇస్తుందని, సంబంధం లేని విశేషాలతో సామాన్యాన్ని పొందలేమని, సామాన్యం (Universal) లేక జ్ఞానం ఉండదని గ్రహించాలి. ఫ్రాయిడ్ దృష్టిలోగూడ బుద్ధికి పరిమితలున్నాయి. బుద్ధి చాల శక్తివంతమైనదే అయినా, దాని స్నిగ్ధతను, తీక్షణతను వికారమోహాదులు మసకచేస్తాయి. వీటిని తొలగిస్తే బుద్ధి తిన్నగా పనిచేసి 'యథార్థా'న్ని చూస్తుంది. 'యథార్థదర్శనమే స్వాతంత్ర్యం'.

మతానికి నీతితో ఉన్న సంబంధాన్ని బట్టి అది సామాజిక మవుతుంది. అలా కాకపోతే మతం వ్యక్తిగతమైనదిగానే ఉంటుంది. మతం నీతిని పరగణించకుండా ఉండడానికి వీలు లేదు. ఎందుకంటె మతం అనేది మనుషుల మధ్య నివసించే మనిషిప్రవర్తన. అతని ధార్మికత ఎంతగొప్పదైన, పునర్జన్మ మీద అతని నమ్మకాలు ఏవైన, దేవునిలో ఐక్యం కావడానికి అతడు ఎంత చేరువలో ఉన్న, ప్రతి మనిషి ఎదుర్కొనే సామాజిక సంపర్కాల సంఘర్షణలు అతనికీ తప్పవు. అతడు రెండవవానికి పొరుగువాడే కదా! అందుకని ప్రతి

మతం నీతిని అంతర్గతం చేసుకొంది. బౌద్ధులు, హిందువులు దానధర్మాలను మోక్షమార్గంగా చెప్పారు. యూదులు, మహమ్మదీయులు దేవుని ఆజ్ఞలను సత్ప్రవర్తనతో తిదాత్మ్యం చేశారు. క్రైస్తవం పొరుగువానిని ప్రేమిస్తే భగవంతుని ప్రేమించినట్లే నన్నది.

మతం నీతిని పరివేష్టించిందనుకొన్నా నీతి లౌకికమా, లేక మతం మీద ఆధారపడిందా అన్న ప్రశ్నను ఎదుర్కొనక తప్పదు. ఏది ఎలాగున్న మతం నీతికి దోహదం చేస్తుంది. ఈ దోహదం అవశ్యక మనేది నిర్వివాదాంశము. అంతమాత్రంచేత నీతి పూర్తిగ మతం మీద ఆధారపడదు. దూషణభూషణలతో, దండనపారితోషికాలతో మనుష్యులు నైతిక ప్రవర్తనను అలవరుచుకొంటారు. అయితే, ఈ దూషణభూషణలు, తిరస్కార పురస్కారాలు దేవునినుంచి వస్తాయంటే అది శంఖులో పోసిన తీర్థము. అంతేకాని నైతికశక్తి మతశంఖువు మీద నిలబడలేదు. దేవుని ఆజ్ఞ అన్నా అనకపోయిన న్యాయవిహితమైన పని అనుకొన్న ప్పుడు దానిని ఆచరించడానికి చాలమంది ముందుకు వస్తారు. ధర్మం చేయి, న్యాయంగా నడువు అనేవి నైతిక సౌజన్యం (Moral goodness) మీద ఆధారపడతాయి. మతం లేకపోయినా, సహకారం వలని లాభంతో, సంఘర్షణ వలని నష్టంతో ప్రవర్తన నియమావళిని మనిషి తప్పక ఏర్పరుచుని ఉండేవాడు.

ఈ వ్యాసం మొదట్లో లేవనెత్తిన బ్రహ్మ, గోహత్యాది ప్రశ్నలకు సమాధానం మనకు ఇక్కడే లభిస్తుంది. మానవప్రవర్తనరంగంలోకి మతం కొంతవరకు గతార్థం చేస్తుంది. అందుకని మతక్రతువులలో పూజాకార్యాలలో బ్రాహ్మణుడు, గోవులు మొదలైనవి ఆక్ర మించిన స్థానాలనుబట్టి కొంత అనుషంగవిలువ (Associative value)ను సంతరించ కొంటాయి. నలుగురుమనస్సులలో అవి చోటుచేసుకొని, ఆసక్తికరం కావడంతో అవి విలువలై పోతాయి.

ఇప్పుడు రాజ్యం మతం—వీటి సంబంధాన్ని పరిశీలిద్దాం. ఏ వ్యవస్థ ఏర్పడినా దాని మౌలికధ్యేయం రక్షణ కాని, భక్షణ కాదు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను, విలువలను పెంచ డానికే కాని కురుచచేయడానికి కాదు. మత, నైతిక వ్యవస్థలూ అంతే. అయితే కొన్ని సార్లు మతవ్యవస్థలు తమ లక్ష్యాన్ని విస్మరించి పర మతాలను, అణగద్రొక్క ప్రయత్నిస్తే ఏం జరిగిందీ మనకు చరిత్ర చెబుతుంది. పరమతద్వేషం శత్రుత్వాన్ని పెంచిందే కాని, తగ్గించలేదు. ఒత్తిడికి ఒకడు తల వంచవచ్చునేమో గాని, నిజమైన ధార్మికతకు గుర్తు అయిన ఆత్మపరివర్తనం జరగదు. అందువలన మత సహనం అనే ధార్మికతాటస్థ్యాన్ని ప్రభుత్వం నెలకొలపాలి. ఎందుకంటే ప్రభుత్వప్రథమకర్తవ్యం శాంతిభద్రతలు. పదిమంది

కూడి ఒక దేవుణ్ణి నెలకొలుపుకొన్నా, ఇతరుల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగం కానంతవరకు ఎవరికి అభ్యంతరం ఉండడానికి వీలులేదు. మతస్వేచ్ఛ సమాజానికి ఆరోగ్యకరము. మత స్వేచ్ఛకోసం ప్రతిపాందించిన సూత్రాలే, మతాన్ని కాదనడానికి వర్తిస్తాయి. సోవియట్ అమెరికా రాజ్యాంగాలు ఈ విషయాన్ని ప్రతిబింబిస్తాయి.

మతం పూర్తిగ వ్యక్తిగతమైతే ప్రభుతకు పురోహితవర్గానికి మధ్య సమస్య తేలిక అయ్యేదే. మతం మౌలికంగా వ్యక్తిగతమైనదే, ఎందుల్లనంటే అది ఒక అంతిమ విలువను పరివేష్టించి ఉంటుంది. మరి ఆ విలువను సాధించడానికి వ్యక్తిధ్యానం, పూజ, ప్రజ్ఞలు అవసరమవుతాయి. కాని రాజశక్తి, సంఘబలము, పురోహితుడు కారు. అవి అభౌతికాలు కనుక మతస్వేచ్ఛ ఆచరించటానికి సాధించడానికి భుజబలంఅవసరం లేదు. అందుకని దానికి ప్రభుత్వం తోడ్పాటు కాని, ప్రమేయంకాని అసరం లేదు.

అయితే, మతం నైతిక ధర్మంతో ముడివడినందువల్ల, అది నైతిక విద్యాబోధనకు ఉపకరణం కావడంవల్ల, ప్రజాహితకార్యాలలో దాని ప్రమేయం అవ్యయంగా ఉంది. అందుకని ప్రభుత, మతం భుజం భుజం కలపాలి. మతం ఎంతవరకు నీతితో లౌకికజీవితాన్ని పంచుకొంటుందో - శాంతి, సహకారాలు, ''నీకేమి జరగాలని కోరుకొంటావో ఎదుటివానికి అదే చేయి అనే స్వర్ణన్యాయం" (Golden rule) వరకు—అంతవరకు ప్రభుత్వం ప్రవేశిస్తుంది. ప్రభుత్వ, ధర్మం "మానవుని మాన్యతను" (Dignity of man) మన్నించడము. ఇక్కడే పురోహితవర్గానికి ప్రభుతకు ఘర్షణ.

ప్రభుత్వం ఈ పరిధిని దాటి మతవిలువల (నీతితోసంబంధం లేని)తో జోక్యంపెట్టుకోరాదు. ప్రభుత్వప్రమేయం, బౌద్ధం ప్రతిపాదించిన శాంతి దాన, వీర, క్షమల వరకే అవసరం కావాలి కాని, చివరి రెండు అయిన ధ్యాన, ప్రజ్ఞలకు వర్తించరాదు. ఎందుకంటే ధ్యాన, ప్రజ్ఞలు వ్యక్తిగతాలు. అందుకని వీటిని ఏ ప్రభుశక్తి బాహ్యశక్తి చేరలేదు. కనుక వీటిని శాసించే ప్రసక్తి ఉదయించరాదు. నిజమైన భక్తి చట్టానికి అతీతము.

ఇంతవరకు మనం 'విలువ'లంటే ఏమిటో వాటికి ఊపిరి ఎలా వస్తుందో, విలువలకు మతానికి గల సంబంధ మేమిటో, మతానికి ప్రభుత్వానికి ఉన్న ఉండవలసిన సంబంధాలు ఏమిటో శాస్త్రీయంగా చర్చించాము. సాపేక్షవిలువలు కాలానుగుణంగా మారినా. కేవల విలువలు ఆంతరంగిక విలువలు అంత తొందరగా మారవు. మరి ఈనాటి మన సమాజాన్ని చూస్తుంటే విలువలు లుప్తమై, నీతి అడుగంటిపోయి, స్వార్థం బలిసిపోయి, అడ్డదారులు

ఆలంబనంగా అధికార, ధనార్జనలు యథేచ్ఛగా సాగిపోతున్నా యని ఎవరైన గ్రహిస్తారు. ఈ విషయంలో ప్రజలకు ప్రభుత్వానికి తేడా లేదు. ఎందుకంటే, ఎప్పుడైన ప్రజలకు తగ్గ ప్రభుత్వమే అధికారంలో ఉంటుందని ఆంగ్ల సామెత.

ఇటువంటి దిగజారిన, అణగారిన మన నేటి సమాజాన్ని ఆకళింపుచేసుకొని, సంక్షుభిత మనస్కులై డా॥ జి. కృష్ణరావు "బొమ్మఏడ్చింది"అనే నాటకాన్ని వ్రాశారు. అయితే ఆయన ఈ నాటకంలో ఆధునికసమాజానికి ఆభరణాలైన యాంత్రిక, సాంకేతిక, భౌతిక విలువల జోలికి పోక, మానవసంసారాంతర్గతాలైన మౌలిక దార్శనిక విలువలను అంతర్వాహినిగా చేసుకొని ఈ రచన సాగించారు.

"బొమ్మఏడ్చింది"—ఎందుకు? ఈ బొమ్మఎవరు?—ఈ ప్రశ్నలు పాఠకునికి కుతూహలాన్ని కలిగిస్తాయి. బొమ్మ బౌద్ధుల ఆరాధ్యదేవత యైన షట్పారమితాదేవి. ఇంతకుముందు నేను చెప్పిన శాంతి, దాన, వీరక్షాంతి,ధ్యానప్రజ్ఞలే ఈ షట్పారమితులు. ఈ ఆరు పారమితులకు ప్రతీకయే ఆదేవత. ఈ పారమితులు దేశంలో లుప్తమైనప్పుడు, వాటికి, క్షోభ కలిగినప్పుడు, ఆ బొమ్మ ఏడుస్తుంది.

అసలు ఈ షట్పారమితాదేవి విగ్రహాన్ని ఆర్యనాగార్జునులు బౌద్ధానుయాయి అయిన, గౌతమీబాలశ్రీకి బహూకరిస్తాడు. గౌతమిమీబాలశ్రీ రాజమాత. గౌతమీ పుత్రశాతకర్ణికి తల్లి. శాతకర్ణి కటకం రాజధానిగా రాజ్యంచేస్తుంటాడు. అయితే ఇతడు వైదికమతపక్షపాతి అమ్మగారు సంగాలకు, అయ్యగారు లింగాలకు అంకితు లయ్యారు. ఈయన ఏలుబడిలోనే శ్రీపర్వతం మీద బౌద్ధారామాన్ని నెలకొలిపి, విద్యార్థులకు విద్యను, రోగపీడితులకు వైద్యాన్ని అనుగ్రహిస్తుంటారు ఆచార్యనాగార్జునులు.

అసలే వైదికపక్షపాతి అయిన శాతకర్ణికి శివగుప్త,మల్లనాగు లనే హైందవమంత్రులు. బౌద్ధం మీద కార్పణ్యాన్ని పెంచడానికి మంటల్లోఆజ్యంపోస్తుంటారు. ఈ మంత్రులలో ఒకరైన మల్లనాగుడే బహుళ వాత్స్యాయను డనే ప్రతీతి ఉంది. వాత్స్యాయనవాదఖండనం కోసం నాగార్జునులు "విగ్రహవ్యావర్తని"ని రచించారు. రాజు తలుచుకుంటే దెబ్బలకు కొదువ ఏమి ? ఏవో కుంటి సాకులతో బౌద్ధబిక్షువులను చికాకుపెట్టడం చెరలో త్రోయించడం చేస్తుంటాడు రాజు.

వాస్తవానికి రాజు ఇలా చేయడంద్వారా హద్దుమీరిన వాడవుతున్నాడు. అందుకని రాచరికపు మేరలో అది ఆలంబనం చేసుకోవలసిన విలువలు అతనికి ఎరుకచెప్పవలసిన

అవశ్యకత ఉంది. అదే నాగార్జునులు వ్రాసిన "సుహృల్లేఖ". ఇది ఒక "పరికథ". ఆ పరికథ ఇలా సాగుతుంది. "రాజా! నీవు అతిభౌముడవు. నీ యందలి స్నేహంవల్ల, లోకమందలి అనుకంపం వల్ల నీకు హితం చెబుతున్నాను. రాజ్యం నీ వెంట రాలేదు, నీవెంట పోదు. ధర్మం అనుష్ఠించు, మద్యం హానికరం. శిక్షించిన కారాగారబద్ధులను వారానికి ఒకసారి అయినా, వదిలిపెట్టించు. మందు మాకు వేయించు. అన్నపానాదులకు, బట్టలకు ఏర్పాట్లు చేయించు. ఘోరాపరాధం చేసిన వారినైన చక్కగా విచారించనిదే శిక్ష వేయకు. కాకపోతే వారిని దేశంనుంచి బహిష్కరించు. కాని హింసించవద్దు....".

నిజంగా ఈ సుహృల్లేఖలోని విషయాలు శ్రుతాతీతాలు. మహాకరుణ ప్రతిపాదకాలు. ఎవరికీ కోపం రావలసిన పని లేదు. అయినా, ఈ లేఖను చూచి రాజుమండి పడతాడు. ఆవైదికానికి దేశంలో తావు లేదనుకొంటాడు మూర్ఖంగా. కాని తల్లి యీ విధంగా హితం చెబుతుంది.

"నాయనా, నీకేది కావాలో చెప్పు.. అంతర్ముఖులకు మతం కావాలి. బహిర్ముఖులకు రాజ్యం కావాలి. రాజ్యంలో ఒకే మతం ఒకే ఆదర్శం ఉండాలని లేదు. మనరాజ్యం సంకుచితం కాదు. భిన్నమతా లుంటాయి, లక్ష్యాలుంటాయి. వీటినన్నింటిని అణచడం సాధ్యమా?.... నిన్ను బౌద్ధం స్వీకరించ మనడం లేదు. బౌద్ధులను అభిమానించ మనడం లేదు. మతతత్త్వం దురవగాహం. రాజులు దాని జోలికి పోరాదు. ఉపేక్ష వహించాలి. ద్వేషం తగదు. ఉపేక్ష పాపం కాదు....".

ఈనాటి మతప్రమేయం లేని రాజ్యభావాన్ని, ఆనాడు తల్లి, కొడుకుకు బోధించింది. రాజ్యవిస్తరణకు మతం అవసరం లేదు. అయితే, ఆ ముసుగులో ఎన్నో యుద్ధాలుచేసి రాజ్య విస్తరణ కావించిన రాజు లెందరో చరిత్రలో మనకు తారసపడతారు. వాస్తవానికి ధ్యాన ప్రజ్ఞలను అనుష్ఠించే అంతర్ముఖులకు మతం ఆవశ్యక మవుతుంది కాని బహిర్ముఖులకు కాదు. రాజ్యాన్ని విస్తరింపజూసే రాజు బహిర్ముఖుడు. అతనికి కావలసింది దానశీలాలు, శాంతివీరాలు మాత్రమే. వీటిని విస్మరిస్తే వచ్చే ఫలితాలు అందరికీ తెలిసినవే.

'మహాకరుణ'పాపం కాదు. వారు వీరని విచక్షణ లేకుండ కరుణ చూపించడమే 'మహాకరుణ'తాత్పర్యం. ఈ 'విలువ'ను ఏ కాలంలోను, ఏ సమాజంలోను కాదనరు. అది సార్వత్రికం. ఈ విలువనే నేటి మనరెడ్‌క్రాస్ పుణికిపుచ్చుకొంది. శత్రువులని లేదు, మిత్రులని లేదు, ఎవరికైనా సేవచేయడమే దాని లక్ష్యం. ఈ లక్ష్యాన్ని అది బౌద్ధం నుంచి గ్రహించిందన్నా తప్పులేదు. వాస్తవానికి నాగార్జునుడు శ్రీపర్వతం మీద దేశీయులకు విదేశీయులకు

(యవనులకు) చికిత్స చేస్తాడు. అయితే ఆ విదేశీయుల చేత స్వదేశధర్మాల ననుసరిస్తామని ప్రమాణం చేయించుకొని చికిత్సచేస్తాడు. అయినా ఈ కారణంతో రాజు నాగార్జునులపై అభియోగం మోపుతాడు. ఈ కారణంగా గూడా ఆయనను శిక్షిస్తాడు.

బౌద్ధభిక్షువులను క్షతగాత్రులని స్వసైన్యానికి చికిత్స కోసం రాజస్కంధావారాన్ని అనుసరించమని రాజు అజ్ఞాపిస్తాడు. అప్పుడు నాగార్జునులు భిక్షుకధర్మాన్ని గురించి యిలా చెప్పాడు :

"జీవుల శోకాక్రందనలు వినలేక కరుణామయులైన మహాయాన భిక్షువులు చీవరాలు గ్రహించారు....దీక్షతో. శక్తివంచనలేకుండా సత్త్వసముద్ధరణకోసం దిగంతాలదాక తిరుగుతున్నారు. భూలోకాన్ని స్వర్గలోకంగా, సంసారాన్ని నిర్వాణంగా మార్చాలని యత్నిస్తున్నారు....భిక్షువులు, రోగులు, విద్యార్థులు మహారాజున కుపయోగపడరు... చికిత్సాపేక్షకులను మృత్యుముఖాన త్రోసి, చీవరాలు పరిత్యజించి, ఆయుధప్రాణులై స్కంధావారాన్ని అనుసరించమనడం న్యాయంకాదు....జీవితంలో మూడంశా లున్నవి : ఒకటి పరహితం, రెండవది స్వహితం, మూడవది ఆత్మహితం లేదా మోక్షం. వీటినే దానశీలం, క్షాంతివీరం, ధ్యానప్రజ్ఞ లంటారు....మతాలేవైనా, అభిమానా లెట్లున్నా దాన శీలక్షాంతివీరాలు మానవమాత్రులకు సర్వసామాన్యాలు. మతం పేరు చెప్పి వీటిని అతిక్రమించేవారు పరద్రోహులే గాదు, ఆత్మద్రోహులుగూడా. నిజమైన మతం ధ్యానప్రజ్ఞాసమ్మితం. ఈ మతంలో ఆత్మశాసనం తక్క బాహ్యశాసనం చెల్లరాదు; అని ఉపదేశిస్తారు.

కనుక ఈ ఉపదేశాన్ని బట్టి, రాజ్యపాలకులు మతనిరపేక్షంగా రాజ్యం చేయవలసివుంటుంది. ప్రభుత్వం బాధ్యత శాంతిభద్రతల రక్షణ కాన, దానికి దానశీల, క్షాంతివీరాలపై అదుపు ఉండవచ్చు. ఇవి అందరికీ అనుష్ఠేయాలే. వీటిని పాలకులు విడనాడితే అశాంతే. అందులో పాలకులు ఏదో ఒక మతానికి చెందినవారైతే ఇక చెప్పేదేముంది ? అన్యమతనాశం జరుగుతుంది. మతం ఆత్మసాతంత్ర్యాన్ని కోరుతుంది. అన్యమతనాశం అంటే ఇతరుల ఆత్మస్వాతంత్ర్యం లుప్తమవుతుం దన్నమాట.

ఏదో ఒక మతాన్ని ప్రభుత్వం ఆదరించి మిగతావాటిని నిరాకరిస్తే, అనేక అన సంభవిస్తాయి. ప్రభుత్వం ఆదరించిన మతంయొక్క వస్తుగతవిలువలు చట్టాలలో చోటు

కొంటాయి. అంతర విలువలు కనిపించకుండా పోతాయి. అందుకే ఒకే నేరానికి రెండు రకాల శిక్షల సిద్ధాంతం అమలులోకి వచ్చింది. నాగార్జునుడు, ప్లాటినస్ — ఇద్దరు చేసిందీ ఒకే నేరం. హిందూమతావలంబియైన శాతకర్ణి ఇద్దరికి వేరు వేరు శిక్షలు విధిస్తాడు. నాగార్జునుడు పూర్వాశ్రమంలో బ్రాహ్మణుడైనందున, బ్రహ్మహత్యను హిందూమతం నిషేధించింది. కనుక, శాతకర్ణి ప్రభుత్వం వైదికం గనుక, నాగార్జునికి దేశబహిష్కారం మాత్రమే విధించి, ప్లాటినస్ మ్లేచ్ఛుడు గనుక మరణదండన వేస్తారు. ఇదే మ్లేచ్ఛపరిపాలన అయితే ఈ శిక్షలు తలక్రిందులుగా ఉండేవి. ఇలాంటి మానవప్రవర్తనలో ధర్మం, న్యాయం ఎక్కడ ఉన్నాయి ? అందుకే రాజ్యం మతప్రమేయం కారాదు. ఈ అన్యాయాన్ని చూచి ధర్మదేవత (షట్పారమితాదేవి) దుఃఖిస్తుంది. ఈ విషయాన్నే నాగార్జునులు వాసిష్ఠితో అంటాడు :

> "అవునమ్మా తెలుసు. అది అలా ఏడుస్తూనే ఉంటుంది. ఆ బొమ్మ మానవుల మనస్సులలో మెదలిననాడే లోకకళ్యాణం".

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి.

# కృష్ణరావుగారి కథలు

—డా॥ అత్తలూరి నరసింహారావు

[డా॥ నరసింహారావుగారు తెనాలి తాలూకా, బిక్కసానివారి పాలెంలో 1946 లో జన్మించారు. చదివింది తెలుగు ఎం. ఏ.; చేసింది "తిలక్ కవితాతత్త్వం" మీద పిహెచ్. డి. పట్టానికి రిసెర్చి. కవితలు, కథలు, వ్యాసాలు; రావిశాస్త్రీయం (రావిశాస్త్రి గారి). ఉద్యోగం ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తెలుగు వ్యుత్పత్తికోశంలో.]

*　　　*　　　*

జి. వి. కృష్ణరావుగారు ఎన్ని కథలు రాశారో పూర్తిగా తెలియదు. నేను చదివినవి మొత్తం ఏడు కథలే.

'ఉదబిందువులు'— ఒక పల్లెటూళ్ళో సుభద్రమ్మగారికి ఇద్దరు కొడుకులు. ఆమెకి భర్త చిన్ననాడే పోయాడు. ఆమె కొడుకుల్నీ, ఆస్తినీ తన చేతుల మీదుగానే కాపాడుకుంటూ వచ్చింది. పెద్దకొడుకు పేరు రామయ్య. మనసు వెన్నలాంటిది. కాని ఏదన్నా తకరారువస్తే పట్టుదల పట్టి మంచం ఎక్కి కూచుంటాడు. వ్యవసాయం అజమాయిషీ అంతా తనే చూసుకుంటూ వున్నాడు. చిన్నకొడుకు లక్ష్మయ్య కాస్త లోభగుణం వున్నవాడు. కాస్త చదువుకుని, చదువుకున్న అమ్మాయిని పెళ్ళిచేసుకుని బస్తీలో బతిపంతులుగా వున్నాడు. సుభద్రమ్మగారు తనకి రెండు ఎకరాలు పోను మిగతా ఆస్తిని చెరిసగం పంచింది. రామయ్య ఉమ్మడి వ్యవసాయంచేస్తూ తమ్ముడికి ప్రతి ఏడూ పంట అమ్మి డబ్బు పంపిస్తూ వుంటాడు. ఇలా జరుగుతూ వుండగా ఒక సంవత్సరం పంటకి ఊచతెగులు తగిలి రాబడి తగ్గింది. అదే

విషయం తమ్ముడికి రాస్తే "మగతాదారులు ఏమి చేస్తున్నారని" సమాధానం రాశాడు. రామయ్యకి మతి పోయినంత పని అయింది. ఈ విషయం అంతా తల్లికి తెలియజేశాడు. ఆ తర్వాత తమ్ముడికి రావలసిన పైకం మొత్తం పంపించేశాడు. తల్లి, తల్లడిల్లిపోయింది. తమ్ముడు తన తెలివితక్కువతనం గ్రహించి తిరిగి డబ్బు పంపించేశాడు. రామయ్య డబ్బు తీసుకోడు. తమ్ముడి పొలం దున్నకుండా కూడా వదిలేస్తాడు. ఇది తెలిసి తల్లి సొంత ఖర్చులు పెట్టుకుని దున్నిస్తుంది. రామయ్యకు తల తీసేసినట్టయింది. తల్లిప్రాణం ఒక్క తమ్ముడి మీదే వుందనుకుని వుక్రోషంతో తల్లితో విడిపోతాడు. తల్లి కొయ్యబారిపోతుంది. తను దగ్గర లేకపోతే నన్నా పెద్దకొడుకు బాగుపడతాడని చిన్నకొడుకు దగ్గర కెళుతుంది. అక్కడ కూడా ఆమెకి సుఖశాంతులు లేకుండా పోతాయి. కాకపోతే, మనవళ్ళదగ్గర చేరిక ఏర్పడింది. అయినా ఒకరోజు అక్కడనుంచి కూడా బయలుదేరి ఎటూ వెళ్ళటం ఇష్టంలేక ఆ ఊళ్ళోనే మారుమూల బియ్యంకొట్టు పెట్టుకుని జీవిస్తూ వుంది. ఈ విషయం మనమడు రఘుకి మాత్రమే తెలుసు. ఇంతలో ఊరునుంచి తల్లికి డబ్బు వస్తుంది. దాంతో చిన్న కొడుక్కి తల్లి ఊళ్ళోలేదని అప్పుడే తెలుస్తుంది. కోడలు బాధపడుతూ కొడుకు రఘుకి చెపితే, రఘు నాయనమ్మ రహస్యం చెప్పేస్తాడు. వెంటనే కోడలు బయలుదేరుతుంది కొడుకుతో. ఒక చిన్న ఇంట్లో జ్వరంతో పడి వుంటుంది. వెంటనే హాస్పిటల్‌కి చేర్పించి చికిత్స చేయిస్తుంది. బావగార్కి వుత్తరం రాసింది. రామయ్య తల్లిని చూడటానికి కూడా రాలేదు. భార్య, కొడుకు మాత్రమే వచ్చారు. కొద్దిరోజులకే తల్లి చనిపోతుంది. ఊరికి తీసికెళ్తారు. అక్కడ కూడా రామయ్య, తల్లిని చూడడు. కర్మకాండలో పాల్గొనడు. తల్లి నిలవడబ్బు అంతా తమ్ముడికి అందిస్తాడు. చనిపోయేముందు తల్లి రాసిచ్చిన వుత్తరం రఘు పెదనాన్నకి చదివి వినిపిస్తాడు. పంటడబ్బు అంతా రామయ్యదే నని రాసివుంది. రామయ్య కన్నీళ్ళు కార్చుతాడు.

ఈ కథలో ఉమ్మడికుటుంబజీవితం విచ్చిపోతున్న రోజులనాటి స్వరూపాన్ని అక్షరాల్లో అమర్చారు కృష్ణారావుగారు. ఇక్కడ తల్లివేదన హృదయవిదారక మయింది. కుటుంబంలో ఎవరికీ ఏ దెబ్బ తగిలినా దాని ప్రభావం తల్లిమీద వుంటుంది. చిన్నకొడుకు చేసిన పొరపాటుకి తల్లిమనస్సు విలవిలలాడింది. చివాట్లువేస్తూ వుత్తరం రాసి, మనస్సు మార్చుకుని, దాన్ని చించేసి ఒకసారి వచ్చి వెళ్ళమని రాయటంలో సుభద్రమ్మ మనస్తత్వం, తల్లిహృదయం తెలుస్తుంది.

సుభద్రమ్మ వుత్తరం చూసుకుని లక్ష్మణరావు భార్య, అత్తగార్కి ఒక వుత్తరం

రాస్తుంది. దానిలో "నేనే వచ్చి బావగారికి కనిపించి క్షమాపణ చెప్పుకొంటే మేలేమో నని పించింది. కాని అన్నదమ్ముల నడుమ నీ జోక్యమేమిటి అంటారేమోనన్న భయంతో మానివేశాను"— ఈ స్థితి ఈనాటికీ గ్రామీణ జీవితంలో భాగమై వుంది. తల్లీకొడుకుల వాదనలో భార్య కల్పించుకున్నందుకు, "కాదు, మీ బాబిచ్చిన అరణం !" అని భర్త కోపంతో అనటం కఠినంగాను, అన్యాయంగాను వున్నా అసహజంగా మాత్రం లేదు.

పెద్దకొడుకు, లక్ష్మయ్య పొలం దున్ననని మొండికేస్తే తల్లి తనకి తెలిసిన పాలేరుని పొలం చేసుకోమని అడుగుతుంది. అతను ముసలమ్మను కాదనలేక చేస్తాడు. పాత తరంలో ఇలాంటి కృతజ్ఞత వున్నవాళ్ళని చిత్రించటం రచయిత లోకపరిశీలనకు నిదర్శనం.

తల్లినుంచి పెద్దకొడుకు వేరుపడినందుకు పశుసంపద కూడా బాధపడినట్టు, నిరసన తెలియజేసినట్టు — ఆవు పాలు ఇవ్వకుండా, ఎగిరి తన్నటం ద్వారా కృష్ణారావుగారు సూచన చెయ్యటం హృద్యంగా వుంది.

సుభద్రమ్మ చిన్నకొడుకు దగ్గరకు వెళ్దామని పట్నం బయలుదేరింది. అక్కడ ఇంటి దగ్గర చిన్నకొడుకు పనిమనిషి సుభద్రమ్మను గుర్తించక కసురుకోవడం — అప్పుడే ఎదుగు తున్న పట్టణాల్లో వేషధారణ కిచ్చే ప్రాముఖ్యం తెలియజేస్తుంది.

సుభద్రమ్మ చిన్నకొడుకు దగ్గరనుంచీ కూడా దూర మవుదామని ఆ వూళ్లోనే ఎవరికీ తెలియకుండా బియ్యం కొట్టి పెట్టుకుని బ్రతుకుతూ జ్వరపడుతుంది. ఈస్థితిలో చిన్నకోడలు తెలుసుకుని వెళ్ళి తనకి తెలిసిన డాక్టరమ్మని పిలుపిస్తుంది. ఆమె వచ్చి "ఎవరు ఈ ముస లమ్మ ?" అని అడిగితే "దిక్కులేనిది" అని ఆనాలోచితంగా అనేస్తుంది. తన అత్తగారు అని చెప్పుకునే ధైర్యం కోల్పోయింది. ఈ కథలో ఈమె మిగతాచోట్ల చాలా వున్నతంగా వున్నా, ఈ సన్నివేశంలో నవీననాగరికతలోని బలహీనతకు బలి అయిపోతుంది. పట్టణ నాగరికతలోని నైచ్యం ఈ ఒక్క మాటలోనే చూపుతారు రచయిత.

ఈ పాత్రల్లో ఏ ఒక్కరి మీదా పాఠకుడికి కోపం రాదు. సానుభూతి మాత్రమే కలుగు తుంది. ప్రతి పాత్రా సజీవంగా ప్రవర్తిస్తూ 1940—60 మధ్య, ముఖ్యంగా కృష్ణా, గుంటూరు జిల్లాల, కింది మధ్యతరగతి గ్రామీణజీవితం కళ్ళముందు కదలాడినట్టు, మన వూళ్లోని వ్యక్తులే వీళ్ళందరూ అన్నట్టు, ఈ కథ చదివినంతసేపూ మన వూళ్లో వున్నట్టు అను

భూతి చెందుతాం. అప్పుడే వికసిస్తున్న పట్టణ మనస్తత్వం యొక్క నీచత్వానికీ, గ్రామీణ జీవితంలోని నిర్మలత్వానికీ ఘర్షణే ఉదబిందువులు.

"చేసుకొన్న ఖర్మ" — ఒక వూళ్లో మధ్యతరగతి రైతు వుంటాడు. అతని పేరు వెంకయ్య. భార్య లక్షువమ్మ. వాళ్ళకి ఇద్దరు కొడుకులు. మరో కొడుకు లాంటివాడు తమ దగ్గర పాలేరు పనిచేసే రాఘవులు. రాఘవులు తండ్రి పుల్లాయ్, మరో వూళ్లో వుంటూ కొడుకుని చిన్నప్పటినుంచీ వెంకయ్య దగ్గరే పనిలో వుంచాడు. రాఘవులు సొంతమనిషిలా, సొంత కొడుకులా పనులు చేస్తూ ఇంట్లోమనిషిలా మసులుతూ వుంటాడు. రాఘవులి జీతం తిండీ బట్టాకాక ఏడాదికి ఏభై రూపాయలు. ప్రతి సంవత్సరం రాఘవులు తండ్రి వచ్చి జీతం తీసికెళ్తూ వుంటాడు. ఇలా వుండగా ఒకసారి పుల్లాయ్‌వచ్చి కొడుకు పెళ్ళి చెయ్యాలనీ, జీతం పెంచమనీ, తన వూళ్లో షావుకారు 75 రూ॥లు జీతం ఇస్తానన్నాడని చెబుతాడు. వెంకయ్య జీతం పెంచే శక్తి లేదంటాడు. కొడుకుని తీసుకుని వెళ్ళమని తండ్రికి చెబుతాడు. రాఘవులు వెళ్ళనని మొరాయిస్తాడు. చేసేదేం లేక తండ్రి వెళ్ళిపోతాడు. రాఘవులి అమాయకహృదయం వెంకయ్య కుటుంబంతోను, పశువుల్తోను, పంటచేలతోను పెనవేసుకుని వుంటుంది. ఈలోపు వెంకయ్య ఆర్థికపరిస్థితి తల్లకిందులైంది. అప్పులవాళ్ళు మూగారు. పొలం, ధాన్యం తెగనమ్మి అప్పులు తీర్చాడు. చివరికి వ్యవసాయానికి ముఖ్యమైన ఎడ్లని కూడా అమ్మేశాడు. ఇదంతా తెలిసి రాఘవులు ఆరోజు అన్నం ముట్టలేదు. తన కిష్టమైన ఎడ్లు, వ్యవసాయం మాయమయ్యేసరికి అతనికి దిక్కు తోచలేదు. తెల్లారి లేచి వెళ్ళిపోతున్నానని చెప్పి దిక్కు తెలియనిచోటుకి బయలుదేరాడు. కోడెదూడ అడ్డుపడింది. వెంకయ్య కొడుకు చిట్టాడు బావురు మన్నాడు. అయినా రాఘవులు వెళ్ళిపోయాడు.

ఈ కథలో ఎవరికి వారు ఇది తాము 'చేసుకొన్న ఖర్మ' అనే అనుకుంటారు. కాని ఇది పరిస్థితులు చేసిన ఖర్మ. ఈ విషయం రచయితకు కూడా తెలుసునని వెంకయ్య స్వగతాలు దాఖలాగా వున్నాయి. ఈ దృష్ట్యా రాస్తే ఈ కథ మరింత గొప్పగా వుండే దనిపిస్తుంది. మారుతున్న గ్రామీణపరిస్థితులకి దర్పణం పట్టింది ఈ కథ.

కొడుకు రాఘవుల్ని చూసిపోదామని, జీతంగురించి మాట్లాడుదామనీ వచ్చిన పుల్లాయ్‌తో వెంకయ్య ప్రేమతో తిట్టిన తిట్లు ఆనాటి అనుబంధాలకి నిదర్శనం. ఈనాడు అయితే అవే తిట్లు కోర్టులు దాకా ఈడుస్తాయి. పుల్లాయ్‌ని వెనకేసుకొచ్చి వెంకయ్య భార్య మాట్లాడుతూ

వుంటే వెంకయ్య ఆమెను "మేకారి పిచ్చి" అని ఇంటిపేరు చెప్పి దెప్పిపొడవటం చాలా సహజంగా వుంది.

రాఘవులు దొడ్లోకి వస్తున్నట్టు పాఠకులకి సూచన చెయ్యటానికి, రాఘవులి పట్ల పశు సంపదకున్న ప్రేమను వ్యక్తం చెయ్యటానికి— "ఇంతలోనే దొడ్లోని అవులు అరిచాయి. కర్రి గిత్త కట్టుకొయ్య దగ్గర ముంగాలిగిట్టతో గీరుతూ ఖణేలున రంకె వేసింది. ఆరు కారులు యెద్దు పండుకొన్నదల్లా లేచి దొడ్డివాకిలి వైపు చూస్తూ నిలబడ్డది. చెంగనాలు తీసుకుంటూ వస్తున్న కోడెదూడ ముందు మోపు దగ్గరకు వెళ్ళి మూచూచి అక్కడనుంచి మరొక గంతు ముందుకు వేసింది. ఈ రెండో మోపు రాఘవులది" అని రచయిత మనకళ్ళ ముందు స్వచ్ఛమైన గ్రామీణచిత్రం అక్షరాల్లో గీసి చూపెడతారు.

ఎన్నుగాడి తెగగొట్టే ప్రస్తావన వచ్చినపుడు దొరగారి కొడుకుతో పాలేరయిన రాఘవులు తోటి వ్యక్తితో మాట్లాడినట్టే మాట్లాడతాడు. ఇక్కడ అనుబంధాల దగ్గరితనం తెలుస్తుంది. అదే తండ్రి వచ్చినపుడు చనువుగా మాట్లాడటంగాని, తల్లిగురించి తెలుసుకోవటం గాని రాఘవులు చెయ్యడు. అసలు తండ్రి వచ్చినందుకు ఆనందంగాని, సంతోషం గాని అతనిలో కనిపించదు. ఇక్కడ అనుబంధాల దూరం తెలుస్తుంది.

వెంకయ్య అన్నిటినీ తెగనమ్మి బాకీలు తీర్చే సమయంలో మిగతా బాకీదారులు కూడా "ఓడంటే అంతా ఓడే" నని చుట్టూ మూగి ఒత్తిడి చేస్తారు. లోకసహజమైన ఈ లక్షణాన్ని రచయిత చక్కగా చిత్రించారు.

ఈనాడు రైతుల స్థితికూడా సరిగ్గా వెంకయ్య పరిస్థితి లాగే వుంది. ముందు ముందు రైతుల స్థితి ఇలా వుండబోతూందని 1947 లోనే వూహించి రచయిత రాశారా అని అనిపించి ఆశ్చర్యపోతాం. ఈనాటి రైతులు వెంకయ్య తమ్ముళ్ళలానే వున్నారు.

ఉమ్మడి కుటుంబజీవనం మిగిలివున్న రోజుల్లో, కులాల మధ్య, వర్గాల మధ్య మరీ ఇంత వైషమ్యం లేనిరోజుల్లో, గ్రామాల్లోకి రాజకీయాలు ఇప్పటిలా అల్లుకుపోని రోజుల్లో పల్లెటూళ్ళ జీవితాన్ని గూర్చి రాసిన స్వచ్ఛమైన కథలు — 'ఉపబిందువులు', 'చేసుకొన్న ఖర్మ'.

"షష్టిపూర్తి"— శేషయ్య ఒకప్పుడు, సంపాదించే ప్రతి మగవాడులాగానే తనింట్లో

మహారాజులాగా వెలిగాడు. అంతా ఆయ నిష్టప్రకారమే జరిగేది. కానీ, ఇప్పుడు సంపాదన లేదు. భార్య చనిపోయింది. కొడుకు పెద్దవాడయ్యాడు. పెళ్ళిచేసుకుని పిల్లల్ని కన్నాడు. ఇంటి ఆధిపత్యం సహజంగానే కొడుక్కి, కోడలికి వచ్చేసింది. ఇక శేషయ్యగారి పని వట్టి తాతయ్య పనే అయింది. దాంతో శేషయ్యగారు తెరవెనక్కి తప్పుకోవాల్సిన తప్పని పరిస్థితి వచ్చింది. అయినా తన సలహాలు ఇంట్లో ఎవరూ తీసుకోవటం లేదని దిగులు. ఇంట్లో జరిగే ముఖ్యమైన విషయాలు తనతో సంప్రదించటం లేదని, తనకి తెలియటంలేదని ఆరాటం. తనని ఇంట్లో ఒక మనిషిగా గుర్తించటం లేదని ఆవేదన. దాంతో చచ్చిపోవాలనిపించి రకరకాల ఆలోచనలు చేస్తాడు. చివరికి ప్రయత్నించి రకరకాల కారణాలతో విరమిస్తాడు. ఒకరోజు చిన్న మనమరాలు వచ్చి అక్కయ్య పెళ్ళి పదిరోజుల్లో జరగబోతుందట అని చెబుతుంది. పెళ్ళిపనులు చకచకా జరిగిపోతున్నాయి. తనని కరివేపాకులా తీసిపారేసి నట్టయింది. దీంతో ఉద్రిక్తుడవుతాడు. మళ్ళీ మనసులో చావు పొరలు విప్పుకున్నాయి. ఆరోజు రాత్రి స్థిరనిశ్చయంతో చచ్చిపోవటానికి బయలుదేరతాడు. మధ్యలో పిల్లదాని పెళ్ళి ఆగిపోతుందేమో ననే అనుమానం వేస్తుంది. దాంతో అడుగుల వేగం తగ్గింది. ఇప్పుడు కాకపోతే పెళ్ళి మరో ముహూర్తంలో జరుగుతుందిలే అని సమాధానపడతాడు. ముందుకు నడుస్తూ బావిలో దూకుదా మనుకుంటే ఊరంతటికీ ఈ ఒక్క బావేనే, తను దాన్లో చస్తే అందరికీ అపకారం చేసినట్టవుతుం దనుకుంటాడు. ఇంక మరి అడుగు ముందుకు పడలేదు. ఇంతలో తను రాస్తున్న కావ్యం గుర్తుకు వస్తుంది. అది ముగించుదా మనుకుంటాడు. ఈ లోపు పిల్ల పెళ్ళి అవుతుంది, కావ్యం ముగిస్తే షష్టిపూర్తి చేయించుకోవచ్చు, ఆ తర్వాత తీరిగ్గా చద్దాములే అనుకుని ఇంటిముఖం పడతాడు.

ఈ కథలోని శేషయ్య మానసికచిత్రణ అత్యద్భుతంగా, చాలా సహజంగా వుంది. శేషయ్య తపనతో పాఠకులు తాదాత్మ్యం చెందుతారు. ఇక్కడ శేషయ్యకే గనక చెప్పుకో దగ్గ ఆస్తి వుంటే కథ మరో రకంగా వుండేది. మానవ అనుబంధాల వెనక సొంత ఆస్తి పాత్ర, ఆడే నాటకం, చేసే ఓలిపితనం ఎంతో వుంది. ఈ లోకంలో ఆస్తుల్లేని, ఆర్జనలేని తాతయ్యలకు శేషయ్య ప్రతినిధి. ఆయ్యా ! మా కష్టాలివి, మా మనసులోపలి పొరల్లోని ఆలోచన లివి, ఆవేదన లివి, అర్థంచేసుకోండి అని తోసివేయబడిన ముసలితనం ప్రతినిధిగా శేషయ్య కథనిండా పరుచుకొని కన్నీళ్ళు తెప్పిస్తాడు, కళ్ళు తెరిపిస్తాడు.

జీవితం ఎంత అసంబద్ధంగా వున్నా, అననుకూలంగా వున్నా చావు పరిష్కారం కాదు;

ఏవో చెప్పరాని అనుబంధాలు, చెప్పలేని ఆత్మీయతతే బ్రతుకుమీద తీపికి, ఆశకి కారణం అని నిరూపించిన కథ.

"అనిర్వచనీయమైన ఖ్యాతి" — ఉషని కట్నం కారణంగా భర్త వదిలేశాడు. ఆ తర్వాత గాంధీగారి స్వాతంత్ర్యపోరాటం ఆమెని ఆకర్షించింది. సత్యాగ్రహం చేసి రెండు సంవత్సరాల జైలుశిక్ష అనుభవించింది. విడుదలై తన ఊరుకి వస్తూ, దేశభక్తురాలిగా రకరకాల కలలు కంటుంది. స్టేషనులో రైలుదిగి తనకోసం ఎవరూ పూలదండలు పట్టుకు రాకపోవటం గమనిస్తుంది. మళ్ళీ తనలో తనే కారణాలు ఊహించుకొని పూరటపడుతుంది. అలా రాత్రివేళ ఇంటికి చేరి తలుపుకొట్టి నాన్నని పిలిచింది. అన్నయ్య వచ్చి తలుపుతీస్తాడు. చెల్లెల్ని చూసి నిర్ఘాంతపోతాడు. తండ్రిని లేపి నీ కూతురు వచ్చిందని చెబుతాడు. కూతురు రెండేళ్ళ క్రితమే చచ్చిపోయిందంటాడు తండ్రి. ఉష ఒక్కసారిగా ఉప్పెనగా ఏడ్చింది. దాంతో వదిన, ఆమె తమ్ముడు రఘు లేచారు. అన్నయ్య వంకరకూత కూస్తాడు. దాంతో ఉష ఎదురు మాట్లాడుతుంది. వాళ్ళ దృష్టిలో ఉష చెడిపోయింది. ఉష నిజం చెప్పినా నమ్మే స్థితిలో లేరు. అసలు ఉష చచ్చిపోయిందనే రెండు సంవత్సరాలనుంచీ చెప్పుకుంటు న్నారు. ఈ స్థితిలో ఉషని ఊపిరి పీల్చనివ్వలేదు. అన్నా, రఘు కలిసి ఉషని చంపి ఊరికాలవలో పారేశారు. అయినా సూర్యుడు తూర్పునే ఉదయించాడు అని కథ ముగు స్తుంది.

ఉష అంతరంగ చిత్రణ వాస్తవానికి దగ్గరగా వుంది. కొన్ని ఆదర్శాల కోసం, విలువల కోసం చిత్తశుద్ధిగా నిలబడి పోరాడే వ్యక్తుల జీవితాలు ఎక్కువభాగం బాధామయం గానో, విషాందాంతంగానో ముగుస్తాయి. అందులోనూ మన సమాజంలోని స్త్రీ బయటకు వెళ్ళి పోరాటంలో పాల్గొనడమా! మగ అహంకారానికి ఎంత ఎదురుదెబ్బ!! ఇక్కడ ఉష ఆస్తులు, అంతస్థులు కోరుకోలేదు. భగ్నమైన వైవాహిక జీవితాన్ని పునరుద్ధరించమని అనలేదు. తను చేసిన పనికి గుర్తింపు, ఒక చిరునవ్వు, ఒక మంచిమాట. ఇవే తను కోరుకుంది. ఇలాంటి గుర్తింపు ఇవ్వకపోగా గుర్తు తెలియకుండానే మట్టుపెట్టేశారు.

సామాజిక సమస్యల్లో స్త్రీ, పాలుపంచుకోవటంలో ఆనాటికన్నా ఈనాడు పరిస్థితి కాస్త మెరుగ్గా వుంది. స్త్రీ 'వంట ఇంటి కుందేలు', 'మగవాడి చెప్పుచేతల్లో వుండాల్సిన ప్రాణి' — ఇంకా ఇలాంటి నానారకాల మురికి భావాలకి వ్యతిరేకంగా నిల్చిన ఉష పాత్ర మరవలేనిది. ఈ ఉష చైతన్యవంత మవుతున్న స్త్రీ శక్తికి విషాదప్రతినిధి.

కృష్ణరావుగారి కథల్లోని గొప్ప పాత్రల్లో ఈ ఉషతోపాటు సుభద్రమ్మ, రామయ్య, రాఘవులు, శేషయ్య — కథలు వున్నంతకాలం కాలంతోపాటు కదులుతూనే వుంటారు.

ఇక 'మాయ', 'అతడంటే', 'వేదాంతి' అనే కథలు కూడా వున్నాయి. ఇందులో 'మాయ' కథకి సీక్వెలే 'వేదాంతి' కథ అని అనిపిస్తుంది. ఈ మూడూ పై నాలుగు కథలంత గొప్పగా లేవు.

మిగతా కథలు ఏమన్నా వుంటే అవి నేను చదవలేదు.

# యుగసంధ్య

## ( పద్యకావ్యం )

—వేములపల్లి ఉమామహేశ్వరరావు

[సాంస్కృతి ప్రవేశపరీక్ష సంస్కృత పాఠశాల అమృతలూరు నా గురువుగారు నాగలింగం వేంకటేశ్వరశాస్త్రిగారు సాహిత్యవిద్యా ప్రవీణ నెల్లూరు చిట్టిగూడూరు సాంస్కృతకళాశాలలో భాషాప్రవీణ సొంతంగా చదువు పుస్తకాలు చదవటం ఉపన్యాసాలు వినడం ఇష్టం 1942 నుండి జి వి కృష్ణరావు గారితో పరిచయం 1950 నుండి చివరి వరకు చాల దగ్గరగ అనుసరించి కుటుంబ మిత్రుడుగా తిరిగే భాగ్యం దక్కింది]

* * *

తెలుగుభాషాసంప్రదాయాని కనుగుణంగా
ఫుల్‌స్టాప్‌లు, కామాలు, కోలన్‌లు లేకుండ
వ్రాయబడడం ఈ వ్యాసం ప్రత్యేకత.

* * * *

జి. వి. కృష్ణరావుగారు మూడు పద్యకావ్యాలు వెలువరించారు ఒకటి వరూధిని రెండు శివరాత్రి మూడు యుగసంధ్య వరూధిని యువనామసంవత్సరం 1985 శివరాత్రి ఈశ్వరనామ సంవత్సరం 1987 యుగసంధ్య 1943 అచ్చు రూపం ధరించాయి ఈ మూడు కావ్యాలు

ఆకాశంలో చాల చిన్నవి అయినా గుణంలో చాలగొప్పవి ఒక్కొక్కటీ ఒక్కొక్క ఉత్తమ విషయం ప్రధానంగా భాసించాయి

కావ్యలక్షణాలు

1 విశ్వశ్రేయః కావ్యం

2 గుణాలంకారసహితే శబ్దార్థే దోషవర్జితే
గద్యపద్యోభయ మయం కావ్యం కావ్యవిదో విదుః

3 నిర్దోషా లక్షణవతీ సరీతిర్గుణభూషితా
సాలంకార రసానేకవృత్తి ర్వాక్కావ్యనామభాక్

4 అదోషే సగుణౌ సాలంకారే శబ్దార్థే కావ్యం

5 వాక్యం రసాత్మకం కావ్యం

ఈప్రకారం కావ్యలక్షణాల్ని పలువురు పలువిధాలచెప్పారు ఏ ఇద్దరు ఒకటిగా చెప్ప లేదంటె ఆశ్చర్యం లేదు ఎందువలన ఇట్లా చెప్పారో ఆలోచించాలి ఈ చెప్పినవారంతా గొప్ప లక్షణ గ్రంథకర్తలే

ఈలక్షణాల్ని పరిశీలిస్తే ఒకవిషయం విశదం అవుతుంది కావ్యాలను ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు రచించారు అలా చాలా కాలం జరిగింది ఆయా కాలాల్లో తమకు తోచినట్లు తాము వ్రాసికొంటూ పోయారు ఈకావ్యాలను అల్లినవారిని కవులు అన్నారు

తరువాత కొంత కాలానికి వచ్చినవారు కావ్యాలను అల్లుటను బదులు అల్లిన కావ్యాలను చదువుచూ వచ్చారు చదువగా చదువగా ఒకవిషయం వారితలంపునకు వచ్చింది వచ్చిందే తడవుగా అన్ని కావ్యాల్లోనూ ఉన్న కొన్ని సామాన్య విషయాలను తీసికొని నియమాలని పేరుపెట్టి పుస్తకాలగా కూర్చారు అవి లక్షణగ్రంథాలుగా ప్రసిద్ధి పొందాయి

అటుపిమ్మట వచ్చినవారు మరికొంత పరిశీలించి మరికొన్ని లక్షణగ్రంథాలు వ్రాశారు ఈవిధంగా లక్షణగ్రంథాలు లెక్కలేనన్ని తయారయ్యాయి అంతియే కాని లక్షణగ్రంథాలు ముందు పుట్టలేదు కవులను శాసించలేదు ఒకవేళ కొందరు శాసించినా కవులు దానికి కట్టుబడి ఉండనూ లేదు అందుకనే నిరంకుశాః కావయః అనీ లక్షణం కూడా చెప్పారు

కొంతకాలం తరువాత కొందరు ఆ లక్షణగ్రంథాలను బట్టీపట్టి సాగదీసి మంచిచెడ్డలను నిర్ణయించనెంచి కొన్నింటి ఖండించి మరికొన్నింటి మండించి వ్రాయడం మొదలుపెట్టారు అవి విమర్శనాగ్రంథాలుగా పేరు పొందాయి

ఈవిధంగా కావ్యాలు లక్షణగ్రంథాలుగా విమర్శనాగ్రంథాలుగా దేశంలో కుప్పతిప్పలుగా వెలిశాయి

ఈనాడు విమర్శకులు ఏవిషయాన్ని గురించి వ్రాయాలన్నా మాట్లాడాలన్నా ఆ లక్షణగ్రంథాలలోనున్న లక్షణాలను ముందు పెట్టుకొని మంచిచెడ్డాలను నిర్ణయించడం అలవాటు చేసికొన్నారు ఇది ఎంతవరకు సబబో ఆలోచించాలి

## పద్యకావ్యం

భారతీయ సంప్రదాయం ప్రకారం కావ్యం మూడు విధాలు గద్యం పద్యం గద్యపద్య ఉభయమయం నియమబద్ధమైన రచన పద్యం నియమబద్ధం కాని రచన గద్యం అదీ భేదం ఇది కవుల ఆచారం ఇది సంస్కృత భాషానియమాలలో ఉన్న విషయం

ఇప్పుడు కొందరు తెలుగుదేశంలో గద్యకవిత్వం లేదని భ్రాంతి పడి క్రొత్తగా గద్య కవిత్వం వచ్చినట్లు భావించి చెప్పడం వింతగాఉంది నన్నయ్య అంతటివాడు మహాభారతంలో ఒకచోట గద్యరచనాప్రవీణులగు మహాకవులును అని అన్నాడు దీనిప్రకారం నన్నయ్యకు పూర్వం తెలుగులో గద్యరచన ఉన్నట్లు గద్యరచన చేసినవారు మహాకవులైనట్లు స్థిరమైన అభిప్రాయం కలుగుతుంది

కావ్యాలు రెండు రకాలు ఒకటి శ్రవ్యం మరియొకటి దృశ్యం ఒకరు చదువుతూంటే విని ఆనందించేది శ్రవ్యకావ్యం కొంతమంది మాట్లాడు కొంటున్నట్లు చూపించితే అది దృశ్యకావ్యం దీనినే నాటకం అంటారు తిక్కనరచన దృశ్యం ఒకసారి చదివినా సంభాషణ సాగించినా అందంగా ఉండునట్లు రచన సాగించగల నేర్పు తిక్కనకు ఉంది అందువలన తిక్కనకు ఉభయకవిమిత్రుడు అను బిరుదు సార్థకమైంది

ఈ కాలంలో చాలా వాదాలు వినబడుతున్నాయి వీనిలో హేతువాదం ఒకటి ఇది వినబడినంత ఎక్కువగ మరియేదీ వినబడుట లేదు అందువల్ల దీన్నిగూర్చి కొంత చెప్పాలి

హేతువు అంటె కారణం హేతువాదం అంటే కారణాన్ని గురించి చెప్పేది అని అర్థం ఒకపని పూర్తి కావటానికి కారణం ఉండాలి ఆకారణం లేకున్న ఆపని పూర్తికాదు మరియొక కారణం చేతకూడ ఆపని పూర్తికారాదు ఆకారణంతో ఆపని జరగాలి ఆకారణాలు అనేకం ఉన్నాయి ఈవిషయాల్ని వివరించి చెప్పేశాస్త్రం తర్కశాస్త్రం ఈశాస్త్రప్రకారం వివరించు వాదం హేతువాదం అవుతుంది

ఈవిషయాల నన్నింటిని ముందు పెట్టుకొని ఈ యుగసంధ్యను పరిశీలించాలి

ఈ యుగసంధ్యలో మొత్తం భాగాలు ఆరు ఒకటి అంకితం 13 పద్యాలు రెండు మహోదయం 12 పద్యాలు మూడు అధిజ్యా ధన్వం 47 పద్యాలు నాలుగు అహతవ్యూహం 67 పద్యాలు అయిదు విలక్షశిలీముఖం 14 పద్యాలు ఆరు ప్రసక్త ప్రస్థానం 57 పద్యాలు ఈరకంగా ఆరుభాగాలు 206 పద్యాలు ఉన్నాయి

ఇందలిపాత్రలు

| యువభారతి | కవివరేణ్యుడు | చంద్రరేఖ కవిభార్య |
|---|---|---|
| కొడుకు | కూతురు | |
| ఆంధ్రధారుణీపతి | మంత్రివర్యుడు | లాక్షణికుడు |

## కథాసారము

**మహోదయము**

తన పరాక్రమముతో నాల్గుదిక్కుల నొక్క కొలికి చేర్చిన త్రిలింగప్రభువునకు జయమగుగాక శత్రురాజులను జయించి వచ్చిన నిన్ను కనులార చూచుటకు కానుకలిచ్చుటకు తెలుగుపిల్లలు వచ్చినారు నీవు శత్రువులను జయించి తెచ్చి ఇచ్చిన మణులతో అచ్చన గాయలాడు మత్తగజేంద్రగామినులు మంగళగానముతో నివాళులిచ్చుచున్నారు నీ విజయవార్తకు సంతసించి ఆబాలవృద్ధము నీదర్శనమునకు విచ్చేసెను శత్రుసముద్రమును నీ పౌరుషము మంధరగిరివలె చిలకగా పుట్టిన అచ్చరలు నీకొలువున నాట్యము చేయ సిద్ధంగానున్నారు స్త్రీలు సామంతులు ప్రతిభావంతులు సేనాధిపతులు మంత్రులు నీరాకకై ఎదురుచూచుచున్నారు శౌర్యరేఖలుపొంగు తెలుగువీరులు నీ కొలువు నలంకరించియున్నారు దయసేయుము

రాజు పేరోలగంబుండి తన డబ్బుతో పొట్టలు నింపుకొనుచున్న కవీంద్రుల చూచి మావిజయమ్ముఁను కావ్యముల కూర్పుఁడని కోరెను ఆమాటకు అనేకులు సంతసించిరి యువ భారతి కవివరేణ్యుఁడు సంతసింపలేదు అందులకాతనిభార్య చంద్రరేఖ అంగీకరింపక కవితో

అందరిని పోషించినవాడు నిండు కొల్వులో కృతిని కోరడానికి తగదా రాజుకొల్వున స్వార్థములో కవిత్వార్థములు కోరెనా ఆరాజు పరాక్రమము తెలుగుసంపదలను వెదజల్లినది గర్జనలు దిగంతముల మారుమ్రోగినవి ప్రపంచహితమును గోరి ధనరాసులు మీముందు గుమ్మరించి మాయగర్భకావ్య కుసుమమ్ముల గూర్పుడన్న కష్టమా ఈనాటికీయవకాశము చిక్కినది భాగ్యము పండినది మీగంటమును గరగర సాగిపోనిండు

ఆయువకవి వట్టి దేబె కవితాపద్ధతి తెలిసియున్న రాజౌసంగుసంపదను కాలదన్నునా యని లోకము కోడియైకూయును తిండిలేక పస్తులుండు నిన్ను పిలిపించి కవీంద్రునిగా జేసి గొప్పస్థాన మిచ్చి కోరినంతడబ్బిచ్చి గౌరవించుచున్నాడు అదిలెక్కలేదా యని పలుక విని యువకవి చంద్రరేఖతో

ఎవ్వతె నీకు నూరిపోసినది ఏ అపవాదములు పుట్టలేదు కదా నేను ఆ రాజు నాజ్ఞను ధిక్కరించితినా ఆసభలో రాజుపై కలహమునకు కాలు దువ్వితినా ఏమి విశేషములు అని అనగా చంద్రరేఖ

ఇంతటిబుద్ధిమంతుడు మరియొకడు ఈలోకమున లేడు తనమాట తప్ప రెండవవాని మాట వినానివాడు నాకు మగడైనాడు నాపుణ్యమిట్లున్నది

రాజుగౌరవముతో ఆంధ్రతేజమును తెలుపు కావ్యములు రచింపుమని కోరినప్పుడు ఆకవులందరు అంగీకరింపగా మీరుమాత్రం దక్షిణలు పుచ్చుకొనక మిన్నులుచూస్తూకూర్చు న్నారు అందులకారాజు కాబట్టి ఊరుకొన్నాడు మరియొకడైనచో మీతల ధణేలున కొట్టి కోటగుమ్మముననుగట్టి యుండెడివాడు ఇకనైనను చేసినతప్పు నొప్పుకొని కావ్యము వ్రాయుదునని దక్షిణలు పట్టుము లేకున్న దోసిళ్ళతో నెత్తిన నిప్పులు పోసికొన్నట్లే మాటపట్టింపుకోసం పెనుగులాడవద్దు నామంగళ సూత్రం నిలుపు

ఈ మాటలకు యువకవి కలకలనవ్వి ఏదిఎట్లు పోయిన నీకేమిలే నేనుమాత్రం దక్షిణలు నీతాళిబొట్టు ఏమాత్రం మరువను

అనగా చంద్రరేఖ

నీవు వట్టి రాతి మనిషివి చచ్చేటప్పుడు కూడ నీ పోటుమాటలు మానవు అత్తగారు నీ గుండెలు రాతిగాజేసి నాకొఅకిచ్చినది నీ ఎగతాళి మాటలు చాలును అనుచు కంటనీర్వెట్టిన భార్యను ఓదార్చుచు యువకవి

నీవు యుద్ధరంగమును చూచిన ఇటువంటి తీర్పు నిత్తువా ఈరాజు జరిపించిన మానవ మారణహోమమునకు ఆతని మారుతమ్ముడే ఆవురుమన్నాడు చెట్లుకూడ పుష్పాలను రాల్చినవి అయినా జాలి కలుగలేదు

ఈ ఊచకోత పాపమని దిక్కులు గుండెలు బాదుకొని చెప్పినవి అయినా రాజునకు గుండె కరుగలేదు ఈరాజు అంతట పుణ్యాత్ముడు కావ్యసుందరి ఆయన చరిత్రలో గంతులు పెట్టవలెనా ఆయనకు కావ్యమునిచ్చిన రాబోవుకాలమున జనులు మోమున ఊయరా

ఇట్లు సంభాషణ సాగినది దీనిలో కావ్యగుణము కావ్యవస్తువుమొదలైన విషయాలను యువకవి వివరించును ఈచర్చ కావ్యప్రపంచానికి పుట్టిల్లు చంద్రరేఖ బీదరికంతో పడినపాట్లు వివరించును ఈలోగా కోటలోని నగారాధ్వనులు పండితులను గోష్ఠికి గొంతెత్తిపిలిచినవి

**అహితవ్యూహము :**

కావ్యసమస్యలపై యువకవితో వాదనచేయుటకు రాజు పండితగోష్ఠి నేర్పాటుకావించి తానే తీర్పరిగా నున్నాడు ఆసభలో కొమ్ములుతిరిగిన పండితులెందరో బారులుతీరి కూర్చు న్నారు అప్పుడు యువకవి భూజానితో

ఓరాజా నేనొక మాట అడుగవలె మీరు ఈసభలో రసికాగ్రణులై తీర్పునిత్తురా అనగా రాజు

ఓకవీ ఇచ్చట అధికారమునకు చోటులేదు అని తన నిశ్చయాన్ని తెలిపాడు అపుడు కవిరాజుతో

మీరు కావ్యాన్ని వ్రాయమన్నారు ఎవరికోసం కావ్యం వ్రాయాలి నా సందేహం తీరునట్లు సెలవిండనగా విని సభలోనివారందరు ఈ యువకవి పట్టి దద్దమ్మా జైత్రయాత్రను గూర్చి వ్రాసి సంస్థానగౌరవం నిలువ బెట్టవలసిన సమయంలో ఇంత తేలికగ మాట్లాడు కవి సన్నాసి ఈనాటికిదొరకె నని ఈసడించుకొన్నారు ఈతనిని నేను జయింతును నేనుజయింతుననుచు తమలో తాము ప్రజ్ఞలు పోసాగారు నాకవకాశము రాలేదుకాని వచ్చినట్లైన ఈతని అంతు తేల్చుదునని ఒకరినొకరు చెప్పుకొన సాగారు

ఆసమయంలో రాజు చూపులు పండువంటి లాక్షణికునిపై బడ్డాయి ఆతడు సర్వ శాస్త్రాన్ని హేతువాదశాస్త్రప్రకారం పరిపూర్ణంగా అవుపోసన పట్టినవాడు రాజుభావం గ్రహించాడు ముందుకు వచ్చాడు ఆపండితుడు ప్రశ్నించడం యువకవి సమాధానం చెప్పడం కొంత సేపటికి యువకవిసమాధానం లాక్షణికుని గెల్చింది మిగిలిన పండితులకు అర్థంకాక విసిగి నిట్టూర్పులు మొదలు పెట్టారు

అపుడు రాజు యువకవితో

ఏమయ్యా యువకవీ ఇంతకీ సారాంశం రాలేదు ఈసాయంకాలానికి తెమల్చగలమా అని చిరునవ్వు నవ్వగా

రాజుభావం ఎరిగిన కవి ఉత్సాహవంతుడై ఒక్కసారి సభనంతయు కలియజూచి యుద్ధరంగంలో జరిగిన ఘోరకార్యాలను వివరించసాగాడు

ఓరాజా యుద్ధకాలంలో నీ సేవకులు చేసిన మానభంగాలకు అవినీతికి సూర్యడంతటి వాడు జంకి మబ్బుచాటుకు చేరాడు ఎంతో మంది అకాల మృత్యువాతబడ్డారు పీనుగులు నాట్యం చేశాయి పల్లెలన్నీ కష్టాల పాలయ్యాయి మీ పౌరుష మంతా దిక్కులేని బీదలపై చూపించావు రైతులు కష్టాల పాలయ్యారు మీరు చేసిన పనివల్ల ప్రజలకేమి లాభం చేకూరింది ఇంత దుఃఖంతో నిండిన మీ మనస్సు కవితామృతాన్ని చవిచూతునా ఈకథను ఏమని వ్రాయగలను ఇదియంతయు గబ్బు కొట్టు నెత్తురు ముద్దయే కదా

ఓరాజా నములుదునా మ్రింగుదునా యన్నట్లు ధుమధుమ చూచెదరేమి మీపేరు విన్న పెద్దలు గడగడలాడుదురు పిన్నలు కెవ్వున కేక పెట్టుదురు ఈపనులన్నియు మంచివో చెడ్డవో ఈ పండితులే తేల్చి చెప్పాలి

ముందు వెనుకలు చూడక చేసిన పనులు మీకు మీదగ్గర డబ్బుగుంజి పెద్దబొజ్జలు పెంచుకొన్న బస్తాలవంటి పండితులకు ఆనందాన్ని కలిగించవచ్చు సామాన్యప్రజలకు ఆనందాన్ని కలిగించ లేవు

ఒకవేళ నేను తెగించి మీప్రతాపాన్ని కావ్యమల్లిన ప్రజలహృదయం మండిపోతుంది అసలు ఈబాధలు కావ్యవస్తువగునా కవులైన వారు రాజాసంగు పొట్టకూటికాసపడి సమాజమునకు కీడు తలపెట్టెదరా ఇంటువంటి దురంతాలను పూర్వయుగాలలో ఏరాజైన తలపెట్టెనా డబ్బున్న బాగా తిన వచ్చు కట్టవచ్చు కాని ప్రజల సుఖాలను కాలరాయవచ్చునా భావికాలాన జనులు నీ చరిత్రను తిట్టి పోయుదురు అని తన వాదనా పటిమతో వాక్చతురతతో సభాసదు కవిని లను ముగ్ధులను గావించాడు

ఉరుములు లేకుండ పిడుగులను కురిపించిన కవిరాజు కోపానికిని సభలోనున్న పండితులందరు దిమ్మరపడిపోయినారు ఆ ప్రాంతములో చీమకూడ చిటుక్కుమనలేదు యువ గెల్తుమని కోతలుకోసిన పండితులు కిక్కురు మనలేదు

అపుడు తెలుగురేడు గుండెదిటవు చేసికొని

ఓ కవిరాజా నీవలె ఇట్లు రాజునెదుర్కొన్న కవులు పూర్వకాలంలో ఎవ్వరును లేరు ఈ కావ్యచర్చాగోష్ఠిలో నీవే గెలుపొందితివి

అని విజయమును ప్రకటించి సభలోనున్న పండితులను చూచి ఓ పండితమండను లారా మీరీ వాదమున నోడితిరి కాన ఈయువకవిరాజు పాదాలకు నమస్కారం చేయండి ఏం ఓడిపోయి తలవంచుటకు సిగ్గుపడుచున్నారేం మ్రొక్కకుండ కాలు కదల్చటానికి వీలులేదు ఇది నాయాజ్ఞ అనగా కవులు కాదనలేక కవిచంద్రునకు సమస్కరించి నిలువగా రాజు వారలను పంపివైచి బాలచంద్రుని వలె ప్రకాశించుచున్న కవిరాజును కన్నులగప్పుకొనుచు ఓ యువకవీ మీశాస్త్రవివాదఘోషలో బ్రహ్మాండం బ్రద్దలైంది వెనుకటిజన్మలో చేసిన మా పుణ్యాం పండింది

ఓ కవిచంద్రా ఈ వివాదంలో కోపించిన రాజ్యతంత్రములు కసరి బుసకొట్టుచున్నాయి నిన్ను నాశనము చేయ వేచియున్నాయి కాన నీ ప్రాణములు కాపాడుకొను మార్గం చూచుకో కాదంటె ఒక ఉపకారం మాత్రం చేయగలను సూర్యోదయం కాక ముందు పట్టణం విడిచిపో

నీ ప్రాణములు నీకు దక్కుతాయి లేకున్న ఆ బ్రహ్మకూడ నీచావును ఆపలేడు అని పలికెను

ఈ విధంగా దయారసం చిందించు రాజుమూసినకపరిపాకానికి లోలోన మెచ్చుకొనుచు రాజును ఆశీర్వదించి కావ్యధర్మాన్ని రక్షించడానికి కంకమొడ్డిన యువభారతి రాజుదగ్గిర సెలవు తీసికొని ఇంటికి సాగిపోయెను

విలక్షిలీముఖము

రాజున కెదురొడ్డి నిల్చినందులకు కవిపై కోపము వహించిన మంత్రివర్యుడొకడు రాజును సమీపించి ఓరాజా ఆ కవి కారుకూతల నెట్లు సహించితివి ఒక్కపూట తిండికి దిక్కు లేని ముష్టివాడు ఈనాటికిట్లు ఎదిరించి మాట్లాడునా తెల్లవారులోపల ఆ కవి తలను ఖండించి కోటగుమ్మమున వ్రేలాడదీయుదునా ఆ రాజద్రోహిని వెడల నిచ్చిన మీ గౌరవం మంటకలవదా అతడు చిన్నవాడే కావచ్చు అధికారంలో దయకు తావు లేదు రాజసింహంపై రాళ్లు రువ్వి కవిగాడు ప్రాణాలతో బయటపడునా అని పలుకుచున్న మంత్రిని చూచి

ఓ మంత్రీ ఆ వివాదంలో నేను ప్రమాతనై తీర్పు చెప్పి రాజునై విజృంభించుట విజ్ఞత కాదు రాజే మాటతప్పిన గతిఏమి పండితులనందరను వాదమున నోడించిన కవిరాజు తలదీయుట గౌరవప్రదమా ఇక ఆ ప్రసంగ మెత్తకు రాజు వాదములు కోరుట కవిరాజు కాదనలేక అంగీకరించుట దానికి ప్రాణాలు తీయుట అయ్యో ఇట్టి ఘోరం కలదా అనగా విని

ఓ రాజా రాజులెవరు రసిక వీరులెవరు నీ హృదయంలో ఇద్దరున్నారా రక్తపాతము నీ కిష్టము కాకున్న నాకు నాజ్ఞనిమ్ము ఆ కవిరాజు ప్రాణాలు తీయుదు నన్న మంత్రిని రాజు వారించి ఇది ఇట్లుకాదు ఒకమాట అన్నతరువాత దానిని నిలబెట్టుకోవలె రేపు ఆ యువకవి పట్టణమున నున్న అతనిని పెడరెక్కలు కట్టి పట్టుకొని రమ్మని చెప్పి పంపివైచెను

ప్రవసక్త ప్రస్థానము

వాదమున పండితుల నోడించి విజయం సాధించిన యువకవి ఇంటికి వచ్చి భార్య చంద్రరేఖతో

ఓ చంద్రరేఖా కాలము నన్ను మ్రింగుటకు సిద్ధముగా నున్నది నొసట రాసినరాతతో కాలము మూడునో లేక పురుషప్రయత్నములే విజయము పొందునో తెలియదు అలసింపరాదు

సూర్యోదయవేళ రాజుగారు నన్ను చంపుదురు ఇటనుండి పోవలయును అన్నెము పున్నెము ఎరుగని బిడ్డలు నిద్రించుచున్నారు కన్నుగుట్టి మృత్యువు ఈ బిడ్డల కెగబడ్డది లేపుము గుడ్ల గూబలు కూయుచున్నవి చిత్రగుప్తుడు రాసిన జాబితాలో నా పేరు ధగ్గర బఠ్ఠిన గీటుగీసి యుండవచ్చును

యుద్ధభూమిలో చచ్చినను దిగులు లేదు ఆరాజు పట్టణం విడిచి పొమ్మనగనేపోవక శరీరం అప్పగింప వచ్చునా దేశరక్షణ కొరకైనను న్యాయము కొఱకైనను దధీచి వలె శరీరం కోసి ఇచ్చెడు వాడను కాని ఊరక పచ్చి నెత్తురుని కార్చుట తగునా ప్రయాణమునకు సిద్ధము కమ్ము ఇంతగ కాళ్ళవ్రేళ్ళాబడి మొత్తుకొన్నను నీమనస్సు చయ్యి చుయ్యనదు ఓ మొగలాయిరాణీ నావంక చూడునే చెప్పింది విను ముసుగు బిగించితివి మరాటిగుఱ్ఱము వలె గడసబారితివి

ఇట్లను చుండగా బైట వాకిటనుండి

ఎవరయ్యా లోపల మా యువభారతి కవివరేణ్యులున్నారా ఎంత పిలిచినను సమాధానం రాదేమి అను మాట వినిపించెను అప్పుడు లోపల

అమ్మా ఊరికి పోదమంటివి లెమ్మని పిల్లలు పలుకుచుబైటనుండి వచ్చిన శబ్దమును విని అమ్మా తలుపుతట్టి ఎవరో పిలుచు చున్నారు వారు మనకు ఊరు వరకు సాయం వత్తురా అనెను యువకవి తలుపుదగ్గరకు వెళ్ళబోగా చంద్రరేఖ లేచి భర్త కాళ్ళపైబడి వెళ్ళవలదని వాదించుచు రాజును తిట్టమొదలుపెట్టెను ఆమాటలకు అడ్డము వచ్చి ఓసీ పిచ్చిదానా రాజు నన్ను చంపదలచిన నన్నంపనేల తరువాత భటులచే కవ్వింపనేల దీపము వెలిగించి వెళ్ళి చూచి వత్తును అని భార్యతోచెప్పి వెళ్ళి వాకిలి తెరవగా ఓసత్కవీ భిక్షాందేహి యను మాట చెవులబడెను దానికాతడు నిర్ఘాంత పోయిచూడగా ఆంధ్రధరణీపతి కంటబడెను ఆదృశ్యము నకు తన్మయత్వం నొంది రాజును గౌరవంగా ఇంటిలోనికి తోడ్కొనివచ్చి ఉచితాసనమున కూర్చుండ జేసెను

రాజు కూర్చుండి

ఓకవిరాజా రాజ్యాధికారం చెలాయించుటకు రాలేదు కావ్యభిక్షకోరి వచ్చితి నని పలుకగ విని కవి సంతసించి ఈనాటికి సాహిత్యారాధనము పండివచ్చినదని తలంచి మీవంటి వారు కావ్యభిక్షకోరి ఇంటికి వచ్చుట ఇంతకంటె కవులకు కావలసినదేమి యున్నది వెదుక

భోకుండ యోగ్యుడైన వరుడెదురు పడగా కూతుర్లున్న తండ్రులకు కోర్కెలేమి యుండును అయినా కన్యాప్రదానమున కొకతె కలదు ఇచ్చుటనుచితం అని పలుకుచుండ కవికూతురు రాజుఒడిలోనికి దూకి నాన్నా ఇటువంటి వానికి నన్నిచ్చి పెండ్లిచేయుదువా ఈ బుగ్గమీసాల సామి నెవతె పెండ్లి యాడును పెండ్లికాకున్న మానె నాగొంతు కోయవలదని పలుకుచుండ రాజు నవ్వుచు ఆబిడ్డనట్లే అదిమిపట్టి నిన్నే పెండ్లి యాడుదును మీ యయ్య ముందుగా నాకు మాట ఇచ్చినాడు ఎట్లు తప్పును అనెను అపుడు యువకవి

తల్లీ అట్లన వలదు పోయి తమ్ముని తోడ్కొని రమ్మని పలికి కూతుని పంపెను

రసపిపాసియగురాజు యువకవివరేణ్యునితో ఓసత్కవీ కావ్య మొకటి యున్నదంటివి కదా దానినైన ఇయ్యరాదా ఈ తటపటాయింపు ఎందులకు ఎన్నివత్సరములో గతించినవి కాని ఇచ్చట మీ కవిత్వామృతము వర్షింపలేదు మకరందమునుకోరు ఈ హృదయం ఒక్క తేనె బొట్టును గూడ రుచి చూడ లేదు అనగా కవి నిట్టూర్చి

ఓరాజా ఈరసార్ద్రితలు కలకాలం ఏలునుగాక దీనితో తెలుగు నాలుగుచెరగుల నిండుగా సువాసనలు పెదజల్లును గాక కృతిభర్తక్షేమం కోరి సొంతకైతను అంకితం కావించాలి కాని కృతినిచ్చిన మీ ప్రాణములకే నేడు కీడు మూడును ఓరాజావేరుగా తలంపక కృతిని గ్రహించు కోరికను విడనాడుమని విన్నవించగా రాజు విని ఓకవీ ఆకృతిని నేను చదువకూడదు అనగా ఇతరులకు చూపింపనని మాట ఇచ్చిన ఇయ్యగలనని కవి మాట ఇచ్చెను రాజు దానికంగీకరించెను అపుడే కవినందనుడు అచటికి వచ్చి నాన్నగారు పొత్తము నిత్తురా నేను మంచి బొమ్మను దాచి ఉంచాను దీనికై మాయక్క తగవులాడు ఈ బొమ్మను మీకిత్తును మీరు దీనిని మాయక్క కీయగూడదండి ఇత్తురా నేనొప్పనండి అనుచు కొయ్య బొమ్మను తెచ్చి రాజునకిచ్చెను

ఇంతలో పుత్త్రిక తెచ్చిన గ్రంథమునందుకొని దానిని ఆంధ్రధారుణీపతి చేతిలో పెట్టి ఓరాజచంద్రమా పోయి రమ్మని కవీంద్రుడారాజును సాదరముగ సాగనంపి వచ్చెను

## కొన్నివిశేషాలు

రాజుసభనేర్పాటు కావించి తానే న్యాయనిర్ణేతగా ఉన్నాడు కావ్యసమస్య చర్చనీయాంశాలు చర్చప్రారంభమైంది యువకవి మాట్లాడినపిదప రాజుచూపు పండువంటి లాక్షణికునై

17)

పాదుకున్నది ఆలాక్షణికుడు తర్కశాస్త్రప్రకారం సర్వశాస్త్రాలను చదివిన మతిమంతుడు

ఆలాక్షణికుని వర్ణన

పాతిక యేండ్లు దన్క చలపట్టున లక్షణమెల్ల తర్కని
ష్ఠాతత దున్ని దున్ని వ్యవసాయము చేసి గడించి పంటలం
బాతర వోసికొన్ని కృషిమంతుడు నిస్తులభాగ్యశాలి ఆ
భూతలనాధు చూపులను పొంగి మరింతయి మచ్చుచూపుచున్

కావ్యవస్తువు ఏది కాదు

కావ్యవస్తువును గూర్చి చాల అభిప్రాయభేదాలున్నాయి అందువల్ల వాదమునందు యువకవి స్పష్టంగా వివరిస్తాడు

తెగబడి మీప్రతాపము నుతించిన నేర్పున కావ్యమల్లినన్
భుగభుగ మండిపోయెడినిపో జనతాహృదయాంతరాళముల్
సెగపొగలొక్కసారి జనసీమలు గ్రక్కును నాల్గుప్రక్కలన్
పగలెగద్రోయు భావనము మాన్యతమమ్మగు కావ్యవస్తువే

ఇది కావ్యవస్తువు కాదు చెడు ఉన్నది కాబట్టి మంచి లేదు కాబట్టి

సంఘమ్ముతోడిదే సాహిత్యలక్ష్మి
జనుల జీవితములే సామగ్రి కవికి
ప్రజలాదరింపగా బరగు కావ్యమ్ము
ఇట్లున్న ధర్మమ్ము నీసడించకుము

ఈప్రకారం కవిసామగ్రిని గూర్చి కావ్యధర్మాన్ని గూర్చి తీసికొన్న నిర్ణయం ఉత్తమమైంది

వాదము-పద్ధతి

అని వాదించిన నాప్రా
క్తన సిద్ధాంతప్రవీణతా ధన్యుండా
తని వాదార్థమ్ములనే
కొన సాగించుచు వివాదగోష్ఠిందవిలెన్

శ్రవ్యం ఉదాహరణ

పూటకు దారిలేక వలపోయు నొకానొక ముష్టివాడె ఈ
నాటికి రాజ్యభోగుల ఫణాఫలకమ్ముల దన్ని మేనితో
బైటికి బోవజాలుకట ప్రాణములుండవ రాచబొందిలో
గోటను గిల్లవైతు మిదిగో కవిమస్తకమూరకుందుమా

ప్రాయపు వేడినెత్తురులు వాకలుగట్టిన వీర భూపతీ
స్నాయువులందు బత్తెములు చాలని శూరుల ప్రాణఘోషముల్
పాయక తీవరించి పరిపంథులనెత్తుటి తర్పణమ్ము కై
హోయని యార్చుచున్నవి మహోచ్చలితానిల రోదనమ్ములన్

దృశ్యం

యువభారతి కావ్యరచనను గూర్చి చెప్పగ

అనిన లాక్షణికుడు మందహాస మొలుక
మీరు చెప్పినట్లుగ జూడ భారతమ్ము
నాదికావ్యమ్ము నేడు కావ్యమ్ములగునె
దీనికెవ్వరొప్పు మరన్న దీక్షితుండు

సంప్రదాయమ్ము మనకు ఆచార్యకమ్ము
దాననే పూర్వకృతులు స్వాద్యములు నేడు
సంప్రదాయమ్ము విడనాడి చదువు కొన్న
వాని చేత గలుగునా రసానుభూతి

అని సమాధాన మిచ్చిన యంత లాక్షి
ణికుడు తలఁవాల్చె అచటి పండితులు నాక
వీశ్వరుని భావ మిసుమంత యెరుగలేక
విసిగి నిట్టూర్పు గాడ్పులు విడిచినారు

ఆసమయమున న్యాయనిర్ణేతగానున్న మహారాజు

ఏమయ్యా యువభారతి
ఏమని సారాంశ మింతకేనియు రాదే
యీ మాపున తెమలింపగ
లేమా యని ప్రార్థివుండు లీలగ నవ్వెన్

ఈ ప్రకారం సంభాషణ సాగింది

వర్ణన

యువభారతి తన వాగ్ధాటితో అనర్గళంగా వాదనాపటిమను చూపింపగా సభలోనున్న పండితశ్రేష్ఠులు దిమ్మెర పోయినారు ఆసమయంలో బైట ఉన్న విశేషం

అకల్లాడదు తత్సభాసముపకంఠారామ వృక్షమ్ములన్
మూకీభావము నొందె విహ్వలములై పుంస్కోకిలవ్రాతముల్
చీకాకై వెడలింప జంకె లతికల్ నిశ్వాససౌగంధ్యముల్
ప్రాకెన్ వీచులు వీచులై యట భయభ్రాంతుల్ వికీర్ణమ్ములై

చిన్నవాక్యాలతో పద్యం

చేసిన తప్పు నొప్పుకొని చివ్వన రాజును జూచి కావ్యమున్
వ్రాసెదనంచు దక్షిణలు పట్టుము మేలగు కానివేళ నీ
దోసిట నీవె నిప్పుకలు దోర్చి శిరమ్మున జల్లు కోవలెన్
బాసల కోసమై పెనగవద్దుర సూత్ర మొకింతనిల్పరా

కావ్యం వ్రాయటానికి యువకవి అంగీకరంప లేదని తెలిసి చంద్రలేఖ తాను పడిన కష్టాలను భర్తకు చెప్పటం పల్లెలలో బీదలపాట్లు చూడండి హృదయం కరిగిపోతుంది

క్ష్మాపతి సేయు మన్ననల కన్నులకుం బొరగ్రమ్మె నేమిరా
రేపును మాపు అప్పులకు ద్రిమ్మరి యిల్లిలు దేవురింప మా
కాపుర మింత పాటిదని కారులు ప్రేలుచు పుట్టనీని ఆ
పాపవు జీవితమ్మునకు బాల్పడి పట్టము గట్టుకొందువా

నేటికి గూడ కట్టెదుట నిల్చును శ్రావణశుక్రవారమా
పూట పయోదమాలికలు ఛొమ్మని శంఖము లొత్తె చంచలల్
దాటె నభమ్ము చేటకు చెలా తప్పెను కాలుపొట్టలన్
గాటపుచిచ్చులే యెగసి కాల్చెను కజ్జున ప్రేవులార్వగన్

కుతకుతలాడు నాయెడద గుప్పిటికి వచ్చిన నాటి ఘట్టముల్
కుతికయె ఆరకున్న పసికూన తదర్థనిశీథవేళ ఏ
గతి కడుపుబ్బనేడ్చె సౌదకాకల నార్పగ వంటపాత్రలే
గతి బడిగంటలై మొరసె కాలము కప్పిన విస్మరించితే

ఇచట బడిగంటలై మెరసె విచిత్రమైనది బడిగంటలు అందరికి వినబడాలి ఇంటిలో నున్న పాత్రశబ్దం కూడా ఊరివారందరికి వినబడింది పాత్రలో ఒక్క మెతుకైనను లేదని భావం

చేతులు పుండ్లుగా నలికి చేసిన చేతులు వమ్ముసేయు నా
తాతలనాటి కొంపకె గదా కలసత్తువ ధారవోసితిన్
నాతర మారె రానటకు నాకిక కూడిడకున్న మానె నా
చేతులు కాయగాచినవి చెప్పక దయ్యపు కొంపగోడులన్

పల్లెలలో గోడలు మట్టితో ఉంటాయి ఇంటిలోపలను ఇంటిగోడలను సరిచేయుటకు చేతిలో మట్టిని పూయవలయు అప్పుడు చేతులు పుండ్లుపడ్డట్టులగును ఆతరువాత కొంతకాలానికి అరచేతులు కాయలు కాయును

యుద్ధాలవలన నష్టాలు

రాజు విజృంభించి యుద్ధం చేసి శత్రువులను ఓడించి దానిని గొప్పపనిగా తలంచి కవిగోష్ఠి ఏర్పాటు కావించి తన విజయాన్ని కావ్యంగా రూపొందించుమని కోరగా యువకవి మాత్రం ఒప్పుకొనక యుద్ధం వలన లాభం లేదని నష్టాలు కష్టాలు ఉంటాయని వివరించాడు

గెలుపున కాసజేసి వెలిగించిన నీభుజశౌర్యదీప్తి లో
గలగల కోడిపోసిన దకాలపు మృత్యువు లేతపుచ్చెలన్
కిలకిల నవ్వి ప్రేతములు నృత్యమదేపని నాల్కబోసె ప
ల్లెల ననివార్యవై ఖరుల లేవడి తీర్చిన నిండు కొల్వునన్

ఎందరి మాతృగర్భముల నెఱ్ఱని నిప్పులు వోసి కాల్చె నో
ఎందరి గుండెలన్ వగపులెప్పటి కప్పుడు దంచిపోసె నో
బందుగు లాప్తులన్ గురుల బాపుచు తావక వాహినీ బల
మ్మెందరి డెందముల్ గలచి యీసున నాయువు గ్రుంగదీసెనో

ఈపద్యంలో ఒక్కొక్క గణానికి ఒక్కొక్క పదం వేయడం చాల విశేషమైనపద్ధతి

అత్తరి నీ యనుజ్ఞలు లతాంగుల పావడలొల్చి బావుటా
లెత్తిన మానభంగముల కేడ్చుచు గ్రుంగుచు వాయువీచికల్
నెత్తులై మోదుకొన్న వవినీతికి భానుడు జంకి మేఘపుం
బొత్తులలో నడంగె వలపోసెను దిక్కులు గోడు గోడునన్

అవినీతికి సూర్యుడు కూడ జంకినట్లు మబ్బుచాటునకు పోయినట్లు వర్ణించడం విశేషం

మూపులనూది హుమ్మనుచు మూరడు మీదికి లేవనెత్తినన్
బాపురె ఒక్క బార దిగజారును కర్ణునిలేరు పోలికన్
కాపుర మిట్లు దిక్కు దెసగానని బీదల మీదికే గదా
గూపులు వేసి త్రోలితివి క్రూరతరమ్ములు బాహుశౌర్యముల్

ఇచ్చట దిక్కు దెస సమానార్థకాలు కావు

బీదల కష్టాలు ఇట్లా ఉంటాయి ఒక్కమూర సుఖంవస్తే ఒక్కబార కష్టం వస్తుంది
భారతయుద్ధరంగంలో కర్ణుని రథంతో పోల్చడం కవిశక్తికి నిదర్శనం

పంటలు పండని పొలాలు రైతుల బాధలు చూడండి

కొల్లలు పండునేల నలుగొంగుల వల్లెరు లల్లిబిల్లిగా
పల్లిక లల్లుకొన్నవి సిపాయిల రీతిగ తుంగగడ్డలున్
పిల్లలు పెట్టి కాపురము పెట్టిన దీర్చెను రెల్లుదుబ్బులం
దుల్లస మాడు మందపవనోర్మిల రైతుల వేడి యూర్పులన్

పొంగి స్రవంతులై రుధిరపూరముగ్రమ్మిన రొంపి యయ్యె ఆ
ప్రాంగణ మందు జీవితశతాంగము జంటెపుగాళ్ళ వైచినన్

టంగున టంగువాళ్లు తెగటారుటెగాని కదల్పరాక రై
తాంగము ఘోష పెట్టునుగదా జనవల్లభ ఆలకింపవా

ఇచ్చట జందెపుగాళ్ళు - టంగువాళ్ళు వ్యవసాయదారులకు మాత్రమే తెలియు పదాలు విశేషాలు —

కవిపత్ని ఇల్లు తిండి వివరించడం

వీరలు తాళపత్రముల వేదన తోడుత గట్టుకొన్న బం
గారపు మేడలందుననె కాపురముందురు స్వర్గలోక సం
చారము సేయు శబ్దము హజారమునందు సుధారసమ్ము లా
హారముగా నొనర్చు బళిరా కవిపత్నికి లోటుగల్గునే

యువ కవిచంద్రుడు నరపాలుడు చేసిన ఆ యుద్ధములో బీదల కష్టాలను వివరించి తలవంచక తన ధైర్యాన్ని ప్రదర్శించడం

ఇంతలు చేసినావు సరె యీ ప్రజకేమి లభించెనయ్య దు
ర్దాంత తనూజ శోకములు తల్లుల గర్భములందు రేగి పొ
ర్లింతలు పెట్టి యేడ్చును పొరింబొరి ఊరక కల్వరించు వి
శాంతియు లేక మూల్గుతమచల్వలు నిచ్చలు నెత్తిపోయుచున్

స్వాముల చిత్త మింతటి విషాద కథా కథనమ్ములో కవి
త్వామృత మానునా జనహృదంతర రక్తము పుక్కిలించునా
ఏమని వ్రాయగా వలయు ఎట్టులు చేతులు వచ్చు ఇందులో
పాముకు తిండమన్న పసవల్చెడు నెత్తురు ముద్దయే గదా

నములుదునా మ్రింగుదునా
యెముకలతో నన్నయట్టులీ నిరుపేదన్
ధుమధుమ చూచెదరేటికి
తమకుం గనుపింపబోవె దారుణభంగుల్

సభలో రాజు ఎదుట ఇంత ధైర్యంగా ఎదుర్కొన్న కవిసింహం మరియొక్కటుండెనా పరిశీలించండి

రాజు ఔదార్యం

భూమీశుడు కవీశుని వాదమున న్యాయనిర్ణేతగా నిలిచి కవిశక్తికి ఆశ్చర్యపడి కవి పాండిత్యమును ధైర్యమును ప్రశంసించడం

పొండని వారల బనిచి పూర్వమహీధర మందు బొల్చు మా
ర్తాండుడు వోలె నున్న కవిరాట్టును కన్నుల గప్పుకొంచు బ్ర
హ్మాండము బద్ధలై నది సుమా తమ శాస్త్రవివాద ఘోషతో
పండెను పొమ్ము మేము తొలిబాముని జేసిననిందుపున్నెముల్

ఇంతటి సాహసిక్యముల నెందును గంటిమ వింటిమా మహో
దంతము ముందు ముందు జనతా హృదయాంబు రుహంబులందునన్
గంతులు వెట్టు కావ్యమయి గానము నించు దిశాసతీసభా
భ్యంతరమందు జన్మము కృతార్థము పొమ్ము జగత్ప్రియంకరా

ఇట్లు కవీశుని కొనియాడి రాజ్యతంత్రమును చెప్పడం

దుస్సహముల్ వివాదములతో కుపితమ్ములు రాజ్యతంత్రముల్
బుస్సన తోకపై నిలిచి పూత్కృతి సేయుచున్నవింక నా
యుస్సును బట్టి పేలువకయుండునె పొండని సాగనంపునే
కస్సున కాటువేయు నటు గావున నూపిరి దాని చూడుమా

కాదనకున్న నొక్క యుపకారము సేయగ సాహసింతు సూ
ర్యోదయరాగముల్ దెసల నోడిక గట్టక మున్పురమునం
దే దరిదాపునన్ నిలువ కేగిన ప్రాణము దక్కు లేనిచో
నాదట వచ్చు మృత్యువున కాదుకొనందరమౌనె బ్రహ్మకున్

కవిహృదయం

ఈ విధంగా పలికిన రాజును ఆశీర్వదించడం

ఇట్లు కరుణారసమ్ము చిందించు నృపుని
చిత్తపరిణతి మెచ్చి యాశీర్వదించి
కావ్యధర్మరక్షార్థియై కంఠమొడ్డి
న యువభారతి సెలవొంది నడువ సాగె

రాజు కావ్యభిక్ష కోరి వచ్చుట

కవి రాజరికము నెదిరెంచినందులకు తెల్లవారులోపల ఊరు విడిచి పొమ్మని భూమీశుడు ఆజ్ఞనిచ్చి కవిని పంపించి ఆరాత్రి నిద్రపట్టక కవీశుని కావ్యమును మనసార కోరి తెల్లవారు జాముున కవి యింటికి స్వయంగా వచ్చి వాకిట నిలిచి కవిని కేకవేసి గౌరవమును పొంది కోరడం

ఈతరుణేందు దీప్తి నిదురింపగ నీయక నామనమ్ము ను
ద్రూతల నూచి తెచ్చె రసముగ్గుగద్రావిన నీ మనోజ్ఞ వా
ణీ తరలార్ద్రగీతిక పునీత పురాతనగాథ సౌహృదం
చీతరి సంస్మరింపుమ కవీశ్వర కావ్యమనుగ్రహింపుమా

రత్నదర్భాధిపత్యమ్ము రాపు సేయు
నిటకు వేంచేయలేదు వీక్షింపవన్న
పూర్వసుస్నేహము లిపుడు మోకరించి
వేడుచున్నవి మీ కావ్యభిక్ష కోరి

సుకవుల తపము

రాజు ఇంటికి వచ్చి కావ్యాన్ని కోరగా యువకవి అంటాడు

హృదయకేదారఖండమ్ము నెల్ల ఆత్మ
వాక్యనిర్గళిత సుధాప్రవాహమందు
ముంచి యెత్తెడు కాంక్షలుప్పొంగి కాదె
చేయు చున్నారు సుకవు లమేయ తపము

పెద్దలయెడ గౌరవం – కవితా పరమార్థం

తన గురువు చెప్పిన మాటను చంద్రరేఖకు చెప్పడం

ఏమి తలంచినాడొ సెలవిచ్చెడు వేళను వీరవైష్ణవ
స్వామి కలాగురూత్తముడు చల్లని చేతులు నా బుజమ్ములన్
గోమున పైచి నీ కవితకుం బరమార్థము వింటివే గదా
యేమరబోకుమా తనయ యా ప్రజసేమము సంస్మరింపుమా

అని తిరుమంత్ర మిచ్చి మరి యంపెను నేడు తదాజ్ఞదాటగా
జనునె జనాంత్రమాలికల జాజులు కట్టిన రాజ్యతంత్రముల్
పనవి రచించి తీర్చిన ప్రబంధము నాతని కంకితమ్ముగా
పౌనరుపనేర్తునా సుకృతి పూజ్య మహాశయ మార్చివైతునా

అంకితం

జి. వి. కృష్ణరావుగారు డబ్బును గాని పలుకుబడిని గాని ఆశించి ఏ గ్రంథం ఎవ్వరికి అంకితం ఇయ్యలేదు ఒక కావ్యాన్ని పితృపాదులకు, మరియొక కావ్యాన్ని గోపీచంద్‌గారికి ఈ కావ్యాన్ని త్రిపురనేని కవిరాజునకు అనగా త్రిపురనేని రామస్వామిచౌదరి గారికి అంకితం. ఇచ్చారు

చౌదరిగారిని గూర్చి చెప్పిన పద్యాలలో కొన్ని

వాణీనూపుర కింకిణీ మధుర నిక్వాణంబు సంపన్నమై
బోణీకొట్టిన నీ పురాణరచనాపూర్వార్థ సంపత్తికిన్
బాణాకత్తులు లేచి యాడినవి విశ్వంబెల్ల కంపింప నీ
బాణీ కింకెదురేది లేదు గదరా ప్రాజ్యాంధ్రరాజ్యస్థలిన్

కత్తికి కోరి బాసికము కట్టిన నీకవితా వధూటి నో
రెత్తిన దుష్టభావముల నెల్ల లగాలగి చేసి చెప్పుతో
నెత్తిన మొత్తి పంపి మరి నేటికి జంకులు చన్న గుండెలో
ఎత్తెను విప్లవధ్వజ మభీప్సితపద్ధతి సిద్ధహస్తుడా

కోయని యార్చి నీకెదురు కొన్న పురాణపు గోలకొండ అ
బ్బాయని అవటిల్లినది బానిసభావము లొక్కమారె క

ల్లో యని దారిబట్టినవి ఓ కవిరాజ భవత్కళా దృతుల్
కాయును గాక ద్రావిడ జగమ్మున నిచ్చలు పండువెన్నెలల్

గుండెలు పిండిపోసి తెలుగుం బ్రతికింపగ పాటుపడ్డ వీ
రుండవు దాస్యభావముల ద్రోలగ చేతులు కాల్చుకొన్న ధీ
రుండవు నీ ప్రబోధముల రూపమె నృత్యసరస్వతీ కలా
ఖండము నిన్నెరుంగకిటు కిమ్మ కరాటము గొడ్డుపోయెరా

పెంకెకు పెంకెవై నిను శపించుచు నున్నను గాని లోకముల్
క్రుంకి పురాణసంహతులలో మధియించి తదీయ గర్భముల్
బొంకులు రంకులన్ వెలికి బుచ్చితి ధర్మపథమ్ము లిట్టి వీ
వంకని చూపి చెప్పి మరి ప్రాణము వోసితి తెల్గుజాతికిన్

ముద్దులు మూటగట్టు పదముల్ రసముగ్గులు గొన్న పద్యముల్
ఒద్దిన తీరుతీయములు తేర్చిన తేట తెనుంగు పోడుముల్
పద్దులు వ్రాసి పెట్టినవి స్పష్టముగా కృతిసంపుటంబులం
దెద్దడి లేక యీ తెలుగు లెన్నడు నీ ఋణ మీగువారలో

సహృదయుడు రసహృదయుడు సరసహృదయుడు అయిన కృష్ణారావుగారి రచనలలో అన్నీ విశేషాలే ఉంటాయి ఏ ఒక్క విషయం వివరించి మిగిలినవి వదలడానికి వీలులేదు ఔచిత్యాన్ని పోషించడంలో సిద్ధహస్తులు అనౌచిత్యం దుర్భిణీయంత్రంవేసి వెదకినా మచ్చుకు కూడ కానరాదు

కావ్యలక్షణం కవితాసామగ్రి స్వయంగా చెప్పుకొన్న బహుముఖప్రజ్ఞావంతుడు లాక్షిణకుడు ఈ కావ్యం రెండవ ప్రపంచ యుద్ధకాలంలో వచ్చింది సామాన్యంగా తమ దేశం యుద్ధంలో విజయాన్ని సాధిస్తే చిన్నకవి నుండి పెద్దకవి దాకా తన నాయకుల్ని దేశాన్ని సైన్యాన్ని కొనియాడుతూ కవిత్వం కట్టడం అలవాటు కాని యుద్ధరంగంలో ఎంతమంది చచ్చిఉంటే విజయం వచ్చిందో ఆలోచించరు ఒకవేళ ఆలోచించినా ఆచరించరు ఈ ఆలోచన రావటానికి గొప్ప సంస్కారం కావాలి అది ఉంటే రాజులు చేసిన యుద్ధాలు మానవహారణ హోమాలు కావ్యాలుగా రావు ఈ భావాన్ని మనస్సులో పెట్టుకొని రాబోవు కాలంలో

కవులు ప్రజలక్షేమం కోరి కవితలల్లాలని సూచిస్తూ దీనికి యుగసంధ్య అని పేరు పెట్టడం సముచితం

జి వి కృష్ణరావుగారు నియమాల్ని కాపాడటానికి కంకణం కట్టుకొని జీవితాన్ని తన సర్వస్వాన్ని ధార పోసిన ధన్యుడు శారీరకంగా ఆయన చాల బలహీనంగా కనబడేవారు కాని ఆయన చెప్పిన విషయాలు బలవత్తమంగా వెలుగొందాయి ఇతరులకు కష్టం కలిగేటట్టు అగౌరవంగా ఏనాడూ ఏ సమయంలోనూ ఒక్కమారు కూడా అని ఉండలేదు ఎల్లవేళలా అందరి క్షేమం కోరుతూ సంతసించేవారు మిత్రులకు శత్రువులకు ఆరాధ్యదైవంగా జీవితాంతం కాలం వెళ్ళబుచ్చిన కృష్ణరావుగారి కీర్తికాయానికి నా హృదయపూర్వక నమస్సులు

# రాజకీయాలు - రచనలు

—శ్రీ. జి. వి. కృష్ణరావు

సమాజంలో రచయితల బాధ్యతలను గూర్చి మీ పత్రికలో ప్రచురిత మవుతున్న లేఖలను చూస్తున్నాను. మీరు చేస్తున్న పని నిజంగా ప్రశంసాపాత్రం. ఇలాంటి అవకాశం కల్పించటం వల్ల ఆంధ్రప్రజానీకం, రచయితలు విజ్ఞానవంతులు కావటానికీ, ఈనాడున్న వాదాలను, అభిప్రాయాలను తెలిసికొని, మంచిచెడ్డలను పరామర్శించి, సత్యం గ్రహించి తదనుగుణంగా వ్యవహరించటానికి వీలేర్పడుతున్నది. ఇలాంటి ఉత్తమోత్తమ కర్తవ్యాన్ని యింత తీవ్రంగా నేడైనా పూనుకొని సాగిస్తున్నందుకు తెలుగు దేశంకృతజ్ఞం.

ప్రాణి అన్న తర్వాత, ఆకలి, మనిషి అన్న తర్వాత అభిప్రాయం లేకుండా ఉంటాయా ? అయితే అభిప్రాయాలన్నీ పత్రికలలోకి పుస్తకాలలోకి ఎక్క తగవేమో ! అట్లా ఎక్కించటానికి పూనుకొన్నా స్థలం చాలదు. కాబట్టి యుక్తియుక్తము హేతుమంతము అయిన వాదాలను మాత్రమే స్థాన ముండాలి. అయితే నేను వ్యక్తం చేయబోతున్న అభిప్రాయాలు, భావాలు ఎంతవరకు పై సూత్రాన్ని పాటిస్తాయో చెప్పవలసినది మీరు— పాఠకులు.

ఇంతవరకు రచయితల గురుతర బాధ్యతను గూర్చి వెలువడిన లేఖలలో ప్రధానంగా మూడంశాలు గోచర మవుతున్నాయి. (1) యుక్తులు, హేతువుల కంటె ఆవేశా లధికంగా ఉండి మనస్సులు విప్పి చర్చించుకొని ఒక నిర్ణయానికి వచ్చే అవకాశాలు కన్పించటంలేదు. (2) చాల మంది రచయితలు ప్రజాస్వామ్యం స్వాతంత్ర్యం అభ్యుదయం సంస్కృతి సాంప్రదాయం జాతీయం అన్న పదాలను విశృంఖలంగా వాడారు. ఆయా పదాలను వారు ఏయే అర్థాలలో వాడారో టూకీగా నైనా వివరించి ఉంటే బాగుండేది. దానివల్ల అసలు

సమస్య కూడ చాల తేలికయ్యేది. (3) సమాజానికి మార్గదర్శకులు కావలసిన మన రచయితల భావాలు, మనస్సులు సంకుచితంగా సంవృతంగా ఉన్న వేమో ననిపిస్తుంది. ఎందుకంటే ఏ నలుగురో అయిదుగురో రచయితలు వినా మిగిలినవారంతా జాతీయకాంగ్రెసు ధృక్పథం, కమ్యూనిస్టు ధృక్పథం తప్ప భారతదేశానికి మరో తరణోపాయం వూహించ వీలున్నట్లుగా కూడా పేర్కొనలేదు. దీనినిబట్టి మన జ్ఞానం విచారణశక్తి ఏ స్థితిలో ఉన్నదో ఊహించుకోవచ్చు.

ఈ మాటలు ఆగ్రహావేశాలకు కారణం కావచ్చు. కాని ఒక మనవి. ఒట్టి ఆగ్రహాల వల్ల ఆవేశాల వల్ల ప్రయోజనం లేదు. సాకల్యంగా ఆలోచించుకోవటం అవసరం. ఉద్రేకాలను రెచ్చగొట్టుకొని పరస్పర దూషణలకు దిగటం తేలిక. ప్రశాంతంగా యుక్తి యుక్తంగా స్పష్టంగా ఆలోచించుకోవటం, సహకార సానుభూతులు పెంపొందించుకోవడం, సత్యాన్ని తెలిసికోవటం కష్టం. ఈనాడు రాజకీయశాస్త్రం దైనందిన రాజకీయాలు తెలిసికొని ఆచరించ వలసిన అవసరం రచయితలకేకాదు, వయోజనుడైన ప్రతి పౌరునికీ ఉంది. తిండి, గుడ్డ, వైద్యసహాయం విద్యవలెనే రాజకీయజ్ఞానంకూడ ప్రతి వ్యక్తికీ అత్యంతావశ్యకం, ఈ జ్ఞానం లేనినాడు తన జీవితాన్ని తన కుటుంబజీవితాన్ని దిద్దితేర్చుకునే అధికారం, స్వాతంత్ర్యం లేనివాడవుతున్నాడు.

### కర్తవ్యం

ఈనాడు తిండికి, గుడ్డకు, వైద్యసహాయానికి నోచుకోక అల్లాడే జనమూ, జీవయాత్ర లోనే సతమతమవుతూ ఆలోచించుకోవటానికి వీలు చిక్కని జనమూ, చదువు సంధ్యలు లేక ప్రపంచంలో నేటి భావపరంపరకు దూరమైన స్వతంత్రాలోచన లేని జనమూ కోట్ల కొలదిగా ఉన్నది. వీరి నందరినీ ఒక్కసారిగా ఆలోచించి కార్యక్షేత్రంలో దూకమంటే అర్థం లేదు. అలా చేయాలంటే కనీసం కొన్ని దశాబ్దులన్నా పట్టక తప్పదు. అట్టి స్థితి ఏర్పడేవరకు రాజకీయక్షేత్రంలో జరిగే నిర్ణయాలు కార్యకలాపాలు అధికారంలో ఉన్న పార్టీ చేసిన నిర్ణయాలే అవుతాయి కాని, యావత్ప్రజ చేసే నిర్ణయాలు కావు.

వయోజనసమాజ మంతా స్వతంత్రవిచారణశక్తి పెంపొందించు కొనువరకు రాజకీయాలను ఆపి ఉంచవచ్చును కదా అంటే దానివల్ల కోటానుకోట్ల ప్రజలను ప్రస్తుత స్థితిగతులలోనే శాశ్వతంగా బంధించట మవుతుంది. వారి ఆర్థికాదిస్థితిగతు లలాగే ఉండి

పోతాయి కాబట్టి వారి స్థితిగతులను చక్కబరచి స్వతంత్ర విచారణ శక్తిని వారు వినియోగించు కొనటానికి అంకురారో పణగా అల్పసంఖ్యాకులుగా ఉన్న విజ్ఞులు నేడు రాజకీయాలను సాగించవలసి ఉంది.

అయితే ఈ పనికి నేడు దేశంలో పార్టీలుకాని, వ్యక్తులుకాని ఎంతవరకు కృషి చేస్తున్నారు? ఈ సమస్య అత్యంతముఖ్యం అభిప్రాయభేదాలకు తావు లేకుండా దీనిని తేల్చుకోవటానికి సరియైన ప్రమాణాలేమిటి అంటే ఆయా పార్టీల సిద్ధాంతాలు, కార్యక్రమాలు, గతప్రవర్తనలే అని చెప్పాలి.

## రాజకీయ పక్షాలు

ఈనాడు ఆంధ్రరాజకీయరంగంలో గోచరిస్తున్న పార్టీలు స్వతంత్రసభ్యులతో కలుపు కొని నాలుగు (1) కాంగ్రెసుపార్టీ (2) కమ్యూనిస్టుపార్టీ (3) సోషలిస్టుపార్టీ (4) స్వతంత్రులు. (స్వతంత్రులు కందరకు ఉమ్మడిగా ఒకే సిద్ధాంతం కార్యక్రమం ఉన్నదని భావించ నక్కర్లేదు. పరిశీలనార్థమే వారిని ఒక శాఖగా పరిగణించడ మవుతున్నది).

ముందు కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతాలతో ప్రస్తుత విమర్శన ప్రారంభించవచ్చును. చాలమంది దాని సిద్ధాంతాలను అర్థం చేసికొనకుండానే దుందుడుకు వ్రాతలతో దానిపై వైముఖ్యం ద్వేషం కలిగించటానికి ప్రయత్నిస్తున్నారు. "కమ్యూనిజం రష్యాలో పెరుగు తున్నది, కాబట్టి అది విజాతీయం. ఇండియాలోని ఆ పార్టీవారంతా రష్యాకు అమ్ముడు పోయారు. అందువల్ల మన చరిత్రను సంస్కృతిని విస్మరించి అవమానించి నిర్మూలించి మన దేశాన్ని రష్యాకు బానిసగా చేయజూస్తున్నారు" అని విమర్శిస్తున్నారు. ఇలాంటి విమర్శ అంధవిశ్వాసాన్ని సంకుచితబుద్ధిని చాటుతున్నది. ఎందుకంటే, అసలు కమ్యూనిస్టు సిద్ధాంతం రష్యాలో పుట్టలేదు. దానికి నిర్దిష్ట స్వరూపం, సమన్వయ సిద్ధాంతము ఇచ్చినది మార్క్సు, ఏంజెల్సు. వీరిద్దరూ రష్యావారు కారు కనీసం కొంతకాలమైనా అక్కడ లేరు. లెనిన్ స్టాలిన్‌లు అక్కడ దాన్ని నెలకొల్పటానికి కారకు లయ్యారు. వాదనకు కమ్యూనిజం రష్యాలోనే పుట్టి రష్యాలోనే విజృంభించిం దనుకొందాము. ఆ సిద్ధాంతం స్వతః మంచిది అయితే ఎందుకు స్వీకరించరాదు? నేటి రైళ్ళు మోటారులు ఇతర యంత్రములు వైద్య విధానము తీసికొనండి. ఇవి మన దేశీయులు కనిపెట్టినవి కావు అంత మాత్రం చేత వాటిని వినియోగించుకోవటం మానుకోలేదు. అసలు నేడు అమలులో ఉన్న రాజ్యాంగ చట్టాన్నే

తీసికొందాము. ఇందతా బ్రిటన్, అమెరికా మొదలైన పాశ్చాత్యదేశాల రాజ్యాంగచట్టాల నుంచి పుచ్చుకొన్నది కాదా ? అది అలా ఉంతగా మన యిప్పటి చట్టంలో అపాశ్చాత్యమూ, కేవలం భారతీయమూ అయిన అంశ మేమున్నది? ఏ బుద్ధిమంతులైనా మన చట్ట మంతా భారతీయ పూర్వసంస్కృతి నుంచి నేరుగా నిష్పన్నమైనదని రుజువు చేస్తే దేశంలోని అజ్ఞతను తొలగించి జ్ఞానోదయం కలిగించినవా రవుతారు.

కాబట్టి ఏ సిద్ధాంతానికైనా ఈ దేశంలో పుట్టినదా లేదా అన్న ప్రశ్నతో నిమిత్తంలేదు. అది మంచిదా, ఆచరణీయమా అన్నవే ముఖ్యాలు. అందులో కొంత మంచి ఉంటే ఆ మంచిని చెడుగు నుంచి విడదీసి స్వీకరించటానికి వీలుంటే స్వీకరించటం వివేకవంతుని ధర్మం. అంతేకాని, పెరటిలో కాయలేదని పొలంనుంచి వచ్చిన కూరగాయలను ఉపయోగించు కొన రాదనటం అవివేకమే అవుతుంది.

## కమ్యూనిష్టు సిద్ధాంతాలు

కాగా, కమ్యూనిష్టు సిద్ధాంతం స్వతహా మంచిదా చెడ్డదా అన్న ప్రశ్నకు సమాధానం చెప్పుకోవటం అవసరం. కాని, కొంతమంది ఈ సందర్భంలో ఇలా అంటున్నారు. ఏ సిద్ధాంతం మంచిచెడుగు లైనా ఆచరణలో కలుగుతున్న ఫలితాన్ని బట్టి చెప్పుకోవాలంటు కమ్యూనిష్టు రష్యాలోని స్థితిగతులను పేర్కొంటున్నారు. కొందరు అది ప్రత్యక్ష స్వర్గ మంటే, కొందరు అది ప్రత్యక్ష నరకమంటున్నారు. ఇదంతా నృప నాపితపుత్ర న్యాయాన్ని తలపిస్తున్నది. సులోచనాల రంగుల స్వభావం అలాంటిది. వాస్తవం అర్థం చేసికోవాలంటే కళ్ళజోళ్ళు అవల ఉంచి నిర్లిప్తంగా పరిశీలించాలి. మానవు డలా పరిశీలించగల డనటానికి గణితశాస్త్రమే దృష్టాంతం.

కమ్యూనిజం మంచిచెడుగులు నిర్ణయించటానికి దాని సిద్ధాంతమే శరణ్యం. హెగిల్ ప్రతిపాదించిన గతితర్కపు మూస నుపయోగించి మార్క్సు స్వకీయ సిద్ధాంతాన్ని పోత పోశాడు. అందువల్ల కమ్యూనిజాన్ని సమగ్రంగా తెలిసికోవాలంటె గతితర్కాన్ని గూర్చి తెలుసుకోవాలి దీనిని సమగ్రంగా వివరించాలంటే నిజానికొక పెద్ద పుస్తకం వ్రాయవలసి వస్తుంది. కాబట్టి, స్థూలంగా ప్రధానమైన, కొన్ని అంశాలు మాత్రమే పేర్కొనబడు చున్నవి.

(thesis, antithesis, synthesis) పరిణామం జరుగుతుందని గతితర్కం వాదప్రతిపాదన చేస్తుంది. ఉదాహరణకు బీజాన్ని తీసుకుందాం. ఇది అనుయోగి, అంకురం ప్రతియోగి, వృక్షం సమన్వాయి. అంటే, బీజం అంకురంగా మారి అంకురం వృక్ష మవుతున్న దన్నమాట. ఇలాంటి వాదనలో కొన్ని సిద్ధాంతాలు అంతర్భూతమై ఉన్నాయి. (1) ఒకటి సత్తు (being) అసత్తు (non being) అవుతుంది. (2) అంత ర్వైరుద్ధ్యం వల్ల పరిణామం జరుగుతుంది. (3) ఈ పరిణామం అనివార్యం (4) పూర్వ పూర్వ దశలకంటె ఉత్తరోత్తర దశలు మేలైనవి (5) ఈ జగత్తు విశ్వం అవయవి (orgaic whole) ఇందులోని ప్రతి వస్తువూ మానవునితో సహా అంగమే. అవయవం కంటే అవయవి గొప్పది. అవయవి కోసమే అవయవం ఉంటున్నది.

ఈ సిద్ధాంతాలను మార్క్స్ ప్రమాణశాస్త్రదృష్టిలో విచారించినట్లు తోచదు మనలో చాలమంది ఈనాడు జాతీయవాదాన్ని కర్మసిద్ధాంతాన్ని చూచి చూడక నమ్ముతున్నట్లే, మార్క్స్ గతితర్కాన్ని, అంతర్భూతంగా ఉన్న విషయాలను తాత్త్విక నిశితబుద్ధిని వినియోగించి పరీక్షించక యథార్థ మని నమ్మి అత్యంత ముఖ్యమైన తన ఆర్థిక సిద్ధాంతాన్ని ఆ మూసలో పోశాడు. దానితో విచిత్రరూపం తయారైంది. హెగిలియన్ గతితర్క వాదమే కమ్యూనిస్టు దార్శనిక రంగంలో గతితార్కిక భౌతికవాదంగాను, రాజకీయ క్షేత్రంలో వర్గకలహంగాను, ఆర్థికరంగంలో అదనపు విలువగాను రూపొందింది. ఈ మూటిలో ఏ ఒకటి లేక పోయినా కమ్యూనిజం లేదు.

ఇలా గతితర్కవాదాన్ని పురస్కరించుకొని కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రతిపాదితం కావటం వల్ల పైన పేర్కొన్న దోషాలు కమ్యూనిస్టు సిద్ధాంతానికి కూడ సంక్రమించాయి. అంటే, ఒకటి సత్తు అసత్తు అవుతుంది అనటంతో అనిర్వచనీయతాదోషం పట్టుతున్నది ఇలాంటిది శాస్త్రీయ విచారానికే గొడ్డలిపెట్టు. ఒకే వస్తువు ఒకే సమయంలో విరుద్ధధర్మాలు కలిగి ఉంటాయంటూ వాదనకు దిగితే సత్యం తేలదు సరిగదా, వాదనకు కూడ అవకాశం ఉండదు.

అంతర్వైరుధ్యం

(2) కేవలం అంతర్వైరుధ్యం ద్వారానే పరిణామం జరుగుతుదంటే శాస్త్రవికాసచరిత్ర నవ్వుతుంది. బుద్ధునివంటి మహనీయుని చరిత్ర కపార్థం కల్పించవలసి వస్తుంది. పైగా కమ్యూనిస్టు సమాజంలో వర్గకలహం ఉండదని మార్క్స్ ప్రతిపాదిస్తున్నాడు. వైరుధ్యం ద్వారానే అభ్యుదయము, పెంపు జరుగుతాయనే పక్షంలో కమ్యూనిస్టు సామాజిక వ్యవస్థ ఏర్పడిన తరువాత వైరుధ్యం అనేది అంతరించి అభ్యుదయం లేనిదై సమాజం కుళ్ళకపోయినా స్తంభించిపోవాలి.

వ్యక్తి - సమాజము

(3) విశ్వం కేవలం అవయవి. అంటే అవయవాలను తెలిసికొన్నంత మాత్రాన అవయవిని తెలుసుకోవటానికి వీలులేదు. ఎందుకంటే ఈ పక్షంలో అవయవాల కంటె అవయవి అధికమైనది, విశిష్టమైనది. ఇదే నిజమైతే ప్రత్యేక రంగాలకు సంబంధించిన శాస్త్రపరిశోధనలు సిద్ధాంతాలు సత్యాన్ని తెలుసుకోవటానికి ఏ మాత్రం ఉపయోగపడనివి కావాలి. ఈ సిద్ధాంతమే నిజమైతే వ్యక్తులు అవయవాలై సమాజం అవయవి కావాలి. అంటే శరీరంలోని ఏ అంగానికి దెబ్బతగిలినా శరీరం బాధపడాలి. కాని నాకు జలుబు చేయటంతో సమాజానికి తుమ్ములు రావటంలేదు. ఎల్లమ్మ వడ్లు దంపితే సమాజానికి చేతులు బొబ్బలెత్తటంలేదు. నాకు సంతోషం కలిగితే సమాజానికి ఆనందాశ్రువులు రాలటం లేదు. అవయవివాదంతో వ్యక్తుల కంటె సమాజం గొప్పదని, వ్యక్తులు తమకోసం కాక సమాజం కోసం బ్రతకాలని, వారు చరిత్ర పురోగతికి నిమిత్తమాత్రు లని, లక్ష్యసిద్ధికి ఎట్టి అవినీతి మార్గం అవలంబించినా అది ధర్మమేనని, అనుస్యూతంగా సిద్ధిస్తున్నవి. ఇవి ఎంతవరకు సమర్థనీయాలు ? వక్తులనందరను మినహాయిస్తే సమాజం ఎక్కడుంది ? గుణసమాహారం వినా ద్రవ్యం ఉంటుందంటే ఎంత అర్థముందో ఈ వాదనలో గూడ అంత అర్థమే ఉంది. పైగా సమాజశ్రేయస్సును గ్రహించి తదనుగుణంగా పాటుపడుతున్న దెవరు ? "కార్మిక ప్రజానీకం పెట్టుబడిదారుల దోపిడికి పాలై దుర్భరయాతనకు లోనౌతున్నది. లాభాల కాంక్షతో పెట్టుబడిదారులు ప్రపంచాన్ని యుద్ధాలలో ముంచి తేలుస్తారు కాబట్టి కమ్యూనిజం కంటే శ్రేయోదాయకమార్గం లేదు" అని ఎలుగెత్తి చాటిన వ్యక్తి మార్క్సా ? లేక సమాజమా ? సమాజమే ఆవేశించి ఆయన చేత అట్లా పలికించింది కాబోలు ! అది అలా ఉండగా లక్ష్యసాధకమైనది ధర్మ మన్న పక్షంలో ధర్మం ఫలసిద్ధి మీద ఆధారపడుతున్నది.

అంటే ఫలం సిద్ధించేటంతవరకు ఒకపని ధర్మమో అధర్మమో చెప్పటానికి వీలులేదు. ధర్మం పేరుతో కార్యాచరణకు పూనుకోవటానికి ఆస్కారంలేదు. అంటే కమ్యూనిస్టు కార్యకపాలకు ధర్మప్రమేయం లేదా.

పరిణామ సిద్ధాంతం

(3) పరిణామం కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం అనివార్య మౌతున్నది. దీనిని బట్టి చరిత్ర గతి ఎప్పుడో నిర్దిష్టమై ఉండాలి. అంటే మార్క్సు వివరించిన ప్రకారం మానవ చరిత్ర నడుచుకోవలిసిందే తప్ప మరొక విధంగా అది పోవటానికి వీలులేదని అర్థం. కాని శ్రామిక నియంతృత్వం ఆయన చెప్పినట్లుగా జర్మనీ ఇంగ్లాండులలో రాలేదు. పారిశ్రామికంగా వెనుకబడ్డ రష్యాలో వచ్చింది. సామ్రాజ్యపు యుద్ధాలు ఒకటి తరువాత ఒకటి వస్తాయన్నాడు. ప్రథమ ప్రపంచ సంగ్రామం తరువాత వచ్చిన యుద్ధాలు సామ్రాజ్యపుయుద్ధాలే కాబోలు. అయితే రెండవ ప్రపంచ సంగ్రామాన్ని పూర్వదశలో కాకపోయినా ఉత్తరదశలోనైనా ప్రజాయుద్ధమని కమ్యూనిస్టులే ఉద్ఘోషించారు. మార్క్సు మహాశయుడు పొరపాటు పడ్డాడా ! కమ్యూనిస్టులు పొరపడ్డారా ! కొరియా యుద్ధంకూడ మార్క్సు చెప్పినట్లు సామ్రాజ్యపు యుద్ధమే కాబోలు.

పరిణామం అనివార్యం అనే పక్షంలో మానవుడు తన చరిత్రను తానే సృష్టించుకొంటున్నాడు అన్న వాక్యానికి ఏమి అర్థం చెప్పుకోవాలి ? మానవుడు విధిగా తన క్లిష్టమున్నా, లేకపోయినా అభ్యుదయగామి అవుతున్నాడు అనాలా ? ఆ పక్షంలో "వ్యాప్తి గ్రహణమే స్వాతంత్ర్యం' (freedom is the recognition of necessity) అన్న నిరుక్తికి పరిణామంలో ఉన్న స్థాన మేమిటి ? పైగా ఉత్పత్తి విధానాన్ని బట్టే సామాజిక వ్యవస్థ, లక్ష్యాలు, భావాలు, సిద్ధాంతాలు, తత్త్వాలు, కళలు, శాస్త్రాలు ఆధారపడి ఉంటాయని మార్క్సు అంటున్నాడు గదా ! మానవచరిత్రను మానవుడు సృష్టిస్తున్నాడా లేక ఉత్పత్తి విధానమే సృష్టిస్తున్నదా ?

అవి అలా ఉండగా ఉత్పత్తి విధానమే భావాదికాన్ని నిర్ణయిస్తుంది అనటం ఎంత వరకు యథార్థం ? ఈ సూత్రాన్ని పురస్కరించుకొని మార్క్సిజాన్ని త్రాగి త్రేణుస్తున్న ఆంధ్ర కమ్యూనిస్టులు ఆంధ్ర ప్రబంధ సాహిత్యంలో విశిష్టస్థానం ఆక్రమిస్తున్న "కళాపూర్ణోదయం" ఆవిర్భూతిని వివరించగలిగితే మార్క్సిజాన్ని యథార్థ మని రుజువుచేసి తెలుగు వారికి జ్ఞానోదయం కలిగించిన వారవుతారు.

(5) పూర్వపూర్వ దశల కంటె ఉత్తరోత్తర దశలు విధిగా అభ్యుదయకరంగా ఉంటాయని కమ్యూనిజం అంటున్నది. ఇక్కడ 'అభ్యుదయ' పదానికి విశేషార్థం చెప్పు కోవాలి. చిరంతనులు మేలును ఐహిక మని, ఆముష్మిక మని రెండు విభాగాలు చేశారు. దీనికి కారణం ఈ లోకానికి వెనుక గమ్యమైన పరలోకం ఒకటి ఉన్నదని భావించటమే ! ఐహికమైన మేలునే వారు. అభ్యుదయ మని ఆముష్మిక మైనదానిని నిశ్శ్రేయసమని నిర్వ చించారు. మార్క్సిజం ఈ లోకాన్ని తప్ప పరలోకాన్ని అంగీకరించదు. అంటే, ఈ మతం ప్రకారం నిశ్శ్రేయసానికి ఎక్కడా తావు లేదు. అందువల్ల మార్క్సిజంలో అభ్యు దయానికి కర్థం నిశ్శ్రేయసాన్ని అపేక్షించని మేలు, ఇంత మాత్రం చేతనే 'అభ్యుదయ' పదాన్ని చెరుస్తున్నా రని నిందించవలసిన పని లేదు. ఆ పక్షంలో 'ఆత్మ' శబ్దాన్ని కూడ అలాగే చేయటం జరుగుతున్నదని భారతీయ దార్శనికులు ఒండొరులను దుయ్యబట్టుకోవలసి ఉంటుంది. ఇలాంటి దానిలో అర్థం లేదు; సభ్యతా లేదు.

### సాహిత్యరంగంలో అభ్యుదయం

ఇంతకు, పూర్వ పూర్వదశల కంటె ఉత్తరోత్తర దశలు విధిగా అభ్యుదయకరంగా ఉంటవన్న వాక్యం లలితకళాక్షేత్రానికి ఎంతవర కన్వయిస్తుంది ? ఆంధ్ర మహాభారత యుగం కంటె శ్రీనాధుని యుగం మేలైనదా ? శ్రీనాధుని యుగం కంటె ప్రబంధయుగం మేలైనదా ? ప్రబంధయుగంలోని పూర్వదశ కంటె ఉత్తరదశ మేలైనదా ? కాన కవి త్రయం కంటె శ్రీనాధుడు ఉత్తమ కవా ? శ్రీనాధుని కంటె పెద్దన గొప్పవాడా ?

ఇది ఇలా ఉండగా, పరిణామ విధానం వల్ల సాహిత్యం మతంగాను ఆ మతం తత్త్వ శాస్త్రంగాను విధిగా మారికూర్చుంటుందని గతితర్క బోధితుడైన హెగిల్ ప్రతిపాదించారు. మార్క్సుకూడ గతితర్కాన్ని ఆశ్రయించాడు కదా ! పై హెగిలియన్ సూత్రాన్ని మార్క్సు తార్కికంగా ఆమోదించవలసిన అవసరం లేదా ! లేకపోతే ఈ విషయంలో మార్క్సు సిద్ధాంత మేమిటి ? ఆమోదిస్తున్నాడంటే లలితకళలన్నీ అంతరించి కేవలం తత్త్వ శాస్త్రం మాత్రమే ఆవిర్భవిస్తున్న దని చెప్పాలి. చరిత్ర దీనిని రుజువు చేస్తున్నదా ?

పై అంశాలనే సంగ్రహంగా ఇలా చెప్పకోవచ్చు. వ్యక్తులకు సమాజానికి అంగాంగి సంబంధం ఉన్నది. వ్యక్తు లందరికంటె సమాజం విశిష్టమైనది. సమాజం కోసం వ్యక్తులు బ్రతకాలి. అంతకు తప్ప వారి బ్రతుకులకు మరెట్టి అర్థమూ లేదు. సమాజం శ్రేయస్సు

కోసమని వ్యక్తులందరను నాశనం చేసినా తప్పు లేదు. అందువల్లనే కొలదిమంది వ్యక్తులు తతిమ్మా వారిని బెదిరించి, హింసించి వధించి అధికారం స్వాయత్తం చేసుకోవటంలో ఏ మాత్రం దోషంలేదు. కాకపోతే. ఇలా చేసే వ్యక్తులు కమ్యూనిస్టు లక్ష్యాన్ని సాధించే దృష్టితో చేయాలి. (2) లక్ష్యసాధక మైనదంతా ధర్మమే, సత్యమే, అంతకు తప్ప వేరుగా ధర్మ మంటు, సత్యమంటు లేవు. అందుకనే "సోవియట్ యూనియన్‌ను చూచి వచ్చిన తరువాత మానవత్వం మీద నాకుగల విశ్వాసం ధృఢమయింది. భగవంతుడి దిక్కుగా మానవుడు చేస్తున్న మహా ప్రయాణంలో సోవియట్ రష్యా అగ్రేసరంగా నడుస్తూడడం నాకు కనిపించింది" అని కమ్యూనిజం వ్రాయించగలిగింది. కమ్యూనిజానికి మానవజాతిలో నమ్మకముంది గాని మానవత్వంలో నమ్మకంలేదు. విధిలో నమ్మక ముంది గాని భగవంతు నిలో నమ్మకంలేదు. అయినా పాఠకులను కమ్యూనిజమందు ఆసక్తులను చేయటానికి మాటలను ఖూనీ చేయటం సత్యంకోసము ధర్మంకోసము, పాటుపడటమే ! అభ్యుదయం అనేది స్పర్ధ , కలహం, ద్వేషం ద్వారా సిద్ధిస్తుందే కాని ప్రేమ సానుభూతి సహకారం, సమానత్వం, సత్యం, దయ ద్వారా సిద్ధించదు. ప్రేమాదులను ప్రస్తావించేవాడు బూర్జువా అవుతున్నాడు. అందుకనే "కళ్ళులేని కబోది పత్రికలు కావలిసినన్ని అబద్ధాలు సరఫరా చేస్తున్నాయి. అజ్ఞానానికి అహంకారం కూడ తోడయితే "అగ్గికి గాలి సహాయపడినట్లు" అని కమ్యూనిజం వ్రాయించగలిగింది. సాహిత్యవిమర్శ చేస్తూ హోవర్డుఫాస్టు లాంటివాళ్ళు ఘోరంగా ఇతరులను తిట్టటం జరిగింది. అందాకా దేనికి, ఈ తిట్లలో మార్క్స్ మాత్రం తన శిష్యులలో ఎవరికి తీసిపోడు ? కమ్యూనిస్టు సిద్ధాంతం హెగిలియన్ వాక్యాన్ని గుత్తకు పుచ్చుకొని వ్యాప్తి గ్రహణమే స్వాతంత్ర్య మని నిర్వచిస్తున్నది. అయితే ఈ వ్యాప్తి గ్రహణాన్ని కమ్యూనిస్టు అగ్రనాయకుల వద్ద శుశ్రూష చేసి నేర్చుకోవలసిందే. అంతేకాని, యీ స్వాతంత్ర్యంలో స్వయం నిర్ణయానికి, వివేకానికి (కార్య కారణ జ్ఞానానికి, తార్కికబుద్ధికి) సమానత్వ సౌభ్రాత్రాలకు సానుభూతి, సహకారాలకు, ఎక్కడా తావే లేదు. స్వాతంత్ర్య స్వభావం కమ్యూనిజం ప్రకారం యింత గోప్య మయినది కాబట్టే "ఈనాడు ప్రజాస్వామ్య మని, వ్యక్తిస్వాతంత్ర్య మని పెద్ద కబుర్లు చెప్పేవాళ్ళతో వాగ్వాదానికి దిగటానికి నాకు సావకాశమూ లేదు, సంతోషమూ లేదు" అని కమ్యూనిజంచే పిలవబడటం సంభవించింది.

**అసంబద్ధ సిద్ధాంతాలు**

ఈ విధంగా పైన పేర్కొన్న కమ్యూనిస్టు సిద్ధాంతాలు శాస్త్రబాధితాలై శోచనీయంగా ఉన్నాయి. అయితే అసలు కమ్యూనిజంలో మంచి అన్న దెక్కడా లేదా అన్న ప్రశ్న

కలగివచ్చు. నిజానికి పెక్కుమంది అలా భావిస్తున్నారు. కాని, ఇది సమర్ధనీయంగా కనిపించటం లేదు. ఎందుకంటే మానవ చరిత్రలో ఆర్థిక సూత్రానికి చాల ప్రాముఖ్యముంది. ఈ సూత్రాన్ని విడిచి చరిత్ర నర్థం చేసుకోవటం కష్టం, భావం, చరిత్ర ఎంత ముఖ్యమో ఆర్థిక సూత్రం కూడ అంత ముఖ్యం మొట్టమొదటిసారిగా ఈ విషయాన్ని అన్వయించి దీని ప్రాముఖ్యం చాటిన గౌరవం మార్క్సుకు తప్ప మరొకని కంటగట్టటానికి వీలు లేదేమో. పైగా దారిద్ర్య పీడితులు ఉన్నంతకాలం సమాజానికి శాంతి లభించటం కల్ల అన్నది కూడ మార్క్సిజం నుంచి స్వీకరించవలసి ఉంది. ఇంతేకాక, స్వాతంత్ర్యపిపాస, సత్యాన్వేషణ, అన్యాయపరిహారణదీక్ష, ఆర్తరక్షాపరాయణత, మానవుని ఎంతగా ప్రోత్సహిస్తవో తెలిసికోవాలంటే మార్క్సు జీవితచరిత్ర కంటే వేరే నిదర్శనం అవసరం లేదు. కమ్యూనిజం నుంచి ముఖ్యంగా ఈ మూడంశాలను ఏ పార్టీ అయినా ఏ రాజకీయ సిద్ధాంతమైనా తీసికోవలసి ఉంటుందని నా నమ్మకం అలాకాక కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఆమూలాగ్రంగా స్వీకరించి ఆచరిస్తే దుర్భరనియంతృత్వం ఏర్పడి, స్వాతంత్ర్యం నశించి, కళలు శాస్త్రాలు కుంఠితమై మానవజీవితం నిరర్థకమై ఘోరనరక మౌతుంది.

*కాంగ్రెసు లక్ష్యం*

కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతం తరువాత కాంగ్రెసు సిద్ధాంతాన్ని పరిశీలించవలసి ఉంది. అయితే కాంగ్రెసుపార్టీ తనకు ప్రజాస్వామ్యమే లక్ష్య మని ఈ లక్ష్యంలో వ్యక్తిస్వాతంత్ర్యం ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటవని భారతీయ సంప్రదాయం, సాంస్కృతి రక్షిత మౌతాయని ఇలాంటి దానిని అమలు పరచినప్పుడు దేశం నిత్యకళ్యాణం పచ్చతోరణంగా ఉంటుందని చెపుతున్నది. ఇవి ఎంతవరకు సిద్ధిస్తవో తెలిసికోవాలంటే ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని గూర్చి తెలుసుకోవాలి.

ప్రజాస్వామ్య మనగానే పార్లమెంటరీ ప్రజాస్వామ్యము, సామాజిక ప్రజాస్వామ్యము, ప్రజల ప్రజాస్వామ్యము, రాడికల్ ప్రజాస్వామ్యము, క్రైస్తవ ప్రజాస్వామ్యము జ్ఞప్తికి రావచ్చును. హిందూ'వా'ముస్లిం'వా' అన్నట్లుగానే రేపు హిందూ ప్రజాస్వామ్యం ముస్లిం ప్రజాస్వామ్యము రావచ్చు. పైగా ప్రజాస్వామ్య మంటే కొందరు ఒకవిధమైన పరిపాలనా పద్ధతి అనీ, కొందరు ప్రజలచే ప్రజలకొరకు ప్రజలు సాగించే ప్రభుత్వమనీ, కొంతమంది అత్యధికసంఖ్యాకుల పరిపాలనమనీ, మరికొందరు ఒకవిధమైన జీవితపద్ధతి అనీ అంటున్నారు.

ఇందులోని దేన్ని ప్రజాస్వామ్యం అనాలి ? ఇన్ని విభిన్న సిద్ధాంతా లున్నప్పుడు ఫలానిది మాత్రమే ప్రజాస్వామ్యమనీ మిగతావేవీ ప్రజాస్వామ్యం కావనీ నిర్ణయించటం ఎలా?

## ప్రజాస్వామ్య లక్ష్యం

అయితే ప్రజాస్వామ్యవాదులలో ఎన్ని మతాలు విభేదాలు ఉన్నా, ఒకటి మాత్రం అంగీకరిస్తున్నారు. ప్రజలందరకుగాని, అధికసంఖ్యాకులకుగాని లేక ప్రజలెన్నుకున్న ప్రతినిధులకుగాని ప్రభుత్వంలో సంబంధం ఉండా లంటున్నారు. ఈవిధంగా ప్రజాస్వామ్య కాముకులంతా ఏదో ఒక రకమైన ఎన్నికపద్ధతి నంగీకరిస్తున్నారు. ఇలా అంగీకరించట మంటే ప్రతివాని అనుభవము యధార్థ మని అంగీకరించటమే. పైగా ఎన్నికపద్ధతి ఆమోదించట మంటే ఏ వ్యక్తీ సర్వజ్ఞుడు కాదని జ్ఞానం పరమం (absolute) కాదని ఒప్పుకోవటమే. దీనినిబట్టి జ్ఞానపారమ్యం ప్రతిపాదించే దర్శనాలు ఆర్షమైనా, అనార్షమైనా ప్రజాస్వామ్యసిద్ధాంతానికి ప్రతికోటిలోనివే అవుతున్నవి. కేవలం ఇలాంటి దర్శనాలను బట్టి సామాజిక జీవితాన్ని దిద్దుకుంటాను అని చెపుతూ తదనుగుణంగా వ్యవహరించే వ్యక్తి ప్రజాస్వామ్యవాది కాజాలడు.

ప్రతివాని అనుభవమూ యధార్థమనీ, ప్రత్యక్షం యధార్థమనీ, ప్రతివానికి వివేచనాశక్తి ఉన్నదనీ ఒప్పుకోవటమే. ఇది సిద్ధాంతమైనప్పుడు ప్రత్యక్షానికి విషయమైనదంతా యధార్థమే కావాలి.

ఏరకపు ప్రజాస్వామ్యానికైనా ఇది మొదటి సూత్రం. ఈ సూత్రం అంగీకరించనివాడు ప్రజాస్వామ్యవాది కాజాలడు. "జగత్తు మిధ్య" అని భావించేవారు కొందరు తాము ప్రజాస్వామ్యవాదుల మని చెప్పుకొంటున్నారు. అలాంటివారికి అద్వైతసిద్ధాంత మన్నా తెలియక పోవాలి. లేదా ప్రజాస్వామ్య సిద్ధాంతమైనా తెలియక పోవాలి. ఈ రెండు సిద్ధాంతాలు తెలిసికూడా తాము అద్వైతులమే కాక, ప్రజాస్వామ్యవాదుల మని అంటే, వారు లోకవంచకులు కావాలి.

ప్రత్యక్షం యధార్థం, అని అన్నప్పుడు ప్రతివ్యక్తి ప్రధానమవుతున్నాడు. ఎందుకంటే ప్రత్యక్షం కేవలం ఇంద్రియార్థసన్నికర్షంవల్ల కలుగుతుందేకాని, మరొక విధంగా కలుగదు. ఇంద్రియాలు వైయక్తికాలు. అంటే నా యింద్రియాలు నావీ, మీ ఇంద్రియాలు మీవీ. నా ఇంద్రియాలతో మీరు కాని, మీ యింద్రియాలతో నేను కాని ప్రత్యక్షజ్ఞానం పొందలేము.

అందువల్ల ప్రత్యక్షజ్ఞానం వైయక్తికం. వైయక్తిక మయిన ప్రత్యక్షం యధార్థ మయినప్పుడు ప్రతివ్యక్తి ప్రధాన మవుతున్నాడు. దీని ద్వారా వ్యక్తులందరకు సమానత్వం సిద్ధిస్తున్నది.

### వ్యక్తి ప్రాముఖ్యం

ప్రతి వ్యక్తి ప్రధానం కావటం, వ్యక్తులందరకు సమానత్వం ఉండటం ప్రజాస్వామ్యానికి మరొక సూత్రం, ఈ సూత్రం ప్రకారం వ్యక్తుల సమూహారమే జాతి అవుతున్నది. అంతేకాని వ్యక్తికి, జాతికి అంగాంగిభావం ఏర్పడటం లేదు. అందువల్ల సమాజంలోని అన్ని విషయాలలో వైయష్టిక మానవుడు ప్రమాణ మవుతున్నాడు కాని, సమాజం కాదు. జాతి కాదు.

ప్రత్యక్షము, ప్రత్యక్షవిషయాలు యధార్థమనీ, జ్ఞానం పరమంకాదనీ, ప్రజాస్వామ్యం బోధిస్తున్నదంటే పరిణామాన్ని అంగీకరిస్తున్న దన్నమాట. ఈ పరిణామం హెగిల్ మార్క్సులుచెప్పే పరిణామం కావాలన్న నియమంలేదు. మానవుని హ్రాసవికాసాలకు మానవుడే కర్తఅన్న దికూడా అంతర్భూత మవుతున్నది.

ఇలాంటి పరిణామం ప్రజాస్వామ్యానికి మూడవ మూలసూత్రం. ఈ సూత్రాన్ని అంగీకరించని మతాలు, వాదాలు మానవాతీతమైన ఒక శక్తి ఉండి ఈ ప్రపంచాన్ని, మానవుణ్ణి నడుపుతున్న దని చెపుతున్నవి. ఇలాంటి తత్త్వాలు, మతాలు ప్రజాస్వామ్యానికి విరుద్ధాలు.

ప్రత్యక్షం యధార్థమై ప్రతి అనుభవము ప్రధాన మవుతున్నప్పుడు వ్యక్తి అనన్య మవుతున్నాడు. దానివల్ల ప్రతి వ్యక్తి విస్మరింపరాని వాడవుతున్నాడు. దానితో వ్యక్తులందరకు సమానత్వం ఏర్పడుతున్నది.

ప్రతి వ్యక్తి ప్రతి అనుభవము విస్మరింపలేక అవశ్యం పరిగణనీయ మవుతున్నప్పుడు వ్యక్తుల మధ్య సహకారం, విభిన్న అనుభవాలకు సమన్వయం అవసరమవుతున్నవి. వ్యక్తుల మధ్య సహకారం ఏర్పడాలంటే సమానత్వం సౌభ్రాతృత్వం స్వాతంత్ర్యం (కార్యకారణ జ్ఞానంతోను, హేతుమత్వంతోను కూడిన స్వయంనిర్ణయం) ఉండి తీరాలి. నేను ఎక్కువ మీరు తక్కువ అనుకున్నప్పుడు, నా మీ మధ్య సౌభ్రాత్రం సానుభూతి లేనప్పుడు నా స్వాతంత్ర్యాన్ని మీరు కాని, మీ స్వాతంత్ర్యాన్ని నేనుకాని ఆమోదించనప్పుడు సహకార ప్రసక్తే లేదు.

అందువల్ల సమానత్వం, సౌభ్రాత్రం, సానుభూతి, దయ, ధర్మం, సత్యం, శీలం, మొదలైన వాటన్నిటికి ప్రజాస్వామ్యంలో అత్యంత ప్రాముఖ్యం సిద్ధిస్తున్నది. కాబట్టి నీతి, ధర్మం లేక, ప్రజాస్వామ్యం లేదు.

మానవసమానత్వం అంగీకరించని తత్వాలు, మతాలు వీటికి ప్రాధాన్యమివ్వని వాదాలు, సిద్ధాంతాలు పై సూత్రాన్నిబట్టి ప్రజాస్వామ్యానికి కేవలం విరుద్ధా లవుతున్నవి. అంటే వర్ణ వ్యవస్థను సమర్థించే హిందూమతం, వేటికి తావివ్వని కమ్యూనిజం ప్రజాస్వామ్యానికి కేవలం వ్యతిరేకాలు. ఒకప్రక్కన వర్ణవ్యవస్థను సమర్థిస్తూ, మరొకప్రక్కన ప్రజాస్వామ్యాన్ని ప్రశంసించటం, ఒకవైపున కమ్యూనిజాన్ని నమ్ముతూ, మరొకప్రక్కన ప్రజాస్వామ్యవాది ననటం హాస్యాస్పదం.

ఇంతవరకు తేలిన ప్రజాస్వామ్య లక్షణాలను బట్టి చూచినప్పుడు అధిక సంఖ్యాకుల పరిపాలన ప్రజాస్వామ్యం కాజాలదనీ, అసలు అది దాని లక్షణం కాదనీ స్పష్టం కాకమానదు. అత్యధిక సంఖ్యాకులకు అత్యధికమైన మేలును సమకూర్చటమే నన్న ప్రజాస్వామ్య నిర్వచనం కూడా దూరాపాస్తమవుతున్నది.

ఇక్కడ ఒక చిన్న శంకకు తావేర్పడుచున్నది. ప్రజలంతా ఏకగ్రీవంగా "వ్యక్తి స్వాతంత్ర్యం అవసరం లేదు. సమాజాభ్యుదయానికి, దేశాభ్యుదయానికి, ఒకే వ్యక్తి నిరంకుశ పరిపాలన సాగించటం అవసరం" అని భావించి అలా చేస్తారనుకోండి; అది ప్రజాస్వామ్యం కాదా ? పై అంశాలను జాగ్రత్తగా అనుసరిస్తున్న వారికి సమాధానం తోచక మానదు.

అలాంటిది ప్రజాస్వామ్యం మమ్మాటికీ కాజాలదు. ఎందుకంటే అది ప్రజాస్వామ్య మూలసిద్ధాంతాలన్నింటిని త్రోసి రాజంటున్నది. కాగా, యావత్ప్రజ ఆమోదించి నిర్వహించు కొనే ప్రభుత్వవిధాన మంతా ప్రజాస్వామ్యం కావలసిన అవసరం లేదు. పై మూలసూత్రాల ననుసరించి సాగేది మాత్రమే ప్రజాస్వామ్యం. ప్రజాస్వామ్యానికి సంఖ్యకు ఎక్కడా సంబంధం లేదు. జర్మనీలో నాజీ ప్రభుత్వం, ఇటలీలోని ఫాసిస్టు ప్రభుత్వం, రష్యాలోని కమ్యూనిస్టు ప్రభుత్వం అత్యధికసంఖ్యాకుల ప్రభుత్వమే అయినా, ప్రజాస్వామ్య ప్రభుత్వాలు కావు. అత్యల్పసంఖ్యాకుల ప్రభుత్వం కూడా పై మూలసూత్రాలకు అనుగుణంగా ఉంటే ప్రజాస్వామిక ప్రభుత్వం అవుతుంది.

పై పర్యవలోకనంతో ప్రత్యక్షం యథార్థమనీ, ప్రతి వ్యక్తి ప్రధాన మనీ, ఈ జగత్తు యథార్థ మనీ, ప్రతిదానికి మానవుడే ప్రమాణ మనీ, వ్యక్తి అనన్య మనీ, సమానత్వ, సౌభ్రాత్ర, స్వాతంత్ర్యాలు అవసర మనీ, నీతి ముఖ్య మనీ, వ్యక్తివికాసం లక్ష్య మనీ, సహకార సమన్వయాలు విధిగా ఉండాలనీ ప్రజాస్వామ్య సిద్ధాంతం.

తత్త్వదృష్టితో చూచినప్పుడు ప్రజాస్వామ్యం పై విధంగా ఉంటుంది. అయితే కాంగ్రెసు పార్టీ లక్ష్యమయిన ప్రజాస్వామ్యం పైదానితో పోల్చి విమర్శించుకున్నప్పుడు తేడా లేమిటో ఎక్కడున్నవో తేలికగా ఊహించుకోవచ్చును. కాంగ్రెసు ప్రతిపాదిస్తున్న ప్రజాస్వామ్యం పేరుకు మాత్రం వ్యక్తి స్వాతంత్రాన్ని అంగీకరిస్తూ జాతి గొప్పదనీ, జాతి ఔన్నత్యంకోసం వ్యక్తులు బలి అయినా తప్పులేదనీ, అసలు అలాంటి వ్యక్తిగతమైన ఆత్మార్పణం ధర్మమని వాచా చెప్పినా చెప్పకపోయినా కర్మణా చేస్తూవుంది. మన నేటి రాజ్యాంగ చట్టాన్ని చూస్తే, రాష్ట్రస్వపరిపాల నాధికారాలను సంకుచితపరచి, కేంద్రప్రభుత్వానికి దానిని ఎంత పుచ్ఛప్రాయంగా కాంగ్రెసు తయారు చేసిందో న్యాయశాస్త్రజ్ఞు లందరికీ విదితమే. అంతేకాదు, శ్రీమంతుల ఆస్తిపాస్తులకు హామీ యిచ్చి నిరుద్యోగ, దారిద్ర్యపీడితులకు హామీ లేకుండా చేసింది. ఇది గతానికి సంబంధించిన చరిత్ర మాత్రమే కాదు. వ్యక్తుల కంటె జాతి గొప్పదన్న సిద్ధాంతాన్ని పురస్కరించుకొనే సర్వతోవ్యాప్తమైన సామాజికాభ్యుదయం పార్టీ ద్వారానే సాధ్యమనీ, వ్యక్తులు కేవలం వంచకులు, విప్లవ నిరోధకులు అని ముక్త కంఠంతో ఉద్ఘోషిస్తూ యావచ్ఛక్తితో కృషిచేస్తూ ఉంది. వ్యక్తికంటే పార్టీ, రాష్ట్రంకంటే దేశం, ఎప్పుడు గొప్పవైనవో సాధనం కంటె లక్ష్యం, అభ్యుదయం కంటె అధికారం, గొప్ప వవుతున్నవి. దీనివల్ల లక్ష్యసాధకం, అధికార సముపార్జకం అయినదంతా వీరికి ధర్మమే అవుతున్నది. నేటి ఎన్నికల సంరంభంలో కాంగ్రెసు పార్టీ ప్రదర్శిస్తున్న ప్రవర్తనమే ఇందుకు నిదర్శనం.

పైగా సర్వస్వతంత్రాధికారం ప్రజలదని ఒప్పుకొంటూ ఆ అధికారాన్ని అయిదేండ్లకొకసారి అధిక ప్రాతినిధ్యం సంపాదించే పక్షం స్వాయత్తం చేసుకొంటున్నది. ఎందుకంటే పార్టీల తరుపున గెలిచిన శాసనసభా సభ్యులు పార్టీకే లోబడి ఉంటున్నారు. కాని నియోజక వర్గానికి బాధ్యులై ఉండటం లేదు. దేవుని నైవేద్యం అర్చకుని వలె ప్రజల సర్వస్వతంత్రాధికారం పార్టీకి సంక్రమిస్తున్నది. యీ అయిదేండ్ల గడుపులో బలమున్న పార్టీ తన ఎన్నికల ప్రణాళికలో పేర్కొన్నవి కాని పేర్కొననివి కానీ ఏవి చేసినా అడ్డుకొనేవారు లేరు. 1946 లో జరిగిన ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెసు, రాజ్యాంగ చట్టాన్ని తయారుచేయబో-

తున్నానని కానీ, పంచవర్ష ప్రణాళిక తయారుచేయబోతున్నానని కానీ, వాటి స్వరూపాలు స్థూలంగా ఇలా ఉంటవని కానీ చెప్పలేదు. అయినా ప్రజల ఇష్టానిష్టాలతో సూచనలతో, సమ్మతితో నిమిత్తం లేకుండానే కాంగ్రెసు వాటిని దేశంమీద విధించింది. ఆ రాజ్యాంగ చట్టం, ప్రణాళికలు మంచివా, కావా అనేది వేరే సమస్య.

ఇలా ప్రజల ఇష్టానిష్టాలతో సమ్మతితో నిమిత్తం లేకుండానే నిర్ణయాలు జరుగుతున్నప్పుడు ప్రజల స్వాతంత్ర్యం పాలకపక్షం దయాధర్మాల మీద ఆధారపడుతుంది. అంతే కాని అధికారంలో ఉన్న పార్టీ నియంతృత్వచర్యలకు దిగుతున్నప్పుడు ప్రజలు ఎలా వారించ గలుగుతారు? అమలులో ఉన్న రాజ్యాంగ చట్టం ఎంతవరకు ప్రజలను రక్షించ గలుగుతుంది? రక్షిస్తుందన్న పక్షంలో వైమర్ రిపబ్లిక్ నాజీ నియంతృత్వస్థాపనను ఎందుకు నిరోధించ లేకపోయింది?

కాగా, వ్యక్తులకంటే జాతి గొప్పదనటంలోను లక్ష్యసాధకమైనది ధర్మమనటంలోను, అధికారం కేంద్రీకృతం కావాలనటంలోను, అధికార ప్రాప్తికోసం పాకులాడటంలోను కాంగ్రెసు పార్టీకి, కమ్యూనిస్టు పార్టీకి ఏమాత్రం తేడా లేదు. రెండు పార్టీలు ప్రజల సర్వస్వతంత్రాధికారాన్ని ఆత్మభుక్తం చేసుకొని వ్యవహరించటానికే యావచ్ఛక్తిని వినియోగిస్తున్నవి. అంతేకాని సిద్ధాంతదృష్టితో పరిశీలించినప్పుడు ఈ రెండు పక్షాలకు ఏమీ తేడాలేదు. రష్యాలో లేని స్వాతంత్ర్యాలు ఈనాడు భారతదేశంలో ఉన్నవంటే ఇవి భారతీయులు వివేకం ఉపయోగించి స్వశక్తితో సంపాదించుకొన్నవి కావు. ఆంగ్ల ప్రభుత్వం ఈ దేశంలో విడిచి పెట్టిపోయిన సంప్రదాయం వల్లా, కాంగ్రెసు పార్టీ అగ్రనాయకుల దయాధర్మాల వల్ల ఇలా ఉంటున్నవి. ఇలా దయాధర్మాల మీద బ్రతికే బ్రతుకులు ఏ స్వతంత్రాలూ కావు.

నిజానికి ఈనాడు కాంగ్రెసు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ ప్రతిపాదిస్తున్న రెండు లక్ష్యాలే తప్ప మరొక ఇతర లక్ష్యం కనిపించనప్పుడు నిరక్షరకుక్షులు కేవలం అన్నమయజీవులు కాక, మిగిలినవారంతా కాంగ్రెసు పార్టీని బలపరచవలసి ఉండేది. కాని ప్రజాస్వామ్యపు యథార్థస్వరూపం దృగ్గోచర మవుతుండగా ఆ లక్ష్యాన్ని వదులుకొని తత్ప్రతికక్షులలో ఒకరికి తోడ్పడట మనేది ప్రజాస్వామ్యవాదికి అసంభావ్యం. సమయం వచ్చినప్పుడు కాకపోతే మరెప్పుడతడు తన లక్ష్యాన్ని ప్రచారించి సాధిస్తాడు?

ఈ పై అంశాలు యథార్థమైతే కాంగ్రెసును సమర్థించి గెలిపించవలసిన అవసర మేమిటి ?

తరువాత పరిశీలించదగినది సోషలిస్టు పార్టీ. కమ్యూనిస్టు, కాంగ్రెసు పార్టీల కంటె ఈ పార్టీ కూడా పై దృష్టితో పరామర్శించినప్పుడు ఏ మాత్రం విలక్షణం కాదు. పై రెండు పార్టీలలోని దోషాలు ఇందులో కూడా ఉన్నాయి.

ఇక మిగిలినది స్వతంత్రులు. అయితే ఎవరు వీరిలో స్వార్థపరులో, అవకాశవాదులో, అవగత చరిత్రలో ఎవరు ప్రజాస్వామ్య వాదులో, స్వాతంత్ర్యాభిలాషులో, నిర్దిష్ట లక్ష్య సమన్వితులో, గీయమాన ప్రవర్తనులో ఆ యా నియోజకవర్గ ప్రజలకు తప్ప ఆంధ్ర ప్రజా సామాన్యానికి తెలియదు. ·ని ప్రజాస్వామ్యాన్ని కోరుతూ వ్యక్తిస్వాతంత్ర్యంకోసం శాయ శక్తులా ప్రయత్నిస్తున్న ఆంధ్రపత్రిక వంటి దినపత్రికలైనా ఆ యా స్వతంత్ర అభ్యర్థుల లక్ష్యాలు, పూర్వచరిత్రలు సంగ్రహంగా నైనా ప్రకటించకపోవటం ప్రజాస్వామ్యాభిలాషుల దురదృష్ట మనే చెప్పాలి. కమ్యూనిస్టు నాయకుల ఉపన్యాసాలను, సిద్ధాంతాలను సాకల్యంగా పరామర్శించటానికి తావు చూపగలిగిన పత్రికలకు ఈ విషయంలో స్థానం లేకపోవటాన్ని మరెలా అర్థం చేసుకోవాలి ?

పై పార్టీ లక్ష్యాల సింహావలోకంతో రాజకీయాలు జీవితపద్ధతికి సంబంధించనవనీ, జీవితపద్ధతి శాస్త్రదృష్టి వల్ల నిష్పన్న మవుతున్న శాస్త్రమనీ స్పష్ట మవుతున్నది. శాస్త్ర మెప్పుడూ విషయప్రధానం. ప్రకృతిశాస్త్రాలకు ప్రకృతివిషయమైతే సామాజికశాస్త్రాలకు సమాజం విషయ మవుతున్నది. ఆ యా శాస్త్రాలు ప్రతిపాదిస్తున్న విషయాల యథార్థతా యథార్థతలు ప్రకృతిలోని అయా విషయాలు పైని ఆధారపడి వుంటున్నవి ప్రకృతిలోని విషయాలు శాస్త్రంచెబుతున్న అంశాలను రుజువుచేస్తే ఆ శాస్త్రార్థం యదార్థం. రుజువుచేయని పక్షంలో అయధార్థం. ఇలాంటి దానిని పరతః ప్రమాణ మని చెప్పవచ్చును. కాబట్టి శాస్త్రం ఏదైనా పరతఃప్రమాణమే. రాజకీయ శాస్త్రయాథార్థ్యం, చరిత్రమీదను, ఆర్థికశాస్త్రంమీదను ఇతర సామాజికశాస్త్రాల మీదను పరమంగా ఆచరణ మీదను ఆధారపడుచున్నది. భౌతిక శాస్త్ర యాథార్థ్యం ప్రకృతిమీద ఆధారపడి యుంటే తత్త్వశాస్త్ర యాథార్థ్యం వివిద ప్రకృతి శాస్త్రాలు సామాజిక శాస్త్రాలు కూడబెట్టిన అర్థాలమీద ఆధారపడుతున్నది.

కాబట్టి శాస్త్రరచన ఏ శాఖకు చెందినదైనా విషయప్రధానము, పరతఃప్రమాణము అవుతున్నది.

ఈ రచన కాక మరొక విధమైన రచన ఉన్నది. ఇది పై దానివలె విషయప్రధానం కాదు. భావనా ప్రధానం. ఈ భావనతో సిద్ధించే విషయాలు ప్రత్యక్ష, అనుమాన, ఉప మానాది ప్రమాణాల వల్ల సిద్ధించే విషయాల వంటివి కావు. దీనివల్ల కలిగే అనుభూతి జాగ్రత్స్వప్నావస్థలందును, క్రీడామాయేంద్ర జాలాదిక మందును లభించే అనుభూతి వంటివి కావు. అందువల్ల భావిత విషయం విలక్షణం. మేఘసందేశం, మృచ్ఛకటికం, కళాపూర్ణోద యం మొదలైనవి విలక్షణాలు. అలౌకికాలైన ఈ కావ్యార్థాల యదార్థతా యథార్థతలను ప్రకృతిలోని ఏ విషయాలను బట్టి నిర్ణయించటానికి వీలౌతుంది ? సహృదయ స్పందన తప్ప మరొక ప్రమాణం లేదు కదా ? కాబట్టి ఇది సహృదయ హృదయమే ప్రమాణంగా కలది. అంటే స్వతఃప్రమాణ మన్న మాట. అంటే, సహృదయ స్పందనం కలిగిస్తే కృతి లేక కలామయ రచన అవుతున్నది. ప్రకృతి విషయాను గుణంగా ఉన్నది శాస్త్ర మవు తున్నది.

కాగా కృతి లేక కలామయ రచన భావనాప్రధానము, స్వతః ప్రమాణము అవు తున్నది.

అయితే శాస్త్రానికి సత్యాన్వేషణమే లక్ష్యం కాబట్టి అది కారణాలను, హేతువును పుర స్కరించుకొని ప్రతిపాద్య విషయాలను ప్రసరిస్తుంది. అంతేకాని అపేక్షా రహితమైన విషయప్రస్తారానికి అందులో ప్రసక్తి లేదు. కలామయ రచనలో అలా కాదు అవయవిలోని అవయవాల వలె దానిలోని ఆదిమధ్యాంతాలు ఎడపరానివై వుంటాయి. శరీరంలో ఏ అవ యవం లేకపోయినా లోటు ఉన్నట్లే కలామయ రచనలో ఉన్న ఏ అంగం లోపించినా కుంటు పడుతుంది. ఈ విధంగా కలామయ రచన భిన్నత్వంలో ఏకత్వం సాధిస్తుంది. అందువలనే కేవలం రంగు, రేఖ, శబ్దం, నాదం, కలామయ రచనలు కావు. అయితే కలామయ రచన లోని వివిధాంశాల పొందిక కూడా క్రమబద్ధమే. ఈ క్రమం అంతర్గత బాధ లేనిదై ఐక్య ప్రతిపాదకమై ఉంటుంది.

ఈ విధంగా శాస్త్రీయ రచన సత్య ప్రధానము, హేతూపపన్నము అవుతుండగా కలా మయ రచన స్వయంసంపూర్ణము, స్వయం భాసమానముగా ఉండి భిన్నత్వంలో ఏకత్వం సాధిస్తుంది. సత్యప్రధానతా హేతూపపన్నతలు శాస్త్రానికి, స్వయం సంపూర్ణతా, స్వయం

భాసమానతలు కలామయ రచనకు సాధారణీకృతిని చేకూరుస్తున్నవి. అయితే శాస్త్ర సాధారణీకృతి ప్రమేయగతం. కళ యందలి సాధారణీకృతి ప్రమాతృగతం.

ఇక్కడ మరొక విషయం ఉన్నది. అద్వైతం హెగెలియనిజమ్ వంటి ఆధ్యాత్మిక వాదాలు అబాధితమైనవే (coherence) సత్య మంటున్నవి. ఈ దృష్టితో చూచినప్పుడు కలామయ రచనకూడా సత్యప్రధానమూ అవుతున్నది. ఈ పక్షంలో స్వయంసంపూర్ణము, స్వయంభాసమానము అవుతున్న అద్వైతాది దర్శనాలుకూడా కలామయ రచనలుగా భావించ వలసి వస్తున్నది.

కాని, వీనినికూడా కలామయ ప్రపంచం నుంచి వేరు చేసే లక్షణం మరొకటున్నది. శాస్త్రానికి అభిధ, లక్షణ, తాత్పర్యం ముఖ్యాలు. కలామయ రచనకు అలా కాదు. దీనికి వ్యంజన ప్రధానం. ఇది లేక కళ లేదు. సాధారణంగా నేడీ విషయం విస్మరింప బడు తున్నది. అందుకనే చాలమంది "దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్" వంటి వాక్యాలను కవిత్వంగా భావిస్తున్నారు. ఇది శోచనీయం. ఎందుకంటే వీనిలో వంజన లేదు. ఐతే హేమ్లెట్‌లో పోలోనియస్ కుమారునికి చేసిన హితోపదేశం, ఉత్తర రామచరిత్ర లోని ముని కుమారుల అశ్వవర్ణనం, పేర్కొని అవి ఎలా కలామయ రచనలు అవుతున్నవని ప్రశ్నించ వచ్చును. వచ్చి వాస్తవికతను చిత్రించి నవలలు, నాటకాలు, కథలు ఎలా సాహిత్య మవుతున్న వని అడుగవచ్చు. హితోపదేశం, పోలోనియస్ స్వభావాన్ని, అశ్వ వర్ణనం, ముని కుమారుల స్థితిని అభివ్యక్తం చేస్తున్నది. నవలలు మొదలైన వానిలో వస్తు ధ్వని ప్రబంధ ధ్వని ఉంటున్నాయి. అందువల్లనే వాటిని సాహిత్యంగా పరిగణించటం జరుగుతున్నది.

*కళాలక్షణం*

పైవాటినన్నిటిని మించిన విశిష్ట లక్షణం మరొకటి కలామయ రచన కుంది. శాస్త్ర రచనకు సత్యం ప్రధానం. ఈ సత్యం తెలిసికోవటంలో నిర్లిప్త సంతృప్తి లేకపోలేదు. అయితే ఆ సత్య మనేది ప్రవృత్తిసఫలత మీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు కమ్యూనిస్టు రాజకీయాలనే తీసుకొందాం. ఈ రాజకీయాలు దేశంలో నాటుకొని పూవులు పూచి, కాయలు కాచి, ఫలం అనుభవింపబడు తున్నప్పుడే సత్యం అనవలసి ఉంటుంది. ఈ ఫలానుభూతిలో సుఖం కలుగు తున్నది. ఈ సుఖం కేవలం ఇతర సుఖాల వంటిదే. పైగా ఇది సవ్యవధికం, సాంతరాయం. కలామయ రచన అప్పటికప్పుడే సంతృప్తి కలిగిస్తున్నది. అంటే అవ్యవధికం; నిరంతరాయం. అనన్యం

అయిన సంతృప్తి కలుగుతున్నది. ఇలాంటి విశిష్టసంతృప్తి, ఆనందం ఏ శాస్త్రం ఇవ్వలేదు.

ఈవిధంగా శాస్త్రం విషయప్రధానము, పరతః ప్రమాణము, హేతూపపన్నము, అభిధాదిశరణము అవుతూ అనుభూతివిస్తృతితో సంస్కారం కోరుతూఉంటే, కలామయ రచన భావనా ప్రధానము, స్వయంసంపూర్ణము, స్వయంభాసమానము, స్వతఃప్రమాణము, విభిన్న తైక్య సంపాదకము, విశిష్ట సంతృప్తిమయము, సంస్కారానపేక్షము అవుతూ ఎప్పుడూ, ఒకేలాగ ఉపాదేయ మవుతున్నది.

ఇలాంటి విశిష్టమైన కలామయ రచనను రాజకీయాలకు లోబడి బాకాలు పట్టమనటం, ఆవును దున్న మని, ఎద్దును పాలిమ్మనటమే.

*ప్రాచీనులు – రాజకీయాలు*

ఈ సందర్భంలో ఒక విచికిత్స పొడమవచ్చును. "కాళిదాసాదులు రఘువంశాది కావ్యాలలో రాజకీయాలను గూర్చి వ్రాయలేదా ? అంతమాత్రం చేతనే అవి కావ్యత్వం కోల్పోయాయా ?" అనవచ్చును. ఈ సందేహం నివర్తించుకోవాలంటే రెండంశాలను విస్పష్టంగా తేల్చుకోవాలి. (1) కాళిదాసు చెప్పిన రాజకీయాలనే చెప్పాలా ? అలా చెప్పినప్పుడే కావ్యత్వం సిద్ధిస్తున్నదా ? (2) కాక ఏదో ఒక విధమైన రాజకీయాలు చెప్పినంత మాత్రాననే కావ్యత్వం సిద్ధిస్తున్నదా ? మొదటి పక్షంలో షేక్స్పియర్, మిల్టన్, డాంటే, ఇబ్సన్, టాల్‌స్టాయ్‌ల రచనలకు కావ్యత్వం సిద్ధించక పోవాలి. (కొంద రసలు పాశ్చాత్య రచనలే కావ్యత్వానికి దూరీకృతా లని అంటారు. వారికీ వాదంతో నిమిత్తం లేదు.) రెండవ పక్షంలో చాణుక్యుని అర్థశాస్త్రం, శుక్ర నీతి సారం, మనుస్మృతి ప్లేటో వ్రాసిన రిపబ్లిక్, మైకవెల్లి రచన, రూసోసోషల్‌కాంట్రాక్ట్ కమ్యూనిస్టు మానిఫెస్టో మొదలైన రాజకీయగ్రంథాలు కావ్యాలు కావాలి. కాబట్టి రాజకీయాలను గూర్చి వ్రాసినా, వ్రాయకపోయినా పై సూత్రాలను పాటించినదే కలామయ రచన అవుతున్నది. అందువల్ల కమ్యూనిస్టు రాజకీయాలను ప్రచారించే రచనలు కలామయ రచనలు కావచ్చును కాకపోవచ్చును. ఇదే అన్యపాక్షిక రాజకీయాలనుగాని ఇతర రాజకీయాలనుగాని ప్రచారించే రచనలకుకూడా అన్వయిస్తుంది.

*కళ – ధర్మము*

అయితే కలామయ రచనకు ధర్మానికి ఎక్కడా సంబంధం లేదా అన్నప్రశ్న పొడమకమానదు. ధర్మ మనేది కేవలం కర్మక్షేత్రానికి సంబంధించినది. మానవుని పరమార్థంగా

స్వీకరించి ఆత్మనాశనానికి పాల్పడక వివేకంతో తనకు తానుగా అంతఃకరణం నిశ్చయించిన కర్మ ధర్మం. దానికి విరుద్ధమైన కర్మ అధర్మం. అయితే భావన విచారము అనేవి కూడా ఒకవిధమైన కర్మలే కదా. వాటికి ధర్మంతో ప్రసక్తి లేదా అన్న సందేహం కలుగక మానదు. నిజమే, కలామయ రచన, శాస్త్ర రచన అభిమానావేశాదులకు వివశమై పైపై పేర్కొన్న తన నియమాలను ఉల్లంఘించి గర్హణీయా లవుతున్నవి.

ఈ సింహావలోకనంతో తేలిన సారాంశం

(1) ప్రజాస్వామ్యం కంటె మించిన ఉత్తమ లక్ష్యం లేదు. దాని కోసం కృషి చేయటం ధర్మం.

(2) శాస్త్రరచనకు సత్యం లక్ష్యం. కలామయ రచనకు విశిష్ట సంతృప్తి లేక ఆనందం లక్ష్యం.

(3) పరవిధేయమాన రాజకీయాలకు కాని లేక మరొక సిద్ధాంతానికి కాని లోబడి మాత్రమే ఏ రచనైనా సాగాలనటం శోచనీయం.

(4) రచనలు ఆమ్నాత పూర్వాలైన తమ శాఖీయ నియమాలను ఉల్లంఘించినప్పుడు శోచనీయా లవుతున్నవి.

(5) రచయిత వివేక విశిష్టమైన తన అంతఃకరణం చూపుతున్న దృష్టితో పూర్వోద్దిష్ట నియమాలను వినియోగించుకొని సృష్టించినప్పుడే ఆత్మసిద్ధికి, తద్వారా లోకకళ్యాణానికి పాటుపడిన వాడవుతున్నాడు. భిన్నంగా ప్రవర్తించినపుడు ఆత్మవంచకుడు, తద్వారా లోకవంచకుడు అవుతున్నాడు. నిజంగా ప్రజాస్వామ్యం కూడా రచయిత యొక్క ఈ విశిష్టసృష్టికి నీరాజనం పడుతూ ఉన్నది.

(ఆంధ్రపత్రిక 1955 ఫిబ్రవరి 13 సంచిక సౌజన్యంతో)

# మా గురుదేవులు

—మహమ్మద్ నఫీజుద్దీన్

[ నఫీజుద్దీన్‌గారు తెనాలిలో జన్మించారు. వి. యస్. ఆర్. కళాశాలలో విద్యాభ్యాసం చేసి, ఆ తరవాత ఆంధ్ర విశ్వకళా పరిషత్ వారి తేరులో ఆంగ్లంలో ఎమ్. ఎ. పట్టం తీసుకొని, వి. యస్. ఆర్ కళాశాల, తెనాలిలో గత పదిహేడు సంవత్సరాలుగ ఆంగ్లోపన్యాస కులుగ పని చేస్తున్నారు.

వీరు లెక్కకు మించిన కథలు, బాలకథలు, కథానికలు నాటి కలు, నవలలు వ్రాశారు. "దేవుడూ నీకు దిక్కెవరు ?" లాటి వీరి నాటికలు అనేక బహుమతులను గెలుచుకొన్నాయి.

ఇటీవల వీరు వ్రాసిన "శిలాశురాలు" అనే కథానిక "యువ" వారు నిర్వహించిన పోటీలలో "చక్రపాణి అవార్డు" గెలుచుకొంది.

వీరు డా॥ జి. వి. కృష్ణరావుగారి దగ్గర చదువుకొన్నారు.]

* * *

రెండు దశాబ్దాల క్రితం సంగతి! అప్పుడు నేను, తెనాలి వి, యస్. ఆర్. కళాశాలలో విద్యార్థిని! చాలామందికి తెలుగంటే, తెలుగు అధ్యాపకులంటే. కొంచెం ఆటవిడుపుగా ఉండేది. 'ఆశ్చర్య చూడామణి' అనే తెలుగు అనువాదపు సంస్కృత నాటకాన్ని బోధించ టానికో అధ్యాపకు లొచ్చారు. సన్నగా, ఎత్తుగా, దుర్బలాకారంతో, నిరాడంబరంగా,

నిండైన తెలుగుదనం మూర్తీభవించే గంభీరమూర్తి ఆయన! "డాక్టర్ జి. వి. కృష్ణరావు గారంటే వీరే!" అన్నారు విద్యార్థు లెవరో. క్లాసు సద్దు మణిగింది! ఆశ్చర్యపోయాను!!

పాఠం ప్రారంభమైంది, సంస్కృత నాటకం నుంచి మొదలుపెట్టి .... .... ఆధునిక నాటకపు పోకడలు వివరిస్తూ, అనువాద కర్త సంస్కృత మూలానికి ఎలా ఆంధ్రీకరణలో అన్యాయం చేశారో సవిమర్శ ప్రశంసతో లోతుపాతులు వివరిస్తుంటే, "ఇందులో యింత రమణీయత వుందా? విమర్శ అంటే ఇలా ఉండాలా? ఇన్ని వివరణలు, యిన్ని సందర్భ సహిత వ్యాఖ్యలు యింత పాండితీప్రకర్ష తెలుసుకోవటం 'ఎంత అదృష్టం!' ఈయన డాక్టర్ జాన్సన్‌లా, 'మరో నడిచే విజ్ఞాన సార్వస్వం' అనుకునే వాళ్ళం! "డిగ్రీ స్థాయిలో ఒక అనువాద నాటకాన్ని యింత తరచి తరచి బోధించాలా?" అనుకున్న వాళ్ళు లేకపోలేదు. అయితే ఆ ఏడు మా క్లాసు విద్యార్థి ఆంధ్ర విశ్వవిద్యాలయమున కంతటికీ ప్రప్రథముడుగా వచ్చి బంగారు పతకాన్ని పొందాడు. అప్పు డనిపించింది, 'గీత'లో చెప్పినట్లు, యోగి పుంగవులకు తాము చేసే పని చాలా బాగా చేస్తేనే కాని సంతృప్తి ఉండదని చెబుతూ— "యోగః కర్మసు కౌశలమ్" అన్నది యిందుకనే నని! కృష్ణరావుగారు కర్మయోగి.

కృష్ణరావుగారు మితభాషి! గంభీరంగా గంగా ప్రవాహంలా సాగే ఆయన పాఠం, భయభక్తులలో, గౌరవ ప్రపత్తులతో వినేవాళ్ళు విద్యార్థు లందరూ. ఎక్కడైనా అనాసక్తత, అశ్రద్ధ - ఆయనకు కోపకారణం అయ్యేది. హాస్యం పాలు ఆయన పాఠాల్లో అరుదుగా ఉండేది. అయితే సందర్భం వచ్చినప్పుడు మనసారా నవ్వేవారు, విద్యార్థుల్ని నవ్వించే వారు.

ఒకరోజు — ఒక విద్యార్థి క్రమశిక్షణారాహిత్య ప్రవర్తనకు సంబంధించిన నోటీసు వచ్చింది. "ఫలానా విద్యార్థి ఆడపిల్లలు వేచి ఉండే గదిలోకి అనుమతి లేకుండా ప్రవేశించి నందుకు, రెండు రూపాయలు జరిమానా!" అనేది ఆ ఆంగ్ల నోటీసు సారాంశం.

ఆ నోటీసు చదివిన కృష్ణరావుగారు, ఆంగ్ల వాక్య నిర్మాణదోషం వల్ల ధ్వనిస్తున్న శ్లేషార్థానికి నవ్వు వొచ్చి నవ్వారు. ఆయనతోపాటు విద్యార్థులూ జత కలిశారు.

నాకు, విద్యార్థిగా— కృష్ణరావుగారి ఔన్నత్యం అర్థమైంది కొంతే! కాని, నేనూ కళాశాల ఉపన్యాసకుడిగా జేరాక, ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగార్ గారి విద్యార్థిగా, నా సాహిత్యజిజ్ఞాస పెరిగింది. ఆంధ్రాంగ్లాలు నాకు అభిమాన విషయా లయ్యాయి. కృష్ణరావు

గారిలా అంత గొప్ప అధ్యాపకుణ్ణి కావాలంటే నేనేం చేయాలి? ఆయన అన్ని సాహిత్య ప్రక్రియల్లో అన్నన్ని విశిష్ట రచనలు ఎలా చేయగలిగారు? ఏ మహనీయుల రచనలు ఆయనను స్పదింపజేశాయి? ఆయన జీవితకాలంలో ఏ రచయితల ప్రభావానికి గురయ్యారు? ఆయన జీవితకాలంలో సాహిత్యాన్ని ఒక ఆలంబనంగా తీసుకుని ఆయన సాధించిం దేమిటి? ఇంతటి మహామనీషిగా ఒక వ్యక్తి ఎదగటం సాధ్యమా? — అనే ప్రశ్నలు నన్ను ఆయన రచనలతోపాటు, ఆయన జీవితాన్ని కొంత అధ్యయనం చేసేట్టు పురిగొల్పాయి.

స్వాతంత్ర్యం రావటానికి రెండు దశాబ్దాలకు పూర్వం, కృష్ణరావుగారు, కూచిపూడి వంటి కుగ్రామంలో పుట్టారు. అయితే స్వతంత్ర భావాలు గల స్వాతంత్ర్యప్రియుడు కావటం వల్ల, నూనూగు యవ్వనప్రాయంలోనే ఎమ్. ఎన్. రాయ్ వంటి మేధావి హేతువాద ప్రభావానికి ఆయన గురయ్యారు. తరువాత 'కవిరాజు' శ్రీ త్రిపురనేని రామస్వామిగారి ప్రభావం శ్రీ గోపదేవ్‌గారి ఆర్యసమాజ ప్రభావం వారిమీద పనిచేశాయి. ఫలితంగా క్రమేపీ ఆయనలో హేతుబద్ధమైన శాస్త్రీయ దృక్పథం ఏర్పడింది.

కృష్ణరావుగారికి బాల్యంనుంచి సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యాల మీద అభిరుచి ఎక్కువ. కళాశాల విద్యార్థిగానే ఆయన ఆనందవర్ధనుడి నుంచి — కోహలుడి వరకున్న అలంకారశాస్త్రజ్ఞుల్ని; ప్లాటో, అరిస్టాటిల్, హెగెల్, కాంట్, బెట్రాండ్‌రస్సెల్ వంటి తత్త్వశాస్త్రవేత్తల్ని; పాణిని వంటి సంస్కృత వ్యాకరణవేత్తల్ని; యూజీబనీల్, షా, యిబ్సన్, మామ్, మపాసా వంటి సాహితీవేత్తల్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. ప్రపంచసాహిత్యాన్ని ఆయన క్షుణ్ణంగా చదివారు. సాహిత్యంలో వస్తున్న అన్ని కొత్తధోరణులను ఆయన బాగా ఆకళించుకున్నారు. సాహిత్య ప్రయోజనాన్ని గుర్తించారు. కత్తికంటె వాడిగా కలాన్ని నడిపారు. జర్నలిస్టుగా శ్రీ నార్లతో సాటిగా, సాహిత్యంలో గోపీచంద్ కంటే దీటుగా నిలిచారు.

విద్యార్థిగా నేను ప్రప్రథమంగా కృష్ణరావుగారి రచన చదివింది ఒక నవల! అప్పట్లో ఆ నవల అర్థమైందనుకున్నాను. మళ్ళీ యీ మధ్య చదివాక మొదట్లో అర్థమైన దనుకొని నేను పొరపాటుపడ్డా ననిపించింది. ఆ నవలే 'కీలుబొమ్మలు'.

స్వాతంత్ర్యం వచ్చాక పల్లెటూళ్ళు ఎలా సంఘర్షణలకు, రాజకీయాలకు ఆలవాలమైనాయో, అమాయకులు వాటిలో పడి ఎలా నలిగిపోతున్నారో, తప్పులు చేసేవారు అబద్ధాలు

చెప్పేవాళ్లు ఎలా గొప్పవారయిపోతారో చెప్పే కథ — ఇందులో ఇతివృత్తం! అదే కాదు. పై సంఘటనల్లో, పరిస్థితుల్లో పడి చిక్కుకున్న ప్రాణులు మానసిక సంఘర్షణ, యీ సంఘర్షణల వెనకవున్న మానవప్రవృత్తిని తాత్వికంగా దర్శించి ప్రదర్శించిన నవల ఇది. అందుకే కాబోలు విమర్శకులు యీ నవలను "వ్యాఖ్యానాత్మకమైన వర్తమాన ఆంధ్ర గ్రామీణ చరిత్ర" అన్నారు.

'కావ్యజగత్తు' — అనే విమర్శనాత్మక గ్రంథం, 'యుగసంధ్య', 'శివరాత్రి' — అనే ఖండకావ్యాలు, వేమన మీద వ్యాసాలు, లిపి సంస్కారం మీద విమర్శలు, 'కళాపూర్ణోదయం' మీద డాక్టరేట్ తెచ్చిన సిద్ధాంతవ్యాసం, 'భిక్షాపాత్ర' అనే నాటిక, 'ప్లాటో', 'అరిస్టాటిల్', 'థోరో' వంటి ప్రముఖ తత్వవేత్తల రచనానువాదాలు — ఇవి, కృష్ణరావుగారి రచనల్లో నాకు తెలిసినవి కొన్ని 'పాండిత్యం లేనివాడు కవి అవుతాడు' — కవిత్వం రానివాడు విమర్శకుడౌతాడు — అనేది కృష్ణరావుగారికి వర్తించవు. ఆయన కవి, పండితుడు, విమర్శకుడు. అందుకే, ఇటు కవి పండితులు, అటు విమర్శకులు ఆరాధించే రచనలు అన్ని సాహిత్య ప్రక్రియల్లో చేసిన సవ్యసాచి.

విద్యార్థిగా ఉన్నప్పటికంటే, నేను, అధ్యాపకవృత్తిలో జేరేకే నాకు ఆయన 'గురుదేవుడి'గా ఎక్కువ ఆదర్శప్రాయు డయ్యాడు. ఆయన క్రమశిక్షణ, సత్ప్రవర్తన, కొన్ని నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడివుండే పట్టుదల, అందరినీ సమదృష్టితో చూచే నిజాయితీ, బోధనాంశాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసే ఓర్పూ-నేర్పూ, విద్యార్థులకు జిజ్ఞాస కలిగించే విధంగా బోధించటం — ఏ అధ్యాపకుడికైనా అనుసరణీయమే గదా!

షేక్స్పియర్ నాటకాలతో ఇంగ్లండ్, ఫిరదౌసి కావ్యాలతో పారశీకదేశం లియోనార్డో-డా-విన్సీ శిల్పప్రతిభతో ఫ్రాన్స్, వాల్మీకి, కాళిదాసు వంటి మహాకవులతో భారతావని పునీతమైంది. కందుకూరి, చిలకమర్తి, గురజాడ, ముట్నూరి ఏ విధంగా నవయుగ వైతాళికులో కృష్ణరావుగారు కూడా బౌద్ధసాహిత్యంతోపాటు ఆధునిక సాహిత్యానికీ ఎనలేని సేవచేశారు. భారతం ఏ విధంగా — ధర్మతత్వజ్ఞులకు, అధ్యాత్మవిదులకు నీతి విచక్షణులకు, కవి వృషభులకు వివిధ రూపాల్లో విశ్వరూప సందర్శనం యిస్తుందో, కృష్ణరావుగారి సాహితీ విశ్వరూపంకూడా అలాగే విభిన్నరూపాల్లో దర్శనమిస్తుంది.

# రాగరేఖలు

—పావినేని శివశంకరరావు

[శివశంకరరావు 1953 గుంటూరుజిల్లా నెక్కట్లగ్రామంలో జన్మించారు. 1974లో బి. ఎ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై జయంతి రామయ్య పంతులు అవార్డు గెలుచుకొన్నారు. 1976లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి "సర్వప్రథముడు" గా ఎమ్. ఎ. పట్టాన్ని అందుకొన్నారు. సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు నాగళ్ళ గురుప్రసాదరావు గారి వద్ద అంతే వాసం చేయడంతో సహజమైన వీరి ప్రతిభకు తావి అబ్బింది.

1977 నుంచి రచనలు చేస్తున్నారు. 'భారతి' 'ఆంధ్రజ్యోతి'లలో ప్రచురితాలు. ప్రస్తుతం తాడికొండ సత్యసాయిబాబా కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు.]

*　*　*　*

అది శాతవాహనుల కాలం. ఆంధ్రజాతి రాజకీయ, సాంఘిక, సాంస్కృతికరంగాలలో అపురూపమైన చైతన్యం కలిగి ఉన్న రోజులవి. బౌద్ధధర్మం తెలుగుజాతికి వన్నె పెట్టిన రోజులవి. సమాజంలోని పతితులకూ, భ్రష్టులకూ బౌద్ధబిక్షువులసేవ లభిస్తూ ఉంది. చాతుర్వర్ణ్యవ్యవస్థ పాదుకొని ఉన్న ఆనాటి సమాజానికి విజాతీయుల తాకిడి ఆరంభమైంది. అప్పటికి పదేండ్లనాడే శకులు తెలుగుగడ్డపై కాలు మోపారు. జట్లుజట్లుగా కూటికోసం, గుడ్డకోసం తెలుగునాట శ్రామికులుగా, సేవకులుగా స్థిరపడ్డారు. ధర్మదేవ, వృషభదత్త మొదలగు జాతీయనామాలతోనే వారు చలామణి అయ్యేవారు. వారు బౌద్ధధర్మాన్ని అవలం

బించారు. శాతవాహనవిరోధు లైన శకులు ఆంధ్రసమాజంతో మమేకం గావటం చిత్రం. అయితే, ఆంధ్రజాతి శకులను అధమజాతిగానే మన్నించింది. మరొకవంక యవనులు తెలుగు పల్లెలను చుట్టుముట్టి దౌర్జన్యంగా అమాయుకుల ఆస్తులను దోచుకోసాగారు. విహార భూములు కూడా చల్లచల్లగా వారికి సంతనపడటంతో బౌద్ధబిక్షువులకూ, వారి అండ కాగే అనాథులకూ ఆశ్రయం అంతరింపసాగింది. ఇటువంటి స్థితిలో ఉన్న ఆనాటి ఆంధ్రదేశం లోని ఒక పల్లెలో జాత్యహంకారం గల ఒకానొక సంపన్నకుటుంబపు గాథే "రాగరేఖలు". ఈ నవలారచయిత కీర్తిశేషులు జీ. వి. కృష్ణరావుగారు.

శాంతమ్మ ఒక కలిగిన కుటుంబపు యజమానురాలు. లంకంత యిల్లు, పొలమూ పుట్రా, కనుసన్నల్లో పాలేళ్లూ దాసీలూ, పనిపాటల కడ్డం రాని భక్తీ, ఒక్కగా నొక్క కుమారుడూ – ఇవీ ఆమె ఆస్తిపాస్తులు. పైపై చూపులకు కుమారుడు ధర్మకీర్తిదే ఇంటిలో పెత్తన మనిపించినా, నిజానికి వెనుకనుంచి చక్రం తిప్పేది శాంతమ్మే. ఆమె కుమారునితో పాటు మరొక అమ్మాయిని కూడా పెంచవలసి వచ్చింది. శాంతమ్మ సోదరి ప్రేమికు డొకడు శకాంగనను వివాహ మాడి తుది దశలో తన కూతురు చిత్రను శాంతమ్మ సోదరి కప్పగించి వెళ్ళిపోతాడు. ఆమె ఆ బిడ్డను తన అవసానకాలంలో శాంతమ్మ కప్పగిస్తుంది. జాతిసాంకర్యం తనకు నచ్చకపోయినా బిక్షువుల ఆదేశంపై చిత్రను సాకక తప్పలేదు శాంతమ్మకు. ఆమె తనకుమారునిపై చూపించుచున్న ప్రేమలో అణువుపాలైనా నోచుకో లేదు చిత్ర.

ఇలా ఉండగా ధర్మకీర్తి ప్రత్తిపంట కోతలకు ఎప్పటివలెనే ఆ యేడూ శకుల జట్టు వచ్చింది. ఆ జట్టు నాయకుడు గుణవర్థనుడు. ఒకలు దాచుకోక కష్టపడే తత్వం, పరోప కారశీలం కలవాడు. అందుకే ధర్మకీర్తికి అతడంటే ఇష్టం. ప్రత్తికోతల సమయంలో ధర్మకీర్తి మంచంపట్టగా తన వీణాగానం ద్వారా గుణవర్ధనుడు ధర్మకీర్తికి స్వస్థత చేకూ ర్చాడు. చిత్రహృదయం కూడా చూరగొన్నాడు. ఆ ఇంటి పెద్దపాలేరు కూడా మూల బడటంతో ధర్మకీర్తి కోరికపై గుణవర్ధనుడు తన జట్టును వదలి ఆ ఇంట పనిపాటలు చూస్తూ ఉండిపోక తప్పలేదు. చిత్రాగుణవర్ధనుల ప్రేమ ఇనుమడించింది. ఒకనాడు వారు వాగు రేవున రెల్లుదుబ్బుల మాటున కౌగిలిలో ఉండగా శాంతమ్మ చూసింది. తన కుటుంబంలోని ఒకవ్యక్తి ఒక శకయువకుడితో, తందనా లాడటం ఎంత అప్రతిష్ఠ? వెంటనే శాంతమ్మ చిత్రను గృహనిర్బంధంలో ఉంచి నయాన భయాన చెప్పి చూసింది. చిత్ర మనస్సు

మారలేదు. ఈలోగా నాలుగు రోజు లాగితే. పరిస్థితి చక్కబడుతుందేమో నని ఆశతో ధర్మకీర్తి గుణవర్ధనుని బలవంతాన అతని ఊరికి పంపించివేశాడు. ఇంటివద్ద పరిస్థితిచూసి అతని గుండె చెరు వయింది. యవనుల బారిని పడి కుటుంబం ఛిద్ర మైంది. ఆస్తిపాస్తులు పోయాయి. తండ్రి మరణించాడు. ఆ దిగులుతో అతడు తిరిగి చిత్ర వద్దకు వెళ్ళలేకపోతాడు. అతనికోసం ఎదురు చూచి ఎదురుచూచి చిత్ర కృశించి పోయింది. తుద కొకనాడు అతడు వాగురేవున కనిపించాడు. ఆనాటిరాత్రే వారిరువురూ లేచిపోతారు. ఈ తలవంపుల మారి పని వలన శాంతమ్మ కాపాడుకుంటున్న వంశప్రతిష్ఠకు దెబ్బ తగిలింది. చిత్రాగుణ వర్ధనులు ఆశ్రమానికి వెళ్ళి ఉంటారేమో ననే ఉద్దేశ్యంతో శాంతిభిక్షువుల వద్దకు వెళతాడు ధర్మకీర్తి. విషయం తెలిసి శాంతమ్మ గృహానికి విచ్చేసిన, శాంతిభిక్షువుల మాటలతో శాంతమ్మ మనస్సు మారదు. అప్పుడు భిక్షువులు ఆమె కుటుంబరహస్యాన్ని వివరిస్తారు. శాంతమ్మ భర్త శకాంగన కుమారుడు. దీనితో జాత్యహంకారానికి చావుదెబ్బ తగిలింది. ధర్మకీర్తి కృపతో చిత్రాగుణవర్ధనులు తిరిగి ఆయింట కాలుబెట్టారు. ఒకానొకప్పుడు చిత్రను ఆశ్రమానికి పంపించివేద్దా మనుకున్న శాంతమ్మ తానె శాంతిభిక్షువుల వెంట ఆశ్రమానికి తరలింది.

రాగద్వేషాలు మానవహృదయంతోనే పుట్టాయి. మానవసమాజంలో ఒక వ్యక్తికి మరొక వ్యక్తిపట్ల ఎందుకు రాగద్వేషాలు జన్మిస్తాయో నిరూపించటం ఒక్కొకసారి అసాధ్యం. మాయల దయ్యమైన మానవహృదయానికి శాస్త్రీయవ్యాఖ్యానం ఇంకా పుట్టలేదు. చిత్ర కల్ల కపటం లేని పిల్ల. తల్లిదండ్రులు లేని ఆ అభాగ్యురాలికి శాంతమ్మవద్ద ఆశ్రయం లభించిందే కాని ఆత్మీయత లభింపలేదు. తన తల్లిదండ్రులు చెడిపోయినవారని లోకు లాడుకునే కథ లను చిత్ర విన్నది. అయితే ఆమె తన బాధను లోలోన దిగమింగుకున్నది. శాంతమ్మపట్ల భయభక్తులను, ధర్మకీర్తిపట్ల సోదరప్రేమను పెంచుకొన్నది చిత్ర. చదువుసంధ్యలతో పాటు చిత్రలేఖనమూ, సంగీతాసక్తీ ఆమె కబ్బాయి. ధర్మకీర్తి మంచంపట్టిన దశలో గుణ వర్ధనుడు తన గానం ద్వారా అతనికి ఊరట కలిగించటం చిత్రను ఆకర్షించింది గుణవర్ధనుడు· ఒళ్లు దాచుకొనేవాడు కాదు. సహనమూ, ధైర్యమూ, గలవాడు. అతని కుటుంబపు పూర్వ వైభవాన్ని గూర్చి ధర్మకీర్తి ద్వారా విన్నది చిత్ర. ఆంధ్రులకంటె శకులే నిస్స్వార్థజీవులని గ్రహించిన చిత్రను ఆ శకయువకుని రూపం, సంస్కారం ఆకర్షించటంలో వింత లేదు. వారిరువురి నడుమ అవ్యాజప్రేమ అంకురించింది. ఆ ప్రేమ హద్దులు దాటనట్టిది. వాగు

రేవులో రెల్లుదుబ్బుల మాటున ఆ అమాయికహృదయాలు ఎన్నో కమ్మని కలలు గనేవి. శాంతమ్మ ఆకలు, కేకలు చిత్రా-గుణవర్ధనుల రాగరేఖల్ని తుడిచిపెట్టలేక పోయాయి. ముందు ముందు తాము అనుభవింపబోయే దుర్భర దారిద్ర్యం కూడా వారిని భయపెట్టలేక పోయింది. వారివలె వారి అనురాగం కూడా నిష్కల్మషం. నిష్కల్మషమైన ఒక తత్వాన్ని మరొక కల్మషతత్వం ఓడించటం ఎప్పుడూ కష్టమే. చిత్రాగుణవర్ధనుల రాగరేఖల ద్వారా ఒకానొక స్వచ్ఛమైన ప్రణయస్వరూపం ఈ నవలలో ఆవిష్కరింపబడింది.

శాంతమ్మవంటి స్త్రీలు లోకంలో అరుదుగా తారసపడుతుంటారు. ఆమె నిబ్బరమైన మనిషి. గుండెలోతు గల వ్యక్తి. తెలివితేటలకూ పట్టుదలకూ మారుపేరు "పని తలపెట్టిందో ఇంద్రాదులు అడ్డుపడినా సాగిపోవలసిందే. అడ్డు తగిలినవారి ప్రాణాలు హతమారవలసిందే." శాంతమ్మ సోదరి కిచ్చిన మాట ప్రకారం చిత్రను పెంచి పెద్దజేసింది. అయితే, ఆ పెంపకంలో అనురాగానికి ఏ మాత్రం తావులేదు. ఉండ నవసరం లేదని కూడా ఆమె నిశ్చయం కారణము. చిత్రలో శకర క్తం ఉన్నదన్నవిషయం ఆమె యేనాడూ మరిచిపోలేదు. చిత్రప్రేమవృత్తాంతం తెలిసినప్పుడు పరిజనుల యెదుట కుటుంబం చులకన కాకుండా ఆమె ప్రదర్శించిన కఠోర నిగ్రహం, మెత్తని మాటల ద్వారా చిత్రను సాధించిన వైనం ఆశ్చర్యం గొలుపుతాయి. చిత్రను గృహనిర్బంధంలో ఉంచినా, తనమాట వినక గుణవర్ధనునే పెండ్లాడతా నని కూర్చున్నది. భయపెట్టటం, బాధించటం అన్నీ అయ్యాయి. మరి చిత్ర నెలా సాధించాలి ? "చిత్రను ఎప్పటివలె చూస్తుండాలి. ఆమె ఆహార విహారాలలో కార్య కలాపాలలో మార్పు ఉండరాదు. అయినా చిత్ర తాను తప్పు చేసినట్టు అనుక్షణం బాధపడాలి." ఇదీ శాంతమ్మ పథకం. కొట్టకుండా తిట్టకుండా పొగబెట్టటం ఆమెకే చేతనవును. భారతంలో ధర్మరాజువలె అమె 'కాంద్రు మనని బెబ్బులి'. తన సంకల్పం ఇతరుల సంకల్పం గావించి వారిచేతనే దానిని సాధింపజేసే నేర్పరితనం ఆమె కబ్బింది. కొడుకు తన మాట మీరే సమయానికి తన వృద్ధాప్యాన్ని అతనిపై తనకు గల కూరిమినీ ప్రస్తావించి ముందరి కాళ్ళకు బందాలు వేసేది. చిత్రాగుణవర్ధనుల ప్రేమను ధర్మకీర్తి సమ్మతిస్తున్నాడు. అతని పద్ధతి మార్చాలి. ఎలా ? ఆ సమయాన శాంతమ్మ మాట లిలా ఉంటాయి. అతనికికే ఒక చెల్లె లుంటే గుణవర్ధనునితో పెండ్లికి ధర్మకీర్తి ఒప్పుకుంటాడా ? చచ్చినా బాగే కాని ఆ పెండ్లిమాత్రం వీలు లేదంటాడు. "అతని మనసెంత మెత్తనో తనకు తెలుసు. పూర్వజన్మపుణ్యాన అతడు తన కడుపున పడ్డాడు. ఇంతకంటే తనకేం

కావాలి ? ఇంతకూ, అతని చెల్లెలుకు కూడని పని చిత్ర చేస్తున్నప్పుడు సహించవచ్చునా? సహించరాదనే అతని ఉద్దేశ్యం. ఆ సంగతి తనకు తెలుసు. ఈ విధంగా దారులన్నీ మూసేస్తూ ఎదుటివారిని తన దారికి తెచ్చే నేర్పు శాంతమ్మ కున్నది. అయితే తుట్టతుదకు శాంతమ్మ ఏ వంశప్రతిష్ఠ, జాతిగౌరవం అనే పునాదుల మీద తన జీవితసౌధాన్ని నిర్మించు కొన్నదో ఆ పునాదులు కూలిపోయాయి. చిత్రలో ప్రవహిస్తున్న శకరక్తమే తన బిడ్డలోనూ ప్రవహిస్తున్న దని ఆమె తెలుసుకొన్నది. ఆమె కన్నుల పొరలు తొలగాయి. చివరికి చిత్రను పంపించదలచు కొన్న ఆశ్రమానికి తానే తరలిపోయింది. శాంతమ్మ కథలో ఈ అంతిమ పరిణామం విశ్వకవి రచించిన 'గోరా'ను జ్ఞప్తికి తెస్తుంది.

ఎటువంటి పురస్సిద్ధాంతాలు లేకుండా ఒక్కసారి ఈ కర్మభూమిని పర్యాలోకిస్తే తరతరాలుగా మన జాతిలో కులమతాల పేరిట జరిగిన, జరుగుతున్న జగన్నాటక మేమిటో అర్థ మవుతుంది. అది శాతవాహనులకాలమైనా ఒకటే; స్వరాజ్యానంతరకాలమైనా ఒకటే. జాత్యహంకారంతో కులమదంతో స్వార్థసాధనకు మనుష్యుల మమతలను బలిపెట్టేవారు నాడూ ఉన్నారు; నేడూ ఉన్నారు.

ఆనాడు ఆంధ్రజాతి, శకజాతి – వీటిభేదం కావచ్చు; నేడు మరో భేదం గావచ్చు. ఇతర జాతులను అసహ్యించుకోవటమే స్వజాతిసంస్కార మయితే ఆ సంస్కారం ఎంత త్వరగా నశిస్తే అంత మేలు. పరిణామశీలమైన మానవసమాజంలో సంప్రదాయదాస్యానికీ పురోగామితత్వానికీ జరిగే సంఘర్షణ అతిప్రాచీనం; అతి నూతనం. ఈ పరస్పర విరుద్ధశక్తుల సంఘర్షణలో అంతిమ విజయం నూతన శక్తులదే. ఈ సాంఘిక పరిణామం గుర్తించలేనివారు వెనక్కి నడిచి నడిచి కాలపు గోతిలో సమాధి అవుతారు. జాతి విద్వేషాల మంటలు ఆరనంతవరకు కుటుంబానికే కాదు, జాతికే మోక్షం లేదు. ఈ సామాజిక సత్యాన్ని జి. వి. కృష్ణరావు గారు ఒక కుటుంబ కథ ద్వారా వివరించారు. ఆ సత్యనిరూపణకు వారు వందల సంవత్సరాలనాటి ఆంధ్రసామాజిక నేపథ్యాన్ని గ్రహించారు. కథలో ఆ సామాజిక వాతావరణాన్ని కల్పించటంలో వారు విఫలంకాలేదు. ఈ నవలలో ఆనాటి బౌద్ధభిక్షువుల సమాజసేవ, సమాజంలోని శకుల దుస్థితి, యవనుల ఆగడాలు మొదలగు చారిత్రికాంశాలు అడుగడుగునా ప్రత్యక్ష మవుతాయి. పాఠకునికి ఆకాలపు సాంఘిక స్వరూపం పట్ల ఒక అవగాహన ఏర్పడుతుంది.

ఈ నవలారచయితకు రచనాశిల్పరహస్యం తెలుసు. స్వీకరించిన ఇతివృత్తాన్ని తీర్చి దిద్దటంలో కృష్ణరావుగారి కైవాడం అడుగడుగునా కనిపిస్తుంది. అవసరమైన చోట ఉత్కంఠను చక్కగా పోషింపగలరు. స్వగ్రామానికి వెళ్లి నాలుగు రోజుల్లో తిరిగి వస్తానన్న గుణవర్ధనుడు ఎన్నాళ్లకూ రాకపోవటానికి కారణమేమో తెలియక చిత్రతో పాటు పాఠకుడూ మథనపడతాడు. చివరికి గుణవర్ధనుని రాకతోనే అతని ఆలస్యానికి కారణం తెలుస్తుంది. విషయాన్ని వివరించటంలో కృష్ణరావుగారు సరళమైన, సూటియైన మార్గాన్ని అవలంబిస్తారు. వారిది నిరాడంబరమైన శైలి అనవసరమైన పాండిత్యప్రకర్షగానీ, నేటి నవలలకు సాధారణలక్షణమైన కృత్రిమసంభాషణలు గానీ వారి శైలిలో కనిపించవు. ఎక్కడా తొణుకూ బెణుకూ లేకుండా సల్లేరుపై బండి నడకలా నిబ్బరంగా సాగిపోతుంది వారి శైలి. అడుగడుగునా తెనుగుదనం ప్రస్ఫుట మవుతుంది. తియతీయని తెలుగుసామెతలు, కండగల తెలుగు పలుకుబడులు ఈ నవలలో కనిపిస్తాయి. మొత్తంమీద చక్కని ఇతివృత్తమూ చక్కనిసందేశమూ కలిగిన నవల "రాగరేఖలు".

# డా॥ జి. వి. కృష్ణరావుగారి నాటికలు పాత్రపోషణ చాతుర్యం

— మంగళగిరి ప్రమీలాదేవి

[కుమారి ప్రమీలాదేవి గుంటూరుజిల్లా రేపల్లెలో జన్మించారు. 1974 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి తెలుగులో ఎమ్. ఎ. పట్టాన్ని ఆర్జించారు. సాహిత్య సంబంధాలైన వ్యాసాలు, గేయాలు, కథలు, కవితలు ఎన్నో చేశారు.

"పద్యగేయ నాటికలు'' అనే విమర్శనాత్మక గ్రంథానికి 1972 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య, అకాడెమీ బహుమతి లభించింది.

"డా॥ జి. వి. కృష్ణరావు నాటికాసాహిత్య సమీక్ష'' మీద వీరు యమ్. ఫిల్. కోసం నాగార్జున విశ్వ విద్యాలయానికి పరిశోధనా వ్యాసాన్ని సమర్పించారు.

వీరు ప్రస్తుతం బందరు హిందూ కళాశాలలో అధ్యాపనం చేస్తున్నారు.]

* * *

ఇది కవితాసమాధి జనియించిన
నూతనభావరేఖ యే
హృదయము లేని పండితుల కిందు
కనంబడబోవు మంజులా

ర్థదములు మేలిఘట్టములు; దారి
తొలంగుడు, పోవనిండు మా
కదే పదివేలు మీ వినిశితాత్మక
దృక్కులకున్ సమస్కృతుల్.

డాక్టరు జి. వి. కృష్ణరావు కవితాసమాధిలో జనియించిన నూతన భావరేఖలలో అత్యంత కాంతివంత మైనవి, ప్రతిభాన్వీత మైనవి వారి నాటికలే. వీరు తెలుగు నాటికా సాహిత్యంలో విశిష్టస్థాన మాక్రమించటానికి వీరి నాటికలలోనే విశేషతను సంతరించుకొన్న వ్యాఖ్యానపద్ధతి, తదనుగుణమైన పాత్రపోషణచాతుర్యాలే కారణం.

ఏకాంకికలు ఆంగ్లసాహిత్య వృక్షపు అంట్లు. ఆంగ్లభాషలోని ఏకాంకికారచన చేత ప్రేరణ పొందటంవల్లనే తెలుగులో ఏకాంకికాసృజన జరిగింది. అందువల్ల ఏకాంకికారచనలో పాశ్చాత్య సాహిత్యలక్షణాలే మనకు అధికంగా ద్యోతక మవుతాయి. అంతమాత్రం చేత ఇవి ఆంగ్లనాటికలకు అనువాదాలు, అనుసరణలు కావు. తెలుగుతనం, భారతీయత వీటిలో లోపించాయని భావించరాదు.

నాటకానికి ప్రధానమైన లక్షణాలను గురించి ప్రాచ్య, పాశ్చాత్య పండితులు విభిన్న మైన తమ అభిప్రాయాలను స్పష్టపరచి ఉన్నారు.

సంస్కృత లాక్షణికుల మతానుసారం ఇతివృత్తం నాట్యశరీరం[1].

పాశ్చాత్య పండితులలో సుప్రసిద్ధుడైన అరిష్టాటిల్ వారి నాటకాలలో ప్రధానమైన ట్రాజడీని ఆరు అంశాలుగా విభజించాడు. 1. ఇతివృత్తం (Plot), 2. పాత్ర (Character), 3. భావం (Thought), 4. భాష (Diction), 5. సంగీతం (Melody), 6. రంగప్రసాధనాదులు (Spectacles)[2]. అరిష్టాటిల్ పండితుడు ఇతివృత్త, పాత్ర పోషణాల విషయంలో తన అభిప్రాయాన్ని పైలా తెలియజేశాడు.

(1) ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికల్పితమ్
పంచభిః సంధిభి స్తస్య విభాగః సంప్రకల్పితః ।

152–6 – 19 శ్లో. నాట్యశాస్త్రం – భరతుడు.

2. Plot and character in a-drama-essay Advanced literary essays. by S. P. Sengupta, S. C. Mundra, S. C. Agarwal. Page No. 83.

"The first principle then and to speak figuratively, the soul of Tragedy, is the plot and second in importance is character. A closely corresponding situation exists in painting. For if some one should paint by applying the most beautiful colours, but with out reference to an over-all-plan he would not please us much as if he had out lined the figure in black and white.[3]

చిత్రలేఖనంలో రంగులకు, సమగ్ర ప్రణాళికకు గల సంబంధం వంటిది రూపక రచనలో పాత్రపోషణకును ఇతివృత్తానికి ఉంటుందని అతని అభిప్రాయం. దీనివల్ల అరిష్టాటిల్ ఇతివృత్తానికి ప్రాధాన్య మిచ్చాడని స్పష్టపడుతున్నది.

"What is the Character but the determintion of inciedent ? what is incident but the illustration of character ?" అంటాడు. The art of fiction తో హెన్రీజేమ్స్ పండితుడు. అంటే హెన్రీజేమ్స్ పండితుల మతానుసారం ఇతివృత్త, శీలాలు రెండూ పరస్పరాశ్రయాలు.

జీవశక్తితో కూడిన ఇతివృత్తమే రూపక మని చెప్పవచ్చు. అట్లాగే శీలంతో కూడిన ఇతివృత్తమే రూపకము. జీవశక్తి లేని రూపకము శవసదృశము. అట్లాగే పాత్ర శీలము లేని ఇతివృత్తము నిర్జీవము, శవప్రాయము, అని తెలుగు రంగస్థలశాస్త్ర రచయితలు అభిప్రాయపడ్డారు.

కాని, గాల్స్‌వర్డీ అభిప్రాయానుసారం పాత్రశీలమే ఇతివృత్తాన్ని నిర్మిస్తుంది. అంటే వీరి మతం ప్రకారం పాత్రశీలమే సంఘర్షణకు దారితీసే కార్యకలాపాలను సృష్టిస్తున్న దన్నమాట. లాజోక్స్ అగ్రీ కూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాడు.

కవి స్రష్ట, సృజనాత్మకమగు నాతని శక్తి యంతయు పాత్ర నిర్మాణమునందే వ్యక్తమగును. ....పాత్రల యందు జీవచైతన్య ముట్టిపడుచున్నచో ఇతివృత్త నిర్మాణము లోపభూయిష్ఠముగ నున్నను, కవి ప్రజ్ఞావిశేషమున కెట్టి కళంకము రాదు. సజీవపాత్ర నిర్మాణ చాతురీధురీణులు కావుననే షేక్స్‌పియర్ మున్నగు మహాకవులు జగత్ప్రసిద్ధులైరి.

---

3. Aristotees Poetics, translation by Leon Golden. P. 13.

కావున సజీవపాత్ర నిర్మాణమున కున్న ప్రాధాన్యము ఇతివృత్త కల్పనకు లేదు." ఇది ఆధునికుల అభిప్రాయం.[4]

నాటక విషయమై చెప్పిన లక్షణాలే నాటికకు కూడా అన్వయిస్తాయి.

డాక్టర్ కృష్ణరావుగారి నాటికలన్నీ పాత్రశీలమే ప్రధానంగా కలవి. అదే నాటికను నడిపిస్తుంది. భిక్షాపాత్ర నాటికకు నాయక, సహాయ నాయకులైన వ్యాస దేవలురు విశిష్టమైన వ్యక్తిత్వం కలవారు. హేతువాదులు. ఆలోచనాశీలురు. గురుకుల ఛాత్రుల ఆకలి తీర్చలేని కాశీనగరంపై కోపిస్తాడు వ్యాసుడు. నిరంకుశ పరిపాలకుడైన విశ్వనాధుని రాజ్యంలో తమ గురుకులం ఉండటానికి యోగ్యం కాదని ఆతని దేశాన్ని బహిష్కరించి గురుకులంతో సహా నిష్క్రమిస్తాడు. దీన్నిబట్టి వీరి నాటికలలో పాత్రశీలమే సంఘర్షణకు దారితీసి ఇతివృత్తాన్ని నడిపించిందని చెప్పవలసి ఉంటుంది.

డాక్టర్ కృష్ణరావుగారు తమ నాటికలోని పాత్రలను మూడు విధాలుగా చిత్రించారు. 1. కార్యం (Action) 2. ప్రత్యక్ష సంభాషణ 3. పరోక్ష సంభాషణలచేత.

కార్యం : పాత్రలు చేయు కార్యాలవల్లనే ఆ పాత్రల శీలం వెల్లడి అవుతుంది. హడ్సన్ పండితుడు.

"Yet action Can notes and implies it"[5] నాటకకార్యం పాత్రాభిప్రాయాన్ని తెలుపడం మాత్రమేకాక ధ్వనింపచేస్తుంది అంటారు.

దమ దమాలబండి, విధినిర్ణయం, ఫ్రెంచి కామెడ్, తమ్మిపడగ, ప్రతిక్రియ మొదలైన నాటికలలో ఈ పద్ధతికిచెందిన పాత్రపోషణ కనబడుతుంది.దమదమాలబండి వీరిహాంమిక నాటికలలో ఉత్తమమైంది. కామేశ్వరరావు అనే సాధారణపార్టీ కార్యకర్త సామాన్య గృహస్తుడైన నిరుద్యోగి వెంకన్న యింట్లో బాడుగకుంటాడు. కామేశ్వరరావుని చూడటానికి వచ్చిన కామ్రేడ్ ప్రవర్ధనని కామేశ్వరరావు వచ్చువరకు కూర్చుండబెట్టి అతిథి మర్యాదచేయ బోయిన గృహస్థు వెంకన్న యిచ్చిన కాఫీ తిరస్కరిస్తాడు. కనీసం సిగిరెట్టు కూడా తీసుకోడు. అలా బిగుసుకు కూర్చున్న కామ్రేడ్‌వర్ధన్ పార్టీకార్యకర్త కామేశ్వరరావు వచ్చి

---

4. సాహిత్య దర్శనము—ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహము—పుట551.

5. An Introduction to the study of Literature P. 190.

తెప్పించి యిస్తే మెచ్చుకుంటూ కాఫీ సిగరెట్లు సేవిస్తాడు. అవిశ్వాసం, ఇతరులను నమ్మక పోవట మనే కామ్రేడ్ ప్రవర్తన గుణాలు ఈ తిరస్కారం వల్లనే ప్రకాశిత మవుతాయి. ఆ కామ్రేడ్ యొక్క సహాయానికి వచ్చిన లక్ష్మిఅనే మిల్లుకార్మికురాలు సుబ్బమ్మను గురించి విస్తృతంగా తెలియచేయడానికి ప్రయత్నించిన వెంకన్నలను మధ్యలోనేఅడ్డగించి "యూ పెటి బూర్జువా స్కౌండ్రల్" అని దూషిస్తాడు. ఈ దూషణవల్ల ప్రవర్తన యొక్క స్వాతిశయం, ఇతరులను గౌరవించలేని మనస్తత్వం వెల్లడి అవుతాయి.

"దానధార"లో బలి తన జగత్త్రియైకరాజ్యాన్ని భక్తి శ్రద్ధలలో వామనునకు దాన మొసంగడం వల్లనే బలివదాన్యత ప్రకటిత మవుతుంది.

మరొక సాంఘిక నాటిక విధినిర్ణయంలో నాయకుడైన నాగేశ్వరరావు జ్యోతి శ్శాస్త్రాన్ని గుడ్డిగా నమ్మడం వల్లనే నాయకుని మరణం తద్వారా అంధవిశ్వాసాలను నమ్మడం వల్ల కలిగే నష్టం వెల్లడి అవుతున్నది.

బౌద్ధపురాణం ఆధారంగా రచించబడిన నాటిక ప్రతిక్రియ. వ్యక్తిత్వపు ఔన్నత్యం, గురుభక్తి, తోటి మానవుల యెడ మైత్రీభావం అనే సుగుణసంపదకలవాడు దీనికి నాయకుడైన విశ్వాంతరుడు. దీని పేరు వినగానే దీనిలో క్రియ (Action), ప్రతిక్రియలు ప్రాధాన్యం వహిస్తాయని స్ఫురిస్తుంది. ఇది సరి ఐనదే. విశ్వాంతరుడు పూర్వాశ్రమంలో రాహులుడు. అతను కోటీశ్వరుడైన యజమాని హేమచంద్రుని చేత కొట్టబడతాడు. ఇది ఈ నాటికకు బీజ మవుతుంది. ఇది ఆధారంగా ఇతివృత్తం నడుస్తుంది. హేమచంద్రుని ఔద్ధత్యం మనకు వెల్లడి అవుతుంది. ఆ పాదుకలను విశ్వాంతరుడు నిరంతరం అంటిపెట్టుకొనటం గురువైన జయదేవుని అనుమానానికి ఆస్కార మవుతుంది. రాహులుడు పెరిగి పెద్దవాడై విద్యా సంస్కృతుల నార్జించి విశ్వాంతరుడై, హేమచంద్రుని కోర్కెకు అనుగుణంగా విహారాన్ని నిర్మించిపెట్టడం, తాను దెబ్బలు తిన్న పాదుకలనే తిరిగి హేమచంద్రుని పాదాలకు తొడిగి, అతని మానసికపరిణతికి కారణం కావడం—వీటివల్ల విశ్వాంతుడి మానసిక ఔన్నత్యం ప్రకటిత మవుతుంది. సుధన్వుని బాణప్రయోగం నాయకుడైన విశ్వాంతరుని మరణానికి కారణ మవుతుంది. ఈ క్రియ వల్లనే సుధన్వుని ఔన్నత్యం ప్రకటితమవుతుంది.

"ఫ్రెంచికామెడీ"లో మధుకుమార్ నటనచేతనే సినిమా డైరెక్టర్ వెంకటేశరన్ మోస గిస్తాడు. దానికి ప్రతిగా వెంకటేశ్వరన్ స్నేహితుడు రాఘవరావు అతణ్ణి గుర్తించి పట్టు

కొన్నవిధం వారి వారి స్వభావాలు ఈచర్య (Action)వల్లనే ప్రకాశిత మవుతాయి. "ఆదర్శ శిఖరాలు"లోని ప్రధానపాత్రధారులైన జక్కన్న, కేదార కుమారుల పాత్రచిత్రణకూడా వారి వాదనైపుణ్యం, కార్యశీలతలు ఆధారంగా జరిగిందే.

"తమ్మిపడగ"లో శ్రీనాధుని ప్రభుభక్తి తమ్మిపడగను లింగమనేని దగ్గరనుండి సంపాదించి వేమారెడ్డికి బహుకరించటం వల్లనే వెల్లడి అవుతుంది.

సంవాదంద్వారా లేక సంభాషణద్వారా పాత్రల స్వరూప, స్వభావాలను వెల్లడించడం పాత్రచిత్రణా పద్ధతులలో రెండవది. అతిప్రధానమైనది కూడా ఇదే. నాటికకు సంవాదం చాలా ముఖ్యం కనుక తద్వారా పాత్రచిత్రణ చేసే ఈ పద్ధతి కూడా ముఖ్యమైనదే. దీనిని తిరిగి రెండు విధాలుగా చెప్పవచ్చు. 1. ప్రత్యక్ష పద్ధతి 2. పరోక్ష పద్ధతి.

డాక్టర్ కృష్ణారావుగారు ఈ రెండు పద్ధతులను స్వీకరించి పాత్రల రూపగుణవిశేషాలను ప్రేక్షకులకు, పాఠకులకు అందించడంలో సఫలులైనారు.

*పరోక్షపద్ధతి*

రెండు పాత్రల మధ్య జరిగిన సంభాషణద్వారా మూడవ వ్యక్తియొక్క రూపగుణ సౌశీల్యాలు, కార్యకలాపాలు చిత్రీకరించటం ఈ పద్ధతికి చెందుతుంది.

'భిక్షాపాత్ర' కృష్ణరావుగారి నాటిక లన్నింటిలో ప్రథమం[6], ప్రసిద్ధమూ మాత్రమే కాక విశిష్టమైనది కూడా. దీనిలో వ్యాసుని వ్యక్తిత్వం అతనికి శిష్యులకు భిక్ష లభించని సమయంలో దేవలుడు "లేదు. వేదవిభాగం చేసిన మేధావికి భిక్షలేదు. మానవాదర్శం నిరూపించి చెప్పిన తత్త్వవేత్తకు భిక్ష కూడదు........" భృగువు, నందీశ్వరుడు, జైమినుల సమక్షంలోని ఈ సంభాషణవల్ల మహాకవిగా ఆయన ప్రతిభ వెల్లడి అవుతుంది.

యాదవ ప్రళయంలో శతధన్వుడు కృతవర్మతో సంభాషిస్తూ "బలవంతులైన నారాయణ గోపాలుర నందరినీ రేపెన్నడైనా తిరగబడతారన్న కోపంతో కౌరవ పక్షాన చేర్చించి ఈ మాయలమారి కృష్ణుడు ఊచకోత కోయించా డని కృష్ణుని మాయలమారి

---

(6) దీనికిముందు సుసీధను రచించినా అది ఆస్కార్‌వైల్డు సలోమికి అనుకరణ కనుక స్వతంత్ర నాటికలలో నిదే మొదటిది.

తనాన్ని తేటతెల్లం చేస్తాడు. అదే సందర్భంలో కృతవర్మ, శతధన్యుల సంభాషణవల్ల కృష్ణుని దూరదృష్టి, కార్యచతురత ప్రకాశిత మవుతుంది. 'దానధార' లోని ప్రథమ దృశ్యం లోని భార్గవాచార్య, విప్రచిత్తుల సంభాషణవల్ల బలిచక్రవర్తి పరిపాలనా సామర్థ్యం ప్రకటిత మవుతుంది.

దీనిలోనే వామనుడు : తార్క్ష్యునితో బలి ఉండగా ప్రమాదం లేదు. అతడు తన ప్రతిజ్ఞకు దాసుడు, రక్షోలోకం కూడా ప్రతిజ్ఞా బద్ధం. ఇంతేకాక ఇదే సందర్భంలోని "ఇతడే దానవచక్రవర్తి.......... నా నా వ్రతదానప్రవణానువర్తి" సుమనోద్ధత చంద్రాతపకీర్తి సత్యకరుణాధర్మమండు" అని పలికిన పలుకులతో బలిచక్రవర్తి యొక్క సత్య వ్రత దీక్ష, ప్రతిజ్ఞాపాలన, సత్యకరుణా ధర్మజ్ఞత వంటి గుణాలు చిత్రించబడ్డాయి. "తమ్మపడిగ' లో వేమభూపాలుని దీర్ఘస్వగతం ద్వారా ఆయన మానసిక సంఘర్షము ప్రకటిత మవుతుంది. ఆయన చెన్నమరాజుల సంభాషణ శ్రీనాథుని పాండిత్య, వ్యక్తిత్వా లను చక్కగా చిత్రిస్తున్నది.

'ప్రతిక్రియ' నాటికలో విశ్వంతరుని సంచిలో పాదుకలు కనిపించా యని మైత్రేబలుని ద్వారా తెలుసుకొన్న తరువాత జయదేవుడు పలికిన పలుకుల వల్ల విశ్వంతరుని పూర్వా శ్రమపు రూపురేఖలు, ప్రస్తుత విద్యా, రూప, గుణసౌశీల్యాలు ప్రకాశవంత మవుతాయి.

'డమడమాల బండి' లో కామేశ్వరరావ్, వెంకన్నతో చేసిన సంభాషణ కామ్రేడ్ ప్రవర్ధని రాజకీయ జీవితఘనతను చాటుతుంది.

ప్రత్యక్ష పద్ధతి : ఇరువురు వ్యక్తులు పరస్పరం సంభాషణ వల్ల మొదటి వ్యక్తి మాటలవల్ల రెండవ వ్యక్తి శీలంగాని, సంభాషణ చేసే వ్యక్తి మాటలవల్ల ఆ పాత్ర వ్యక్తిత్వ శీలాలు కాని వ్యక్తం కావడం ప్రత్యక్ష పద్ధతి.

భిక్షాపాత్రలో అన్నపూర్ణ వ్యాసుల మధ్యన జరిగిన సంభాషణవల్ల వ్యాసుని ఋషి త్వం, విద్యాదాతృత్వం, లోక సేవాపరాయణత్వాలు వెల్లడి కావడం ఇట్టిదే.

దానధారలో భార్గవాచార్యులు, బలిచక్రవర్తుల సంభాషణలద్వారా బలియొక్క లోకో త్తర వ్యక్తిత్వం వెల్లడి అవుతుంది.

"సునీధ' లో ప్రతీహారి నందకుమారుణ్ణి గూర్చి పలికిన పలుకులద్వారా ఆతని స్నేహశీలం, బుద్ధఘోషుని ఖండిత శిరస్సును చూచి చెప్పిన సునీధ స్వగతం ద్వారా బుద్ధ ఘోషుని సౌందర్యశీలాలు, ఆతని యెడ సునీధకు గల కాంక్షలు చిత్రించ బడ్డాయి.

పరస్పర సంభాషణలో సంభాషించే పాత్రద్వారా ఆ పాత్ర వ్యక్తిత్వమే చిత్రించ బడడం యాదవ ప్రళయంలో బలరాముని వాక్యాలలో అధర్మం జరుగుతున్నా చూస్తూ ఊరు కొనే ఆతని బలహీనతను చిత్రించ బడింది.

ప్రతిక్రియలో హేమచంద్రుడు విశ్వంతర మైత్రీ బలురతో చేసిన సంభాషణ వల్ల బౌద్ధధర్మ స్వీకారానికి పూర్వపు హేమచంద్రుని చపలత్వ దుర్బలతలు ప్రకటిత. మవుతాయి.

నాయకులు : కృష్ణరావుగారి 14 నాటికలలో ఫ్రెంచి "కామెడే', "తమ్మిపడగ"లు తప్ప తక్కినవి. 1. యాదవ ప్రళయం 2. భిక్షాపాత్ర 3. దానధార 3. ధమ్మిల్లం 4. ప్రతిక్రియ 6. సునీధ 7. విధి నిర్ణయం 7. స్వర్గమా, నరకమా 9. ఆదర్శ శిఖరాలు 10. డమ డమాల బండి 11. పాడు సంఘం 12. దోపిడీలు విషాదాంతాలే. తమ్మిపడగ చివరివరకు విషాదాంశాలతో నిండియుండి చివరకు మోదాంతంగా మారుతుంది.

కవులు, కళాకారులు వీరి నాటికలలో ప్రధాన భూమికలలో చిత్రించబడ్డారు. వీరంతా ఉత్తమ ప్రకృతి గలవారు, శీలసంపన్నులు. భిక్షాపాత్ర నాయకుడు వేదవ్యాసుడు మహా కవి, మహాఋషి, అష్టాదశపురాణులకు కర్త, గురుకుల వాసులకు విద్యాదానం చేసే ఉత్తమ దేశికుడు. ధమ్మిల్లం నాయకుడైన నత్కీరుడు సంగ పీఠాధ్యక్షుడు, కవి, శిష్యవాత్సల్యం గల ఉత్తమ దేశికుడు.

'తమ్మిపడగ' నాయకుడు శ్రీనాథుడు సుప్రసిద్ధకవి. కొండవీటి రెడ్డిరాజుల ఆస్థాన కవి. విద్యాధికారి. ప్రతిక్రియ, ఆదర్శ శిఖరాలు నాయకులైన విశ్వంతర జక్కనలు శిల్పకళా కోవిదులు "సునీథ". నాయిక "సునీథ" క్రూరమైన ప్రకృతి గలదైనా నృత్య కళాకారిణి.

"పాడుసంఘం" లో పెట్టుబడిదారీ మనస్తత్వము కల పురుషోత్తం కుమారుడు మహేశం అభ్యుదయ కవి. దోపిడీ నాటికలోని నాయకుడు కవి, గాయకుడు. 'ఫ్రెంచి కామెడీ" లో మధుకుమార్, ఆర్థిక పరిస్థితుల వల్ల మోసగాడుగా మారినా కవి, నటుడు.

డాక్టరు కృష్ణరావుగారి 14 నాటికలలో భిక్షాపాత్ర, దానధార, ధమ్మిల్లం, విధి నిర్ణయం, సునీథ, డమడమాల బండి — లలో స్త్రీపాత్రలు ప్రత్యక్షంగా రంగం మీదకు వస్తాయి. స్త్రీపాత్రలు రంగం మీదకు రాకపోయినా తత్ప్రసక్తి ప్రశస్తి గల నాటికలు. 'ఆదర్శశిఖరాలు' 'పాడుసంఘం' 'స్వర్గమా, నరకమా' 'దోపిడీ'నాటికలలోకూడా స్త్రీపాత్రలు రంగంమీదకు రాకపోయినా స్త్రీ సమస్యల చర్చలు, గుణవర్ణనలు కల నాటికలు.

వీరు చిత్రించిన స్త్రీపాత్రలను రెండు వర్గాలుగా విభజించవచ్చు. 1. దేవతాపాత్రలు 2. మానవీయాలు. 'భిక్షాపాత్ర' లోని అన్నపూర్ణ, 'దానధార' లోని వింధ్యావళి, యాదవ ప్రళయంలోని సత్యభామ దేవతా పాత్రలు. డమడమాల బండిలోని రాధ, ధమ్మిల్లంలోని బాలసరస్వతి, విధినిర్ణయంలోని జానకి మానవీయాలు.

మానవేతర పాత్రలైనా అన్నపూర్ణ, వింధ్యావళులు సాధారణ గృహిణులే. అన్నపూర్ణ ఆశ్రిత వాత్సల్యము. పతిభక్తి కలది. కరుణామయి. వింధ్యావళి పతిభక్తి కలది. కలలోనైనా భర్త పదవీచ్యుతిని ఊహించలేని బేల. దాన మీయడం వల్ల నష్టం కలుగగలదని ఆచార్యుడైన భార్గవుని వల్ల, తాను కాంచిన స్వప్నం వల్ల తెలుసుకొన్నప్పటికీ పతి ప్రక్కన కూర్చుండి వామనునకు త్రిపదదానాన్ని ధారాదత్తం చేసిన పతిభక్తి పరాయణురాలైన స్త్రీ రత్నం. దానధార నాటికలోని రెండవ మూడవ దృశ్యాలలో ఈ వింధ్యావళి యొక్క ఉత్తమ ప్రకృతులను గమనించవచ్చు.

వీరనారిగా పేరుగన్న సత్యభామ కూడా యాదవప్రళయంలో బేలగానే చిత్రించ బడింది. పతికి అపాయం కలుగుతుందేమో నని పతి వెంటనే తానుండి, సాత్యకిని సహాయ పడమని కోరుతుందీమె. పరిస్థితుల నర్థం చేసుకొన్న ధీమంతురాలు. వీరి సత్యభామ.

ధర్మాధర్మ వివేచనం, వాదనా పటిమ, ధైర్యస్థైర్యాలు కలిగిన స్త్రీపాత్ర 'ధమ్మిల్లం' లోని బాలసరస్వతి. ఈ పాత్ర డాక్టర్ కృష్ణరావుగారి సృష్టి. మూలంలో లేని ఈ పాత్రకు నామ, గుణ సౌశీల్యాలను రచయిత దీనితో ప్రత్యేకంగా దిద్ది తీర్చారు.

'సునీథ' లోని 'సునీథ' మూలానుసారమైన పాత్రే. మూలానుసారంగానే ఆమె నాట్యకళా ప్రావీణ్యం, కాముకతలు చిత్రించబడ్డాయి. వీరి మానవీయ పాత్రలు కూడా దోషాలు లేనట్టివి. భర్త్రధీనలు, సహధర్మచారిణులు, వీరి సాంఘిక నాటికలలో కూడా దర్శన మిస్తారు. డమడమాల బండిలోని రాధను, దీనికుదాహరణగా పేర్కొనవచ్చు.

పాడుసంఘంలోని కార్మికనాయకుడైన సత్యనారాయణ భార్య పెద్ద పెట్టుబడిదారు కూతురైనా, భర్తమాట జవదాటక, భోజనానికికూడ ఇబ్బంది పడుతూ, చివరకు పసిపిల్లవాడి పాలసీసాకు గతి లేకపోయినా బయటకు పొక్కక, తండ్రి సహాయాన్ని కూడా త్రోసిపుచ్చిన భర్త్రధీన.

కళాహృదయం, కౌశలాలతో పాటు ప్రేమ, దానికోసం కళాభిమానాన్ని కూడా వదులుకోగల నిశ్చలత, పవిత్రమైన ప్రేమ హృదయం కలది "ఆదర్శ శిఖరాలు" లోని శిల్పశ్రీ.

అప్రధాన పాత్రల ప్రాధాన్యం : డాక్టర్ కృష్ణరావు గారి నాటికలలోని కొన్ని అప్రధాన పాత్రలుకూడా ప్రాధాన్యం కలవే. ఇవి అప్రధాన పాత్రలైనా నాటికకు తగు వాతావరణం చేకూర్చడంలోను రచయిత చెప్పదలచిన విషయాన్ని స్పష్టీకరించడానికి కొన్ని చోట్ల కథాగమనం మలుపు తిరగటానికి ఇవి ఉపయోగపడతాయి.

"తమ్మిపడగ" లో గాయకులు అప్రధాన పాత్రలే. చాలా కొద్దిక్షణాలు రంగంమీద కనుపిస్తారు. యువరాజు రాచవేముని పనుపున సింగనామాత్యుని మీద "తనకృపాణ సముద్ధత....ఇత్యాదిగా గల పద్యాల్ని చదువుతారు. వేమభూపాలుడు క్రుద్ధు డవుతాడు. ఇది ఎవరివల్ల జరిగిందో, దానికి కారణం, ఆతని మనస్తత్వం, మంత్రి సింగన అభిప్రాయం తెలుసుకొన్ని చర్చ చేయడానికి ఇది అవకాశం కల్పిస్తుంది. ఈ పద్యగానం ఈ ఏకాంకికలో వేమారెడ్డి మనస్సులో సంఘర్షణ యేర్పడటానికి కారణ మవుతుంది.

పాడుసంఘంలో ప్రసాద్, నౌకరు వెంకన్న పాత్రలు నాటికాంతం వరకు ఉంటాయి. ప్రసాద్ వెంకన్నతోను, వెంకన్న సత్యనారాయణతోను జరిపిన సంభాషణల వల్ల సత్యనారాయణకు, పురుషోత్తానికి మధ్య ఉన్న భేధాభిప్రాయాలు తెలుస్తాయి. ఈ సంఘర్షణ అత్యంత సున్నితంగా రూపొందటానికి కూడా పాత్రలు రెండూ కారణమవుతాయి.

కమ్యూనిజాన్ని ప్రసాద్‌తో సంభాషణలో ఒక చిన్న ఉదాహరణద్వారా

పురుషోత్తం : ఇటు చూడు బాబూ, ఈ చొక్కా నీదేనా!

ప్రసాద్ : నాది కాక మరెవరిది తాతయ్యా ?

పురుషోత్తం : కాదు. సంఘందట ! అని వివరిస్తారు.

దమడమాల బండిలో జయప్రసాద్‌లు ఆ నాటికా ఇతివృత్తానికి తగిన పూర్వవాతా వరణం సృష్టించడానికి, నాటకీయతకు అవసర మవుతారు.

పాత్ర విపర్యయము : ''రెండు పరస్పర విరుద్ధ శక్తులమధ్య సంఘర్షణ జరుగుతూ ఉంటుంది. కాబట్టి ఆ శక్తులకు ప్రతీక లయిన పాత్రలు కూడ పరస్పర విరుద్ధాలు గానే ఉంటాయి" అని పాత్ర విపర్యయానికి రంగస్థలశాస్త్ర నిర్వచనం.

ఈ పాత్ర విపర్యయాన్ని కృష్ణరావుగారి ''భిక్షాపాత్ర", "దమడమాల బండి", ''విధినిర్ణయం", ''పాడుసంఘం" నాటికలలో కనిపిస్తుంది.

"భిక్షాపాత్ర'' లో నాస్తిక దృక్పథం కల దేవలునకు విపర్యయంగా ఆర్యసంప్రదాయాల మీద అధిక గౌరవం కల నందీశ్వరుడు, దమడమాల బండిలో వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తిత్వ గౌరవాల పై గౌరవం గల వెంకన్నకు, ప్రతిగా తద్విరుద్ధ ప్రకృతి గల కామ్రేడ్ ప్రవర్ధన్‌ను, విధినిర్ణయంలో జ్యోతిశ్శాస్త్రాన్ని గుడ్డిగానమ్మే నాగేశ్వరరావుకు ప్రతిగా జ్యోతిశ్శాస్త్రం పచ్చి అబద్ధ మనీ, భవిష్యత్తులో ఏమి జరుగుతుందో. మానవుడి ఆత్మశక్తి ఎంత ఉందో ఎవడూ చెప్పలేడని విశ్వసించే రామారావును, "పాడుసంఘం" లో పెట్టుబడిదారీ మనస్తత్వం గల పురుషోత్తానికి ప్రతిగా కమ్యూనిష్టు భావాలు కల సత్యనారాయణల సృష్టి పాత్ర విపర్యాయానికి ఉదాహరణలు.

నాటికకున్న చిన్న పరిధిలో చతురతతో పాత్రనిర్మాణాన్ని చేసి వ్యాసుడు, నదీశ్వరుడు, బలి వంటి పాత్రలను ఉత్తమ ప్రకృతులుగా, మానవతావాద దృక్పథంలో దిద్ది తీర్చిన డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు అభినందనీయులు.

# జి. వి. కె. తో ముఖాముఖి

[ఈ 'ముఖాముఖి'లో హితశ్రీ, శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ అన్నపరెడ్డి వేంకటేశ్వరరెడ్డి పాల్గొన్నారు. జి. వి. కె. తో వీరి ముగ్గురికి పావు శతాబ్దంపాటు అత్యంత సన్నిహితసంబంధం ఉంది. ఇంకా నాలుగు రోజులలో శ్రీ అరవిందసాహిత్యసేవాసమితి, తెనాలి. శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణగారి ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన సన్మానసభ జరుపనున్న సమయంలో, 26 మార్చి, 1979న ఈ గోష్ఠి నిర్వహణం జరిగింది.

ఈ గోష్ఠికి అక్షరరూపకల్పన చేసింది జి. వి. కె. మూర్తి మత్స్వా చిత్రణం గావించింది శ్రీ రెడ్డి.

ఇది జి. వి. కె. చివరి వాగ్రూప రచన] —సంపాదకుడు

* * * * *

ఆ రోజు ఉదయం కాఫీ త్రాగిన తరవాత ఏమీ తోచడం లేదు. బట్టలు వేసుకొని సైకిలు ఎక్కాను ఎక్కడకు వెళ్ళాలో నిర్ణయించుకోకుండానే. నిర్ణయం మనం తీసుకోకపోతే ఆ పని అలవాటు చేస్తుంది. అనేక సమస్యలను అలవాట్లు పరిష్కరిస్తాయి. ఆరోజూ అదే జరిగింది. నిష్క్రియాత్మకంగా, నిరుద్దేశపూర్వకంగా కూర్చున్న నన్ను సైకిలు అలవాటు చొప్పున జి. వి. కె. గారింటి ముఖం పట్టించింది. జీవితకాలం ఎన్ని క్షణాలు! అన్ని క్షణాలలో ప్రతిక్షణమూ నేను జీవిస్తున్నానా? ఆ మాటకొస్తే ఎవరైన ప్రతిక్షణమూ జీవిస్తారా? నామాత్రానికి నేను ప్రతిక్షణమూ ఉంటున్నానే గాని జీవించడం లేదు. అలా జీవించని కొన్ని క్షణాలు గడిచేసరికి జి. వి. కె. గారి వాకిలి ముంగిట వాలాను.

ఆయన ఎక్కడో దూరాకాశంలోకి అవలోకిస్తూ తూర్పుముఖంగా మునిగాళ్ళ వేసుకొని సోఫాలో కూర్చొని ఉన్నారు. నాకు సందేహం కలిగింది. ఈయనైనా జీవితంలో ప్రతిక్షణమూ జీవిస్తున్నాడా అని? శుష్కించి, ఎముకలగూడై ఆ దేహం నిష్క్రియాత్మకతను ప్రదర్శిస్తున్నా, ఆయన ఏకాగ్రత, కేంద్రీకృత అవధానం, సమాధ్యవస్థ దానిని కాదంటున్నాయి. సమాధ్యవస్థ ఎంత క్రియాత్మకం! బహుశ ఆయనైనా నాకంటె ఎక్కువ క్షణాలు జీవిస్తున్నాడేమో! ప్రతిక్షణం కాకపోయినా, కనీసం మరిన్ని క్షణాలు జీవించే ఆ జీవి దేనిని గురించి ఆలోచిస్తున్నాడు?

చివరి అంకెను తిప్పిన తరవాత మొదటి నాలుగు అంకెలను గుర్తుపెట్టుకొని, వేటితో కలిపి మొత్తం అయిదు అంకెల సంఖ్యను ప్రయోగించే టెలిఫోన్ డయలింగ్ వ్యవస్థకు స్ఫోట సిద్ధాంతంలోని 'అకాంక్ష'కు మధ్య ఉన్న సంబంధాన్ని గురించా? అప్పటి ఆచార్యనాగార్జునుడు ఇరవయ్యోశతాబ్ది ఐన్‌స్టైన్ సిద్ధాంతిని ముందుగా ఊహించాడా లేదా అనా? కవితాశిల్పానికి ఫ్రాయిడ్ స్వప్నశిల్పానికి మధ్య సారూప్యతల గురించా? "అపోహ"వాదం ధ్వనిసిద్ధాంతాన్ని పరామర్శించే తీరు గురించా? మరి దేనిని గురించి?

ఆలిండియారేడియో, విజవాడ నుంచి పదవీవిరమణ చేసిన తరవాత, ఈ పదవీవిరమణకు ఆనుషంగిక అంత్యానికి మధ్యఉన్న వానప్రస్థంలో ఈయన జీవిస్తున్నాడా? యువతను ఆదరించే ఈ ప్రపంచకంలో, ప్రయోజకత్వానికి పట్టంకట్టే ఈ ప్రపంచంలో, విజయాన్ని కొలబద్దగ పరిగణించే ఈ ప్రపంచంలో, పదవీవిరమణ తరవాత ఆనుషంగిక అంత్యంకోసం ఎదురుచూచే అందరిలాగే జీవిస్తున్నాడా?

కాదు, తన మేధాసంపత్తితో ప్రతిక్షణమూ జీవిస్తున్నానని, జీవితం అమూల్యమైనదని, నిరాశానిస్పృహలకు తావు లేదని, ఆనుషంగిక అంత్యం సమీపించేవరకు సృజనాత్మకంగా క్రియాత్మకంగా, ప్రభావోత్పాదకంగా జీవించ వచ్చని ఋజువు చేస్తున్నా రని అనిపించింది అయన ఏకాగ్రత చూస్తుంటే.

నవల, నాటిక, కావ్యం, దర్శనం, కథ, కథానికలలో దేనిలో అయినా గంభీరవిషయాన్ని లోతుగ తేలికగా చెప్పి, దర్శనాలలోగూడ మధ్య మధ్య వక్రోక్తి హాస్యాలను జోడించి, రసెల్ అనిపించుకున్న కావ్యానుశీలనుడా ఇతడు?

గ్రామీణ మధ్యతరగతి జీవితాన్ని విశ్వసించి, "కీలుబొమ్మలు"లో "పాపికొండలు"లో "ఉదబిందువులు"లో మధ్యతరగతి నీతి (Middle class Morality)ని రాడికల్ హ్యూమనిస్టు మానకలశంతో గ్రహించిన మానుషార్థప్రతిపాదకులా ఈయన ?

సమాజంలో ఆహారం అందరికీ సమంగా అందనంత కాలం, వ్యాసుడైనా ఈశుడైనా "భిక్షాపాత్ర"ను బద్దలుకొట్టి కమ్యూనిస్టు అవుతాడని తమ వ్యాసనిష్కాసనంలో చెప్పింది వీరేనా ?

నాగార్జునపర్వతాన్ని ఏకకేల కీలించి, మానకలశుని దర్శనం 'విగ్రహవ్యావర్తని'ని, తెలుగులో, తెలుగుగడ్డ కందించి, అందులో సత్కార్యవాదులకు 'అన్నమలముల భేదా'లని విప్పిచెప్పిన పరమదార్శనికుడా ?

అటు ప్లేటో, అరిస్టాటిల్, కాంట్, హ్యూమ్, హెగెల్‌ల దర్శనాలను, ప్రాచీన భారత దర్శనాలనే గాక, ఇటు ప్రాచ్యపాశ్చాత్య కావ్యాలను కావ్యానుశాసనాలను ఆవపోసనపట్టి, కావ్య మీమాంస రససిద్ధాంతాలను నిగ్గుతేల్చి, మమ్మటుడు పొరుగింటివాడన్నట్లు భాసిల్లి, శ్రీ తాపీ ధర్మారావు 'హృదయోల్లాసం'పై, డా॥ పాటిబండ్ల మాధవరాయ శర్మ "మహాభారతంలో ఛందోశిల్పం"పై సమగ్రంగా, సాధికారంగా బృహత్సమీక్షల (ఈ రెండు సమీక్షలు కృష్ణ రావుగారి 'నవతోరణం'లో ప్రచురిత మయ్యాయి. వీటిని రెండు డాక్టరేట్ పట్టానికి సరిపోయే వ్యాసా లనవచ్చు. తాపీవారు జి. వి. కె. విమర్శకు కైమోడ్పులర్పించారు) ను చేసిన కవితాతత్త్వజ్ఞులా ఈయన ?

ఆయనను గురించి నాలో ఆలోచనలు ఇలా పరుగులు తీస్తున్న సమయంలో యాదృ చ్ఛికంగా హితశ్రీ, జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి అక్కడకు రావడం జరిగింది. వారి పాదధ్వనితో ఆయన ఈ లోకంలోకి వచ్చారు. అప్పటివరకు నేను అలాగే నిలబడిఉన్నాను. వారు నా రాకను గమనించనూ లేదు, నా ఉనికిని గుర్తించనూ లేదు. "ఏమిటి విశేషం? ముగ్గురు ఒకే మాట కూడబలుక్కొని వచ్చారు" అన్నా రాయన.

"యాదృచ్ఛికం. మేము ముగ్గురం కలిసి రాలేదు" అని చెప్పాము. అప్పుడు కూర్చోమని మాకు ఆయన ఆసనాలు చూపించారు. పిచ్చాపాటీ కబుర్లు ఆరంభ మయ్యాయి. మధ్యలో "మన ఈ యాదృచ్ఛిక సమావేశాన్ని ఎందుకు సాహిత్యగోష్ఠిగా మార్చగూడదు ?" అని నేను ప్రతిపాదించాను. అందరూ తలలూపారు. మీ రాక యాదృచ్ఛికమైనా, మీ

ప్రతిపాదన పూర్వనిర్ణీతమే నన్నమాట; అయితే కానివ్వండి అన్నారు జి. వి. కె. "ఏమండీ! కృష్ణరావుగారూ ! మీ ఉద్దేశంలో అసలు రచయిత ఎందుకు వ్రాస్తాడు? వ్రాయడానికి అతనిని ప్రేరేపించేది ఏది ? శ్రీ శాస్త్రి గోష్ఠి ప్రారంభించారు. "సార్వత్రికంగా అందరిని ఏ ఒకటీ ప్రేరేపిస్తుందని చెప్పలేము. ఒకటి ఒకరిని ప్రేరేపిస్తే, మరొకరిని మరొకటి ప్రేరేపిస్తుంది. మొత్తంమీద ఎవరికైన 'అనుభవం' ముఖ్యం. అనన్యమైన ఒక అనుభవాన్ని రచయిత పొందినప్పుడు అది రచయితను వ్రాయసంకల్పింప జేస్తుంది. కాని రచయితైన వాడు ఈ అనుభవాన్ని యథాతథంగా చిత్రించడు. అవ్యక్తస్వప్న విషయం (Latend dream content) నుంచి వ్యక్తస్వప్నం (Manifest dream) ఎలా రూపొందుతుందో అదే 'వైచిత్రి'తో రచయిత అనుభవం నుంచి రచన ఉత్పత్తిల్లుతుంది.

"ఆత్మాభివ్యక్తీకరణ లాలస రచనకు దోహదం అవుతుంది. రచయిత తన వైయక్తిక పరిమితులను అధిగమించి అనుభవాన్ని సాధారణీకరణం చేస్తాడు. ఆత్మాభివ్యక్తీకరణేచ్ఛ ఎందుకు కలుగుతుంది? అది ఉద్బోధకము. పరిచ్ఛిన్నమైన, వ్యక్తిగతమైన జీవితాన్ని దాటి అపరిచ్ఛిన్నమైన సార్వజనీనతను చేరవలెననే తపన రచనకు మూలహేతువు. ఆత్మ సాత్కృతి గావించుకోవలె ననే దాహం రచనకు కారణం."

'అయితే మీ రచనకు ప్రధానప్రేరకశక్తి ఏదో చెప్పుతారా?' అడిగారు శాస్త్రిగారు.

'నాకు ప్రేరకమైనవి కొన్ని ఉన్నాయి. సమాజం సమస్యాగ్రస్తం. దానిని పరిష్కరించాలని ప్రతివాడు ఆలోచిస్తాడు. అయితే ఈ ఆలోచించేవారిలో ఎక్కువమంది, పరుల ఆలోచనావిధానాలను, వారి ఊతపదాలను పదే పదే ఆలకించడంవల్ల, గానుగెద్దు గాడిలో పడి, అవి తమ స్వంతాలే అని భ్రాంతిలో పడతారు. ఈ గానుగెద్దు ఒరవడి (Cliche) నుంచి, భ్రాంతినుంచి అటువంటివారిని మేల్కొలపాలని నా ఆవేదన. ఈ భావనే నా రచనకు ప్రేరకం.'

'సాహిత్యానికి ధర్మానికి తేడా ఏమిటంటారు?' హితశ్రీగారు ప్రశ్నించి, కుతూహలాన్ని మాలో రేకెత్తించారు. అంతే! జి. వి. కే. ఏదో ఊహాలోకాన్నుంచి అన్నారు –

'లోకంకోసం ఏడిస్తే అది కవిత్వం, తనకోసం ఏడిస్తే అది స్వార్థం, తనకోసం లోకంకోసం ఏడిస్తే అది ధర్మం, రెండింటికోసం ఏడ్చినట్లు నటిస్తే అది రాజకీయం'.

"కళ కళ కోసమే అంటారుగదా, దానిపై మీ అభిప్రాయం?" అడిగాను నేను చర్చను మలుపుతిప్పుతూ.

"ఈ సిద్ధాంతాన్ని తాత్త్వికంగా మొట్టమొదట ప్రతిపాదించినవాడు క్రోచె. 'జీవితం వేరు, కళ వేరు' అని భావించిన కొందరు క్రోచె సిద్ధాంతాన్ని అపార్థం చేసుకొని విపరీత వ్యాఖ్యానాలు చేశారు. నాకు జీవితం, కళ వేరు వేరు కావు. అవి రెండూ ఒకటే. జీవిత ప్రవాహానికి (సంసారానికి) ఆద్యంతాలు లేవు. అది సాపేక్షం. అనంతసంసారాన్ని అర్థం చేసుకోవడానికి 'మరొకటి' కావాలి గదా. పైగా అది వైయక్తికమూ కాదు. ఆద్యంత సహితమై, నిరపేక్షమై, స్వప్రకాశమై తృప్తి నిచ్చే 'జీవితశకల'మే కళ.

"సాహిత్యం సమాజానికి దర్పణం కావాలంటారా?"

"సాహిత్యం సమాజానికి ప్రతిబింబమూ కాదు, అనుకరణమూ కాదు. అది ఇంద్ర జాలమూ కాదు. 'ఇలా ఉంటుంది, ఇలా ఉండదు', అని చెప్పడానికి వీలు లేనిది.'

"సాహిత్యం సమాజాన్ని మలుస్తుందటారా?" శ్రీ శాస్త్రి అడ్డుకొన్నారు.

"జీవితపు విలువలను నిర్దేశించి వెలుగు నిచ్చేది కళ. దీని పరమార్థం నిరవధిక మధురానుభూతి— పరిమితులు లేని సర్లిప్తసుఖం— ఆనందం."

"వర్తమాన సాహిత్యం పోకడలను గురించి మీ అభిప్రాయం?"

"This won't do" అని పెదవి విరిచారు.

"సాహిత్యవికాసంలో పత్రికల పాత్రను గురించి చెప్తారా?"

"సర్వానికి మూలం పత్రికలే. మరి సాహిత్యం మాట వేరే చెప్పవలసిన పని ఏముంది? సాహిత్యవికాసంలో, ఉత్తమసాహిత్యం రావడంలో, సాహిత్యాభిరుచిని పెంపొందించడంలో పత్రికల పాత్ర అనన్యము. ఈనాటి సాహిత్యస్థితికి మన పత్రికలే నిదర్శనం."

"సమాజం రోజు రోజుకు సంక్లిష్ట మవుతున్నది. రచయిత అవగాహనను అది దాటి పోతోంది. అందుకని రచయిత సరైన సాహిత్యరచన చేయలేకపోతున్నాడు. మీరం మంటారు ?"

'సాహిత్యం సహృదయ హృదయైకవేద్యం. సంస్కారభేదాన్ని బట్టి అనుభూతిలో తేడా లుండడం సహజం. ఒకరి అనుభూతి వేరొకని అనుభూతితో ఏకీభవించనంతమాత్రాన అది ఉత్తమ సాహిత్యం కాదనలేము. తెలుపును చూస్తున్నప్పుడు దాని ధవళిమ అందరికీ ఏకరీతిలో గోచర మవుతుందని చెప్పలేము. అందుకని దానిని తెలుపు కాదని అనలేము. A nation gets the literature it deserves.'

'మన సమాజం సరిగానే ఉందంటారా? అంటే మన సమాజాన్ని ఏ విలువలు నిర్దేశిస్తున్న వంటారు?'

''నైతికవిలువలు పూర్తిగ పడిపోయాయి. నీతి లోపించిన జాతికి గతి, మోక్షం లేదు. త్యాగం లేని నైతికవిలువలు లేవు. స్వాతంత్ర్యం పేరుతో వెర్రిమొర్రి వేషాలు వేయడం జరుగుతోంది. ఇల్లాలు, కేవలం తన స్వాతంత్ర్యమే పరమార్థ మనుకొంటే, మగని మేలు, బిడ్డల మేలు కుంటుపడడమే కాక, తన మేలుకు గూడ చేటు వాటిల్లుతుంది. ఈనాటికి మన విలువలు ఏమైనా శేషించి ఉంటే, అవి రామాయణ, భారతాదుల చే దిద్దబడ్డవే".

మీ రచనలలో మీరు దర్శింపజేసిన జీవితార్థం ఏమిటి?' అని చివరిగ ప్రశ్నించాను.

'జీవితాన్ని సమగ్రంగా చిత్రించా మని ఎవరూ చెప్పలేరు. జీవితం అపారం. దానికి చెలియలికట్ట వేయడం ఎవరి తరం? ఒక ఒడ్డును చూపి, అది సాగరమో సరోవరమో చెబు తాము. అప్పటి కప్పుడు ఆ యా పరిస్థితులలో కలిగిన అనుభూతుల మీద ఆధారపడి వ్రాయడం జరుగుతుంది. నా రచనలలో నేను చెప్పదలచుకొంది ఒక్కటే; మనిషి సహకార, సానుభూతులలో జీవించాలి. 'దృష్టిలేక సృష్టిలేదు.' 'మంచిచెడుగులు లేక కవిత్వం లేదు.' మాటల గారడీలో పడి, వాటికి బానిసలమై స్వతంత్రంగా ఆలోచించలేకపోతున్నాము. అలా అయిపోయి గూడ ఇంక మనం స్వతంత్రగావిచారం సాగిస్తున్నా మనే ఆత్మవంచనకు లోనవు తున్నాము. ఈ వంచన నుంచి విముక్తుల్ని చేయడం రచయిత ధర్మం. దీనికోసం ప్రయత్నిం చాను."

''చివరి ప్రశ్నండి. మీరు ఆ యాసంతోగూడ ఇంత ఓపికగ, దీర్ఘంగ సమాధానా లిచ్చారు. మరొక అవకాశం లభిస్తే, మీరు ఇదేరకం జీవితాన్ని తిరిగి కొనసాగించాలని కోరు కొంటున్నారా?"

"With no regrets"

# హేతువాది జి. వి. కె.

—ఎం. వి. రామమూర్తి

[మల్లాది వెంకట రామమూర్తిగారు 1918 లో జన్మించారు. వీరు బాపట్లలో న్యాయవాది, ప్రసిద్ధ వ్యాసకర్త. యమ్. యన్. రాయ్. తాత్వికానుచరులు ఆంధ్రదేశంలో రాడికల్ హ్యూమనిజమ్ వ్యాప్తికి బహుధా కృషిచేశారు. ప్రస్తుతం 'వికాసం' మాసపత్రిక సంపాదకులు. 1977 అత్యాయిక పరిస్థితి ఈయనను కారాగానికి పంపింది. వీరి రచనలు "ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం" "జైలు అనుభావాలు."

రామమూర్తిగారు కృష్ణరావు గారికి హేతువాద మిత్రులు.]

*    *    *    *

హేతువాదం అనగానే చాలమందికి నిరీశ్వరవాదం స్ఫురిస్తుంది. హేతువాది నిరీశ్వరవాది అవుతాడు; అందులో సందేహం లేదు. కాని, హేతువాదం అంతటితో ఆగదు. మరోలా చెప్పాలంటే ప్రతి నాస్తికుడూ హేతువాది కాడు. హేతువాదులలో అత్యధిక సంఖ్యాకులు నాస్తికత్వాన్ని ఆమోదిస్తారు. ఇటీవల తెలుగుదేశంలో ఈ సందర్భంగా కొంత అయోమయం ఏర్పడింది. కొంతమంది పెద్దలు పదాలను రూఢ్యర్థంలో కాక, వ్యుత్పత్తి అర్థంలో కాక, తమ ఇచ్చవచ్చిన రీతిలో నిర్వచనాలు చేసి వాడటం వల్ల ఈ గందరగోళం సంభవిస్తున్నది. ప్రతి వ్యక్తీ విలక్షణుడే; ఎవరిము కాదనము. కాని ఇంతవరకూ చలామణీలో ఉన్న పదానికి క్రొత్త అర్థాన్ని కల్పించి, అలా ఆ పదాన్ని ప్రచారంలోనికి తేవడం క్షంతవ్యం కాదు. ఇది

భాష యెడల అపచారం; ప్రజానీకానికి అపకారం. అంతేకాదు, ప్రయోజన శూన్యం. తాత్కాలికంగా క్రొత్తదనాన్ని కాంక్షించే ప్రజలు మెచ్చుకోలు అందివ్వవచ్చును; కాని అచిరకాలంలో ఆ మోజు పోతుంది. అంటే ఈ గందరగోళానికి కారణభూతులైనవారిని, వారి సిద్ధాంతాలను ప్రజలు విస్మరించి తీరుతారు. క్రొత్త అర్థంలో పదాన్ని వాడి ప్రజలను తికమక పెట్టేకన్న క్రొత్త పదాన్ని ఎంపిక చేసుకోవటం లేక క్రొత్త పదాన్ని సృష్టి చేసుకోవటం విజ్ఞత.

తెలుగుదేశంలో మనం 'హేతువాదం' అనేదాన్ని సంస్కృతంలో 'యుక్తివాదం' అంటున్నారు. సంస్కృతం ఎక్కువగా భాషలో చొప్పించుకున్న మళయాళీలు దానిని 'యుక్తివాదం' అని అభివర్ణించుకొని పిలుచుకుంటున్నారు. ఇటీవల ఆంధ్రదేశంలో 'యుక్తివాదం' అంటే యుక్తులతో ఆ మాటకు వస్తే, కుయుక్తులతో కార్యసాధన చేసుకోవట మనే నైచ్యార్థము వాడుకలోనికి వచ్చింది. కనుక చదువరులకు, శ్రోతలకు పరిచయమై సులభ గ్రాహ్యమైన 'హేతువాదం' అనే పదాన్ని వాడటం సమంజసం.

ఇంతకూ హేతువాదం చెప్పే దేమిటి? స్వేచ్ఛగా సత్యాన్వేషణ చేయమంటుంది. విషయాలను, సంఘటనలను, సమాజాన్ని, సిద్ధాంతాలను, అన్నింటినీ సునిశితంగా పరిశీలించు తరువాత వాటిని గురించి స్వేచ్ఛగా ఆలోచించు. ఈ చర్యల ఫలితంగా వచ్చిన నిర్ణయాలు తర్కానికీ, అనుభవానికీ నిలిచేవిగా ఉన్నదీ లేనిదీ చూచుకో. ఆ గీటురాళ్ళ పరీక్షకు నిలిచిన వాటిని జీవితంతో అన్వయించుకో. ప్రతి జీవి మనుగడకై ఆరాటపడుతుంది. మానవుడు తతిమ్మా జీవుల కన్న విలక్షణుడు కనుక అతనిలో మనుగడకోసం జరిగే పోరాటం స్వేచ్ఛా పిపాసగా మారుతుంది. స్వేచ్ఛ కావాలనుకునే వ్యక్తి తనను కట్టిపారవేస్తున్న బంధాలను గుర్తించాలి. దీనికి సత్యాన్వేషణ అవసరమౌతుంది. ఈ సందర్భంలో హేతువాదం అతనికి ఉపకరిస్తుంది.

జగత్తుయొక్క ఉనికిని యథాతథంగా హేతువాది అంగీకరిస్తున్నాడు. అది మిధ్య అని, లేక వ్యావహారిక సత్యం మాత్రమే నని, భావసంజాతపు భ్రమ అని తలపోసి దానినుంచి పారిపోవాలని ప్రయత్నించడు.

అంతటితో ఆగక జగత్తు నడిచే తీరును పరిశీలిస్తాడు. అందులో కొన్ని నియమా లున్నట్లు గ్రహిస్తాడు. నియతిబద్ధమైన జగత్తులో కార్యకారణ సంబంధాలు, నియమాలు అతనికి ప్రస్ఫుటంగా గోచరిస్తవి. జగత్తులోని ఈ 'నియతి' తనలో 'హేతుత్వం' లేక 'వివేచన' (Reason) గా భాసిస్తున్నదనే నిర్ణయానికి వస్తాడు. ఏతా వాతా తేలిందేమంటే

'హేతుత్వం' మానవుని ప్రత్యేకత. ఆ స్వభావాన్ని అతడు విస్మరించలేడు. కనుక మానవుడు వస్తుతః హేతువాది అని చెప్పడం బేసబబు కాదు. కాగా, ఈ మానవ స్వభావాన్ని గుర్తించి, దానిని మరుగున పడనీయకుండా అనుక్షణం జాగ్రత్తపడుతూ తన జీవితాన్ని, తన చుట్టూ ఉన్న సమాజాన్ని మలుచుకునేవాడు హేతువాది.

సత్యాన్వేషణకు ఎంతో విలువ నిచ్చే హేతువాది ఏ సిద్ధాంతాన్ని, ఏ వ్యక్తినీ ఆరాధించడు; అంతమాత్రాన వాటిని, వారిని నిరాదరణ చేస్తాడని అర్థం కాదు. సిద్ధాంతాలు యుగ జనితాలు; సిద్ధాంతకర్తలు యుగపురుషులు. వారు జీవించేనాటికి, వారు ప్రవచించే నాటికి అందుబాటులో ఉన్న సమాచారాన్ని జ్ఞాన భాండాగారాన్ని, తీక్షణంగా, గాఢంగా పరిశీలించి అప్పుడు తమలో కలిగిన భావాల తోడ్పాటుతో వారు ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తారు. ఆ సిద్ధాంతాలు సార్వకాలిక మనుకోవటం పొరపాటు. అయితే అమలులోఉన్న సిద్ధాంతానికివి ప్రతిపత్తి కలిగించే నూతనాంశాలు, క్రొత్త సిద్ధాంతాలు వెలికి వచ్చేవరకు విజ్ఞత కల్గిన మానవుడు ఆ సిద్ధాంతాన్ని ఆమోదించి తన జీవననౌకకు చుక్కానిలాగా దానిని వాడుకుంటాడు. ఇలా చేయగల్గినవాడే సిసలయిన హేతువాది. తతిమ్మా వారు కుహనా హేతువాదులు. హేతువాదిగా ఇంతకు క్రితం తమకు లభించిన ప్రతిష్ఠయొక్క వెలుగులో ప్రకాశించేవారు మాత్రమే. సిసలయిన హేతువాదికి విశ్రాంతికి అవకాశాలు లేవు. అతని ప్రయాణం నిరంతరం అవిచ్ఛిన్నం; కాగా శరీర అస్వస్థతవల్లనో, మానసిక వ్యథవల్లనో అతని ప్రయత్నాలలో, కృషిలో కొన్ని విరామాలు ఏర్పడవచ్చును; అంతే.

జి. వి. కృష్ణరావుగారు భావుకుడు, రచయిత, జిజ్ఞాసి, స్వేచ్ఛాకాముకుడు, సత్యాన్వేషి, మేధావి, సహృదయుడు, అన్నింటికన్న మిన్న సిసలైన హేతువాది.

జి. వి. కె. లోని హేతువాదం అతడి ఉపన్యాసాలలో, ప్రసంగాలలో, సంభాషణలో, రచనలలో ప్రస్ఫుటంగా మనకు దర్శన మిస్తుంది. ముఖ్యంగా కథలలో కొట్టవచ్చినట్లు కన్పడుతుంది. అతడు సృష్టించిన పాత్రలు తమ ఉపన్యాసాల ద్వారా హేతువాదాన్ని ప్రచారం చెయ్యవు. ఆ పాత్రల నైజమే హేతువాదం. వాటి జీవితగమనంలో హేతువాదం అడుగడుగునా ఉంటుంది.

"ఏ స్థితినీ యథాతథంగా చూడకు; ఆమోదించకు. ఇది ఇలా ఎందుకు ఉన్నది ? ఈ స్థితికి ఎవరు కారణభూతులు ? లేక ఎవరి చర్యలవల్ల ఈ స్థితి కల్గింది ? నా బాధ్యత ఏమిటి ? నేను కోరదగిన దేమిటి ? ఈ స్థితి మారటం నా అభ్యుదయం దృష్ట్యా అవసరమా ?"

ఈ ప్రశ్నలను తనకు తానే వేసుకొని సమాధానాలను వెతుక్కోమంటుంది హేతువాదం. ఇలాంటి ప్రశ్నలనే వేస్తవి జి. వి. కృష్ణరావుగారి పాత్రలు.

ఎర్రావు కోడెదూడను పెట్టాలని మొక్కుకున్నాడు. 'రామరాజ్యం' అనే కథలో జీతగాడు. అది అతనికి సహజంగా తోచింది; తన విధిగా భావించాడు. బళ్లోకి వెళ్తున్న పిల్లలను చూచాడు. తానూ చదువుకునే వయస్సు కలవాడే. పిల్లలను చూడగానే అనేక ఆలోచనలు అతనిలో రేకెత్తాయి. తాను బళ్లోకివెళ్లే ఇతర పిల్లల మాదిరిగా ఎందుకు చదువుకోకూడదు. నీడపట్టున హాయిగా కాలిమీద కాలువేసుకొని నోట్లో వేలుకూడా వేసుకోవచ్చునే ? గొడ్లను కాయటానికి పది పన్నెండేండ్ల పిల్లలను చిన్నజీతగాళ్లుగా పెట్టుకుంటారు ఆసాములు. ఆ పసివయస్సు పిల్లలు తాము కాచే గొడ్లను ఆప్యాయంగా చూచుకుంటారు. ఆ పశువులను అభిమానిస్తారు; ప్రేమిస్తారు. వాటి బాగోగులే తమ బాగోగులుగా భావిస్తారు.

తమకు వేరే జీవితం ఉందని వారికి తోచదు ఎప్పుడూ. ఇలాంటి జీతగాడు రాఘవులుకు చివరకు రావలసిన ప్రశ్నలే వచ్చాయి. గొడ్లను తోలుకొనిపోతున్నాడు. ఆవుపెయ్యి గోడమీద తీగను లాగింది. గోడకు పిడకలు కొట్టుతున్న ఇల్లాలు రాఘవులను తిట్టింది. అతని బుర్రలో భావాలు మెదిలాయి. 'ఇలా తిట్లు తినమనేనా తన తల్లిదండ్రులు కని పాకవేసింది ? ........' తనూ గొడ్లను తిట్టటంలా. అయితే తాను గూడ ఒక గొడ్డేనా ? పశుత్వదశ నుండి బయటికి పడవేసే ప్రశ్నలు. రాఘవులు ఒక గొడ్డును అదుపులో తేలేకపోయాడు. రత్తి ఆ పనిచేసింది. కృతజ్ఞతగా, పశువుల పేడను రత్తిని తీసుకొని పోనిచ్చాడు రాఘవులు. ఆసామి రాఘవులను కోప్పడి తీవ్రంగా కొట్టాడు పేడను రత్తిపరం చేసినందుకు. రాఘవులు ఆసామి ఇంటి నుంచి పారిపోయాడు.

'ఆనాటి నీ జీవితం కంటే ఉత్తమమైన జీవితం లేదు ........ ఆ లోకమే రామరాజ్యం అని రాఘవులుతో చెప్పండి' అంటాడు రచయిత. ఈ చివరి వాక్యంలోని వ్యంగ్యమాధుర్యాన్ని అలా ఉంచి రాఘవులుకు వచ్చిన ప్రశ్నలు, అతడు ఉద్యోగం వదిలి పారిపోవటం హేతుయుత చర్యలు. ఈ కథలో హేతువాదిగా మానవుని కర్తవ్యబోధ కూడ ఉంది.

నిజాయితీగా జీవితాన్ని సాగిస్తున్నాడు రైతు వెంకయ్య 'చేసుకున్నకర్మ' అనే కథలో. కాని ఖర్చులకు చాలని ఆదాయం. ఊరికే ఆలోచించడం మొదలుపెట్టాడు. "తన ఊరి షావుకారికి ఆ ఐశ్వర్యమేమిటి ? అతడు చేసిన పుణ్యమేమిటి ? ఎందరి కొంపలు నిలువున తీశాడు ! ఎన్ని దీపాలు ఆర్పివేశాడు ! వెనక జన్మలో పుణ్యం చేసుకున్నాడేమో ! అయితే

దేవుడిమీద కూడ పెత్తనం సాగించేది కర్మే కాబోలు. ఆ లెక్కలో దేవుడు దేనికి? జీత గాడుగా ఉన్న రాఘవులకూ వచ్చాయి ఆలోచనలు. "ఇంతకూ తాను కోరుతున్నదేమిటి? ఎడ్లూ వ్యవసాయమేనా? కాబట్టి తనకు ఎడ్లూ, చేతినిండా వ్యవసాయం సలక్షణంగా ఉంటే చాలు. దానితో తాను సంతృప్తి పడగలడు. తన జీవితం సుఖంగా వెళ్ళమారిపోతుంది. తన రెక్కలూ, స్వాతంత్ర్యం అమ్ముకున్నా అవి ఎందుకు దక్కటం లేదు?" ఇలాంటి ప్రశ్నల అవసరం రైతుల స్థితినీ, కూలీల పరిస్థితిని బాగుచేయాలనే వారికి తేలికగా అర్థం అవుతుంది. ఈ ప్రశ్న లుదయించనంతవరకు వారి స్థితిగతులు చక్కబడ వనేది నగ్న సత్యం.

కార్యకారణనియమం హేతువాదానికి జీవగర్ర. ప్రతి కార్యానికి ఏదో ఒక కారణమైనా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఒకే కార్యం అనేక కారణాలవల్ల కలుగవచ్చును. 'షష్ఠిపూర్తి' అనే కథలో ఆత్మహత్య చేసుకోవాలనుకున్న ముసలి ఆ ప్రయత్నాన్ని విరమించే సంద ర్భంగా ఈ విషయాన్ని శ్రీ జి. వి. కె. స్పష్టంచేశారు. 'ఒకటి కాదు, రెండు కాదు, పిడుగు ల్లాంటి నాలుగుకారణాలుంటే శేఖరం ఎలా ఆత్మహత్య చేసుకుంటాడు' అని రచన ముగించాడు. ఏదో ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప ఆత్మహత్యను మానవవాదులు అంగీకరించరనే విషయాన్ని అలా ఉంచి హేతుయుక్తంగా ఆలోచించే వ్యక్తి జీవితాన్ని తుదముట్టించుకోరాదనే ఉద్బోధ కూడా ఉంది ఈ కథలో.

కర్మభూమి అనే కథ చాల రసవత్తరమైనది. సగం వెలుతురు సగం చీకటి ఉన్న గుహలో సాలీండ్లు గుళ్ళు గోపురాల ఆకారంలో గుళ్లుపెట్టి చిన్నపురుగులను వాటి ఉచ్చులలో బిగించి చంపుతూ ఉంటాయి. అదంతా కర్మయోగం క్రింద చలామణీ చేస్తాయి. వ్యంగ్యంగా రచయిత అంటాడు "కర్మభూమిలో కర్మ అధికమై జీవులకు మరణయోగం ఎక్కువవుతూ వచ్చింది" అని. పరమాత్ముని కోసం నూలుపోగులతో గుళ్లుగోపురాలు కట్టాయి సాలీళ్లు. కందిరీగ వచ్చి వాటిని ధ్వంసం చేయటం మొదలుపెట్టింది. మీగుళ్లూ గోపురాలూ జీవుల స్వాతంత్ర్యాన్ని అరికడుతున్నాయి. పైగా జీవుల నిండు ప్రాణాలను బలిగొంటున్నాయి. అసలు మీ లాంటి లోకకంటకుల్ని ఉండనీయటానికి వీలులేదు" అని రొదపెట్టింది కందిరీగ. కందిరీగ రాగానే ఒక చిన్నపురుగుకు రెక్కాడించటానికి వీలైయింది. "ఈ యోగులు మన ప్రాణాలకు ఉచ్చులు పోసి దేవుడంటున్నారా?" అని ప్రశ్నించింది ఒక గడుగ్గాయి. ఈ కథలో సాలీళ్ళు పూజారులు; బ్రాహ్మణ్యం. వారిని బలపరిచే తేళ్ళు

మంత్రగబ్బలు క్షత్రియులు. చిన్నపురుగులు తతిమ్మా కులాలవారు. కందిరీగ ఆలోచనకు ప్రతిరూపం.

శ్రీ జి. వి. కె. కథలలో 'బొమ్మరిల్లు'కు విశిష్టస్థానం ఉంది. అది ఏప్రిల్ '41 నాటి రచన. ఆనాటికి జి. వి. కె. గారికి మార్క్సిస్టు దృక్పథం ఉందనీ, భారత కమ్యూనిస్టు పార్టీ వారి పార్టీ కమ్యూనిస్టు కాక విలక్షణమైన కమ్యూనిస్టుల దృక్పథం కలదని మనం గుర్తుంచుకోవాలి. ఆ కథలో ఒక పిల్లవాడు తన తోటి విద్యార్థి జుట్టు గుబురులా ఎందుకు ఉందని తన తల్లిని అడుగుతాడు. 'పూసుకోటానికి నూనె లేక' అని తల్లి చెబుతుంది. తింటానికి కొడుకుకు ఏమీ పెట్టదు పున్నమ్మ ఎందుకని' అని తల్లిని అడిగితే.

'డబ్బులేక' అని తల్లి జవాబు ఇస్తుంది.

'డబ్బు ఎలా వస్తుంది' అని ప్రశ్న.

'పని చేస్తే' – సమాధానం

'వెంకన్నబావ, పున్నమ్మక్కయ్యలు పని చేస్తున్నారు కదా వాళ్ళకు డబ్బు లేదేమి..

........సమాధానం లేదు తల్లినుండి. 'నాన్న పని చేయటం లేదుగా-మరి నాన్నకు డబ్బు ఎలా వస్తున్నది?' పిల్లవాడి ప్రశ్న.

ఈ కథలో జి. వి. కె. లో జీర్ణించిన హేతువాదం పరవళ్ళు త్రొక్కింది.

జఘనసుందరి ఒక పెద్ద కథ. సుందరి తన భర్త అయిన శర్మ మేధస్సును, భర్త స్నేహితుడు నందుని కండలు తిరిగిన శరీరాన్నీ అభిమానిస్తుంది. కాని దుర్వృత్తికి దిగదు. ఒక సన్నివేశంలో వారు చనిపోతే కాళికాదేవి వరప్రసాదం వలన వారిని బ్రతికించు కుంటుంది. ఆ తొందరలో ఒకరి శిరస్సును మరొకరి మొండేనికి తగిలిస్తుంది. ఇరువురూ ప్రాణాలతో లేచిన తరువాత ఆమె ఎవరి భార్య అనే మీమాంస వచ్చింది. సమస్యను వారు ముగ్గురూ పరిష్కరించుకోలేక జితేంద్రియుడుగా పేరుప్రఖ్యాతులున్న ఒక ఋషి వద్దకు పోతారు. సుందరి రూపవతి సౌందర్యవతి. ఋషి చలించాడు. వివాహంలో పాణిగ్రహణం చేసేది శరీరమే కనుక భర్త శరీరము కలిగి ఉన్న వ్యక్తితో కాపురం చేయమంటాడు. మరల వెన్వెంటనే మార్చుకొని మానవుడికి శిరస్సు ప్రధానం కనుక భర్త శిరస్సు కలిగిఉన్న

వ్యక్తితో దాంపత్య జీవనం గడపమంటాడు. అంటే శర్మశిరస్సూ, నందుడి శరీరం కలిగి ఉన్న వ్యక్తి ఆమెను తన వెంట తీసుకొని పోతాడు. రెండవ వ్యక్తి తపస్సుకై అడవికి పోతాడు. సుందరికి వచ్చిన పని జరిగిందని, ఆమెకు ఎనలేని తృప్తి కలిగి ఉంటుందని భ్రమ పడవచ్చు; కాని అలా జరుగలేదు. ఇద్దరు పురుషులలోనూ ఎన్నో మార్పులొచ్చాయి. సుందరి జీవితం దుఃఖభాజన మౌతుంది. చివరకు ముగ్గురూ శరీరత్యాగం చేస్తారు.

"మనస్సుకీ శరీరానికి పరస్పర సంబంధం ఉంది. మనస్సుకు శరీరంమీద పెత్తనం లేకపోలేదు. కాని శరీరం మన పోలీసుల లాఠీచార్జిలాగా పైకి కనిపించకుండానే తన పని కాస్తా తను చేసుకుపోతుంది".

"జితేంద్రియుల మని గప్పాలు కొట్టుకునేవారు, దానిని మెచ్చుకునేవారు తాము తమ హృదయ చరిత్రలను చదువుకుంటే సత్యం బోధపడకపోదు. అప్పటికీ కాదు, వట్టిదేనని ఆత్మవంచన చేసుకుంటే ఎవరేమి చెబుతారు ?" ఈ రెండూ రచయిత వ్యాఖ్యానాలు. మొదటి దాంట్లోని సనిశితహాస్యం, శరీరశాస్త్ర జ్ఞానం మిక్కుటంగా ఉన్నాయి. అంతేకాదు, హేతువాదం ప్రస్ఫుటంగా ఉన్నది.

ఇంద్రియాలను పూర్తిగా జయించామని భావించటం భ్రమ అనే సందేశాన్ని కథ ద్వారా తార్కికంగా నిరూపించాడు జి. వి. కె.

బిక్షాపాత్ర చిన్న నాటిక. కాని చాలశక్తివంతం అయినది. పాత కథను తిరిగి వ్రాశాడు జి. వి. కె. భారత సంహితను వ్రాసిన వ్యాసుడు వారణాసిలో పెద్ద గురుకులాన్ని నెలకొల్పి విద్యాదానం చేస్తూ ఉంటాడు. బిక్షాటన వల్ల ఉదరపోషణ చేసుకోవలసిందని విద్యార్థులకు ఆదేశించాడు. ఒక్కొక్కరు ఐదు ఇళ్ళకు మాత్రమే బిక్షను అర్థించటానికి వెళ్ళాలి. ఆ యా గృహిణులు ఏ కారణం వల్లనైనా బిక్షను ఇవ్వకపోతే పస్తులుండాల్సిందే ఎన్నాళ్ళైనా. వరుసగా పది రోజులు ఎవరికీ బిక్ష లభించలేదు వారణాసిలో. సుమంతుడు ఆకలి బాధకు తట్టుకోలేక కళ్ళు తేలవేస్తున్నాడు. నందీశ్వరుడు పూర్తిగా ఆధ్యాత్మికతత్వం జీర్ణించుకున్నవాడు. దేవలుడు హేతువాది. వ్యాసుడు గురుకులానికి అధిపతి. జైమిని వ్యాసుని తరువాత అధికార బాధ్యతలున్న మహాపండితుడు. సుమంతుడు ఆకలి బాధతో కొట్టుమిట్టాడుతూ ఉంటే నందీశ్వరుడు ఆత్మానాత్మవిచారం చేద్దా మంటాడు.

దేవలుడు అతని చర్యను నిరసిస్తాడు. భృగు వైశంపాయనులు, బ్రహ్మచారులు అతని చర్యను "నీవు నాస్తికుడిలాగా కనిపిస్తున్నావు" అని దేవలుని హెచ్చరిస్తారు.

దే : నందీశ్వరుడు ఎంతసేపు చెప్పినా, ఒక్కటే చెప్పింది. అది సహేతుకంగా లేదు.

.... .... .... ....

దే : మూర్ఖులకు వాగిందే పది తడవలు వాగితే సహేతుకమై పోతుంది. వేరే ప్రమాణం అక్కరలేదు.

నం : నీవు అధఃపతితుడవౌతావు. ఎంత పూర్వపుణ్యమో వుంటే గాని ఆర్షసూక్తాలు అర్థం కావు : అమరత్వం ప్రాప్తించదు.

దే : స్వల్పమైన ఈ నూరేండ్ల జీవితంతోనే వేగలేకుండా ఉన్నాను. అలాంటప్పుడు ఈ అమరత్వం దేనికి ?

వ్యాసుడు స్వయంగా భిక్షాటనానికి ఉద్యుక్తుడవుతాడు. అంతకు ముందు జైమినితో సంభాషణలో

"ఉదారదృష్టి లేక మానవులకు చాతుర్వర్ణ్యం విధించాను. బీదలకు ద్రోహంచేసే కర్మసిద్ధాంతమూ, అవతారమూ బోధించి దాస్యం అంగీకరింపజేశాను. ఆధ్యాత్మిక మనే పేరుతో తుచ్ఛ భౌతికతత్వాన్ని ఉపదేశించాను. ఆదర్శప్రాయంగా అలాగే భిక్షాపాత్ర లిచ్చి విద్యావంతుల్ని పాడు చేశాను."

ఇలా వ్యాసుడు వ్యాకులపడ్డాడు.

భిక్షకు బయలు దేరారు. ఎవరికీ దొరకలేదు. వ్యాసుడు వారణాశిని, ఆ పురప్రజలను శపించపోతాడు, విశ్వనాథుని భార్య అన్నపూర్ణ "వత్సా" అని వ్యాసుని సంబోధిస్తూ

అ : లోకాన్ని అర్థం చేసుకున్న ఋషివి. మానవులకు ఆదర్శప్రాయుడివి ! మానవకర్తవ్యం నిరూపించావు !

దే : రెండూ, మూడూ, నాలుగు.

వై : ఏమిటీ లెక్క.

దే : విను, విను

అ : విద్యాదాతవు ! పైగా మహాకవివి లోకసంగ్రహార్థం నీ యావచ్ఛక్తిని వినియోగిస్తున్నావు. నీ భుక్తికి కావలసింది చాల స్వల్పం. ఇంతవరకు సహించావు.

దే : తొమ్మిది.

నం : ఏమిటి తొమ్మిది ?

దే : బిక్షార్థ్హతకు కారణాలు.

ముందు వ్యాసుని బిక్షకు పిలిచి, తరవాత జైమినిని అహ్వానించి, ఇంక కొంత సేపటికి బ్రహ్మచారు లందరినీ బిక్షకు రమ్మంటుంది అన్నపూర్ణ. అందరూ విస్తళ్ళ ముందు కూర్చున్నారు. విశ్వనాధుడు ఒక్కసారిగా ఊడిపడతాడు. వ్యాసుడిని తీవ్రంగా నిందిస్తాడు.

దే : అధికారమత్తుడు మాట్లాడుతూ ఉన్నాడు. సంఘం యీ రాజుల్నీ, యీ ధనికుల్నీ తలదన్నిపోతుందని యీ మూఢుని కేం తెలుసు ?

ఇలా దేవలుడు కాశీపతియైన శివుడిని తిరస్కరిస్తాడు. తిండియొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించక వేదాధ్యయనము, జపము, తపము, యోగనిష్ఠలను విద్యావంతులకు నిర్దేశించిన ధర్మాన్ని తృణీకరిస్తాడు దేవలుడు. ఇతడు భౌతికవాదేకాక హేతువాది. ఈ పాత్రద్వారా జి. వి. కె.చెప్పాడు తన మనోభావాలను.

మార్క్సిస్టు దృక్పథంతో వ్రాసిన "కావ్యజగత్తు"లో పదునైన తర్కం కదను త్రొక్కింది. ప్రాచ్యపాశ్చాత్య కవిత్వతత్వగ్రంధాలను అవలోకనం చేసి, అలంకారశాస్త్రాలను మధించి వ్రాసిన రచన అది. కాగా, కొన్ని అభిప్రాయాలతో అందరూ ఏకీభవించలేక పోవచ్చు. ఆ మాటకు వస్తే అందులోను కొన్ని మార్క్సిస్టుభావాలను శ్రీ జి. వి. కె. తనే మార్చుకున్నాడు.

శ్రీ జి. వి. కె. కు యుక్తిపై ఎంత అభిమానమో విగ్రహవ్యావర్తిని' గ్రంథంలో తెలియవస్తుంది.

"నాగార్జుని సిద్ధాంతము యుక్తిపై నాధారపడుచున్నదే కాని, అద్వైతాదుల వలె శ్రుతిపై నాధారపడుట లేదు.

"మాధ్యమిక మతమున యుక్తి యాధ్యాత్మికమైన జుజుత్స." అంటాడు రచయిత.

నాగార్జును డందించిన నాస్తికశబ్దార్థమును 'హేతువాదుల కెల్లరకు నంగీకారయోగ్య మగు ఉత్తమోత్తమ పరిష్కారము' అని జి. వి. కె. నుడివెను.

'ఆదీ మన కర్మమునకు ఫలము కలుగ దనువాడు నాస్తికుడు. ఫలము కలుగు ననువాడు ఆస్తికుడు.' అని నాగార్జుడు నిర్వచనం చేశాడు. దానిని ఆమోదించినట్లు కన్పడు తుంది మన జి. వి. కె.

తన రచనలలోనే కాక తన ఉపన్యాసాలలో ప్రసంగాలలో హేతువాదాన్ని నేలకొల్పి ప్రచారం చేసిన ఘనత జి. వి. కె. ది. దిఙ్మాత్రంగా అతని రచనలను తడివి చూడటం జరిగింది. ఎన్నో ఎంతో తెలియచెప్పాడు జి. వి. కె. అతని సంస్మరణ ద్వారా ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని పుంజుకొని సాగిపోవటం హేతువాదుల విధ్యుక్తధర్మం.

ఎం. వి. రామమూర్తి,
ప్రధాన కార్యదర్శి
(అఖిలభారత హేతువాదసంఘం)

# కృష్ణపక్షం

—పురాణం సుబ్రహ్మణ్యశర్మ

[సుప్రసిద్ధ కథకులు శ్రీ పురాణం 1929లో జన్మించారు. వీరి 'నీలి' కథల సంపుటికి 1971 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి లభించింది.

వీరు ప్రస్తుతం ఆంధ్రజ్యోతి వారపత్రిక సంపాదకులు.]

*    *    *

తెనాలి ఆకాశం మీద వెలిగే ఉజ్జ్వలమైన తెలుగు నక్షత్రాల్లో మరొకటి రాలిపోయింది. తెలుగుజాతి రినైజాన్స్‌కి తెనాలి చాలా గొప్ప సేవ చేసింది. సంగీత సాహిత్యాలు, లలిత కళలు, జర్నలిజం, నాటకాలు, సినిమా, హేతువాద దృక్పథానికి ఎంతో కృషి తెనాలి నుంచే జరిగింది. తెనాలి ఒక కల్చరల్ ఐలండ్. ఆగస్టు 23 వ తేదీన హైదరాబాద్‌లో కన్ను మూసిన ఆచార్యుడు డా॥ జి. వి. కృష్ణరావు, ఆర్భాటాలకీ, ఆడంబరాలకీ అతీతమైన మహా సాధువు, దార్శనికుడు. ఆయన జీవితంలో ఓ అంతర్వాహిని; సరస్వతీప్రవాహం. ఒక కవిగానో, రచయితగానో, ఉపన్యాసకుడిగానో కేటాయించి గౌరవించటానికి లొంగనంత విస్తృతి కలిగినది ఆయన వ్యక్తిత్వం. సన్నగా, పొడుగ్గా, బక్కపల్చని ధావళ్యమూర్తి. గొంతుకలో ఒక మార్దవంతో కూడిన గంభీరత, పలుకుల్లో శస్త్రతుల్యమైన వాడి వున్నాయి. చెరువు అలలకి అల్లనల్లన కదిలే తామరాకు మీద ప్రభాతధవళకిరణ స్పర్శకు మెరిసిపోయే నీటిబొట్టులా అంటీ ముట్టని మనస్సు — ఋషులవలె అన్నింటి లోపలకీ తరచి చూడగల అంతర్దృష్టి. వెన్నెల్లో కరిగి విరిగిన మబ్బుతునకలా వెలిగే మందస్మితంలో ఎప్పుడు

చూసినా నడుస్తున్న జీమూతవాహనుళ్ళా వుండేవా రాయన. అయితే మేధావులకు వుండే కించిత్తు కన్ఫ్యూజన్ ఆయనలోనూ సహజాలంకారంగా భాసిల్లేది.

1914 లో తెనాలి వద్ద కూచిపూడి ఆయన జన్మస్థలి. గుంటూరు ఎ. సి. కాలేజీలో బి.ఎ. చదువు. గోపీచంద్ స్నేహంలో పాశ్చాత్య తాత్త్వికధోరణులతో పరిచయం కలిగింది. నవ్యసాహిత్య ప్రక్రియలన్నీ పరిశీలించి ప్రయోగించి చూశారు. గోపీచంద్ వ్రాసిన "పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా" నవలలో యవ్వన ప్రారంభదశకు సంబంధించిన చిత్రణ వున్న దని అంటారు. కవిరాజు వూపు వీరిపైన కూడా ప్రసరించింది. అందులో నుంచి బయట పడి ఎమ్. ఎన్. రాయ్ తాత్త్వికసిద్ధాంతాల ప్రభావానికి లోనయారు. 1941 లో ఎం. ఏ. చదువుకోసం కాశీ వెళ్ళి పూర్తిచేయకుండా తిరిగి వచ్చారు.

మార్క్సిస్టు దృక్పధానికి ఒకరకమైన భాష్యంచెపుతూ ఆయన రచించిన 'భిక్షాపాత్ర' స్వాతంత్ర్యానంతరం మన పట్టణాల పల్లెల మధ్య జీవితం, మనుషులు, ఎలా మారారో నిరూపించే స్వతంత్ర నవల. 'కీలుబొమ్మలు' వల్ల వారికి చాలా పేరు వచ్చింది. 'పాపికొండలు' కూడా వారికి ఖ్యాతి తెచ్చిన నవల. అయితే అది అసంపూర్ణం. 'కళాపూర్ణోదయం' పై పరిశోధనచేసి వారు డాక్టరేట్ పొందారు. ప్రాక్పశ్చిమ తత్త్వవేత్తల అధ్యయనసారమే 'జేగంటలు'.

పేరుప్రఖ్యాతుల కోసం పాకులాడని వ్యక్తిగనుక కృష్ణరావుగారిని గురించి చాలామందికి తెలియవలసినంతగా తెలియక పోవచ్చు. గతవైభవాన్ని కీర్తించే పునరుద్ధరణ వాదాన్ని, జాతిలోవర్గంలో భాగంగా తప్ప....వ్యక్తి అస్తిత్వాన్ని గుర్తించటానికి నిరాకరించే ఇతరసమష్టి తత్త్వాలను హ్యూమనిస్ట్‌గా కృష్ణరావు అంగీకరించలేదని శ్రీ జి. వెంకటస్వామి తమ ప్రత్యేక వ్యాసంలో కృష్ణరావుగారి తాత్త్వికదృక్పధాన్ని వివరిస్తూ అన్నారు.

అరవైఐదవ ఏట అస్తమించిన కృష్ణరావుగారు జీవితాన్ని నిశ్చలంగా పరిపూర్ణంగా గడిపిన జ్ఞాని.

# నా సాహితీ యాత్ర

- డా॥ జి. వి. కృష్ణరావు

ఓయమ్మ నీ కుమారుడు
మాయిండ్లను పాలు పెరుగు మననీడమ్మా
పోయెద మెక్కడికైనను
మాయన్నల సురభులాన మంజులవాణీ

ఇది నేను మొమ్మొదట నేర్చుకున్న పద్యం. ఆరుబయట వెన్నెట్లో తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని మా పినతల్లి చెప్పింది. మా అమ్మనోట కూనిరాగమైన ఎన్నడూ వెలుపడలేదు. ఆమె నాకు జోలపాటైనా పాడివుంటుందా అని సందేహం. పాడివుంటే నా జీవితం మరొకవిధంగా వుండేదేమో!

మా అమ్మకు చదువు రాదు. మా నాన్న అతి కష్టంతో సంతకం చేసేవాడు. ఆలాంటి కుటుంబంలో చదువుసంధ్యలకు ఎంతవరకు అవకాశం ఉంటుంది? అయినా అయిదవ యేట నన్ను బడికి పొమ్మన్నారు. చెట్లూ చేమలు తనిఖీ చేయటానికి నేరుగా పొలాలకు పోయాను. నాకు చదువు అంటుతుందని మావాళ్ళెవరూ అనుకోలేదు.

ఒకసారి మా మేనత్త మా యింటికి వచ్చింది. ఈ రాకతో కథ అడ్డం తిరిగింది. ఆమె నన్ను తన స్వగ్రామం పట్టుకు పోయింది. అచటి పొలాలు క్రొత్తవి. తిప్ప కాయల తోడు దొరకలేదు. అందువల్ల రేపుమాపులు బడికి పోక తప్పింది కాదు. వయసు ముదిరినవాళ్ళకు చదువు తొందరగా వస్తుందంటారు. కాని నాకది వర్తించ లేదనే చెప్పాలి. లెక్కలు మాత్రం చురుకుగా చేస్తుండేవాణ్ణి. తెలుగు మాత్రం పేచీ పెట్టింది. పద్యం నోటికి

వచ్చేది కాదు. దానిని అప్పగించటానికి తరచుగా గోడకుర్చీ వేయవలసి వచ్చేది. నలుగురిలో అంత అవమానం ఎలా సహించేటట్లు? ఆ ఊరినుంచి పారిపోతే చెర విరగడవుతుంది. నిజమే కాని, మానాన్న, మేనత్తా పడనిస్తేగా!

గోరుచుట్టుపై రోకటి పోటన్నట్లు దానికి మరొకటి తోడయింది. న్రాాతలో చేపలన్నీ చాపలుగా బాబు లందరూ బూచులుగా మారేవారు. వాక్యంలో వర్ణ లోపాగమ ప్రత్యయాలు అన్నీ ఇన్నీకావు. ఇలాంటి ముద్రారాక్షసాలు మృచ్ఛకటికాలుగా తయారయేవి. వాటిని చూచి పెద్దవాళ్ళు కడుపుబ్బ నవ్వుకునేవాళ్ళు. ఇలా నవ్వుల పాలైనప్పుడు పై ప్రాణాలు పైనే పోయేవి. అసలు తెలుగు అన్నది లేకపోతే ఎంతబాగుండును అనిపించేది.

హైస్కూలులో చేరినతరువాత స్థితిగతులు మారాయి. ఎందుకు మారాయో గుర్తుకు రావటం లేదు. కాని తెలుగులో నా స్థితి అంత అధ్వాన్నంగా లేదు.

ఆ రోజుల్లో నవలలు ముఖ్యంగా అపరాధపరిశోధక నవలలు ఎక్కువగా వెలువడుతుండేవి. వేసంగి సెలవుల్లో స్వగ్రామం వెళ్ళినప్పుడు రోజుకు ఒక నవల చొప్పున చదివేవాణ్ణి. మా వూరి లైబ్రేరియను విస్తుపోయేవాడు. నమ్మలేక కథ అడిగేవాడు. నేను చెప్పేవాణ్ణి. అతడు మరొక పుస్తకం యిచ్చేవాడు. ఇలా మూడేళ్ళలోనూ మూడువందల నవలలైనా చదివి ఉంటాను.

"డిటెక్టివు నవలలు చదివితే పిల్లలు చెడిపోతారు, భాష రాదు, సరియైన సాహిత్యాభిరుచి కలుగదు, ఆలోచన వక్రిస్తుంది, భావనాశక్తి వికసించదు, ప్రేలుమాలిక పెంపొందుతుంది. వివేకం మందగిస్తుంది." అని అంటారు. కాని నాకు మాత్రం ఈ నవలలు ఎంతో ఉపకరించాయి. పద్యకావ్యపఠనం ప్రారంభించాను.

ఒకసారి.

ఓ పార్థ నిన్ను నమ్మితి
బాపని రక్షింపకిట్లు పార్థుడవైతే
నా పాలి పారిజాతము
గోపాలకచక్రవర్తి గొని రానైతిన్.

అన్న పదాన్ని "ఓ రామ నిన్ను నమ్మితి" అంటూ నకిలీ పద్యం వ్రాసి సవ చూపించాను. అతడు ఊరకుండవచ్చునా? లేదు, దాన్ని లాగుకొని పోయి మ

మాష్టారుకు చూపించాడు. నాకోసం కబురు వచ్చింది. భయపడుతూ అధ్యాపకుల గది వద్దకు వెళ్ళాను, ఏమిరా, అప్పుడేకవిత్వంకూడా మొదలు పెట్టావా? పట్టుమని పది పద్యాలైనా నోటికి వచ్చునా? అంటూ నన్ను క్రిందికీ మీదికీ ఆయన ఒకసారి చూచాడు. జొట జొట నాకు కన్నీళ్ళు కారసాగాయి. ఆయన తన దృష్టిని మరల్చికొని నా పద్యాన్ని దిద్దుతూ" నడక బాగానే ఉన్నది. కాని తప్పులున్నా యనుకో, అయినా కావ్యాలు లక్షణ గ్రంథాలు క్షుణ్ణంగా చదువుకోకుండా పద్యం చెబటం తప్పు, అది నరక హేతువు, తెలిసిందా? గట్టిగా చదువుకో" అంటూ దిద్దిన పద్యం నాకు ఇచ్చివేశారు.

అది మూడవ ఫారం చదువుతున్నప్పుడు జరిగిన సంఘటన. నాటినుంచి కావ్యపఠనం వ్యాకరణాధ్యయనం స్వయంకృషితో సాధించాను. దానివల్ల ఎన్నో భ్రమప్రమాదాలకు లోనయ్యాను. పద్యరచనయే కవిత్వం, సమాసజటిలతే ప్రౌఢిమ అనుకునేవాణ్ణి. అంతేకాని సాహిత్యమనేది.

శబ్దార్థశాసనజ్ఞానమాత్రేణైవ న వేద్యతే
వేద్యతే స హి కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్॥

అని, నాడు తెలుసుకోలేకపోయాను. అసలు యిలాంటి ప్రస్తావనే ఎదురుపడలేదు. కాకపోతే నా స్కూలుపైనలు క్లాసులో ఒకటి జరిగింది. శాస్త్రిగారు క్లాసులో కాంపోజిషను పుస్తకాలు ఇచ్చివేస్తూ నన్నుదగ్గరకు పిలిచి దీర్ఘసమాసపదరచన మంచిది కాదు. అర్థకైవల్యం ముఖ్యం. ప్రయోజనమేదో ఉంటే తప్ప ఝటితిస్ఫూర్తి కలిగించని పదం వాడరాదు. రచన యెప్పుడూ అరటి పండొలిచి అందించినట్లుగా ఉండాలి. అదే గొప్పరచన. దీర్ఘ సమాసక్లిష్ట రచన నుంచి ఎంత తొందరగా బయటపడితే అంత మంచిది అన్నారు. చిరునవ్వుతో వెలువడిన ఆ మాటలు ఇప్పటికీ నా చెవుల్లో గింగురుమంటూనే ఉన్నవి.

యస్. యస్. యల్. సి. క్లాసునుంచి బయటపడేనాటికి ఒక నవల ఒక శతకం వ్రాశాను. ఆ రచనలకు కవియశఃప్రార్థిత్వమే కారణం.

ఆ సంవత్సరం వేసంగిసెలవులలో ఒక కాలేజి విద్యార్థి సరిక్రొత్త కవిత్వమంటూ భావకవిత్వోద్యమంలో వెలువడిన రెండు మూడు ఖండకావ్య సంపుటులు పట్టుకువచ్చాడు. ఈ పద్యాలు ఎంత బాగున్నవో చూడుమని కొన్ని పద్యాలు వినిపించాడు. లాక్షణికత్వమే కవిత్వమని భావించే నాకు అవి కవిత్వంగా వినిపించలేదు. వ్యాకరణస్ఖాలిత్యాలు అర్థముక్త పాదాలు ఘోరదోషాలు పొడకట్టాయి. కవి భావుకత కాని, రచనాలాలిత్యం కాని, నాకు ఆనాడు

పొడకట్టలేదు. ఉమాకాంత విద్యా శేఖరుల విమర్శనం అక్షరాల నిజమనుకున్నాను. అంతే కాని కవితాస్వాదనకు సహృదయత ఎంతో అవసరమని గ్రహించలేకపోయాను. అన్నిటికీ అందరూ అధి కారులు కారని తెలుసుకోటానికీ మరి కొంతకాలం పట్టింది.

కాలేజీలో చేరిన క్రొత్తలో పద్యరచన మీదనే దృష్టి పడింది. ఆ రోజుల్లో వరూధిని అన్న ఖండకావ్యం వెలువరించాను. అవధానవిద్య అంత కష్టమైనది కాదు, అని సహాధ్యాయులకు నిరూపించటానికి అష్టావధానం శతావధానం చేయవలసివచ్చింది. అయితే వీటివల్ల అలవడిన జల్లినేత వదల్చుకోటానికి కొన్ని యేండ్లు పట్టింది.

డిగ్రీ క్లాసులో వుండగా కీర్తిశేషుడు గోపీచంద్‌తో పరిచయమేర్పడి స్వల్పకాలంలోనే అది స్నేహంగా పరిణమించింది. అతడు ప్రతిభాశాలి. పాశ్చాత్యసాహిత్యాభిలాష ఆధునిక సాహిత్యరీతులు అతని వల్లనే అలపడ్డాయి. అప్పటిదాక మూఢ దేశభక్తి ఉండేది. కాని నిర్దిష్టరాజకీయలక్ష్యం కనిపించేది కాదు. యం. యన్. రాయ్. రచనలనూ, మార్క్సిజాన్ని గోపీచంద్ పరిచితం చేశాడు. దానితో నా దృష్టిమారింది. జీవితానికి ఒకమార్గం, రచనకు ఒక లక్ష్యం ఏర్పడ్డాయి. వ్యావహారిక భాషావాదం ఎంతో సముచిత మనిపించింది. అదిమొదలు నా ముఖ్యరచనలన్నీ వ్యావహారిక భాషలోనే సాగాయి.

ఆ రోజుల్లో తెనాలి సాహిత్య కేంద్రంగా ఉండేది. ప్రాచీన మార్గానుయాయులే కాక చక్రపాణి, కొడవటిగంటి, గోపీచంద్ వంటి కథారచయితలు పెక్కుమంది ఇక్కడే వుండే వాళ్ళు. సాయంకాలం మందుల షాపులోనో మరోకచోటనో కలుసుకొనేవాళ్ళు. సాహిత్య విమర్శలు కథాలక్షణాలు ప్రముఖ రచయితల గుణ అవగుణాలు ఆనుషంగికంగా చర్చకు వచ్చేవి. ఎవరి అభిప్రాయాలు వారివి. ఐకకంఠ్యం ఉండేది కాదు. అయినా ఆ చర్చలు ఎంతో ఉపయోగకారులుగా వుండేవి. ఈ కాలంలోనే కొన్ని కధానికలు ఏకాంకికలు వచ్చినాయి. ఆస్కార్‌వైల్డు సలోమాని సునీథ అన్నపేరుతో అనువదించాను. 1937లో డిగ్రీపుచ్చుకొని కాలేజీనుంచి బయటపడ్డాను. ఉద్యోగం అవసరమైయింది. కాని ఇచ్చే నాధుడే కనబడలేదు. అప్పటినుంచి రోజుకు గంటలెన్ని ? ఇరవైనాలుగని ఎలా చెప్పారు అని వితర్కం మనస్సులో ప్రారంభమయింది.

కాశీఖండంలో వ్యాసుడు గుండెల్లో నుంచి పెకలి వచ్చి నా కన్నుల ముందు తారాడ సాగాడు. చలితాధరుడై కంపితకంఠంతో శాపజలం అందుకొని.

మా భూ త్త్రైపూరుషీ విద్యా
మా భూ త్త్రైపూరుషం ధనమ్
మా భూ త్త్రైపూరుషీ భక్తిః

అనబోతున్న మూర్తి కనిపించింది. మహర్షి శతధాభిన్నంగా వైచిన భిక్షాపాత్ర నా భావనాపథంలో రెండురోజులు నిలిచిపోయింది. ఆ సాక్షాత్కారఫలమే నా భిక్షాపాత్ర. ప్రచురణార్థం దానిని వరుసగా కొన్ని పత్రికలకు పంపించాను. ఏ సంపాదకునకు అది రుచించినట్లు లేదు. అనుభూతితప్తకటాహంలోనుంచి వెలువడిన నా మొదటి రచన భిక్షాపాత్ర. పత్రికాలోకం నా భిక్షాపాత్రను నాకే అర్పించింది.

నిరుద్యోగంతో విసుగెత్తిపోయి పై చదువుకోసం కాశీలో తేలాను. ట్యూషన్లతో పొట్ట పోసుకుంటూ యం. ఏ. ఆంగ్లసాహిత్యాధ్యయనం ప్రారంభించాను. విశ్వవిద్యాలయభాండాగారం అందుబాటులో ఉండేది. ఏ పుస్తకం కావాలన్నా దొరికేది. లిటరేచర్, లిటరరీ క్రిటిసిజం, పాలిటిక్సు చదువుకోటానికి మంచి అవకాశం లభించింది.

ఆ అధ్యయనఫలమే కావ్యజగత్తు. భరతుని నుంచి పండితరాయల దాక, ప్లేటో నుంచి మార్క్సు దాక ఉన్న మహామనీషుల సూక్తులను ప్రామాణికంగా ఉదహరించి కావ్య వస్తువు రూపం ఎలా పరిణామం పొందుతుందో మార్క్సిస్టు దృక్పథంతో వివరించాను. అది అప్పటి యువలోకంలో కొంత సంచలనం కలిగించి ఉండవచ్చు. నేటి తెలుగు సాహిత్యం అన్నది కూడ అప్పటి రచనే అయితే, కొన్ని సంవత్సరాల తరువాత అది దినపత్రికలో వరుసగా వెలువడింది. ఆధునిక సాహిత్య ఉద్యమాలను, వాటికి మూలమైన సామాజిక స్థితిగతులను, ఉద్యమకర్తల రచనలను, వీటి గుణగణాలను దానిలో పరామర్శించాను. దానివల్ల కొందరి మనస్సులను నొప్పించటం మాత్రం జరిగింది.

ధనాభావంవల్ల యం. ఏ. పరీక్షకు కూర్చొనకుండానే ఇంటికి తిరిగివచ్చాను. మళ్ళీ నిరుద్యోగం ఎదుర్కొన్నది. అతికష్టంమీద ఈసారి దినపత్రికలో సబ్ఎడిటర్ పని సంపాదించాను. అక్కడ పనిచేస్తున్నప్పుడే 'జఘనసుందరి'ని వ్రాయటం జరిగింది. నీతిమాలిన పచ్చి శృంగారమే దాని లక్ష్యమని ఇటీవల ఒక విద్వాంసుడు పత్రికలో విమర్శించాడు. ఆ సమీక్షనుబట్టి మూలాన్ని పసికట్టిన వేలూరి శివరామశాస్త్రిగారు నాకా పుస్తకం పంపలేదేమి ? ఇంటికి పోగానే తప్పక పంపించు, అని నాకాదేశించారు. నా రచన అరణ్యరోదనం కాదనుకున్నాను.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. రాయ్ చెప్పినట్లు ప్రపంచప్రజాస్వామ్యం ఫాసిస్టు రాజ్యాలను ఓడించి విజయం చేపట్టి భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించ బోతున్నది. ఆ సందర్భాన రాడికల్ డెమొక్రటిక్ పార్టీ డెహ్రాడూన్‌లో ఏర్పాటు చేసిన రాజకీయ మహాసభకు హాజరయ్యాను.

ఇది నా జీవితంలో మరొక పెద్దమలుపు. ఆ సమావేశంలో యం. ఎన్. రాయ్ కమ్యూనిస్టు బైబిలును, భూలోక స్వర్గసీమలోని స్థితినీ, నిశితంగా విమర్శించి పక్షరహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించే నవ్యమానవవాదాన్ని నిరూపించాడు. పీడిత మానవప్రపంచానికి దానికంటె వేరు శరణ్యం లేదన్నాడు. అధికారకాంక్షతో అవినీతి కొడిగట్టి రాజకీయ పక్షాలు మానవస్వాతంత్ర్యాన్ని ఎలా భక్షిస్తవో వివరించాడు. ఆయన ప్రతిపాదించిన ప్రతి అంశమూ యుక్తియుక్తంగా కన్పించింది.

ఆ ఉపన్యాసం నాకు దిగ్భ్రాంతి కలిగించింది. నేనింతకాలం పేడబొమ్మలు పెట్టుకొని పూజిస్తున్నానా ? ఈ తెలివి నాకెందుకు కలగలేదు ? ఈ సంగతి ఎందుకు ఆలోచించలేక పోయాను ? నాయకులు చెప్పే ప్రతిమాటకూ తల ఆడించటమేనా నా పని ? గంగిరెద్దుకూ నాకూ తేడా ఏమిటి ?

తాత్త్విక చింతన లేక స్వతంత్రవిచారం పొడమదని తెలిపోయింది. "తద్విజిజ్ఞాసస్వ" అన్నవాక్యం హృదయ కుహరంలో ప్రతిధ్వనించింది. తత్త్వశాస్త్రాధ్యయనానికి అదే నాంది. ఈరచనలో పెక్కు చిక్కులు ఎదుర్కోవలసి వచ్చింది. లోతుకు పోయి విషయం చర్చిస్తే సామాన్యపాఠకునకు అర్థం కాదు. మరీ స్థూలంగా పోతే కట్టుకథలు, పిట్టకథలూ చెప్పవలసి వస్తుంది. అందువల్ల మధ్యేమార్గం పట్టాను. అయినా అతడు వ్రాస్తే అంతంత మాత్రం వాళ్ళకు అర్థం కాదు అన్న అపప్రథ తప్పలేదు.

పత్రికారంగం నుంచి విరమించుకోదలచి డాక్టరేట్ కోసం పరిశోధనకు దిగి Studies in KALAPURNODAYAM అన్న ఆంగ్లవ్యాసం వ్రాశాను. "అయితే మీరు తెలుగుకు ఎందుకు వచ్చారు?" అని పరీక్షకు లొకరు ప్రశ్నించారు. తల నాకు గిర్రున తిరిగింది. అడిగేవానికి చెప్పేవాడు లోకువ కదా మరి!

ఎలాగైతేనేమి విశ్వవిద్యాలయం పట్టమిచ్చి పంపించివేసింది. డాక్టరేట్ డిగ్రీ పుచ్చుకోకపూర్వం ఉద్యోగం లేదు. పాఠ్యగ్రంథము వ్రాసి యిస్తానని ఒక ప్రచురణకర్త వద్ద డబ్బు పుచ్చుకున్నాను. కీలుబొమ్మలు గ్రాంథిక భాషలో వ్రాయాలని ప్రారంభించాను. మొదటి

ప్రకరణం వ్రాసేటప్పటికి రచన ఎదురు తిరిగింది. గ్రాంథికభాషలో వ్రాయటం దుశ్శక మనిపించింది. తీసుకున్న డబ్బు ప్రచురణ కర్తకు తిరిగి ఇచ్చివేసి నవలను ముగించి ప్రచురణార్థం పత్రికా సంపాదకులకు పంపించాను. భిక్షాపాత్రకు పట్టినగతే కీలుబొమ్మలకు పట్టింది. ఉపాధి లేక గొట్టుమిట్టాడుతున్నప్పుడు నిస్పృహ కలగటంలో ఆశ్చర్యం లేదు. 'శప్తము శప్తమింక మనసాదిగు లొందకు మాతృభూమిక్రై' అని అనుకొన్నాను. నిజానికి కీలుబొమ్మల తాత్పర్యం కాదు.

స్వాతంత్ర్యమంటే ఏమిటి? మానవుడు దానిని యెలా కోల్పోతున్నాడు! తిరిగి దానిని సాధించే మార్గమేమిటి? ఆర్థిక సామాజిక రాజకీయ హేతువు లెంతవరకు మానవజీవితాన్ని మార్చివేస్తున్నవి? వ్యక్తుల కర్తవ్యమేమిటి? ఈ జిజ్ఞాసను రేకెత్తించటమే కీలుబొమ్మలలక్ష్యం. ఈ నవలను మెచ్చుకుంటూ ఒకరు కథ సుఖాంతం చేస్తే ఇంకా ఎంతో బాగుండేది అన్నారు. కృతజ్ఞత నివేదించుకుంటూ వెంటనే సమాధానం వ్రాశాను. మీ కోరిక చెల్లించివుంటే మీ వద్ద నుంచి యీ ముక్క అయినా నాకు లభించి ఉండేది కాదన్నాను.

కాలేజీలో అతి కష్టం మీద ఉద్యోగం దొరికింది. ఈ ఉద్యోగంలో వుండగా మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగింది. అతికష్టంతో నాగార్జునులగ్రంథాలను వ్రాసికొని వచ్చి విగ్రహవ్యావర్తని, రత్నావళి, ఇంకా ఏడు రచనలను పద్యాలుగా అనువదించాను. అయితే ప్రయోజనమేమున్నది? ఆ వ్రాతపతులన్నీ దొంగలపాలయినవి. ఎలాగో ఓపిక చేసుకొని విగ్రహవ్యావర్తిని మాత్రం తిరిగి అనువదించి విపులభూమికతో ప్రకటించాను. కాలేజీలో పని చేస్తున్నప్పుడే ప్లేటో వ్రాసిన రిపబ్లిక్‌ను తెనిగించాను.

1962లో తిరిగి నిరుద్యోగం ప్రాప్తించింది. మళ్ళీ చిక్కులు. పాపికొండలు అన్న నవలను ప్రారంభించి కొంతమేర దినపత్రికలో ప్రకటించాను. ఇంతలో రేడియోలో ఉద్యోగం ప్రాప్తించింది. నవలారచనకు విఘాతం కలిగింది. తరువాత రెండు మూడు పద్య రచనలు, భాసుని ప్రతిమానాటకానికి అనువాదం, ఉదబిందువులు అన్న కథానిక సంపుటి ప్రకటించాను. తరువాత "బొమ్మఏడ్చింది" ఇది యీ జీవుని ఆవేదన.

ఇంతవరకూ వాక్కులు బాలకులు వినోదించే దండపాశికలే కదా అని పండితులు అనవచ్చును. దానికి మీరేమంటారు ? అంటే ఓమితి బ్రూమః.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

# G. V. K. Playwright – Philosopher

–Prof. K. V. Gopalaswamy

*(Professor Gopalaswamy was born in 1903. He had his education at Christian College, Madras and Balliol College, Oxford and was called to the Bar from the Inner Temple, London. He served the Andhra University in different capacities as Professor, Registrar, Senator, Syndicate and Member of Board of Studies and Academic Council at different times and is illustrious as the producer of The Andhra University Experimental Theatre for two decades (1943/63). He is an active member of many cultural organisations and is the president of Andhra Pradesh Natya Sangam since 1973. He has also published several noted biographical articles.)*

*  *  *

On 16th January 1944 I was invited to speak at **Sutaasramam** in Tenali by a group of devotees, who had met to commemorate the first death anniversary of Kaviraju Tripuraneni Ramaswamy Chowdary. Tenali was always a cultural centre of Andhra, which generated many interesting ideas and produced considerable creative writing. The Kaviraju was an eminent scholar, critic, play-wright and poet, as well as a protaganist of Social Justice. Most of the people who attended this meeting admired and adopted his great ideas. But, after I had finished my formal address, I had informal talks with some of his followers, and I found that in addition to the self-respect movement he had shaped in Andhra, two other interesting movements emerged from **Sutaasramam** during the Second World War. They were the growth of Humanism and the rise of the Radical Democratic Party. On the occasion I had the pleasure of meeting Avula Gopalakrishna

Moorthy, the leader of the Humanists in South India; two sons of the Kaviraju — Gopichand, the dynamic leader of Radical Democracy, and Gokulchand, the budding play-wright: Kopparapu Subba Rao, musician, Stage-director and dramatist; P. V. Subba Rao, an excellent party-organizer; two or three young men who were publishing a trought-provoking Telugu journal called **Vihari**, from a small village called Govada in the Guntur District. I was also introduced to Gavani Venkata Krishna Rao, a modest, unobtrusive youngster, with whom I was to come into much closer contact only five years later.

The Andhra University Experimental Theatre produced the Kaviraju's **Khuni** in 1944. It was presented to an audience of well over 10,000 people. Kopparapu Subbarao's **Alli Mutha** and **Chesina Papam** were presented to similar audiences in 1945. Such numbers were possible only in Guntur. When the University moved to Waltair in 1946, the audiences were considerably smaller, ranging between 2,000 and 5,000. Mr. G. V. Krishna Rao's **Adarasasikharalu** was presented on 17-12-1948 and his **Yadava Pralayam** was presented on 14-12-1949. An earlier play of his, **Bikshapatra**, was scheduled to be produced on 16-12-1952, but was cancelled along with the entire culture programme for that year, owing to the demise of **Amarajeevi Potti Sreeramulu** on 15-12-1952; but was presented as a major attraction in January 1953, during the Silver Jubilee Celebrations of the Andhra University. His first play **Suneedha** was published in 1935, the year in which the Kaviraju's **Khuni** appeared. It is interesting to note that Suneedha was the name given to Venaraju's mother, who shaped his life. A collection of eight one act plays, which included **Paadu Sanghamu, Damadamala Bandi Yaadava Pralayam, Daanadhara**, **Vidhinilayam, Dhammillam** and **Prathikriya** was published in 1952. These plays, as wall as subsequent publications have proved beyond doubt that Gavani Venkata Krishnarao, was one of the most outstanding Telugu writers of this century, imaginatively, morally and mentally.

In 1949, thirty-five-year-old Krishnarao applied for admission as a post-graduate student into the fourth year class of the Telugu B. A. (Hons.) course of the Andhra University. The Telugu Honours Course in the Andhra University was started in 1931, with one senior and one junior lecturer, and 7 students were admitted that year and

they appeared for the examination in 1934 and all of them took the Honours degree with different classes. The total number of students that have qualified for the Telugu B, A. (Hons.) degree between 1934 and 1951 (the year in which Mr. Krishna Rao would have taken his degree) was 57, in 17 years i. e., 3.3 per year. The Reader who was Head of the Department till 1949, but retired before the admissions for the year were made, would certainly have refused admission to Mr. Krishna Rao without giving any reasons, if he had continued to serve the University for another year. But it would have been quite clear for those in the know, that the refusal was not due to age but caste.

The eminent scholar who took over the headship in July 1949 refused Mr. Krishna Rao admission, not because of his being a member of the fourth caste (such candidates could always be put in their proper place at the time of grading the candidates when final results are published) but "because of his age". There was no age limit for admission into any of the Honours courses in the Andhra University, or any other University in India. His real fear was something else. Two of Mr. Krishna Rao's highly controversial plays were well-received by the large audiences at the cultural festivals in the University in 1947 and 1948, while a play by the current head of the department, (who by Vedic lore, was born from the head of Brahma) had to be abandoned after several rehearsals, owing to the fear of the actors, (drawn from his own department) that the play when presented might invite missiles, drawn from the feet of the audience, and sent as salutations to the other. The head of the department, therefore, advised Mr. Krishna Rao to register for the Ph. D. of the Madras University, through my intervention, since there was no suitable staff at Waltair to guide him.

When Mr. Krishna Rao saw me in this connection, I advised him to take the Honours course, which was better suited to the teaching profession he sought to enter after improving his qualifations. Since I failed to change his mind, I recommended him to the Vice-Chancellor of Madras. and he was Registered for the Ph.D. in Telugu, with the Reader in Telugu at Madras as his Director. Mr. Krishna

Rao's choise of **Kalapurnodayam** as the subject of his thesis, inevitably lead him to crucifiction at the hands of an enraged evaluator, who noticed in the thesis a dangerous extension of the criterion of critical evaluation that Dr. C. R. Reddy brought to light in his **Kavithvathat_vavicharam**. Since the verdict had to be unanimous, he was advised to resubmit his thesis with a few minor changes without giving up his approach. The enraged examiner also climbed down when he noticed the annoyance of the Chairman of the Board, and Mr. Krishna Rao was finally awarded the Ph. D. of the Madras University in 1955.

During the quarter of a century which intervened between Krishna Rao's taking his B.A. degree and his appointment as Producer of the Spoken-Word in the All India Radio, he went through different walks of life which gave him rich, varied and colourful experience. From 1938 to 1948 he tried to be a printer and publisher – starting as an employee, continuing as a partner, and ending as a publisher. In 1948 he returned to his native village, Kuchipudi, near Tenali, and taught in a secondary school for a year. Trying to improve his academic qualifications, but failing to get admission into the post-graduate course at the Andhra University, he went to Madras in 1950 and spent a couple of years in journalism, but failing to meet the special requirements of the eminent editors, who prefered reportage satisfactory to the Industrial Magnates who owned the News-papers for the sole purpose of political power.

He returned to Tenali in 1952 to work as a Telugu Tutor in the newly opened Tenali College, while he worked on his Thesis for the Ph. D. degree, which he took in 1955. He continued to work in the same college for the next three years as a Lecturer in Telugu, but resigned soon after the management changed hands and some quasi-literates took over. From 1958 to 1963 he retreated to his village once again to live amongst his close relations trying to restore his mental peace. Throughout these twenty-five years, Krishna Rao continued his writings which included poetry, short stories, novels and plays, as well as essays and philosphical works. All this was possible because he belonged to a close-knit family, whose members cultivated a few acres of land themselves, with occasional assistance from

casual labour. They were not like the so-called self-cultivating landlords owning enormous landed property which could be retained with the aid of subserviant labour, corrupt village officers, and useful politicians. Unable to save anything from his paltry earnings during his chequered professional career, Krishns Rao could not acquire any landed property and therefore escaped the malicious 1938 tenancy legislation of the Andhra Kesari. He was able to live in comparative peace satisfied with his modest share in the family income.

But when the ecomomic conditions in the villages changed for the worse in 1963, mainly as a result of the consequences of the Five-Year-Plans, and as Krishna Rao was forced to augument the family income, he joined the All India Radio at Vijayawada as Producer of the Spoken Word. His work in this field was quite praise-worthy, but gave him little scope for anything unique. Most of the ten years from 1963 to 1973, the Vijayavada Station of the All India Radio, was dominated by Banda Kanakalingeswara Rao, the Producer of Drama. The Spoken-word had none of the advantages of Drama. Having neither the glamour of Krishna Sastri, not the aggressive attack of Vadlamudi Gopalakrishnayya, who held this office in Hyderabad, Krishna Rao managed this his job in spite of some malicious attacks. It was, however, during this period that his play *Urubhangam* was presented, translated into sixteen languages, and was repeated over and over again.

After completing his assignment at the All India Radio in 1973 Krishna Rao returned to Tenali, where he had set up his establishment for the sake of the education of his children. He built a house in Bose Road and named it 'Prabhasa' where, surrounded by a large collection of books, mainly philosophical works, many of them by Buddhistic thinkers, to whose writings he was attracted since 1955, he spent most of his time reading their works and assimilating their philosophy, as a result of which the play **The Doll Wept** emerged. The genisis of this play was given to me by the author as follows :

"From 1955 to 1958 I was drawn to Nagarjuna's writings. Continuing the Upanishadic tradition he disproved

both materialism and spiritualism and suggested that truth is beyond them. The world which we see, think of and rationalise is relative, but the ultimate truth is non-relative. This does not mean that the two are different and have different locale. There is no difference. They are one and the same. The world seen through concepts is *Samsara* and the world deprived of concepts is *Nirvana* and *Nirvana* is an experience akin to that of a lump of sugar put into the mouth of a dumb man. This philosophy left a tremendous impression on me. I translated into Telugu seven of his minor works and they were lost irrevocably. Then I thought of writing a play on Nagarjuna's *Sunyavada*. Abstruse subjects do not easily yield to dramatic presentation. Once again I became a disgruntled soul. Twelve years have passed and at last this play came into light."

It is necessary to mention here that **The Doll Wept** was written in 1973. two years before the declaration of Emergency in June 1975, although the first edition was printed only in March 1979. Actually, it was in 1962, soon after Krishna Rao resigned his lecturership in the Tenali College, that he considered the desirability of utilizing the material which had provoked his thought during the three previous years. But he could not give it the shape he desired to give it till 1973, after he left the All India Radio.

Krishna Rao asks :

"Can this **Weeping Doll** be called a historical play? We actually come across Nagarjuna, Aryadeva, Vatsayana, Goutamiputra Satakarni, Bala Sri, and Vasisthi in our cultural history. But their contemporaniety is doubted. But this is unreasonable because Vatsayana severely attacks Nagarjuna's theory of time, motion and rest in his **Nyayabhasya** and these are rebutted by Nagarjuna in his **Vigrahayavarthini**. In my opinion Vatsayana is not only the Bhashyakara of *Nyayasutras* but also the author of *Kamasutras* and *Arthasastra*. Another false notion prevalent is that one Satavahana King cultivated friendship with Nagarjuna, but this goes against the textual evidence of the Ratnavali."

He also asks :

> "Are the events depicted in the play historical ? Certainly not : they are imaginatively drawn on the basis of Nagarjuna's writing **Ratnavali** an epistle, written to the then ruling king asking him not to interfere in the religious affairs etc. What has all this to do with our life and problems ? Nagarjuna's thoughts on freedom, democracy, secularism, the right of resentment and revolt and the **Mahakaruna** unsullied, positively show the path of progress and peace."

I cannot escape taking notice of these questions by treating hem as rhetorical since he appealed to me

> "As en eminent lawyer you can throw much light on these issues. I do not know to what extent you agree with them."

Ignoring the word "eminent" which was used out of courtesy than regard for accuracy, I must say that a lawyer is not a proper person to throw any light on the issues mentioned by Krishna Rao. Lawyers argue a case from a point which suits the needs of their clients. Since there are always as many points of view as there are parties to a dispute, the poor judges often accept a point of view which puts the least strain on their powers of judgement. In this case it is much more desirable to approach the subject from such historical evidence as is awailable to us, some of which I am placing before you.

a) **Nagarjuna**, the great exponent of the **Mahayana** doctrine, probably flourised at **Kanishka's** Court. Kanishka was a great patron of learning. The Buddhist philosophers Aswaghasha, Parsva and Vasumitra enjoyed his favour. Sangharaksha was his chaplin; Charaka was his celebrated physician; Mathara, a politician of unusual intelli gence, was one of his ministers ; the Greek Agesilaus was his engineer These and other worthies "played a leading part in the relegious, literary, scientfic, philosophical and artistic activities of his reign". If the identification of the Kanishka era with the Saka-kala of A. D. 78, supported by many scholars, is to accepted, Kanishka ruled from A.D.

78 to A. D. 101 or 102. This theory is not favoured by some of the more recent authorities, who ascribe Kanishka's accession to A.D. 248 and 278. Both these alternatives have been criticised by scholars, who have shown that even the earlier of these two dates is too late for the first of the **Kushana** rulers, bearing the name of Kanishka. Certain Tibetan and Chinese documents indicate that Kanishka's rule was shortly before A. D. 130. The worthies mentioned above as adorning the court of Kanishka, may not also have all have enjoyed the patronage of a single Kushana ruler named Kanishka.

b) **Arya Deva** was the Buddhist monk who has gone on record as having exclaimed towards a haughty king "What is thy haughty pride worth, O king, who art a (mere) servant of the *gana* (Multitude, i. e. body politic) and receive the sixth part as wages", Arya Deva, according to Chatuhsatika, had also declared that morality, i. e. righteousness, must everywhere be supreme, in public as in private life, thereby repudiating the whole doctrine of **Reason of State** propounded by Kautilya.

c) **Gautamiputra Satakarni and Gautami Balasri** : The latest epigraphic record of Gautamiputra, which is dated in his twenty-fourth regnal year, was issued jointly by the king with his mother Gautami Balasri, who is significantly styled 'one whose son is living'. It is probable that the charter was issued when the king was invalid. He seems to have died soon after and was succeeded by his son Vasishtiputra Pulumavi. His reign, therefore, may be assigned roughly to the period c. A. D. 106-30.

d) **Vasishtha** is known by his *Dharma-Sutra*, a metrical *Smriti*, probably based on *Manu-Smriti*, which is now lost,but quotations from which have been traced in *Vasishtha Dharma-Sutra*. The Smriti, however, contains a mythological legend to the effect that 'these Institutes of the Sacred Law' were originally composed by the Divine Creator who taught them to Bhrigu and other sages. It is Brighu (or his pupil, according to some versions) who ultimately expounds them. This theory of divine origin undoubtedly gave a sacrosant character to *Manu-Smriti* and at least partially explains (or is explained by ?) its importance and popularity. Nothing definite can be said about

*Manu-Smriti*. But it is now generally agreed that the next was formulated some time between 200 B. C. and A. D. 200, a modest margin of four hundred years to choose from. As for Vasishtha we have no dates from which to choose. There is considerable difference of opinion among scholars regarding the date of other *Smriti* works by Vishnu Yajnavalkya, Narada, Brihaspati and Katyayana The commmentary of Medhatithi on *Manu-Smriti* belongs to the 9th century, of Govindaraja to the 11th, and of Kulluka, probably to the 13th century. An interesting feature of all these *Smrities* and commetaries was the unanimous view of all these authorities that while the illegitimate male child of a *sudra* woman was entitled to maintenance, a female child was not, whatever the caste of the father may be, which only confirms the view that there is nothing egalitarian in Hindu ethos.

e) **Vatsayana** : There is some evidence to indicate that Vatsayana, the author of *Kamasutra* was also the author of *Arthasastra*. None of the writers, whose evidence is usually cited in favour of a date for **Kautiliya** in the 4th century B. C. can with certainty be definitely placed before C. A. D. 300. The interval of six centuries is wide enough for the growth of legends. The author of *Arthasastra* is also called **Chanakya** and **Dramila** by Hemachandra in his *Abhidhana-chintamani* and *Yadavaprakasa*. Hemachandra identifies him with Vatsayana, the author of *Kamasutra*. The identification is not corrobarated by any other work in Sanskrit literature, but the resemblance in the style of the two works is striking. Krishna Rao's belief seems to be based on this.

According to certain traditions, Kanishka's successor, **Huvishka** (A. D. 106-138) was a contemporary of Nagarjuna. Gautamiputra Satakarni's reign also may be assiged roughly to the period A. D. 106-30. The Kushana period witnessed important developments in religion, literature, and sculpture, especially the rise of Mahayana Buddhism, Gandhasa Art, *and the appearance of the Buddha figure.* **It** was also the period of rellgious ferment and missionary activity: **If** these factors are taken into consideration, along with Arya Deva's pronouncements quoted above, there is no reason to bellitle the

importance of the epistle, *Ratnavali* sent by Nagarjuna to the Satavahana ruler, and the consequences that followed. It is certainly within the privileges of a creative writer to use such material as is available to him and interpret according to his light.

But Krishna Rao was very diffident about his very fine work. He wrote :

> "As a play 'Weeping Doll' does not rouse the emotions in the reader to the highest pitch, but leaves him in a subdued mood of sorrow. There is no villian. Each thinks that he is right and reasonable. Only ideas and ideals clash and crush, instead of parties and personalities. This may be the cause of the subdued effect of the play. The 'Weeping Doll' is not an external embellishment but an inherent symbol befitting the spirit of the play. However, all these points are quite useless, if the play does not click and the heart does not miss one beat."

In these, his almost last words to me, Krishna Rao does not ask me about the production values of his play. Obviously, he has not written this drama for being put in boards, quite in contrast to his first Buddhist play **Bikshapatra** which took by storm an audience of over 5000, when we presented at Waltair, in the Silver Jubilee Auditorium in 1953. He speaks only of the reactions of the "reader", and has no desire to submit his last work to the judgement of post-emergency era. Incidentally it must be emphacised that the **Weeping Doll** has no connection whatsoever with the Emergency of June 1975.

The **Weeping Doll** was released by me on 30th March, 1979, at a meeting over which Sri Bezawada Gopala Reddy, the President of the Andhra Pradesh Sahitya Akademi, presided. The play was dedicated to Chief Justice Avula Sambasiva Rao, who could not attend the function. The speakers on that day included Gopa Dev, the Arya Samagist leader, from Hyderabad, and Dr. Donappa of the Nagarjuna University, who interpreted his works. Krishna Rao, who was already too sick to speak, had his written reply read for him. In April, 1979 he wrote to me "This is the first time for me to approach any person

for this type of favour''. Owing to reasons beyond my control, it took me quite a long time to start writing the introduction but never finished it. My writing-table faces a panal of the Buddha looking tenderly at an injured kid which adorns the front wall of Chief Justice Sambasiva Rao's house. I had often seen tears in those tender eyes of Gautama. On 24th July 1979, even before I had completed the first parapraph of the introduction, the transistor near me announced the death of Krishna Rao on the previous day. Not easily moved to tears, I could not restrain them. Looking at the Buddha-Vigraha in front of me I thought Goutama also wept for Krishna Rao the play wright-philosopher.

శ్రీ అరవింద సాహిత్య సేవాసమితి జి. వి. కె. ని
సమ్మానిస్తున్న సందర్భంలో తీసిన ఫోటో (30—3—79)



ఉపన్యసిస్తున్న డా. బెజవాడ గోపాలరెడ్డి, ఈయనకు కుడిప్రక్కన వరుసగ డా. జి.వి.కె., ప్రొ. కె.వి.గోపాలస్వామి, సంజీవదేవ్, వెలువోలు సీతారామయ్య, ఎడమప్రక్క ప్రొ. తూమాటి దొణప్ప ప్రభృతులు

# సాహితీ మానకలశుడు

ఆర్యనాగార్జునుణ్ణి మానకలశు డంటారు. మానకలశు అంటే కొలపాత్ర. ఆర్యనాగార్జునుడు జ్ఞానానికి కొలబద్ద. అలాగే డా. జి. వి. కృష్ణరావు ఆంధ్రసాహిత్యానికి కొలబద్ద. విగ్రహ వ్యావర్తని ని అనువదించి ఎందరో ఎన్నో సంవత్సరాలుగ తవ్వు చున్న నాగార్జునపర్వతాన్ని డా. జి. వి. కె. ఏకకేల కీలించి నాగార్జునులకు దగ్గరయ్యారు. తెనాలిలో సారస్వతప్రియులు కొందరు ఏర్పాటు చేసుకొన్న శ్రీ అరవింద సాహిత్యసేవా సమితి అట్టి సాహితీ మానకలశుని గౌరవాధ్యక్షులుగా గౌర వించింది. ఈ సమితి మార్చి 30, 1979న ఆయనను సమ్మా నించింది. ఆ సమ్మాన వివరాలు ఈ గ్రంథనికి అనుబంధంగా చేర్చబడ్డాయి.

సంపాదకవర్గం.

# ఆమని విందు

—జి. సత్యనారాయణ

[సత్యనారాయణగారు 1913 లో జన్మించారు. కొంతకాలం ఉపాధ్యాయులుగ పని చేశారు, భావుకులు. శ్రీ అరవింద మహర్షి పూర్ణయోగంతో ప్రభావితులై తదనుగుణంగా జీవితాన్ని పండించు కొనడానికి ప్రయత్నిస్తున్న జిజ్ఞాసువు. తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్యసమితికే కాక, శ్రీ అరవింద కేంద్రానికి గూడ వీరు ప్రబోధక చైతన్యశక్తి. ఈ 'ఆమని విందు' కాయన ముఖ్య గేస్తు]

*　　*　　*

ప్రఖ్యాత సాహితీతపస్వి, దార్శనికులు డా॥ జి. వి. కృష్ణరావుగారి ప్రధాన సాహితీ క్షేత్రం తెనాలి పట్టణం. అనేకమంది సుప్రసిద్ధ సాహితీవేత్తలు, వివిధరంగాలలో కాకలు తీరిన కళాకారులుద్భవించిన కళలకు కాణాచి యైన తెనాలికి మకుటాయమానుడు డా॥ కృష్ణ రావు. చివరకు ఆకాశవాణిలో పదవీవిమరణచేసి తెనాలిలోనే స్థిరవాస మేర్పరుచుకున్నారు. డా॥ కృష్ణరావు కవి, కథకుడు, నవలాకారుడు, నాటక, నాటికీకర్త, సిద్ధాంతవేత్త, భారతీయ పాశ్చాత్యదర్శనశాస్త్ర, అలంకారశాస్త్రపారీణుడు, రసజ్ఞుడు, సహృదయవిమర్శకుడు, పండితు డయ్యు నిరాడంబరమూర్తి. తమ మధ్య నున్న ఈ మహాశక్తిసంపన్నుని సద్వినియోగ పరచుకోవాలనే సంకల్పంతో కొంతమంది సారస్వతప్రియులు 1973 ఆగష్టులో శ్రీ అరవింద సాహిత్యసేవాసమితిని తెనాలిలో స్థాపించుకొని వారిని గౌరవాధ్యక్షులుగా చేసుకొన్నారు. ఈ సమితివారేర్పాటు చేసిన అనేక సభలలో — విశ్వనాథ, తుమ్మల, సి. నా. రె., వాసిలి,

యిత్యాది సాహిత్యప్రకాండుల కవిపండితుల సభలలో అధ్యక్షపీఠము నుంచి, సాహిత్య గోష్ఠులలోను వారి సాహిత్యప్రకర్షను, అనుభవాలను వినే మహద్భాగ్యం సాహిత్యపిపాసులకు లభించింది. సాహితీప్రియు లందరు తమ ఆత్మీయతకు, ప్రేమానురాగాలకు, ఆదరాభిమానాలకు ప్రతీకంగా వారిని సన్మానించుకోవాలనే తీవ్ర ఆకాంక్షఫలితంగా శ్రీ అరవింద సాహిత్య సేవాసమితివారి ఆధ్వర్యమున 30-3-1979 తేదీన తెనాలి హిందీ ప్రేమీమండలి మహావిద్యాలయంలో డా॥ కృష్ణరావుగారికి సన్మానసభ ఏర్పాటు చేయబడింది. ఆనాడు మహావిద్యాలయప్రాంగణం వివిధవర్ణాల తోరణాలతో శోభాయమానంగా అలంకరించబడింది. సుందరంగా తీర్చిదిద్దబడిన యెత్తైన వేదిక విద్యుత్‌కాంతులతో కనులపండువగా, ధగధగాయమానంగా మెరసింది. ప్రముఖ విద్వాంసులు, కవులు, గాయకులు, కళాకారులు, ఉపాధ్యాయులు, ఉద్యోగస్థులు, వ్యాపారులు, ఇంక ఎందరో పట్టణ, పరిసరగ్రామాల సాహిత్యప్రియులు అభిమానులు వేల సంఖ్యలో సభను అలంకరించిరి. సన్మానకార్యక్రమాని కేతెంచిన ప్రముఖ అతిథులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ అధ్యక్షులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి, సంగీతనాటక ఎకాడమీ అధ్యక్షులు డా॥ కె. వి. గోపాలస్వామి, కళాతపస్వి ప్రముఖ ప్రకృతిచిత్రకారులు, లలితకళా ఎకాడమీ సభ్యులు శ్రీ సంజీవదేవ్, నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగు ప్రొఫెసరు ఆచార్య తూమాటి దోణప్ప, సిద్ధార్థ కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు మొదలుగా గల పెద్దలు, సమితి కార్యకర్తలు, మిత్రులు, 'ప్రబాస' (కృష్ణరావుగారి స్వగృహం)కు వెళ్ళి, ఉచిత మర్యాదలతో కృష్ణరావు దంపతులను సభాస్థలికి తోడ్కొనిరాగా, సింహద్వారం ముందు విద్యార్థులు బారులు తీరి

కవులారా! కదలిరండీ! బుధులారా! కలసిరండీ!
కృష్ణరావుకు నేడు సముచితసత్కారం.

అంటూ స్వాగతగానం చేశారు; నాదస్వర మంగళవాద్యాలు మ్రోగాయి. ముత్తైదువులు నుదుట కుంకుమ దిద్ది నీరాజనం పట్టగా ఇరువైపుల పుష్పవృష్టిని కురిపిస్తూ ఆరక్షకులుగా నున్న కృష్ణరావుగారిని మిత్రులు చేయూతనిచ్చి వేదికపై ఆసీనులను చేశారు. ఆనాటి సభ నలంకరించిన సాహితీవేత్తలను, కళాకారులను, పెద్దలను, అభిమానులను అవలోకనం చేస్తే ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, సంగీత నాటకఅకాడమి, వివిధసాహితీసంస్థలు ఒక్కమాటతో ఆంధ్రభారతి కదలి వచ్చిందా అని హృదయము ఉప్పొంగింది. ఢిల్లీనుండి తిరుపతివరకు విద్యారంగమునుండి, కవితాకంఠములనుండి, సాహితీబంధవులనుండి, కళాక్షేత్రములనుండి, రాష్ట్రపతి. ఉపరాష్ట్రపతి మొదలు విద్యామంత్రులు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఆస్థానకవి పండితులు, సహృదయులు పంపిన సందేశములను శ్రీ ఏ. వెంకటేశ్వరరెడ్డి వినిపిస్తూంటే

భారతాంబయే తరలి వచ్చిందా అనిపించింది. నలువైపుల ఆనందోత్సాహాలు వెల్లివిరియగా శ్రీమాన్ దీవి హనుమంతాచార్యులుగారి వేదప్రవచనంతో సమ్మానసభ ప్రారంభమైంది. హిందీప్రేమీమండలి విద్యార్థినులు "తెలుగుతల్లి" గీతాన్ని శ్రావ్యంగా ఆలాపించారు.

సమితి జాయింటు సెక్రటరి శ్రీ సి. శంకర్ ప్రధాన అతిథుల గుణగణాలను, ప్రతిభా విశేషాలను మహోత్తేజకంగా పరిచయం చేసి స్వాగతం పలుకగా కార్యకర్తలు సభావేదిక నలంకరించిన పెద్దలను, డా॥ కృష్ణరావుగారిని, సమితిఅధ్యక్షులు శ్రీ వెలువోలు సీతా రామయ్యగారిని పుష్పమాలాలంకృతులను జేశారు.

సమితి ఉపాధ్యక్షులు శ్రీ యం. వి. యన్. ప్రసాదరావు (హితశ్రీ) గారు కృష్ణరావు గారి ప్రతిభావ్యుత్పత్తులను, రచనాశిల్పాన్ని, సునిశిత విమర్శనాపాటవాన్ని పరిచయం జేసి యీ సన్మానసభ వైశిష్ట్యాన్ని వివరించారు.

సభ కాధ్వర్యము వహించిన డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు తన తొలిపలుకులలో గత అర్థశతాబ్దంగా సాహితీరంగంలో వివిధప్రక్రియల ద్వారా రచనలు సాగించిన సాహితీవైతాళి కుడు డా॥ జి. వి. కృష్ణరావు అన్నారు. కళాపూర్ణోదయంపై చేసిన పరిశోధనగ్రంథం ఆయన మౌలిక ఆలోచనకు ప్రతీక అని, మద్రాసు విశ్వవిద్యాలయం 100 సంవత్సరాలలో గుర్తించిన 18 మంది డాక్టరేట్లలో కృష్ణరావు ఒకరని, యిది ఆయన ప్రతిభను చాటు తున్నదని అన్నారు. సమకాలీనసమాజం వారి ప్రతిభను గుర్తించలేకపోయినా, భావి తరాల వారు తప్పక గుర్తించి తీరుతారని, ఆయన రచనలోని శాశ్వతసాహితీవిలువకు ఏమాత్రం నష్టం జరగదని, షేక్సియర్, కాళిదాసులను ఆనాటి సమాజం గుర్తించక పోయినంతమాత్రాన వీరి రచనలు కాలగర్భంలో కలిసిపోలేదని, అట్లే కృష్ణరావు రచనలకు గుర్తింపు రాగలదని, త్వరలోనే పలు పరిశోధనాపీఠాలు వెల్లివిరుస్తాయని గోపాలరెడ్డిగారు అభిభాషించారు.

డా॥ కె. వి. గోపాలస్వామిగారు సమితి ప్రచురించిన డా॥ కృష్ణరావుగారి చివరి రచన "బొమ్మఏడ్చింది" అనే నాటకాన్ని ఆవిష్కరించి, కృష్ణరావు ఆలోచనాధీరుడు, గొప్ప రచ యిత అని, "బొమ్మఏడ్చింది" లోని విశేషాలను ఉగ్గడించి యిట్టి నాటకాలను వ్రాయుటలో ఆయన కాయనే సాటియని ప్రశంసించారు. ఆయన వ్రాసిన "భిక్షుపాత్ర"రూపకం పదునాల్గు భాషలలోనికి అనువదింపబడ్డ దనియు, తను ఆంధ్రయూనివర్శిటీలో నున్నప్పుడు దానిని అనేకపర్యాయములు ప్రదర్శింపజేసానని నుడివారు.

తదుపరి శ్రీ కృష్ణరావుగారిని సమితి తరపున శ్రీ గోపాలరెడ్డిగారు సన్మానించారు. గంధాక్షతలు వారి శిరమున జల్లి, పుష్పాభిషేకం గావించి, నూతన పట్టువస్త్రాల్ని బహూకరించారు. ఆవిష్కరింపబడిన నాటక గ్రంథాన్ని సమితి ప్రెసిడెంటు శ్రీ వెలువోలు సీతారామయ్యగారు కృష్ణరావుగారికి సమర్పించారు. శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి, డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి, శ్రీమతి తెన్నేటి లతగార్లు పట్టుదుశ్శాలువలతో సన్మానించారు.

శ్రీకృష్ణరావుగారి సతీమణి శ్రీమతి యశోదమ్మగారిని, సమితిపక్షన శ్రీమతి బోయపాటి సుభద్రాదేవిగారు కుంకుమ, గంధాక్షతలతో, పుష్పమాలతో అలంకరించి పట్టుచీర బహూకరించారు.

శ్రీ జనస్వామి సుబ్రమణ్యశాస్త్రి కృష్ణరావుగారి రచనావైశిష్ట్యాన్ని కొనియాడుతూ కవి ఋషికల్పుడని, క్రాంతదర్శనుడైన ఋషియే కవిశబ్దవాచ్యుడని, అటువంటి క్రాంతదర్శనం కృష్ణరావుగారి ప్రతిరచనలోను కానవస్తుందని, ఇతివృత్తంలో తాను చెప్పదలచిన మహార్థం త్రివేణిసంగమ సరస్వతివోలె అంతర్లీనంగా జాలువారుతుంటుందని, వర్ణించి, సమితి పక్షాన సమ్మానసుమాంజలి సర్పించారు.

పట్టణంలోని సాహిత్యసంస్థలు—సాహితీమహతి పక్షాన శ్రీ పి. జయసింహమూర్తి కవిరాజు—ఎ. జి. కె. భావవికాస్ తరపున శ్రీ మేకా సూర్యనారాయణ, ఇంకా అనేకసంస్థల ప్రతినిధులు సన్మానపత్రములతోను, కవులు, మిత్రులు, అభిమానులు అక్షరాభిషేకంతో పుష్పాభిషేకాలతో ప్రేమానురాగాలతో శ్రీ కృష్ణరావుగారిని ముంచెత్తారు.

'తెనుగులెంక' శ్రీతుమ్మల సీతారామమూర్తి, అమూల్యశ్రీ అమ్మలయ్య, శ్రీ వి. అంజిరెడ్డి, శ్రీ దోనేపూడి రాజారావు, శ్రీ సజ్జా వేంకటరత్నం అక్షరాభిషేకం గావింపగా, హిందీ ప్రేమీమండలి మహావిద్యాలయం, చైతన్య వేదిక, రినైజాన్సు అసోసియేషన్, లలిత కళా సమాఖ్య, నటరాజ కళాసమితి, అభ్యుదయ కళాసమితి, మహిళా మండలి, రోటరీ, లయన్సు క్లబ్బులు, కీర్తిశేషులు విద్యాదానకర్త తెల్లాకుల వేంకటేశ్వరగుప్త భాగవతార్ గారి అభిమాన సంఘం, డా॥ కె. రవీంద్రబాబు, డా॥ గవిని వెంకటేశ్వరరావు, జె. యస్. యన్. ప్రసాద్, ఎ. వి. సుబ్రహ్మణ్యం, పి. రామకృష్ణ, అల్లూరి వెంకట్రావు సమితి సభ్యులెల్లరు, ఇంకా యెందరో సాహిత్యాభిమానులు పుష్పమాలలతో సత్కరించి, శ్రీ కృష్ణరావుగారి యెడ వారికున్న గౌరవాభిమానములు ప్రకటించుకున్నారు.

కృష్ణరావుగారి చిన్ననాటి గురువు పండిత గోపదేవ్‌గారు ఆనందాతిరేకంతో వారిని ఆశీర్వదించారు. శ్రీమాన్ దీవి హనుమంతాచార్యులు అగరుప్రవరలో ఆశీస్సులు పలికారు.

సాహిత్యస్రష్ట, క్రాంతద్రష్ట డా॥ జి. వి. కృష్ణరావుగారిని సమ్మానించడం సాహితీలోకాన్నంతటినీ సన్మానించుకోవడమే యగునట్లు వేదిక నలంకరించినపెద్దలు, సాహితీవేత్తలందరిని సమితికార్యకర్తలు కాశ్మీరు శాలువలతో సత్కరించారు. శ్రీమాన్ దీవి హనుమంతాచార్యులుగారిని కృష్ణరావుగారు సాహిత్యప్రకంపనలతో కంపించుచున్న స్వహస్తములతో సన్మానించారు.

తరువాత వక్తలు కృష్ణరావుగారి వివిధసాహిత్య ప్రక్రియలపై గంభీరోపన్యాసములు చేశారు.

కళాతపస్వి, సాహితీవేత్త శ్రీ సంజీవదేవ్ ప్రారంభోపన్యాసం చేస్తూ శ్రీ కృష్ణరావుగారి సాహితీ, సాంస్కృతిక పరిచయం వల్ల తానెంతో ప్రభావితుడయ్యానని ఆలోచన, అనుభూతి, హేతువాదం, అస్తిత్వవాదాల మేళవింపు వారి రచనల్లో సుస్పష్టమని ప్రస్తుతించారు.

ఆచార్య దోణప్పగారు ఉపన్యసించుతూ ప్రాచీన పాశ్చాత్య దార్శనికదృక్పథాన్ని, ప్రాచ్యదృక్పథాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసికొన్నారని, సృజనాత్మక సాహిత్యంతోపాటు విమర్శనాసాహిత్యాన్ని కూడా డా॥ కృష్ణరావు రచించారని, వైవిధ్యం గల సాహితీసృష్టి చేసిన కొద్దిమంది ఆంధ్రసాహితీవేత్తలలో కృష్ణరావు ఒకరని, తెలుగుభాష మనినంతకాలం ఆయన రచనలు నిలిచి తీరగలవని వక్కాణించారు. "కీలుబొమ్మలు" నవల ఆధునిక సాహిత్యంలో ఒక "క్లాసిక్"అని శిష్టవ్యావహారిక భాషలో రచనలు చేయగలిగిన కొద్దిమందిలో కృష్ణరావుగా రొకరని శ్రీ దోణప్ప శ్లాఘించారు. తెలుగుభాషాకోవిదులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావుగారు మాట్లాడుతూ వాస్తవిక రచనలో ఎంతటి రసమయజగత్తును, దేశసంస్కృతిని చెప్పవచ్చో శ్రీ కృష్ణరావుగారి రచనలు తెలుపుతాయని, వారి సునిశిత ప్రజ్ఞకు నివాళులర్పించారు.

కళాప్రపూర్ణ శ్రీమతి తెన్నేటి హేమలత కృష్ణరావుగారితో తనకున్న పరిచయాన్ని వివరించి, వారి సహృదయతను, ప్రతిభను శ్లాఘించారు. అలంకారశాస్త్రము, తర్కము, వ్యాకరణము వారిలాగా తెలిసినవారు ఇప్పుడులేరు అని ముగించారు.

ఎవరి పర్యవేక్షణలో సన్మానభాస్థలి శోభాయమానంగా, సన్మానితుని కర్హమైన రీతిలో రూపురేఖలు దిద్దికుందో ఆ ఏర్పాట్లుచేసిన శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు, హిందీ ప్రేమీ మండలి కులపతి, కృష్ణరావుగారికి తన నివాళులర్పిస్తూ వారిని "మానవాకృతిదాల్చిన విజ్ఞాన సర్వస్వం"అని, ఎంత విద్వవత్సంపన్నుడో అంత నిరాడంబరమూర్తి అని అంజలిఘటించారు.

ఉపన్యాసముానంతరం శ్రీ అరవిందసాహిత్యసేవాసమితి ఈ సందర్భంలో నిర్వహించిన సాహిత్య, సాంస్కృతిక-వక్తృత్వం, వ్యాస, కథారచన, సంగీతం, చిత్రలేఖనం, జనరల్‌నాలెడ్జి, ఏకపాత్రాభినయం మొదలగు పోటీలలో విజేతలైన యువతీయువకులకు సమితి తరపున డా॥ గోపాలరెడ్డిగారు బహుమతీప్రధానం చేశారు. ఈ కార్యక్రమంలో సహకరించిన శ్రీ పరుచూరి రామకృష్ణ, శ్రీ వి. పూర్ణానందశర్మ, వి. వెంకట్రావు, సుబ్బలక్ష్మి, శ్రీ యం. ఉపేంద్రరావు, శ్రీ రూపాకుల రామకృష్ణయ్య, శ్రీ యం. శ్రీనివాసరావు, శ్రీ బల్హారనాద్ శ్రీ పి. సుబ్బారావుగార్లకు కృతజ్ఞతలందజేశారు. సన్మానితులు డాక్టరు జి. వి. కృష్ణరావుగారు తనకు జరిగిన సన్మానమునకు సమాధానము చెప్పుతూ లోకమున జరుగు సన్మానాలు తీరు తెన్నులను తడివి పూజ లందుకొను 'ఆ పసుపుబొమ్మ ఉలకదు, పలకదు; అయితే ఈ బొమ్మ చేయెత్తి నమస్కరిస్తుంది'అన్నారు. (దీనిపూర్తిపాఠం "కృష్ణార్పణం"లో గాననగును)

సభామర్యాదానుగుణంగా, తన విధ్యుక్తధర్మంగా గుళ్ళపల్లి సత్యనారాయణ, అందరికీ వందన సమర్పణగావింప, "జనగణమన" జాతీయగీతంతో సభ జయప్రదంగా ముగిసింది.

గుంటూరు జె. కె. సి. కళాశాల ఆంగ్లశాఖాధ్యక్షులు శ్రీ పి. సత్యనారాయణ "భిక్షపాత్ర"నుండి వ్యాసుని ఏకపాత్రాభినయంతో ప్రేక్షకుల నలరించారు.

అట్టి సభ తెనాలిపట్టణంలో "న భూతో న భవిష్యతి"యని, సదస్యులు వెళ్లుతూ అనుకోవడం వినిపించింది.

# స్వాగతగీతం

రచన :– ఎ. ఆర్. కోటేశ్వరరావు

పల్లవి ॥ కవులారా ! కదలిరండు !
బుధులారా ! కలసిరండీ !
కృష్ణరావునకు నేడు
సముచిత సత్కారం ॥క॥

చరణం 1 "గురుపూజ" కు విచ్చేసి
కూర్మి తా గోపాలరెడ్డి
ఆ మాన్యున కివే, ఇవే,
అందింతుమల స్వాగతాలు ॥క॥

2 శారద ప్రియతనయుడు గా
శరదిందు సమానుడుగా
మన కృష్ణరాయనికి
సత్కారము లందింపగ ॥క॥

3 భాష మనకు ప్రాణమని
సాహిత్యము సంపదని
చిత్తశుద్ధితో సేవలు
చేసిన కవి గౌరవింప ॥క॥

కవి, దార్శనికులు, సహృదయ విమర్శకులు

మానవతావాది డా॥ జి. వి. కృష్ణరావు, పిహెచ్.డి గారికి

శ్రీ అరవింద సాహిత్య సేవాసమితి, తెనాలి, సమర్పించు

# సన్మాన సుమాంజలి

రసహృదయా !

సుమారు అయిదు దశాబ్దాలుగా ఆంధ్రసాహితీ కేదారాలను పుష్పఫలసంభరితం చేసిన మీ స్నిగ్ధహృదయానికి మా సుమాంజలులు. లలితకళలన్నీ దేవశిల్పాలే. "ఆత్మ సంస్కృతిర్వావ హ ఇమాని దేవశిల్పాని" దేవశిల్పాలన్నీ ఆత్మసంస్కారనిదుత్తకాలని వేద వాణి ఉద్ఘోషిస్తోంది. కళామూర్ధ స్థానీయమైన కవిత నూనూగు మీసాలనాడే మిమ్ము వరించింది. ఇది మీ సుకృతవిశేషం. ఇదిగో సరసఖావోల్లసితమైన మా సుస్వాగతం. అందుకోండి.

వివిధ దర్శనశాస్త్రమర్మజ్ఞా !

దర్శనశాస్త్రాధ్యయనమే వివిధ సమస్యల పరిష్కారసాధక మని విశ్వసించిన మీ దార్శనిక హృదయానికి మా జోతలు. ప్రాచ్య పాశ్చాత్య దర్శనాలను ఆపోశనపట్టిన అగస్త్యులు మీరు. వివిధ దర్శనాలను మథించి మథించి శ్రీ నాగార్జున ప్రవర్తిత మాధ్యమికదర్శన సుధాకలశధారలతో తాపతప్త చిత్తులను పునరుజ్జీవింప సమకట్టిన సమరసతా మూర్తులు మీరు. ఆధ్యాత్మికంగ మాధ్యమికాన్ని, సాంసారికంగ కవితను చేతబూని సంసారనిర్వాణాలకు అభేదాన్ని ప్రతిపాదించిన ఉదాత్తహృదయులు మీరు. దర్శనాలంకార శాస్త్రాధ్యయనంతో సుసంస్కృతమై, పరిణతి చెందిన మీ హృదయం నుండి వెలువడిన ప్రతివాక్యం ఒక రసశకలము; ప్రతి సన్నివేశం వరమార్థస్ఫోరకము. వ్యుత్పన్నతాదీప్తమైన మీ ప్రతిభ కివే మా ధన్యవాదాలు.

**సార్థక కవినామాంచితా ! కృష్ణరాయా !**

"ప్రతిభా వ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి" అన్నది అలంకారికాభిమతమైనా, మీ యందు ఆ రెండూ ఒకదానితో నొకటి ఉజ్జీవితమై సమరసతాపాదకస్థితిని పొందాయి. కావుననే, మీ యెడ 'కవి' నామం అన్వర్థము. కవి ఋషికల్పుడు గదా ! క్రాంతదర్శనుడైన ఋషియే కవిశబ్దవాచ్యుడు. అటువంటి క్రాంతదర్శనం మీ ప్రతి రచనలోను కానవస్తోంది. మీ 'కీలుబొమ్మలు', 'పాపికొండలు', 'భిక్షాపాత్ర', 'ఉదబిందువులు' భావ్యర్థస్ఫోరకాలై సరసహృదయులను రసధునులలో తేలుస్తున్నాయి. 1971 లో రచింపబడిన నేటి "బొమ్మఏడ్చింది" దేశంలోని రాజకీయాలకు, సామాజిక పరిస్థితులకు దర్పణం పట్టుతున్నది. ప్రజాతాంత్రిక శాసనవ్యవస్థకు కర్తవ్యతాబోధకమై వెలుగొందుతున్నది. మహార్థస్ఫోరకాలైన ఇటువంటి మీ రచనలను చూచినప్పుడు, "లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే", అనే భవభూతివాక్యం మీపట్ల సార్థకము. ఇందులో అతిశయోక్తి లేదు. వాగర్థ రహస్యవేత్తలైన మీకివే మా హార్దికాభినందనలు.

**రసస్నిగ్ధ మానవతామూర్తీ !**

చేతనానుప్రాణితాలు, సార్వజనీనాలైన మానవత్వపు విలువలులేని మనిషి, సమరసతాభావ సంవలితమైన మీ దృష్టిలో మానవరూపంలో ఉన్న ఒక వినిమయవస్తువు. ఈ పరమసత్యాన్నే మీ జీవితం, మీ రచనలు వ్యంగ్యమర్యాదలో ఉద్బోధిస్తుంటాయి మానవత్వపు విలువలు, నైతికమూల్యాలు స్వార్థబుద్ధి ప్రతాడితాలై సంకీర్ణాలైనప్పుడు ఘూర్ణిల్లిన మీ హృదయం నుంచి వెలువడిన గర్జనలు కాంతాసమ్మితాలై కథలుగా. నవలలుగా, నాటకాలుగా, విమర్శన వ్యాసాలుగా ఆవిష్కృతా లవుతాయి. ఆ సమయాన కరుణాప్లావితమైన మీ హృదయానుభూతి సహృదయులకు అనుభవైకవేద్యమై అనిర్వచనీయ సుఖా పాదనమవుతుంది.

**సాహితీబంధూ !**

మిమ్ము సన్మానించుకొనే అవకాశం మాకు కలిగినందుకు తెనాలి నగర సాహితీ ప్రియుల పక్షాన మనసార అభినందనలు తెలియజేస్తూ సెలవు తీసుకొంటాము.

"జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

ఇట్లు

**శ్రీ అరవింద సాహిత్య సేవాసమితి**

**తె నా లి**

# అక్షరాభిషేకం

—అమూల్యశ్రీ

హైస్కూలులో విద్య నభ్యసించిననాడు
పద్యమల్లి "నవల" వ్రాసినావు
కాలేజిలో విద్య గఱచినవేళ "అ
ష్టశతావధానము"ల్ సల్పినావు
కాశీపురిని "యెమ్మె" క్లాసులో కూర్చొని
మార్క్సు "కావ్యజగత్తు" మలచినావు
ఆంధ్రయూన్వర్సిటీయందు చదివి 'కళా
పూర్ణోదయ' ప్రభల్ పుణికినావు

మొట్టమొదట 'సూతాశ్రమ'ము న వసించి
హేతువాద సిద్ధాంతపు లోతు లరసి
అంత పూని కారల్ మార్క్సు అంతు తెల్చి
శబ్దతత్త్వవిచారణ జరుపుచుంటె !

స్వచ్ఛందదేశాన సామాన్యజనుల 'కీల్
బొమ్మలు'గా సరిపోల్చినావు
ఆధ్యాత్మిక మహర్షి వ్యాసుని చేతిలో
వట్టి 'భిక్షాపాత్ర' పెట్టినావు
గౌతమబుద్ధుని క్రాంతమహోభి ని
ష్క్రమణమౌ 'శివరాత్రి' గాంచినావు
బౌద్ధ నాగార్జున ప్రవచిత 'విగ్రహ
వ్యావర్తని' కి టీకి వ్రాసినావు

పాడు సంఘాన యాదవ ప్రళయ మరసి
పాతక్రొత్తల యుగసంధ్య హేతుబద్ధ
చైత్రరథ మెక్కి దర్శనాచార్యుడ వయి
ప్లేటో ఆదర్శరాజ్యము చాటినావు!

పాపికొండల శిఖరాల చూపు నిల్పి
ఆగిపోయితివేమి ! ముందడుగు నిడక
బ్రహ్మ తాత్త్విక దృష్టిలో పడితివేమి ?
శిఖర మెక్కి శేష కథను సెప్పవయ్య !

రాజకీయ సామాజిక ప్రగతిశీలి !
ప్రాచ్య పాశ్చాత్య తర్క పారాయణుడవు !
భౌతిక పరతత్వ విచార పండితుడవు !
సంస్కృతాంధ్రాంగ్ల భాషా విశారదుడవు !

పాత్రికేయుడ వైన నేపదవి నున్న
విశ్వ మానవ కళ్యాణ వేదికపయి
నాడు నేడు సత్యాన్వేషణమున మునిగి
సాహితీ కృషి సల్పు జిజ్ఞాసు వీవు !

'పండిత నవలాధిక కథ
కుండవు ! తత్వపరిశోధకుండవు ! ఆచా-
ర్యుండవు ! నాటకకర్తవు !
నిండు మనీషివి ! సుకవివి ! నీకున్ జేజేల్ !

# డా॥ జి. వి. కృష్ణరావుగారు

—వి. అంజిరెడ్డి, ఎం. ఎ.

త్రేతభాషల నై దుష్యతేజ మెన్న
నాంధ్రభాషలో వెలయించె నతిగ కృతులు
దేవభాషనుండి ప్రతిమఁ దెనుగుఁ జేసె
నాంగ్లమునఁ దెల్గు 'థీసిస్సు' కాయు నొసగె.

తొలుత గ్రాంథికభాషపై తూగె మమత
వ్యావహారికమున దృష్టివఱలె మరలి
ప్రాక్తనపు కావ్యమకరంద సక్తబుద్ధి
యాధునిక భావలహరిలో నమితసిద్ధి.

ఖ్యాత 'కావ్యజగత్తు'న కవిత రీతి
ప్రాచ్య పాశ్చాత్య ధోరణిఁ బట్టి తెల్పె
'బొమ్మ ఏడ్చింది' లో తాను పుడిసిలిడిన
కష్ట భార్గసారా వెల్ల కట్టె పటము.

'భిక్షుపాత్ర' వ్రాసి కుక్షిబాధను జాటి
యెత్తె ప్రాతనుండి క్రొత్త వెలికి
ప్లేటో తలచి నిగ్గుపేరిమి తేఱిన
తత్త్వపుస్తకంబు తనివిఁ దెచ్చె.

# ప్రశంస

చదివి చదివి సకలసాహితీ మర్మంబు
తెఱఁగి పెరిఁగినాఁడు కృష్ణరావు
ఎవ్వరెవ్వ రెంతదవ్వైనఁ దన కించు (ఇష్టమగు)
బాటవిడని ధైర్యపేటి యితఁడు.

తత్త్వవేత్తయయ్యుఁ దనమ్రోలనున్న స
మాజమునకు నెడవుగాఁ జనండు;
చన్నవారిపల్కు సైఁపఁడు లేఖినీ
శరము పఱపి వారిగరువ మణఁచు.

తెనుఁగు బాసగవను తేఁకువమైఁ గాచి
యింటిపేరు నిల్పుదంట యితఁడు
పొగడఁదగినచేఁత పొనరించెఁ దెన్నాలి
పౌరలోక మితని గౌరవించి.

ఇదిలే దదిలేదని యితఁ
డెద నెన్నఁడు తలఁపఁ; డాంధ్రి నింకను గొలువన్
బ్రిదులని యనామయము లే
నిది యాటయ తలఁచి నలఁగు; నెఱయుత మడియునన్!

తెనుఁగు లెంక
30-3-79

# డా॥ జి. వి. కృష్ణరావుగారికి

## వచన కవితోపహారం

— దోనేపూడి రాజారావు

సాహిత్య కురుక్షేత్రంలో
కృష్ణుడిలా ప్రవేశించి మీ
కటు అనుభవాల ప్రేరణతో
జీవనవైషమ్యాలు మథించగా
ఉద్భవించిన మీ 'పాపికొండలు'
సమకాలీన జీవనప్రవాహాని కొక
ప్రామాణిక అక్షరజగత్తు.
ఈ వాస్తవిక భౌతికజగత్తులో మీ
"భిక్షాపాత్రో"క సంచలనం
వొక భూకంపం
సిద్ధప్రసిద్ధ 'వ్యాస'పాత్రలో అదొక
ఆధునిక చైతన్యం
ఈనాటికీ అది
కుంభగత ప్రదీపకళికలా వెలుగుతోంది.
శాంతాకారం మీ శ్వేతవదనం
విశ్వాకారం మీ నిండు హృదయం
యోగిహృద్ధ్యాన గమ్యం మీ మందగమనం
శతపుష్పవికాసం మీ సత్సాహిత్యం,

# సందేశములు

[సన్మాన మహోత్సవం జయప్రదం కావలెనని సందేశములు పంపిన పెద్దలంతా వెలిబుచ్చిన అకాంక్ష నూటికి నూరుపాళ్ళు నెరవేరిన దని తెల్పుటకు సంతసము. కృష్ణరావుగారి వ్యక్తిత్వాన్ని, రచనలను స్పృశించిన మా దగ్గరున్న కొన్ని సందేశముల నీ దిగువ పొందుబరచడ మైనది.]

*　　*　　*

1. **Dr. P. C. Chander,**
*Education Minister of India,*
New Delhi

It is in the fitness of things that Sri Aurobindo Sahitya Seva Samithi. Tenali has decided to honour the noted man of letters Dr. G. V. Krishna Rao. Dr. Rao's literary gifts are of an outstanding order and his writings range from fiction to literary criticism, from poetry to philosophical treatises.

*　　*　　*

2. **Dr. M. Santappa,**
*Vice-Chancellor,*
Sri Venkateswara University,
Tirupati

Dr. G. V. Krishna Rao is well known among Telugu writers in India and particular Andhra Pradesh, he being the

native of circar area. He did several contributions in philosophy, novels, oneact plays, etc., by producing excellent publications.

* * *

**3. Prof. K. Satchidananda Murthy,**

*Dept. of philosophy,*

A. U., Waltair

'Dr. G. V. Krishna Rao is one of the fore most literary figures in Telugu. He is one of one best creative writers and literary crities. He has also successfully translated some philosophical classics. I am impressed to know that even now he is engaged in studying the theories of *Sabda* and *Dhvani*. A critical work by him in this field may be expected to be an important contribution.'

* * *

**4. డా॥ దాశరథి, *D. Litt*,**

ఆస్థానకవి, ఆంధ్రప్రదేశ్, హైదరాబాద్

ప్రఖ్యాత రచయిత, ప్రియమిత్రులు డా॥ జి. వి. కృష్ణరావుగారిని, తెనాలి శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి పక్షాన, ఈ నెల 30 వ తేదీన సన్మానించు తున్నందుకు చాలా సంతోషం. డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించడం ఆ సన్మాన సభకు అత్యంత శోభను చేకూర్చగలదు.

డా॥ కృష్ణరావుగారు బహుముఖప్రజ్ఞాశాలి. కావ్యం, కథ, నవల, విమర్శ, నాటిక — ఒకటేమిటి ? అనేక ప్రక్రియలలో ఆరితేరిన మేధావి.

* * *

**5. డా॥ సి. నారాయణరెడ్డి,**

హైదరాబాద్

డా॥ జి.వి. కృష్ణరావుగారు తెలుగునేల పండించుకున్న మేధావులలో అగ్రకోటికి చెందినవారు. సృజనాత్మకత, విమర్శనా మౌలికత, సమస్థాయిలో

పెంపొందించుకున్న కృష్ణరావుగారిని మీరు సన్మానిస్తున్నందుకు నా హార్దికాభి
నందనలు.

*   *   *

6. **M. Sivaprakasam**.
*Station Director*
All India Radio, Vijayawada

'It is heartening to note that you are felicitating Dr. G. V. Krishna Rao, the literary luminary and writer of Eminence.'

*   *   *

7. **R. S. Sudarshanam**,
*Principal*,
Govt. College, Rajahmundry

'It gives me grest pleasure to know that Sri Aurobinda Sahitya Seva Samithi will be holding a special function to honour Dr. G.V. Krishna Rao, under the presidentship of Dr. Gopala Reddy. I send may regards and felicitations to Dr. G. V. Krishna Rao on the occasion. My congratulations to the organizers of the function.'

*   *   *

8. **Prof. N. G. Ranga**,
Nidubrolu from or Delhi

His contributions to the cause of **Humanism**, in Andhra are great. He nurtured this cause together with A. G. K. and A. Sambasiva Rao.

*   *   *

9 **Dr. V. V. L. Narasimha Rao**, M. A., Ph. D.,
*Principal*,
Govt. College, Macherla

... ... to honour my beloved scholar - writer Dr. G. V. Krishna Rao Garu. Dr. Krishna Rao's multi-faceted genious in literature is praise worthy.

**10, భావరాజు నరసింహారావు,**

ఎడిటర్, త్రివేణి త్రైమాసపత్రిక, మచిలీపట్నం

ఆంధ్రులు సగర్వంగా చెప్పుకోదగిన కొద్దిమంది సాహితీవేత్తలలో కృష్ణ రావుగారు ఒకరు. అయినా ఆంధ్రదేశం వారి ప్రతిభను గుర్తించి, వారిని గౌర వించవలసిన రీతిలో గౌరవించలేకపోయింది. శ్రీకృష్ణరావుగారికి ఆయుర్భాగ్యాన్ని ప్రసాదించి, ఆంధ్ర సరస్వతికి యింకా అమూల్య ఆభరణాలను ఆయన సేకరించే శక్తిని ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

*　　　*　　　*

**11. వెంపరాల సూర్యనారాయణశాస్త్రి,**

కాకినాడ

ఆయనతో నాకు గల చిరపరిచయమున—కావ్యవ్యాకరణ - సిశిత విమర్శన పాటవమాత్రమే యెఱుగుదును. కాని వారి రచనలన్నీ చూడగా — ఆయనకు తెలియని వైజ్ఞానిక విషయము లేదనిపించినది.

*　　　*　　　*

**12. డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం**

గుంటూరు

బహుముఖ ప్రజ్ఞాధురంధరులు డా॥కృష్ణరావుగారు కవులు, నాటక కర్తలు, నవలాకారులు, పరిశోధకులు, వారే ప్రక్రియ చేబట్టినా బంగారం కావించే ప్రతిభా మూర్తులు. అన్నిటికన్న మెచ్చదగింది — వారి నిరాడంబర జీవనం, నిస్తుల భావనాశక్తి.

వారు ఇటువంటి సన్మానాలకు ప్రవృత్తిచేత అంతగా ఉన్ముఖులని తోచదు. అయినా మీ నిర్బంధప్రణయానికి కాదనేటంత విరసులు కారు. అందుకే అంగీక రించి వుంటారు.

ఇంకెందరో పెద్దలు, రసహృదయులు, సహృదయులు సందేశములు పంపినారు. కాని అవన్నీ మావద్ద లేనందున ప్రచురించలేక పోయినందులకు క్షంతవ్యులం. ఎందరో మహానుభావులు వారందరికీ మా వందనములు.

# డా॥ జి. వి. కృష్ణరావు

## సాహితీ జీవిత విశేషాలు

స్వగ్రామం : తెనాలి తాలూకా, కూచిపూడి

జననం : 1914

చదువు : తురిమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళు

రచనోపక్రమణ : తురిమెళ్ళ ఐదవఫారంలో, చిన్ననవల (1931)

పద్యరచన : కొల్లూరులో S.S.L.C. చదువుతూ ఒక శతకం (1934)

కళాశాలవిద్య : A. C. College, గుంటూరు – B. A. వరకు

కాలేజిలో జరిగిన ఒక అష్టావధానానికి పృచ్ఛకుడుగా వెళ్ళివచ్చి, హాస్టల్లో మిత్రుల్తో "అవధానమంటే ఏముంది, నేనూ చేయగల" నన్నారు. సరే, కానిమ్మన్నారు. అష్టావధాన, శతవధానాలు రెండూ చేసి చూపించారు. (1935)

పరిచయం : 1933 నాటికే గోపీచంద్‌తో పరిచయం, స్నేహం.

ప్రభావం : గోపీచంద్ వెంట సూతాశ్రమప్రవేశం — కవిరాజు రామస్వామి చౌదరిగారి వద్ద చేరిక — వారి హేతువాదప్రభావం — గోపీచంద్ సాంగత్యంతో పాశ్చాత్యసాహిత్యసంసర్గం — కథ, నవల, నాటికలతో పరిచయం — విశేషించి యం. యన్. రాయ్ రాజకీయ, తాత్త్విక సిద్ధాంతాలలో ప్రవేశం.

**సంస్కృతభాషాభ్యాసం:** ఆదేసమయంలో పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్యుల వారితో రఘువంశం చెప్పుకోవడంతో ఆరంభం .... రాయిరాజకీయాలు. సంస్కృత పాఠాలు, పాశ్చాత్యసాహిత్యం కృష్ణరావుగారి వ్యాసంగం .... అప్పట్లో ఆస్కార్‌వైల్డు 'సలోమీ'ని తెలుగులో 'సునీథ' నాటికగా పునస్సృష్టిచేసి ప్రచురించారు....'వరూధిని' ఖండకావ్యం (1935)లో ఒకప్రక్కన, బుద్ధుని మహాభినిష్క్రమణాన్ని చెప్పే 'శివరాత్రి' (1937) కావ్యం మరొకప్రక్కన ఖండకృతులుగా వెలువరచారు.

**భిక్షాపాత్ర:** డిగ్రీ పుచ్చుకోగానే, రాయ్ రచనలతో ఎక్కిన మార్క్సిజాన్ని సాహిత్యంలో ప్రయోగింప బూనుకొన్నారు. 1938 ఏప్రిల్‌లో జర్మన్ కవి (Brecht)ని చూచి, తెలుగులో శ్రీశ్రీ 'దేశచరిత్రలు' వ్రాస్తుండగా, కృష్ణరావుగారు కాశీఖండంనుండి వ్యాసనిష్కాసనాన్ని గ్రహించి, భారతీయ ఆధ్యాత్మప్రతిభకు ప్రతీక అయిన ఆ వ్యాసుడు కాశీలో అన్నపూర్ణ వాకిట్లో ఆకటికి అల్లాడిమల్లాడి తా బోధించిన ఆధ్యాత్మికతకు పశ్చాత్తప్తుడై మార్క్సుకు చేరువగా జరిగివచ్చినట్లుగా "భిక్షాపాత్ర" అనే ఏకాంకికను సృష్టించి పూరుకొన్నారు. ఆ మహానాటికను తెలుగునుండి national play గా ఎన్నికజేసి పదహారు భారతీయభాషల్లోకి పరివర్తనం చేయించి ప్రసారం చేయించింది ఆకాశవాణి.

**కాశీలో కావ్యజగత్తు:** M. A. కొరకు కాశీ చేరారు. 1941 వరకు రెండేళ్ళు చదివి రాజకీయాలు ముదిరి పరీక్షలెగబెట్టి స్వస్థలానికి తిరిగివచ్చారు. కాశీలో M.A. క్లాసులో కూర్చుండి వ్రాసిందే మార్క్సిస్టు సింహావలోకనమైన "కావ్యజగత్తు" అన్న చిన్న పుస్తకం. అదొక అలంకారిక సిద్ధాంత సమీక్షాగ్రంథం (Aesthetics). దాన్నే ఉస్మానియా విశ్వవిద్యాలయం అప్పట్లో M. A. కు పాఠ్యం చేసింది— 1941 లో చదువు చాలించి జర్నలిజంలోకి దిగారు. నార్ల, శ్రీశ్రీలతోపాటు ఆంధ్రప్రభ సంపాదవర్గంలో పనిచేశారు. సంపాదకవర్గం తీసుకొన్న నిర్ణయాన్ని పురస్కరించుకొని ప్రభనుండి

విరమించుకొన్నారు. తెనాలినుండి రాడికల్ డెమోక్రాట్, విహారి పత్రికలు ఎడిట్‌చేశారు. పిమ్మట పాములపాటి వెంకటకృష్ణయ్యగారి దేశాభిమాని దినపత్రికలోను విజయప్రభలోను పనిచేశారు.

*కీలుబొమ్మలు* : స్వతంత్రభారతంలో తెలుగు పల్లెపట్టు ఎలావుందో, ఎలాతయారవుతోందో, జీవితంలో మార్క్సిజం ఎలా చాలనిదవుతోందో చిత్రిస్తూ మానవస్వాతంత్ర్యాన్ని చర్చించిన నవల కీలుబొమ్మలు (1951) వ్రాశారు. ఉన్నవవారి "మాలపల్లి" గోపీచంద్ "అసమర్థుని జీవయాత్ర"లవలె కీలుబొమ్మలు Telugu Classic అయింది. దానికి రెండు నాటకీకరణలు జరిగాయి తెలుగులో, కన్నడంలోకి అనూదితమవుతోంది ప్రస్తుతం.

*కళాపూర్ణోదయం* : వెంటనే రామలింగారెడ్డిగారి పూత్న విమర్శతో కొత్త విలువని తెచ్చు
Ph. D., : కొని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో M. A. కు పఠనపాఠనంలో తప్పనిసరియైన కళాపూర్ణోదయం మీద పరిశోధన ప్రారంభించారు. రెడ్డిగారి విమర్శవివరణలు కళాపూర్ణోదయం మీద తుది తీర్పులు కావని, యింకా అధికమైన లోతులు, అందాలు ఉన్నాయని ఫ్రాయిడన్ సైకో యనాలిసిస్ దాకావెళ్ళి బృహత్తరమైన థీసిస్‌ను ఆంగ్లంలో వ్రాసి డాక్టరేటు పట్టాన్ని పొందారు. పింగళిసూరన్నను ప్రపంచ ప్రముఖ రచయితలలో పెద్దవాణ్ణిగా రూపొందించారు. తెలుగు originality కళాపూర్ణోదయాన్ని పట్టినిలుస్తుందని చూపారు.

*తత్త్వవిచారం* : రెండోప్రపంచయుద్ధం నాజీ పరాజయంతో ముగియగానే యం.యన్. రాయ్ చూపు కమ్యూనిజంకంటే ఉత్తమమైన వ్యవస్థకావాలని అన్వేషణ ప్రారంభించింది. మార్క్సిసిద్ధాంత వైఫల్యాన్ని (1947) రాయ్ నిరూపించేసరికి కృష్ణరావుగారిసమాలోచనాశక్తికికొరడాదెబ్బ తగిలినట్లయింది.రాయ్ చెప్పేవరకు మార్క్సిజంలోటుపాట్లు మనం కానలేదు. అన్యాయం అనుకున్నాడు, గోపీచంద్‌తోకలసి తత్త్వవేత్తల్ని,ప్రాక్పశ్చిమాలవాళ్ళని ఉభయుల్నీ, ప్రశ్నించారు. కృష్ణరావుగారు ప్లేటో,అరిస్టోటిల్,కాంట్,హెగెల్... రస్సెల్‌లను మథిం

చారు. కాంట్ పరతత్త్వవాదం, ప్లేటో (జేగంటలు) తన రచనలుగా ఆవిర్భవించాయి. ఆంగ్లంలో వ్రాసిన ఆ గ్రంథాలను తానే తెలుగించుకొని ప్రచురించారు. అయితే, అరిస్టోటిల్‌ను గూర్చి ఆంగ్లంనుండి తెలుగులో చెప్పకుండా అముద్రితంగా వుంచారు.

నాగార్జునుడు : ప్రాచ్యతత్త్వవేత్తల్ని పరిశీలించారు. వైదికదర్శనాలే కాక, అవైదికమైన బౌద్ధదర్శన ప్రపంచాన్ని ఆలోకించారు. శంకరునివద్ద దొరకని సమాధానాలు, నాగార్జునాచార్యునిలో లభిస్తున్న వనుకొన్నారు. "ఎన్నో ఏండ్లనుండి ఎన్నో లక్షలమంది నాగార్జున-కొండ త్రవ్వుచునేయున్నారు. వీరు నాగార్జునశైలము నొక్కచేతనే యెత్తి లోపలి విజ్ఞానమును పైకి తీసినారు" అన్న వేలూరు శివరామశాస్త్రిగారి ప్రశంసను నిలుచుకొనునట్లుగా నాగార్జునుల "విగ్రహవ్యావర్తని"ని టీకా వివరణములతో తెనిగించి ప్రచురించి అజరామరకీర్తికి పాత్రులయ్యారు. నాగార్జునకృతులు యితరములు అయిదింటిని తెనిగించారు. ఈ కాలంలో తెనాలి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేశారు.

కేంద్రసాహిత్య అకాడమీ ప్లేటో రిపబ్లిక్ ను ఆదర్శరాజ్యంగా వీరిచేత తెలుగులో చెప్పించింది. ఆంధ్రసాహిత్య అకాడమీ సభ్యులుగా గ్రహించబడ్డారు. ప్రదేశ్ ప్రభుత్వ లిపి సంస్కరణ సంఘసభ్యులుగా గైకొనబడ్డారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనేటు సభ్యులుగా ఎన్నికయ్యారు. పొన్నూరు సంస్కృతకళాశాల ప్రిన్సిపాలుగా పనిచేశారు. పిమ్మట 1965 నుండి 1973 వరకు ఆకాశవాణిలో ప్రసంగవిభాగం అసిస్టెంటు ప్రొడ్యూసరుగా నిర్వహించి విరమించారు.

అరవయ్యోపడిలో : పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాక్కులనే శబ్దబ్రహ్మ సిద్ధాంతంపై Electronics, విశేషించి Hollography ప్రసరించే వెలుగుల్ని సమన్వయించడంలోనూ .... ఆంధ్ర బౌద్ధాచార్యుడైన

ధర్మకీర్తి, తర్కంలో ధ్వనిసిద్ధాంత జన్మరహస్యాన్ని కనుగొనే పరిశ్రమలోనూ....తత్త్వశాస్త్రంలో ప్రమాణ మీమాంసపై (Epistemology) విజ్ఞానశాస్త్రం, Psychology of perception వగైరాలు ఏమంటున్నవో అజ దీసుకోవటంలోనూ నిమగ్నమై,.... అసంపూర్ణంగా నిల్చివున్న "పాపికొండల్ని" పూర్తిచేయడానికి ఆరోగ్యంకోసం నిరీక్షించారు. కాని నిరీక్షణ నిరీక్షణే అయింది.

జిజ్ఞాస, సత్యాన్వేషణ, సామాజికాభ్యుదయం ఆయన లక్ష్యాలు స్వతంత్ర విచారధార, సాహిత్యసృష్టి ఆయన ఉచ్ఛ్వాస, నిశ్వాసలు, కీర్తి కండూతి సోకని రచనావ్యాసంగం వారి విశిష్టత.

కవులు, కథకులు, నవలాకారులు, నాటక నాటికాకర్తలు-ఆధునిక రాజకీయ సామాజిక సిద్ధాంతవేత్తలు-భారతీయ పాశ్చాత్య దర్శన శాస్త్ర (Ph lo ophy), ఆలంకారశాస్త్ర (A est etics) పారీణులు, వ్యాకరణశాస్త్రజ్ఞులు అయి, కళాస్రష్టలు, విమర్శకులు, తత్త్వవేత్తలు, పండితులుగా ఆంధ్రలోకానికి చిరపరిచితులైన ఈ కృష్ణరావుగారి సాహిత్యాన్ని సమాలోచించడం ఆంధ్రమహాజనుల కర్తవ్యం.

కాలధర్మం : ఆగష్టు 23, 1979.

# కృష్ణార్పణం
## (సమ్మానితుని సమాధానం)

ఇప్పటి ఈ సన్మానం చూసినతరువాత నోట మాట రావటం లేదు. పదేసి ఏళ్ళు పనిచేసి విరమించినప్పుడు కూడా గుక్కెడు తేనీరు పొందజాలని నాకు ఈ సన్మానం విస్మాపకం కాక ఎలా ఉంటుంది ?

ఇంతకూ ఇది సమ్మానమా, సన్మానమా, సమానమా? సమ్యక్ మానం సమ్మానం. అంటే మంచి సత్కారం. సత్ మానం సన్మానం అంటే పండితులు చేయు గౌరవం, లేదా ఉత్తమమైన గౌరవం. లేదా యథార్థమైన సత్కృతి. ఇక మానంతో కూడినది సమానం. సమానులు కావించు సత్కారం 'సమానం' అనవచ్చు. అందుకనే విజ్ఞులు "సమానానాం సుశ్లోకోకస్తు" అని ఆశీర్వదిస్తుంటారు. ఇంతకూ ఇప్పుడిది ఈ మూటిలో ఏదవుతుంది ?

ఈ సందర్భంలో మరొకమాట. సమ్మానంలో అనేక భేదాలు ఉండటం తమకు తెలియనిది కాదు. వాటా సమ్మానాలు పోటీ సమ్మానాలు, కైంకర్య సమ్మానాలు, కైతవ సమ్మానాలు, రిక్త సమ్మానాలు, ఆత్మకృత సమ్మానాలు—ఇంకా ఎన్నో రకాలు. ఇప్పటి ?

మరొక విషయం స్ఫురణకొస్తున్నది. నాబాల్యంనాటి మాట. ఒక యాయవారపు బ్రహ్మణుడు నిత్యం మా యింటికి వస్తుండేవాడు. వచ్చి "శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః" అని నిలబడేవాడు. నేను దోసెడు బియ్యం పెట్టేవాడిని. ఆయన దానిని పుచ్చుకొని "కృష్ణార్పణమస్తు" అని వెళ్ళిపోయేవాడు. అప్పటికింకా కులదురభిమానం పోలేదు. ఆద్యంతవాక్యాలను అన్వయించుకోలేదు. నేను ఎవరికి భిక్షం పెట్టాను ? ఎవరు పుచ్చు

కున్నారు? కృష్ణుడు పుచ్చుకున్నాడా? కాదు. ఈయనే స్వయంగా కృష్ణభగవానుడ నని చెప్పుకుంటున్నా డన్న అసూయ కలిగింది. అయినా, పెద్దవాళ్ళకు జడిసి మాటాడలేక పోయాను. ఇలా ఉండగా ఒకరోజున ఒక బ్రాహ్మణ మిత్రుని యింటికి వెళ్ళాను. అక్కడ కూడా ఈ యాయవారపు బ్రాహ్మణుడు తటస్థ పడ్డాడు. గృహస్థు పెట్టిన భిక్షను స్వీకరిస్తూ "కృష్ణార్పణమస్తు" అనే అన్నాడు. అప్పుడు బిత్తరపోయాను. ఆలోచన రేగింది. యాయవారపు బ్రాహ్మణుడు దురహంకారియై అన్నమాట కాదు. ఆయన జ్ఞాపకం చేస్తున్నాడు. ప్రతివాడు కర్తవ్యాన్ని స్వార్థరహితంగా పరమేశ్వరార్పణబుద్ధితో చేయాలని, ఆ బుద్ధితోనే ఆ ఫలాన్ని స్వీకరించాలి అని ఉపదేశిస్తున్నాడు.

బౌద్ధంలో కూడా ఈ సంప్రదాయమే వుంది. ఇప్పటిది కాదు. ప్రాచీనకాలం నుంచి ఇది వస్తూవుంది. ఆర్యనాగార్జునుడు కూడా తాను వ్రాసిన "చతుస్తవం" లోని ప్రతి స్తవం చివర "వీనివలన లభించే పుణ్యం లోకానికి సంక్రమించుగాక" అంటూ ఘంటాపథంగా యెలుగెత్తి చాటాడు.

కనుక యిప్పటి గౌరవం కూడా అటువంటిదే. శ్రీ అరవింద సాహిత్యసేవాసమితి వారు రచయితలలోకాన్ని సత్కరించటానికి తలపెట్టి, ప్రతీకగా నన్ను నిలబెట్టి ఈ గౌరవాన్ని యిస్తున్నారని భావిస్తున్నాను. యజ్ఞయాగాది పుణ్యక్రతువులలో పసుపు బొమ్మను చేసి, దాని యందు ఇష్టదైవాన్ని ఆవహింపజేసి క్రతువు నిర్వహిస్తారు. ఆ దైవం ఉత్తరోత్తరా అదృష్టఫలాన్ని అందిస్తుందంటారు. నేను అలాంటి పసుపు బొమ్మనే. అయితే అక్కడ ప్రాప్తించే అదృష్టఫలం నేనూ యిస్తానని అహంకరించలేను. అక్కడ ఆ బొమ్మ ఉలకదు, పలకదు కాని ఇక్కడ ఈ బొమ్మ చేయెత్తి నమస్కరిస్తుంది.

# డాక్టర్ జి. వి. కృష్ణరావుగారి రచనలు

**తత్త్వశాస్త్రం**

ప్లేటో
* అరిస్టోటిల్
కాంటు పరతత్త్వవాదం
* హెగెల్
గతితార్కిక భౌతికవాదం
విగ్రహవ్యావర్తని (నాగార్జునకృతులు)
* రత్నావళి ,,
* చతుఃస్తవం ,,
మాధ్యమిక వింశతి ,,
* భవసంక్రాంతి సూత్రవృత్తి ,,
నిర్వాణ ప్రకరణం ,,
ప్లేటో ఆదర్శరాజ్యం ,,

**నవలలు**

కీలుబొమ్మలు
రాగరేఖలు
జఘనసుందరి
పాపికొండలు

**నాటికలు**

సునీథ
భిక్షాపాత్ర
యాదవ ప్రళయం
దానధార
ధమ్మిల్లం
ఆదర్శ శిఖరాలు
ప్రతిక్రియ
స్వర్గమా ? నరకమా?
డమడమాలబండి
పాడుసంఘం
విధినిర్ణయం
తమ్మపడిగ
ఫ్రెంచి కామెడీ

**సాహిత్య విమర్శ**

కావ్యజగత్తు
Studies in Kalapoornodayam
నవతోరణం
తెలుగులిపి సంస్కరణ

**నాటకాలు**

* బొమ్మఏడ్చింది
ప్రతిమ ( భాసనాటకం

**కావ్యాలు**

వరూధిని
శివరాత్రి
యుగసంధ్య

**కథాసంపుటాలు**

ఉదబిందువులు
చైత్రరథం

సంతానము కలుగకుండునట్లు సరస్వతీదేవి నుండి వరములు పొందుదురు. ఇవి పరస్పర విరుద్ధములు. కాని యా వరము లిచ్చినది సరస్వతీదేవి గదా! అవి వ్యర్థము లగుటకు వీలు లేదే! సూరన అటు సరస్వతీదేవి వాక్కునకు, ఇటు నాయికానాయకుల శీలమునకు భంగము కలుగ కుండ ఆ రెండు వరములకు సాఫల్యము చేకూర్చును. ఇది యథార్థ మగు నొక యింద్రజాలమే.

ఈవిధముగా కృష్ణరావుగారు కళాపూర్ణోదయకథాకవితా శిల్పరహస్యముల నిరవశేష ముగా బయటఁబెట్టిరి. ఇతర విమర్శకులు వీనియందలి కొన్ని యంశములను తడవక పోలేదు. కాని కృష్ణరావుగారి చూపు వేఱు. కళాపూర్ణోదయము నందలి ప్రత్యంశము కావ్యమహా తాత్పర్యమునకు అనుగుణముగా నున్నదని నిరూపించుట వారికే చెల్లినది. కళాపూర్ణోదయ విమర్శ సాహిత్యమున నిది యపూర్వము.

ఇది యంతయు నొక యెత్తు. కృష్ణరావుగారు కళాపూర్ణోదయము కళావతారవిధాన మును అభివ్యక్తీకరించు చున్నదని గావించిన నిరూపణము మఱియొక యెత్తు. ఈనిరూపణము వారి యుపజ్ఞకు ప్రబల నిదర్శనము. వారి సిద్ధాంతప్రబంధములో 250 వ పౌరట నుండి చివరిదాఁక ఈ రహస్యమే విపులముగా ప్రబలము లయిన యుపపత్తులతో బయటఁబడినది. కృష్ణరావుగా రిట్లనిరి:

> "As it has been pointed out on many an occasion, the central idea or the theme of the Kalapurnodayam is the complete emergence of art. That is to say the complete process by which a work of art con ceive by the poet.in accordance with the laws of beauty finds outward artistic expression"
>
> (Page 250)

సూరన కళావిర్భూతి యెట్లు జరుగునో కళాపూర్ణోదయమున నొక మహాకథాముఖమున నిరూపింప నిశ్చయించెను గదా! మఱి యాయన యే తాత్త్వికసత్యము ప్రాతిపదికగా ఈ నిరూపణము గావించెను ? అని యెవరైన ప్రశ్నింపవచ్చును. విశిష్టాద్వైతదర్శనము నాధార ముగాఁ జేసికొని సూరన కళావతార మెట్లు జరుగునో వివరించె నని కృష్ణరావుగారిసిద్ధాంతము. ఇది వారి కల్పనము గాదు. మఱి గట్టిగా నున్న తొమ్మిది యుపపత్తులతో వారు ప్రతిపాదించిన కళాలీల. 252 వ పౌరటలో కృష్ణరావుగా రాయుపపత్తులను జూపిరి. మణికంధరుని వృత్తాం

తము, సుముఖాసక్తి మణిస్తంభులను, నామధేయములు, సరస్వతీచతుర్ముఖుల లీల, కవి శాస్త్రవ్యసనాతిధన్యులగువారి సాయము కావ్యప్రచారము కొఱకర్థించుట, విశిష్టాద్వైతప్రతిపాదనము, కావ్యమీమాంస మున్నగున వన్నియు ఆ యుపపత్తులలోనివే. కావున కృష్ణరావు గారి సిద్ధాంతము కేవల మూహ గాక, కళాపూర్ణోదయకావ్యమూర్తి ననుసరించి సాక్షాత్కరింపఁజేసికొనిన సత్య మగుచున్నది. వారు తన యభిప్రాయములను సూరన కారోపింపలేదు. తన మాటల నాయన కంటఁగట్టలేదు.

సౌందర్యము సర్వేశ్వరుని యనంతకళ్యాణగుణములలో నొక గుణము. అది శాశ్వతము. పరిణామదూరము. విశ్వజనీనము. అనేకత్వమున ఏకత్వముతో విరాజిల్లునట్టిది. సుందర సృష్టి సర్వేశ్వరుని రూపమే. దేశకాలబద్ధుఁడగు జీవుఁడు గావించు సౌందర్యసృష్టి సర్వేశ్వరుని సౌందర్యగుణమునకు రూపాంతరమే. సర్వేశ్వరుఁడు తన విభూతిని జీవుఁడు చేయు సౌందర్య సృష్టి ద్వారా ప్రదర్శించును. జీవుడు సర్వేశ్వరుని యుపకరణము మాత్రమే. ఆయన కరుణామయుఁడు ఒక్కొక్కవేళ ఒక్కొక్కనిపై సర్వేశ్వరుఁడు కరుణ చూపును. తత్ఫలముగా జీవుఁడు సౌందర్యావిష్కరణమునకు పూనుకొనును. అతఁడు సర్వేశ్వరుడు ఏకైకశరణ్యుఁడని విశ్వసించి, తదనుగ్రహార్థము పాటువడవలయును. దీనికి భక్తియే సాధనము. దీనికి చరమఫలము మోక్షము.

"When beauty is a quality and a beautiful object a mode of Brahman, the artist is only an instrument selected by Him for its manifestation. One will be selected to be an artist either by one's great merit or by divine grace. Barring these two, there is no other way open to become a genuine artist"

(Page 334)

"As Brahman is the ultimate goal and the very basis of the universe and as the creative faculty is the gift of divine grace, the poet or any artist must create in a spirit of complete devotion to Him"

(Page 335)

"This poetry or any Art devoted and dedicated to Brahman will certainly, Surana opines, put the agent on the path of Bhakti, the royal road to release or Moksha"

(Pages 336. 337)